# పద్య కావ్యములు.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ఆడవిమల్లెలు ... | 0 | 8 |
| అధ్యాత్మరామాయణము ... | 1 | 8 |
| అనంతునిఛందము, ఛందోదర్పణము ... | 2 | 0 |
| అనిరుద్ధచరిత్రము, కనుపర్తి అబ్బయామాత్య ప్రణీతము ... | 0 | 10 |
| * అప్పకవీయము, శ్రీగిడుగు రామమూర్తి పంతులుగారి విమర్శతో నున్నది ... | 5 | 0 |
| అంబరీషోపాఖ్యానము, సటీక (భాగవతము) ... | 0 | 6 |
| ఆముక్తమాల్యద, (విష్ణుచిత్తీయము) ... | 6 | 0 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము ... | 0 | ½ |
| ఆదిపర్వము, పద్యకావ్యము, తెల్లచ్చు ... | 1 | 8 |
| " టీకతో ... | 4 | 0 |
| శ్రీమదాంధ్రభారతము, పద్యకావ్యము:— | | |
| ఆది, సభాపర్వములుగల సంపుటము ... | 4 | 0 |
| ఆరణ్యపర్వము ... | 4 | 0 |
| విరాటోద్యోగపర్వములు ... | 4 | 0 |
| భీష్మద్రోణపర్వములు ... | 4 | 0 |
| కర్ణశల్యసౌప్తిక స్త్రీపర్వములు ... | 4 | 0 |
| శాంతిపర్వము ... | 4 | 0 |
| అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములుగల సంపుటము ... | 4 | 0 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము ... | 11 | 4 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వము ... | 7 | 8 |
| శాంతిసప్తకము ... | 7 | 8 |
| ఆంధ్రభాషాభూషణము, విమర్శతో ... | 0 | 6 |
| ఆంధ్రభాషార్ణవము ... | 1 | 4 |

శ్రీరస్తు

# ముగ్గురు మూర్తులు

శ్రీ. ఎ. ఎస్. పి. అయ్యరు, ఎం. ఏ., ఐ. సి. యస్., బారిష్టరు,

అనువాదకుఁడు :

శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ

ప్రకటితము.

# అవతారిక



శ్రీ. ఏ. యస్. పంచాపకేశఅయ్యరు ఆంగ్లంలో వ్రాసిన 'Three Men of Destiny' అనే నవల కిది తెలుగుసేత. బహుగ్రంథకర్తలైన అయ్యరుగారి రచనలు ఆంగ్లభాషాభిజ్ఞులకు సుపరిచితములు. సరళము, సులభము, ధారాళము, హాస్యరసపూరితములైన శైలి వారిసొమ్ము. వారింతకు పూర్వం 'బాలాదిత్య' అనే నవల వ్రాసిరి. ఇది రెండవది.

ప్రాక్పశ్చిమసభ్యతలు సంగమిస్తున్న కాలమిది. సాంచీస్థూపమం దొకచో సింహవాహనులగు నిరువురు పురుషుల బొమ్మలున్నవి. అందొకరిచేతిలో ద్రాక్షపండ్లగుత్తియు రెండవవారిచేతిలో పద్మము నున్న ట్లావిగ్రహములు చెక్కబడినవి. వారిరువురు శల్యకేశ్వర (Seleukos) చంద్రగుప్తులని అయ్యరుగారిఊహ. ఆనాటి ప్రాక్పశ్చిము సభ్యతాసమ్మేళనమునకు చిహ్నమది. అట్లే సింహారూఢుడైన ఆంగ్లేయుడును మాతంగవాహనుడైన భారతీయుడును నేడు కూడా ద్రాక్షాగుచ్ఛపద్మహస్తులై ఈరెండుసభ్యతలకు సామరస్యము కూర్తురని అయ్యరుగారు ఆశంసిస్తున్నారు. తొలినాటి ఆప్రాక్పశ్చిమ సభ్యతాసమ్మేళనమునుగూర్చి ఈగ్రంథము ప్రవర్తించినది.

ఆకాలపుజరిత్రనుగూర్చి వ్రాసిన గ్రీకుగ్రంథకర్తలందరును అలీసాందరు భారతభూమి కెత్తివచ్చినవిషయములు వ్రాసియుంచిరిగాని భారతీయుల ఇతిహాసములం దెచ్చటను అలీసాందరుపేరే వినబడదు. అలీసాందరుచరిత్రమున చంద్రగుప్తోపాఖ్యానమును గూడ గ్రీకులించుక స్పృశించిరిగాని చాణక్యునిమాట నెత్తినవారుకారు. చంద్రగుప్తుడు అలీసాందరును అవమానింప నాచక్రవర్తి అతని బంధించి, తుదముట్టింపనెంచె ననియు, చంద్రగుప్తుడు

బంధనమునుండి తప్పించుకొని పారిపోయెననియు, త్రోవలో నొకచో నాతడు నిద్రించుచుండ అతని మొగమున బోడమిన చెమ్మట నొకసింగము నాకెననియు, భద్రగజమొకటి నెదురై అతని దనపై నెక్కించుకొనె ననియు, పిమ్మట నాత డారులషలసేన సమకూర్చుకొని భారతభూమిని జయించె ననియు, ఇత్యాదివృత్తాంతమును ప్లూటార్కు, జస్టిను మున్నగుయవనులు వ్రాసిరి. చంద్రగుప్తుడు శల్యూకేశ్వరున కేనూరేనుగుల నిచ్చె నని కూడా ప్లూటార్కు వ్రాసెను.

ఇక చాణక్యునివిషయము జూత మన్న గ్రీకుగ్రంథముల నాతని ప్రసక్తియే కన్పించదు. అట్లే కౌటిల్యుని అర్థశాస్త్రమున నెక్కడను జంద్రగుప్త పాటలీపుత్రముల ప్రశంసగాని అలీసాందరు-శల్యూకేశ్వరుల ప్రసక్తిగాని కాన్పింపదు. చంద్రగుప్తునాస్థానమున కేతెంచిన గ్రీకురాయబారి మెగాస్థనీసు కూడా చాణక్యునిగూర్చి వ్రాసినవాడు కాడు.

ఇట్లు పరస్పరవిరుద్ధములైన ఈపూర్వేతిహాసములను బౌద్ధజైనగాథలను, యావనచరిత్రగ్రంథములను అయ్యరుగారు శ్రద్ధమై పరిశీలించి, ధర్మాధికృతులగుటచే సత్యనిర్ధారణము వారికి అలవాటేగనుక, అతినిపుణముగా నాయావిషయములను గ్రంథావతారికయందు జర్చించిరి. అందు వారు తేల్చిన విషయము లివి.

1. కౌటిల్యరచితమని ప్రతీతిగల అర్థశాస్త్రము చాణక్యసంకలితమే. చాణక్యుడు చంద్రగుప్తునకు, దత్తనయుడగు బిందుసారునకు గూడ మంత్రి. ఈతడు దాక్షిణాత్యుడు. కేరళపుత్ర మీతని జన్మభూమి. నేటి కొచ్చిమండలమందున్న క్రాంగనూరుగాని ముసిరిగాని ఈతని పూర్వనివాసము.

2. చంద్రగుప్తుడు మహానందిసంతతివాడు, మౌర్యునకు పౌత్రుడును గానోపునని అయ్యరుగారి ఊహ. అర్థశాస్త్రమునందు జెప్పబడిన నరేంద్రుడు చంద్రగుప్తుడే.

బ్రహ్మాండపురాణమును అర్థశాస్త్రమును అశోకుని శాసనములును పైరెండువిషయములను నిర్ధారించుచున్నవి.

3. శాతకర్ణి దక్షిణదిగ్విజయము చేసినమాట యథార్థమే. తమిళ గ్రంథములు అశోకశిలాస్తంభములు నీవిషయంలో ప్రబలసాక్ష్య మిస్తున్నవి.

4. చంద్రగుప్తుడు అలీసాందరుచే బంధింపబడి తప్పించుకొనిపోవుటయుం నిక్కమే. 'జస్టిను' ఈవిషయమును స్పష్టముగా పేర్కొనెను. చంద్రగుప్తుని బంధించినది నందులేకాని అలీసాందరు కాదు అని కొందరు పాశ్చాత్యుల అభిప్రాయం. అందుకు తగిన ఆధారములు భారతీయుల గ్రంథములందు కన్పింపవు కావున 'జస్టిను' వ్రాసినవ్రాతను శంకింప బనిలేదు.

5. గ్రీకు చరిత్రకారులు పేర్కొన్న వృద్ధ 'పోరస్సే' ముద్రారాక్షసమందు జెప్పబడిన పర్వతకుడు. కొందఱు పర్వతకుడు నేపాళపతి అనిరి. కొందఱు శల్యకేశ్వరుడే పర్వతకుడనిరి. ఈయూహలు రెండును యథార్థములు కావు. ఆకాలమున కాశ్మీర మలయ కౌలూత సింధు సౌరాష్ట్రపతులను వశీకరింపగల నేపాళపతి యెవ్వడును గానరాడు. కాశ్మీర మలయకౌలూతాధిపులు పర్వతకరాజ్యము నభిలషించుట జూడ నాతనిరాజ్య మామూడురాష్ట్రములకు మధ్యభాగమున నుండవలెనని తోచుచున్నది. పర్వతకునకు ఉత్తరక్రియలు భారతధర్మానుసారము జరిగినవిగాన అతడు శల్యకేశ్వరుడును కాడు. కాశ్మీరపాంచాలమధ్యస్థములగు పర్వతభూములేలుకొను అభిసార అర్సకేశులు వృద్ధపోరస్సునకు సామంతులుగాన అతనికి పర్వతేశ్వరుడని బిరుద ముండె యుండును. పర్వతకాస్థానమున ప్రతీహారిణులు, గాంచుకీయులు నుండుట జూడ అభారతరాజన్యాచారము పర్వతకుడు భారతీయుడనుటకు బోషకమగుచున్నది.

6. అలీసాందరు రాజ్యవిభాగము రెండవసారి జరిగినపుడు అంభికి సింధువిపాశానదులమధ్య నుండు భూమి పంచిపెట్టబడినది. అనంతర మంభిని గూర్చి చెపుటను ప్రస్తావములేదు. కావున అంభిరాష్ట్రము మగధకు సంక్రమించియుండుననియు అంభి అనపత్యుడై మరణించియుండుననియు నూహించి అయ్యరుగారు అంభి ఆత్మహత్య చేసుకొన్నట్లు కల్పించిరి.

7. బౌద్ధగ్రంథములు చంద్రగుప్తుడు మేహవ్రణములతో బాధపడి బిందుసారుని రాజ్యాభిషిక్తునొనర్చి మరణించెనని చెప్పుచున్నవి. జైనగ్రంథములు చంద్రగుప్తుడు భద్రబాహుస్వామితోగూడ శ్రావణబెలగోలయందు సల్లేఖనమొనర్చి మరణించెనని వాకొనుచున్నవి. అయ్యరుగారు బౌద్ధులవ్రాతను నమ్ముటకే ఆధారములధికముగానున్నవని నమ్మి సల్లేఖనమొనర్చిన చంద్రగుప్తమునీంద్రుడు రాజవైశ్యపుష్యగుప్తుని కుమారుడు కానోపునని తేల్చిరి.

చరిత్రల ఏకవాక్యత కుదిరినప్రదేశములలో అయ్యరుగారు ఎట్టి మార్పును చేయక ప్రమాణవైవిధ్య మున్నపట్టుల మాత్రము స్వతంత్రించిరి.

ఈవిధముగా నమితశ్రమకోర్చి బహుగ్రంథపరిశీలనమొనర్చి, అయ్యరుగారు ప్రాతకాలపుజరిత్రను ద్రవ్వియెత్తి మనకనులయెదుట ప్రదర్శించిరి. ఆనాటిసాంప్రదాయములను, ఆచారములను, ధర్మములను, రాజతంత్రమును దెలుపు ననేకవిషయములు కథలోగ్రుచ్చియెత్తి గ్రంథమునకు వన్నె కల్పించిరి.

అపరూపమగు నీయుద్గ్రంథమును ఆంధ్రులకు సమర్పించుటకై చేసిన యత్నమున నే నెంతవఱకు కృతకృత్యుడనైతినో అనువిషయము సహృదయులకే వదలుచున్నాను. పాత్రౌచిత్యముచెడకుండా సంభాషణములు వ్యావహారికాంధ్రమున నే రచింప యత్నించితిని. వస్తువు పురాతనముగాన కథారచనము పట్ల గ్రాంథికాంధ్రము నాశ్రయించి ప్రాతదనపువాసన గల్పింప జూచితిని. గ్రీకునామములను పఠితృజనసౌకర్యముకొరకు సంస్కృతీకరించితిని. ఇట్లు చేయుట దోషముకాదని యెంచితిని. తక్కిన విషయములకు సహృదయులే ప్రమాణము అని విన్నవిస్తున్నాను.

ఇట్లు,

కాటూరి వేంకటేశ్వరరావు.

# విషయసూచిక

శ్రీ ర స్తు

# ముగ్గురు మూర్తులు

## 1

### జ గ జ్జి గీ షు వు

క్రీస్తుదైవతము మఱి మూడువందల ఇర్వది యేండ్లకు పుట్టు ననగా జరిగినవృత్తాంత మిది. నడివేసంగిదినము లవి. నేటి జలాలాబాదు కించుక పడమరగా నుండే నికాయపురమున (Nikaia) పటకుటీరమున విడిసియున్న అలీసాందరు (Alexander)తనపూర్వదిగ్విజయ యాత్రావిశేషములనుగూర్చిన వార్తలు తల్లి యగు అలింపాశాకు (Olimpias) వ్రాయించి యంపుచుండెను.

సమవిభక్తాంగుడు, దృఢకాయుడు, సుందరుడు నగు అలీసాందరు మోమున క్షాత్త్రతేజము వెల్లివిరియుచుండెను. విలువంపులై తీర్చిన ట్లున్న కనుబొమలు, విశాలమగుఫాలము, దీర్ఘమైననాసిక, రక్తరేఖారంజితములగు నేత్రములవెడలు ప్రసన్నగంభీరదృష్టులు నాతని మహానుభావమును బట్టియిచ్చుచుండెను. వెడఁదవక్షమున దిండుగా సమర్చికట్టిన ఉరస్త్రాణమును, దానిపై నున్న ఖాంసములగప్పి మోకాళ్లపైకి వ్రేలాడు నిలువుటంగీని ఆతఁడు ధరించియుండెను. తెల్లనితురాయి జెరవిన శిరస్త్రాణమును, మణులు దాపిన కంఠత్రాణమును పని తన ముట్టిపడుచుండెను. సైకరణప్రణయిని యగు నాతనిఖడ్గము అవితథోద్యమము. దానిని సిప్రియేశుడు (Cyprian King) ఆతనికి కానుకపెట్టెనట. ఆతడు నడుమున జుట్టిన చిత్రశిల్పాభిశోభితమగు ఇనుపకానె రథీయులు

(Rhodians) పెట్టినకానుక. పలకయు, బల్లెమును, పాదత్రాణములును చెంత నున్న పీఠమున గానవచ్చుచుండెను. పెదవులయందు భోగార్హ్వతయు, గడ్డము నందు సంకల్పస్థిరతయు, చూపులయందు విశ్వజిగీషయు నుద్యోతింప నిలువెల్ల ప్రాభవాభిమానము లుట్టిపడ నాతడు సమున్నతపీఠమున నాసీనుడైయుండెను. ఉత్తరము వ్రాయుచున్న యూమునేశుని (Eumenes)చెస నెడనెడ సాదర ములు సస్నేహములు నగు వీక్షణముల బఱపుచు చెప్పి వ్రాయించుచుండెను. దుర్గములగు హిందూకుశపర్వతముల దా నవలీలగా దాటుటయు రక్షణా (Roxana) దేవిని వివాహమగుటయు, భరతఖండముపై దాడి సలుప నుండు టయు, తక్షశిలాపతికి నితరులకు గప్పము వెట్టు డని వార్త లంపుటయు జెప్పి వ్రాయించి, ఇంచుక యాగి, తల్లి వ్రాయించి పంపిన లేఖపై నొకపరి చూడ్కి సారించెను.

"ఇచటివా రెల్లరు నీవిజయవార్తలు విని అక్కజ మందుచున్నారు. కాని నాయనా! నిన్ను దేవపతిపుత్రునిగా నెఱింగిన నాకేమి యక్కజము? భర్తృసమాగమమునకు బూర్వమే నాగర్భమున దేవేంద్రునివజ్రము సొచ్చి నటు లనుభవించిన నాకు నీదివ్యత్వము తెలియదా? ధ్యానేశ(Dionysius) హారకులేశ (Heracles) అఖిలేశులతో (Achilles) సగోత్రుడవైన నీవు నీజనకుని వజ్రాయుధము ననుకరించుచు పూర్వఖండముపై బడి నిర్జించి, యావ ద్విశ్వమును బాదాక్రాంత మొనర్చుకొందువు. నీతండ్రి ని న్నాశీర్వదించుగాక. తండ్రీ! విశ్వవిజయివై మరలి రమ్ము."

అని యందున్న తుదిమాటలు చదువుకొని మరల వ్రాయసకాని కిట్లు చెప్పదొడగెను.

"అమ్మా! నీ దీవన లూరకపోవు. నే నీపూర్వదిగంతమువఱకు జయించి, మాహిందూమహాసముద్రముగుండా తిరిగి పారసీకసముద్రమును జొచ్చి, ఈజిప్టుగుండా మాసిడానుకు జగజ్జేతనై వచ్చి నీపాదములచెంత వ్రాలుదును.

గురుపాదులగు అరిస్టాటిలు (Aristotle) ఈహిందూకుశపర్వతములను సముద్రపు కనుమాపుమేరలో నున్నదని చెప్పిరే కాని ఆమాట నిజముకాదు సుమా. సముద్ర మింకను ఎంతోదవ్వున నున్నదట. అయినను దిగంతమునకేగక నేను మరలి వత్తునచుట పట్టిది. నారాజ్యమునకు సముద్రమే పొలిమేర చేయుందును. పారసీకదేశము నవలీలగా జయించితిని; నా 'వసుపాలము'ను (Boukephalus) హరించిన 'ఉకు' (Oxus) తీరవాసులను భ్రుకుటిమాత్రముచే పాదానతుల నొనర్చితిని; నాసైన్యపదాఘాతముచే రేగిన కెంధూళి చేతనే సిథియనుల పలాయితుల గావించితిని. ఇక హిందూభూమియూ నాజైత్రయాత్ర నరికట్టునది! ప్రాక్పశ్చిమఖండముల నేకచ్ఛత్రముక్రిందికి దెచ్చి జాతిభేదములను, దిగ్భేదములను పోకార్చి సర్వమానవకోటి నేక మొనర్పనెంచు మీతనయుని వజ్రసంకల్పమున కెదురొడ్డువారు కాలము చెల్లినవారుగా నెఱుంగుము. మందభాగ్యులగు మూర్ఖులు, నాసేనాసముద్రము నెదుర్కొని మడిసి, నన్ను నృశంసుని జేయుచుండిరే కాని, నేను స్వభావముచే క్రూరుడను గాను. అమ్మా! నీసుతుని దాక్షిణ్యము నెఱుగవా నీవు? శరణాగతరక్షణ మనిన నా హృదయ ముప్పొంగిపోవును. నాయమోఘోద్యమమున కీమూర్ఖులు విఘ్నకారులై నాకోడలు మండించి, నన్నెక్కొకపుడు రాక్షసకృత్యముల కెపకొల్పుచుందు. పారసీకము దూతగా, ఐగుప్తము పురోహితుడుగా ప్రాక్పశ్చిమ ఖండములకు వివాహోత్సవము గూర్చుభాగ్యము నాకెన్నడో! భారతసముద్ర తీరమున నచటి తార్కికులతో తత్త్వవిచారము చేయుచు నిశ్చింతగా కాలము గడపు టెప్పుడో?" లేఖను ముగించుసరికి ప్రతీహారి ప్రవేశించి, "దేవా! తక్షశిలేశు, (Taxila) తనయుడగు అంభితో, బంగారుపల్లకిపై నేతెంచి తను దర్శనము వేచియున్నా" డని విన్నవించెను.

అలీసాంటరు:—మనవిజయదుందుభి హైందవరాజన్యుల నప్పుడే మేల్కొలుపుచున్నది. మంచిది. తక్షశిలేశు డెటుల నున్నాడు?

ప్రతీహారి:—లోకజ్ఞుడగు అపూర్వరాజు దేశకాలముల విచారించి సామ మవలంబించినట్లు తోచుచున్నాడు. ఆతని కుమారుడు నూత్రము మనఃపూర్వకముగా దేవపాదమూలమున కేతెంచిన ట్లున్నాడు.

ఆలీ:—నీవు వారితో నెట్లు సంభాషింప గల్గితివి ?

ప్రతీ.—నానాభాషావిదుడగు శశిగుప్తునిముఖమున.

ఆలీ.—శశిగుప్తుడు బాక్ట్రియాలో మనల జేరవచ్చినపుడు సేవలవీరు డనుకొంటినేగాని ఇన్నివిషయముల నుపకరించు ననుకో లేదు. ఈదేశమున మన కాతడు చాల అక్కఱకు రాగలడు. మంచిది. శశి గుప్తునితోగూడ వారిని ప్రవేశపెట్టుము.

తక్షశిలేశుడు డెబ్బదియేండ్ల వయసువాడు. రాజోచితములైన సరిగ దుస్తులవల నాతడు ధరించెను. అంభియు శశిగుప్తుడు నలుపదియేండ్లయీడు వారు. వారిరువురు గ్రీకులయుడుపులు దాల్చియుండిరి. అట్లు ప్రవేశించి నమస్కరించిన తక్షశిలాపతిని, ఆతనితనయుని తనయెట్టయెదుట పరపులపై నాసీనుల గావించి ఆలీసాందరు వారితో శశిగుప్తముఖమున మాటలాడుచు వృద్ధభూపతిని "ఇంతకు మీయభిప్రాయము చెప్పరైతిరి" అని ప్రశ్నించెను.

తక్షశిలేశుడును చిఱునవ్వు మోమున దోప "నేను వేఱుగా చెప్పవలసిన దేమున్నది? మీరా, మాఅన్నవస్త్రముల కాశించి వచ్చినవారు కారు; మాకా, మీభాగ్యభోగముల హరించే తలంపు మొదలే లేదు. ఇక మనకు పరస్పరకలహానికి కారణం కన్పించదు. కాదంటేరా, మాకు నెక్కువమైన భాగ్యమున్న మీరూ అనుభవింపవచ్చును. మీకు తలమున్కలైన భాగ్య మున్న మేమూ పాలుపంచుకోవచ్చును."

అనుటయు ఆలీసాందరు సాదరముగా లేచివచ్చి ఆవృద్ధుని కౌగిలించుకొని "ఈప్రియోక్తులతో తప్పించుకొని పోనెంచితివేమో కాని, ఏనాటికైన

ఔదార్యమున నిన్ను జయించి నాచేయిమే మీదనిపించుకొంటాను" అనుచు, అతడు తెచ్చిన కానుకలు గైకొని, ఆతండ్రికొడుకుల కెన్నియో పసదనము లొసంగి మిక్కిలిగా సత్కరించెను.

తక్షశిలాపతి ఎంతయు హర్షించి "మే మింక మీవాళ్లము. మాసర్వ స్వము మీదిగానే యెంచి వినియోగించికొనుడు. ఔదార్యంలో మిమ్ములను నేను మిగులనిచ్చినా, మాపండితులు మాత్రం శాస్త్రార్థంలో మీపండితులను మిగుల నివ్వరు. సమస్తశాస్త్రాలను పుక్కిటబట్టిన అట్టి మహాపండితులతో తక్ష శిలానగరం మీరాకకొఱకు ఎదురుచూస్తూవుంటుంది. ఇక విక్రమంలో ఎవరిది పైచేయవుతుందో తేల్చవలెనని పర్వతకుడు ఉవ్విళ్లూరుతున్నాడు. అల్పసత్వు లైన అభిసార అర్యకేశ మలయపతులను జయించిన గర్వంతో కన్నుగానక పర్వతేశ్వరుడ నైతి నని విఱ్ఱవీగుతున్నాడు" అనుచుండ, అలీసాందరు "మీ పండితులను ఓడించుమాట యేమోగాని, పర్వతకుని ఉబలాటం మాత్రం తప్ప కుండా తీరుస్తాము. ఇంతకు, ఆతని సైన్యసంపద ఏపాటిది?" అని ప్రశ్నించెను.

తక్ష.—ముప్పదివేల కాల్బంటులు, అయిదువేల ఆశ్వికదళం, అయిదువందల రథాలు, రెండువందల ఏనుగులూ-ఇదీ ఆతనిబలం. ఇక ఆతని స్నేహితుడు అభిసారునకు అయిదువేల కాల్బలం, వేయింటికి గుఱ్ఱపుదళం, ఏభైరథాలు ఏనుగు లొకయేభైవున్నవి.

అలీసాందరు.—పారసీకసైన్యంలో కూడా యీదేశపువి పదిహేను ఏనుగు లున్నవి, చూచాము. ఏమిటవి, యుద్ధంలో వీటి ప్రయోజనం?

తక్ష.—ప్రయోజనం అంతా యింతానా? అయితే పదీ పదిహేనూ వుండి ప్రయోజనం లేదు. వందలకొలదిగా ఉన్న గజదళం నడగొండలవలె సేనాముఖాన నిలుచున్నవీ అంటే వాటిని కదల్చటం, ఆవ్యూహంలో ప్రవేశించడం శక్య మవుతుందా! వాటిని రెచ్చగొట్టి పరబలం మీదికి

తోలితే వాటిధాకకు రథతురగపదాతులు నలినలి కావలసిందే గాని వాటిని అడ్డగించడం శక్యం కాదు.

ఆలీ.—కావచ్చునుగాని మాకు మాత్రం వాటిలక్ష్యం వుండదు.

తక్ష.—మీకు లక్ష్యం వుండదు గాని మీసైనికులకో!

ఆలీ.—మఱి వీటికి ప్రతిక్రియ ఏమి టంటారు ?

తక్ష.—వాటిని తిప్పికొట్టడమే ప్రతిక్రియ. భేరీపటహకాహళధ్వనులతో వాటికి చీకాకు పుట్టించి, చీదరగొల్పితే వెనుకకు మరలి వాళ్ల సేనలనే చిందరవందరగా తొక్కుకుంటూ పోయి చెదరగొట్టుతవి.

ఆలీ.—సెబాసు, మీరిక పయనముకండు. ఇదుగో, మాసేనాపతులు హేఫిస్థాన (Hephaistion) పృథుకేశులతో (Perdikkas) కొంతసైన్యం మీ వెంట గొనిపొండి. ఉదభాండపురందగ్గర సింధునదిమీద పడవలతో సేతువు నిర్మించి, మాసైన్యము నీవలి యొడ్డున నిలిపి, మీరు నదిని దాటి తక్షశిలా నగర రక్షణకు ఏర్పాటులు చేసికొని ఆవలియొడ్డున మారాక వేచి యుండండి. మే మింతలో కాబూలునదికి ఉత్తరమునగల శత్రువులను పరిమార్చి ఉదభాండపురానికి వచ్చి చేరుతాము. పిమ్మట సింధునదిని దాటి పర్వతక అభిసారుల చేవ యెటువంటిదో చూచెదము. మామిత్రులతో కయ్యమన్నచో మాకు సంకోచముగాని వేయిమంది పర్వతకులనైనా ఎదుర్కొవడానికి సిద్ధమే" అనుచు అంభివంక చూచి "మీయభిప్రాయం చెప్పరైతిరి" అనెను.

ఇంతసేపును సభక్తికంగా ఆలీసాందరువంక రెప్పవాల్చకుండా చూచు చున్నఅంభి, "చిత్తము. తమరు జగజ్జేతలు. ఈదేశంలో తమరిని ఎదుర్కొని పోరాడే మొనగాడు లేడు. ఇక యేనుగులా! అవి యెంతలావుగా వున్నా మావటివానికి లోకువ. తమకు వాటిభయం అక్కఱలేదు" అనెను. ఆలీసాంద

రామాటలకు చిరునవ్వు నవ్వుతూ అంభివంక ఇంచుక దృష్టినిలిపి "ఈకుఱ్ఱవాడు చాలా వృద్ధిలోకి వస్తాడు" అని పల్కెను. ఆపలుకులకు తక్షశిలేశుని మొగము సంతోషముచే నిండయ్యెను. పిమ్మట ఆలీసాందరు సబహుమానంగా వీడ్కొలుప వారిరువురును శశిగుప్తుడు తోడ రా దమగుడారముల కేగిరి.

త్రోవలో తక్షశిలాపతి ఆలీసాందరు మహానుభావమును గాంభీర్యమును ఆతడు జూపినస్నేహ గౌరవములను తలచికొని లోలోన మెచ్చుకొనుచు, శశిగుప్తునితో "సందేహం లేదు. ఈతడు నిజంగా దేవపతిపుత్రుడే. ఆశౌర్య గాంభీర్యములు ఇతరుల కేలా వస్తవి? ఆయన చరిత్ర నీకు తెలియకపోదు. మాకు కొంచెము వినిపించుదూ ఆ అద్భుతచరిత్ర" అని యడిగెను.

శశిగుప్తుడు.—ఆచరిత్ర ఒక పురాణ మవుతుంది. దాని కేమిగాని తులమావి (Ptolemy) వంటి చరిత్రజ్ఞులవలన నేను విన్నంతలో యథార్థము మనవిచేస్తాను. ఈయనతండ్రి ఫిలిప్పు రాజన్యమాత్రుడేకాని తల్లియైన అలింపాశ మాత్రం దొడ్డయిల్లాలు. ఆమె చిన్నతనంలోనే దేవేంద్రుని ఉపాసించింది. వివాహమైనరాత్రి ఆదేవికి వజ్రాయుధం వచ్చి తనగర్భంలో దూరి సహస్రజిహ్వాలతో మండి చల్లారినట్లు కల వచ్చింది. ఆరాత్రే ఫిలిప్పుకుగూడా తనదేవిగర్భమునకు సింహాలాంఛితమైన ముద్ర వేసినట్లు కలవచ్చింది. అంతట నాతడు మేలుకొని చూచేసరికి అందుకు తథ్యంగా తనదేవి శయ్యపై నొకమహాసర్పము కన్పించిందిట. పిమ్మట స్వప్నశాస్త్రజ్ఞులను విచారించగా వారు దేవపతిప్రసాదంవల్ల అంలిపాశకు సింహసత్వుడైన కుమారుడు కలుగు నని చెప్పి రట. పిమ్మట ఈమహావీరుడు ఆదేవి గర్భాన జన్మించాడు.

తక్ష.—ఆ అలాచెప్పండిమరి! వరప్రసాదుడు కాబట్టేఈఅద్భుత పరాక్రమం!

శశి.—అభిజాత్యాభిమానం ఆప్రభువుకు పుట్టుకలోనే అలవడింది. చిన్నతనంలో అందరూ దవుడు పందెములు వేస్తూవుంటే 'నువ్వుకూడా వారితో

దవుడు తీస్తావా?' అని ఎవరో అడిగారట. ఆలీసాందరు ఏమన్నాడో విన్నారా? 'నాతో పందెం చరచేవారంతా నావలె రాజపుత్రులైతే దవుడు తీస్తా' నన్నాడట.

తత్.—ఔను. పువ్వు పుట్టగానే పరిమళిస్తుంది.

శశి.—ఆలీసాందరు తండ్రి మొదటనుండి స్త్రీలోలుడు. ఒకనాడురాత్రి వేశ్య నొకదానిని కుమారునిశయ్యామందిరానికి పంపినా డట. ఆలీసాందరు శయ్యాగృహంలోఉన్న ఆవేశ్యను చూచి గడపలోనివాడు అచట నుంచే సీత్కారించుకొంటూ వెనుకకు దిరిగి స్నేహితు డగు టాల్మీగదిలోకి వెళ్లి అచట నిద్రించెనట. స్త్రీవిషయమున ఆలీసాందరునిగ్రహం అటువంటిది.

తత్.—ఆబ్రహ్మచర్య ప్రభావమే ఇంతవాణ్ణి చేసింది. హిందూ కుశపర్వతములు అవలీలగా దాటినాడంటే మరి సామాన్యుడా?

శశి.—కుమారుడు తండ్రివలె భోగలాలసుడై చెడిపోకుండా తల్లి సింహ దాసుడనే (Leonidas) గురువు శిక్షలో పెట్టింది. గ్రీసుదేశ మంతటిలో మహాపండితుడైన అరిస్టాటిలును కుమారునకు గురువుగా తండ్రి ఏర్పరచి నాడు. ఆ ఉభయుంలశిక్షలో పెరిగి ఇంతవాడై నాడు. ఆలీసాందరే అన్నా డట ఒకసారి 'నాతండ్రి నాకు జన్మ మిచ్చాడు. అరిస్టాటిలువారు నన్ను సార్థకజన్ముణ్ణి చేశారు' అని.

తత్.—నిజం, ఎంతరత్నమైనా సానబెట్టక ప్రకాశించదు.

శశి.—వర్తకు డొకడు జాత్యశ్వాన్ని తెచ్చి ఫిలిప్పుకు మూడు సువర్ణాలకు అమ్మజూపాడట. ఆగుఱ్ఱాన్ని వంచేకొతు దొరకక ఫిలిప్పు తన కక్కర లేదన్నాడట. ఆలీసాంద రావృత్తాంతం విని తా నాగుఱ్ఱమును వశవర్తినిగా జేసుకొని ఎక్కిస్వారిచేశాడు. అదే ఆయనకు పూర్వదిగ్విజయవాహనమై, తోడునీడై ప్రాణపదమైన వసుపాలము. దానిని ఉత్తరవాసులు దొంగి

లించుకు పోయినా రొకసారి. ఆలీసాంద రప్పుడు 'నాగుట్టమును తెచ్చి యిస్తారా? మీదేశాన్ని సర్వనాశం చెయ్యనా?' అని అడిగాడట. అంతట వాళ్లు గడగడలాడుతూ ఆగుట్టాన్ని తెచ్చి అర్పించారు.

అంభి.—ఆరౌతుకు తగినగుట్ట మది. కాని ముసలి దైపోతున్నది.

శశి.—కాక, ఎల్లకాలం ఒకరీతిగా వుంటుందా! అది చూచినన్ని దేశాలు, చేసినన్ని యుద్ధాలు మనం చూడలేదు, చేయలేదు.

శష.—సరేకాని, ఈజైత్రయాత్ర ఎందుకు ప్రారంభించినట్లు ఈయన? మాచక్రవర్తులవలె రాజసూయం చేయాలని సంకల్పమా?

శశి.—మీరాజసూయంపేరు. అదినామమాత్రవిజయం. ఈయన దట్లాకాదు. తాను జయించిన దేశాలన్నిటిలో తన ప్రతినిధులను వుంచి, వారిద్వారా, ఈయఖండ భూఖండం ఏకచ్ఛత్రం క్రిందికి తేవలెననే ఆయన సంకల్పం. చిన్ననాడు పారసీకరాయబారు ఒకబంతీ, ఒకకట్టా ఆయనకు కానుక పెట్టారట. వాటిని తీసుకొని ఆలీసాందరు అన్నాడట:—"ఈబంతిని కట్ట ఆడించినట్లు భూగోళమంతటినీ నాయిచ్ఛవచ్చినట్లు ఆడిస్తా" నని. ఆయనది వజ్రసంకల్పం. ఆయనవుద్యమం అవితథం. పారసీకవిజయానికి బయలుదేరుతూవుంటే, సామంతగణమూ, రాజపురుషులూ పెదవి విరిచి "'మేము రాలేము" అన్నారట. మీకర్మం; నే నార్జించే భాగ్యంలో పాలు పంచుకునే అదృష్టం మీకు లేదు. అయినా మీకు అన్యాయం చేయను. ఇదుగో" అని వారి కందరికీ తనరాజ్యం పంచిపెట్టాడట. "ఇది యేమిరా, నాయనా! ఇంత యవివేక" మని తల్లి మందలించి "నీకేమి మిగుల్చుకొన్నా" వని అడిగిందట. ఆమాటలకు నవ్వి "నా అదృష్టం లేదా నాకు?" అని సమాధానం చెప్పాడట. చెప్పినట్లుగానే లక్షలాదిసువర్ణాలు సంపాదించాడు. అద్ర్యాతంక (Adriatic) సముద్రంనుంచి సింధునది వఱకుగల భూఖండాన్ని పాదాక్రాంతం చేసుకున్నాడు. ఇంకొక చిత్రం

మీరు విన్నారో లేదో! పారసీక ప్రభువు ధీరేశుడు (Darius) సంధి రాయబారం పంపాడట. 'యూఫ్రెటీసునదికి పడమటనున్న భూభాగ మంతా అరణమిచ్చి నాకూతురునిస్తాను' అని. సచివుడైన ప్రమాణ్యుడు, (Parmenio) 'నేనే ఆలీసాందరుణ్నైతే ఈసంధికి ఒప్పుకొంటాను' అన్నాడట. అప్పుడు ఆలీసాందరు 'నేనూ ప్రామాణ్యుడనైతే ఒప్పుకొనే వాడనే' అని బదులుచెప్పి, ఆరాయబారికి ఏమి చెప్పాడో విన్నారా? "నేను ఆసియాఖండ సార్వభౌముణ్ణి అని ఎఱిగి మెలగమను నీప్రభువును. తనతో సంధిచేసుకోడానికి తనతోపాటువాడ ననుకొన్నాడేమో! తన కూతురే నాకు కావలసివస్తే తను ఇచ్చేదాకా ఆగ నని చెప్పు. తన కేమి కావాలో అడగమను ఇస్తాను. అంతేకాని తనదాక్షిణ్యంతో నాకు పని లే దని చెప్పు" అని కబురు పంపాడట.

శశ.—మఱి నన్ను తనతో సమానంగా చూచుకొని ఆదరించాడే.

శశి.—నిజమే. ఆయన శత్రుభీషణుడు, ఆశ్రితసులభుడూను. ఆశ్రితులలో తనజాతిఅనీ ఇతరులనీ భేదం పాటించడు. నెత్తినిపెట్టుకొని గౌరవిస్తాడు. ఇక ఆగ్రహం వచ్చిందో, ప్రళయాగ్ని అయిపోతాడు. థీబిస్‌పురముపై కోపంవచ్చి నేలమట్టంచేసి ఆడవాళ్లను పసిపిల్లలతో సమేతంగా బానిసల క్రింద అమ్మివేసినాడు. బాధిస్సనే (Batis) సేనాపతి పారసీకులపక్షం చేరాడని, వాడిపాదాలకు రంధ్రంచేసి కంచుకడియాలారంధ్రంలోదూర్చి, ప్రాణంపోయేదాకా నేలపై పడలాగించాడు. వెనుక ఎవడో పారసీక ప్రభువు ఏథెన్సుపట్టణాన్ని నష్టపరిచాడని, దానికిబదులుగా పరశుపాలపుర (Persepolis) ప్రాసాదాన్ని కాల్చి బూడిదచేశాడు. తన కెదురాడిన నేరానికి బాల్యసఖుడైన కళాధీశుణ్ణే (Kleitos) వధించాడు. కాల స్థానేశుడనే (Kallisthenes) చరిత్రకారుడు 'ఆలీసాందరుకు నేను ఇస్తే వచ్చినకీర్తేగాని లేకపోతే ఎక్కడిది?' అని తనకు నమ్ముడుగాక ధిక్క—

రించినందకు నేటివఱకు చెరలో ఉంచాడు. గర్దమ(Gordium) పురమందు పూర్వం మయదాసు (Midas) ఎక్కినరథానికి పూన్చికట్టిన రజ్జుగ్రంథి వుంది. ఆగర్దమగ్రంథిని విప్పినబుద్ధిశాలి ఆసియాకు చక్రవర్తి అవుతాడని చెప్పుకొనేవారు. ఆలీసాందరా ముడినిచూచాడు. అది విప్పడానికి సాధ్యంగా కనిపించలేదు. ఇదికాదు పని యని కత్తితో ఆముడిని ఒక్కవేటున ఖండించి వూరకొన్నాడు.

తక్ష.—అన్నన్నా! ఎందు కంత తొందరపడ్డాడు! కొంచెం ఓపికపట్టి విప్పితే ప్రాక్పశ్చిమఖండాలకు సామరస్యం కుదర్చవలసినవాడు కత్తితో ఖండించి తీరనివైషమ్యం కల్పించాడు రెండుఖండాలకు. మళ్లా ఏనాటికైనా, విడిపోయిన ఆముడిని తిరిగి బంధించి, రెండుఖండాలను ప్రేమసూత్రబద్ధం చేసే పుణ్యపురుషుడు పుట్టేవఱకు ఈవిరోధాలు తీరవు కాబోలు.

శశి.—నిజమే. గడచినదానికి వగచి ఏమి చేస్తాము గనుక? ఇంతకు ఆజగజ్జైత్ర ధాటకు ఎదురొడ్డే హిందూ ప్రభువులకు ముప్పు తప్పదు.

తక్ష.—పర్వతకుడువంటి మూర్ఖులు తప్ప ఇతరు లాసాహసానికి జొరబడరు. మామట్టికుండలా ఆలోహభాండంతో ఢీకొనేది? ఇంతకు, మా తక్షశిల పారసీక ప్రభువులకు ఒకప్పుడు సామంతరాజ్యంగా వుండేది. పారసీకనేతయైన ఆలీసాందరుకు మళ్లా తలవంచడం మాకు తప్పుకాదు. పర్వతకుని వంటి తుచ్ఛులకు దోసిళ్లొగ్గటంకంటె ఇటువంటి ఉదారుడు సరసుడు అయినవానితో సఖ్యంచేసుకోవడమే మాకు నీతిగా కనిపిస్తుంది.

తక్షశిలేశుని అంభిని సాగనంపి శశిగుప్తుడు తిరిగి స్వామిచెంతకు వచ్చి ఆవృద్ధభూపుని హృదయమున ఆలీసాందరుపైగల అనురక్తిని వేవిధముల కొనియాడి చెప్పెను. ఆలీసాందరుడు తక్షశిలేశుని ఉచితజ్ఞతకు మెచ్చుకొనెను. చెంతనున్నవారు 'ప్రభువులు వీరిపట్ల అతిమాత్రమైన ఔదార్యం చూపుతున్నారు. ఆ వదాన్యం చివరకు మనకు నష్టదాయక మవుతుంది' అని

ప్రసంగం ఆరంభించిరి. అంతట చక్రవర్తి "లాభనష్టాలు గణించడానికి నేను వర్తకుడను కాను. అవిధేయులకు ప్రతాపాన్ని, విధేయులకు అనురాగాన్ని, సమంగా పంచుతాను. ఇంతకు తక్షశిలాపతిరాక మనకు శుభసూచకం. హిందూ రాజుల ప్రతిఘటన అంతగా ఉండ దనుకొంటాను."

శశి.—దేవరవారు అలా భావించడానికి వల్లగాదు. ఇచట మాక్షత్రియవీరులు ఒక్కనాటికి తలవంచరు. పర్వతకునిపైగల అసూయాద్వేషములచే తక్షశిలాపతి తమతో చెలిమిచేయడం క్షేమంగా ఎంచవచ్చును. అంతేగాని తక్కినరాజులు ప్రతిఘటించి తీరుతారు. క్షత్రియధర్మం పరతంత్రత నంగీకరించదు. తక్షశిలాపతి వర్తనాన్ని నిరసించి అచటిపండితు డొకడప్పుడే తనరాజనీతిగ్రంథంతోకూడా ఇతరరాజుల ఆశ్రయంకోరి వెళ్లిపోయినాడట. రాజులు ఊరకొందా మనుకొన్నా ఈబ్రాహ్మణపండితులు ఊరకోనివ్వరు.

ఆలీ.—ఈబ్రాహ్మణుల కెందు కంత చలపాదితనం! వీరిమాటచొప్పున నడచుకొనేటంత అస్వతంత్రులా హిందూరాజులు ?

శశి.—రాజులకంటె, బ్రాహ్మణులకంటె కూడా బలీయమైనది ధర్మం. బ్రాహ్మణులు ధర్మానుశాసనంచేసి, నిర్వచనంచేస్తే ఆధర్మానికి రాజులు ప్రవర్తకులవుతారు. రాగద్వేషాలుగాని, స్వార్థచింతగాని లేని నిర్లిప్తులు కావడంచేత బ్రాహ్మణులమాటకే చెల్లుబడి. వీతరాగులు గతక్రోధులు అయిన ఆ పండితులు స్వయంవీరులైకూడా కత్తిపట్టక సాధుజీవనం చేస్తారు. రాజుల నిగ్రహానుగ్రహాలను లెక్కచేయక దైవస్వరూపమైన ధర్మాన్ని వారు నిరూపిస్తూవుంటారు. రాజదండము ఆతపోధనుల కనుసన్నల వర్తిస్తుంది.

ఆలీ.—ఈతపోధనులు రాచకార్యాలలో వేలుపెట్టి నాకడ్డం వస్తే తగినఫలం అనుభవిస్తారు. ఇంతకు, మన 120000 కాల్బలం, 15000 ఆశ్వికదళం మహాసముద్రంవలె పొంగి హిందూభూమిని ముంచుకువస్తూవుంటే ఈబ్రాహ్మ

బలమంత్రాలుగాని, ఈక్షత్రియుల ఆయుధాలుగాని అడ్డుకొంటవా?" అనుచు హెఫిస్థాన పృథుకేశులవంకకు దిరిగి, 'మీరు మీసైన్యములతో మీవంతునకు వచ్చినపని చక్కబెట్టి సింధుతీరాన సిద్ధంగావుండండి, కర్తరేశ (Krateros) సేనాపతితో మేము అచట మిమ్మును కలసికొంటాము. మాపూనికకు ఎవ రడ్డం వస్తారో చూచెదము.

కర్తరేశుడు.—ప్రభువుల ఉద్యమం అమోఘంగా కొనసాగుతుంది.

ఆలీ.—విశ్వాన్ని ఒకచ్ఛత్రం క్రిందికి తెచ్చేసంకల్పం కూడానా?

కర్తరేశుడు —ఆహా ! ప్రభువులు కారణజన్ములు.

ఇటులు సల్లాపించుచు ఆరాత్రి గడపిరి. పిమ్మట మూడునాళ్లకు సైన్యములు రెండును బయలుదేరెను.

---

# 2

## ఋష్యపత్న్యము

కాశీక్షేత్రములో ఆనాడు వర్షం కురుస్తూవుంది. వీథులవెంట వర్షపునీరు కాలువలుగట్టి పాఱుతున్నది. ఆబోతులుమాత్ర మావర్షధారలు లెక్కసేయక తలలువంచి గంగడోళ్లుబిగబట్టి చతుష్పథములలో నెమరువేస్తూ నిల్చియున్నవి. దండకమండలుధారులైన సన్న్యాసులు గూడా ఆబోతులను ఒత్తిగించుకొని వీథులలో సంచరిస్తున్నారు. ఇంద్రానుచరములైన వర్షధారలు, శివానుచరములైన ఆబోతులు, బ్రహ్మవాదులైన సన్న్యాసులు తప్ప ఇతరప్రాణు లెవ్వరు వీథులలో కన్పించుట లేదు.

హనుమద్ఘట్టమున దొకయింటిలో చాణక్యునితల్లి దేవకి నివసిస్తూ ఉన్నది. ఆమెకు నలభైఅయిదేండ్ల వయస్సు. చామనచాయ, దృఢగాత్ర.

మీనాక్షిఅనే స్నేహితురాలు, మీనాక్షిమనుమరాలు గౌతమి అనే పంద్రెం డేళ్లబాలిక గౌతమితో మాట్లాడుతున్నారు. ఆనాడు కాశీరాజసభలో చాణక్యుడు పండితులతో వాదంచేస్తున్నాడు. జంబూద్వీపం నాల్గుదెసలనుండి దిగ్గజాలవంటి పండితు లాసభకువచ్చారు. ఆవాదంలో తనకొడుకు జయించునో లేదో అని దేవకి ఆరాటపడుతూ మీనాక్షితో ఆతని పాండిత్య ప్రభావాన్ని గూర్చి చెప్పుతున్నది.

దేవకి.—తక్షశిలలో దిగ్గజాలవంటి పండితమల్లులను జయించి మల్లనాగుడనే బిరుదుపొందాడు బిడ్డ. నేడు విశ్వేశ్వరానుగ్రహం ఏలావుంటుందో?

మీనాక్షి.—అటువంటివాడి కీవాదములు కొట్టినపిండేగాని, మీ అబ్బాయికి ఎన్ని పేర్లమ్మా, వదినా? విష్ణుగుప్తుడు పెట్టినపేరనుకో. మరి ఇంకా కౌటిల్యు డనీ, వాత్స్యాయనుడనీ, ద్రామిళుడనీ, చాణక్యుడనీ, అంటారు గదా, ఏమి టీపేర్లన్నీ?

దేవకి.—విరోధులు కౌటిల్యు డంటారుగాని మేము కౌటిలగోత్రులం కావడంచేత కౌటిల్యుడని పేరువచ్చింది. మాపుట్టినింటివారిదేమో శ్రీవత్స గోత్రం. మానాన్నగారికి పురుషసంతతి లేకపోవడంచేత ఉభయకులాధారుడైన ద్వ్యాముష్యాయణుడు గనుక మా అబ్బాయినిగూడా ఆగోత్రంపేర వాత్స్యాయను డంటారు. మీవలెనే మేమూ ద్రమిళులం కావడాన్నిబట్టి ద్రామిళు డంటారు. తండ్రిగారినిబట్టి చాణక్యుడని పేరు వచ్చింది.

మీనాక్షి.—నవ్వుతూ మనుమరాలివంకకు జూచి "విన్నావటే నీసందేహం తీర్చానుగదా" అని దేవకితో, "కాబోయే భర్తగారికిన్నిపేర్లెలావచ్చిన వని నన్ను రోజూ అడుగుతుంది వదినా మీకోడలు."

ఆమాటలకు సిగ్గుపడి గౌతమి యింటిలోనికి బరుగిడిపోయెను.

మీనా.—మీఅబ్బాయికి యిష్టమని ఇవ్వాళ్ల తానే స్వయంగా అట్లుచేసింది. కోడలిపాకం కొంచెం రుచిచూడండి. అని మనుమరాలిచేత అరటియాకు లతో అట్లు తెప్పించి దేవకి కొకటియిచ్చి, తానొకటి తీసికొనెను.

దేవకి.—మీ తాతగారి కేమైనా మిగిల్చావా, అన్నీ మాకే పెట్టుతున్నావా.

మీనాక్షి.—తాతగారికీ మిగిల్చింది, భర్తగారికీ మిగిల్చింది.

అనగానే గౌతమి మళ్లా లోపలికి పారిపోయింది.

మీనాక్షి.—ఏమో, తల్లిచావుపిల్ల. మీచేతుల్లో పెట్టితే ఇంతసుఖపడుతుందని మావారు ఎంతో ఉబలాటపడుతున్నారు. దీనివివాహం తరవాయితీరితే శుక్లతీర్థానికిపోయి అక్కడ కృష్ణా, రామా అంటూ నిశ్చింతగా కాలంగడ పాలని వారి ఉద్దేశం. మీఅన్నగారికి బొత్తిగా ఇహమైముఖ్యం కలిగింది.

దేవకి.—అవును. మొదటినుంచీ శ్యామశాస్త్రిఅన్నగారిది నివృత్తి మార్గమే. మాచిన్నతనంలో వింతవింతగా చెప్పుకొనేవారు, ఆయనపాండిత్యాన్ని, హాస్యప్రియత్వాన్ని, మావారు చెప్పుతూవుండేవారు. ఒకలోభివాడు తండ్రి శ్రాద్ధంనాడు నిక్షేపంవంటి కపిలగోవు ఉండగా దాన్ని విడిచి, బక్క చిక్కిన ఒక ఆవును దానంచేయబోయినాడట. శ్యామశాస్త్రిగారు తీరా సమయానికి ఆకపిలనే దానంచేయించి పూరకొన్నారట.

మీనా.—అయ్యో, వదినా! ఆయన కొంటెతనా లింకా మీ రే మెఱుగు దురు? గయలో ఒకడు అమలకం వదలిపెడతా నన్నాడట. సరే, కాని మళ్ళి మంత్రంచెప్పేటప్పుడు అమలకానికి బదులు ఆమ్రం అనిచెప్పి వాడి చేత నీళ్లు వదలించారట. తీరా, నీళ్లువదలినతరవాత తెలుసుకొని అబ్రాహ్మడు చిన్నబుచ్చుకొన్నాడట. అప్పటికి ఇప్పటికీ మామిడిపండును చూచినప్పు డల్లా మీఅన్నగారిని తిట్టిపోస్తాడట. ఇంకొకటి మీరు విన్నారో, లేదో? ఒకడు అగ్నిలో హోమంచేయడానికి చవకపాకు కంపునెయ్యి తెచ్చాడట.

చప్పున మీ అన్నగారు 'నాయనా! దేవతలకు ఈనెయ్యి తాగితే డోకులం పుట్టుతవి' అనిచెప్పి, అప్పటికప్పుడు మంచినేయి తెప్పించారట.

దేవకి.—అన్నగారైనా ఇంకా వచ్చారుకారు. వానకూడా వెలిసింది. సభ యింకా జరుగుతూనేవుంది కాబోలు.

మీనాక్షి.—వదినా! ఎందు కంత ఆందోళన పడతారు. ఈపాటికి వస్తూనే వుంటారు. చూడండీ! తక్షశిలలోకూడా యిట్లా వాదప్రతివాదాలు జరుగుతూవుండేవా?

దేవకి.—జరిగేవికాని వేదశాస్త్రములమీద ఇంత ఆస్థలే దక్కడ. కాశీ అనగా, మగధ అనగా ఆర్యావర్తానికి నడిబొడ్డులవంటివి. తక్షశిల జంబూద్వీపానికి ఒకకొన నున్నది కావడంచేత అక్కడ ఎంతసేపూ వైద్యశాస్త్రమంటే, శస్త్రచికిత్సంటే ప్రీతి ఎక్కువ. యవనులు, అశ్వకులు, పారసీకులు, బాహ్లికులు మొదలైన వేదబాహ్యులు చేరుతూవుంటా రక్కడ. తక్షశిలాపతి, మాఅబ్బాయి ఎంతచెప్పినా వినక ఈమధ్య యవనప్రభువుతో సంధిచేసుకో బోయినాడు, మావాడికి ఒడలుమండి, 'ఛీ! వైదికధర్మాని కిక్కడ ఆశ్రయంలేదు. ఇక నిక్కడ క్షణంకూడా వుండ' నని చెప్పి తానుచేసిన అర్థశాస్త్రం తీసుకొని చక్కావచ్చాడు. మగధరాజుకు దానిని సమర్పించాలని సంకల్పం.

మీనాక్షి.—మగధలో మాత్రం పూర్వధర్మాలు తిన్నగా ఉన్నవా వదినా? ఇప్పటిరాజు మటీ భ్రష్టుడైపోయినా డంటూరు. ఎనమండుగురుతమ్ములూ, తానూ ధనం కూడబెట్టడమూ, ముఖస్తుతులకు ఉబ్బిపోవడం తప్ప దానం ధర్మం లేదంటూరు.

దేవకి.—అందుకే కాబోలు, మమ్మ నిక్కడ విడిచి, అబ్బాయి తాను ఒక్కడే పాటలీపుత్రం వెళ్లివస్తా నంటున్నాడు. గూఢచారులవల్ల ఈకథంతా వినేవుంటాడు.

మీనాక్షి.—అయితే, వదినా! రాజుల కున్నట్లు మీఅబ్బాయికి గూఢచారు లెందుకమ్మా?

దేవకి.—మరే నమ్మా. దేశమంతటా మావాడిచారులు తిరుగుతూనే వుంటారు. నన్నుకూడా ప్రజలు అనుమానిస్తారు. ఎక్కడలేని రాచకార్యాలూ మా అబ్బాయికే కావాలి. తక్షశిలలోవున్నప్పుడు మాఅబ్బాయికి దూరదృష్టి దూరశ్రవణం వున్నవనీ, అణిమాదిసిద్ధులు పొందాడనీ, గొప్పమంత్ర వేత్తనీ చెప్పుకొని అంతా గడగడలాడి పోయేవారు. ప్రభువు కూడా ఎంతో భయభక్తులతో మెలిగేవాడు. నల్లబ్రాహ్మణ్ణి నమ్మకూడ దనుకొని గుసగుసలు పోతూవుండేవాళ్లు అంతారు. ఇందుశర్మా, సిద్ధార్థకుడూ, నిపుణకుడూ అని మావాడిశిష్యులు. వాళ్లను చూస్తేనే భయపడేవాళ్లు ప్రజలు. అదుగో! సిద్ధార్థకుడు వస్తున్నాడు. ఏమి నాయనా! చల్లనివార్త వినిపించు తండ్రీ!

సిద్ధార్థకుడు ఇరువదియొక్కయేండ్ల వయసువాడు. దేవకిని సమీపించి, నమస్కరించి, "అమ్మా! గురువుగారు జయంపొంది ఏనుగంబారీమీద ఊరేగుతూ వస్తున్నారు. డెబ్బైనలుగురు, కొమ్ములు తిరిగిన పండితులు వాదించి ఓడిపోయినారు. మహారాజులుంగారు గురుదేవులకు సరిగంచు పట్టుదుశ్శాలువులు బహూకరించారు. అదుగో! ఊరేగింపు సమీపిస్తున్నది రండి. దశాశ్వమేధఘట్టానికి వెళ్లి చూతురుగాని" అని చెప్పి వారి ముప్పురను వెంట గొని పోయెను.

ఊరేగింపు దశాశ్వమేధఘట్టానికి చేరునప్పటికి వీథులనిండా జనము క్రిక్కిరిసి ఉన్నది. పట్ట పేనుగుపై అంబారీలో చాణక్యుడు పుష్పమాలాలంకృతుడై ఆసీనుడై వున్నాడు. మంగళవాద్యాలు మ్రోగుతున్నవి. స్వస్తి వాచకులు ఇరువంకల వేదగానం చేస్తూ వింజామరలువీస్తున్నారు. మాగధులు, "స్వస్తి శ్రీపండితప్రదీపక, సకలవిద్యాసముద్ర, తార్కికశిరోమణి, ఋష్య

పత్యా, చణకసూనులైన విష్ణుగుప్త విష్ణుదత్తంసులకు స్వస్తి" అని బిరుదుగా ద్యాలు చదువుతున్నారు. కుమారుని విజయోత్సవము నాతల్లి కన్నులార చూచు కొన్నది. ఊరేగింపు ముగిసినపిమ్మట చాణక్యుడు సశిష్యుడై, శ్యామశాస్త్రితో గూడా ఇంటికివచ్చి తల్లికి పాదాభివందనం చేసెను. కన్నుల నీరుపెట్టుకొంటూ తల్లి కుమారుని లేవనెత్తి అక్కున జేర్చుకొని "నాయనా! మీతండ్రిగారికి ఈవిజయోత్సవం చూచేభాగ్యం లేకపోయెగదా" అనిగద్గదకంఠంతో పలికింది పిమ్మట నందరు భోజనాలకు కూర్చున్నారు. "అయ్యో! ఇంతమంది వస్తారను కోలేదు బిడ్డచేసినఅట్లు చాలవు" అని దేవకీ మీనాక్షులు చేతులుపిసుకుకొంటూ వుండగా గౌతమి దొంతరలకు దొంతరలు తెచ్చి అందరకు అట్లు వడ్డించింది. "ఎక్కడివే, అమ్మా! ఇన్ని అట్లు,' అని దేవకీ మీనాక్షులు వంటయింటిలోకి వెళ్లి గౌతమిని ఆశ్చర్యంతో ప్రశ్నించారు. గౌతమి, "అమ్మమ్మా! మొన్న వారు చెప్పుతూవుండగా వినలేదూ? 'కష్టాలు మనంఒక్కళ్లమే అనుభవించాలి, సుఖం మాత్రం ఇష్టులతో, సఖులతో పంచుకోవాలి, అని ఈసుసఖమయూన ఆర్యపుత్రులు ఒంటరిగా రారని నేను ఊహించాను" అని బదులు పలికింది. ఆమాటలకు సంతోషం పట్టలేక దేవకి ఆబాలికను కౌగిలించుకొని, "తల్లీ! నాబిడ్డకు తగినఇల్లాలివి" అని చెక్కిలి దువ్వెను.

భోజనశాలలో శ్యామశాస్త్రి ప్రసంగం తెచ్చి గౌతమిని చాణక్యున కిచ్చి వివాహంచేస్తానని పలికేటప్పటికి నలుగురూ తథాస్తంటే తథాస్తన్నారు రాబోయే పుష్యమీనక్షత్రంనాడే సుముహూర్తమని నిశ్చయించేశారు. "ఇక చాణక్యులవారి ఇంట్లో ఇటువంటి అట్లు మాకు రోజూ దొరుకుతూ వుంటవి" అన్నారొకరు పంక్తిలో. చాణక్యుడు ముసిముసినవ్వులు నవ్వుతూ, "నాయింట్లో బియ్యపుగింజనేది వున్నన్నాళ్లూ అట్లకేమికొదువ వుంటుంది" అని బదులు పలికాడు. సిద్ధార్థకుడు, "ఈజంబూద్వీపంలో బియ్యపుగింజనేది వుండవలెనే గాని మాగురుదేవుల ఇంట్లో తక్కువవుతుందా" అనెను.



# 3

# సమాగమము

ఆ సంవత్సరమందే జూలై నెలలో ఒకనాటి యుదయమున పాటలీపుత్రనగరం బాలాతపంలో సువర్ణస్నానంచేసి, తిష్ఠుకొన్న అరువదినాల్గు ద్వారములతో, అప్రమత్తములైన అయిదుసూర్ల డెబ్బదిబురుజులతో కలకల లాడుతూవుంది. నగరంలోనికి కావలసిన ఆహారములు, భోగద్రవ్యములు నలు దెసలనుండి ఎడ్లబండ్లమీద ఎడతెరపిలేకుండా వచ్చి పడుతున్నవి. అరబ్బీ దేశమునుండి, పారశీకసముద్రమునుండి సుగంధద్రవ్యములు, గవయమృగదంత ములు, ముత్యములు, పగడములు భరుకచ్ఛముగుండా, సోపారోజ్జయినుల గుండా నగరంలోనికి వచ్చి చేరుతున్నవి. సింహళద్వీపకేరళములనుండి పచ్చలు, కెంపులు, కళింగ కోసల విదర్భ వజ్రకరూరులనుండి వేదోత్కటగిరినుండి, వజ్రరాసులు వచ్చి చేరుతున్నవి. నూలుబట్టలు ముత్యాలు పాండ్యమునుండి, త్రివిష్టపకాశ్మీరములనుండి వారాణసినుండి పట్టుబట్టలు; సింధుదరదములనుండి సువర్ణగిరినుండి సువర్ణము రాజధానికి వస్తున్నవి. కామరూపమహిషమండల ములు గంధపుచెక్క లంపుతున్నవి. వంగము కామరూపము పులితోళ్లు మొసలి చర్మములు పంపుతున్నవి. వింధ్యహిమవన్నగములు చిఱుతపులితోళ్లు, ఎలుగు బంటిచర్మములను, సౌరాష్ట్రము జలచరచర్మములను, కానుక లంపుచుండెను. వంగపాండ్యనేపాళములు పచ్చడము లంపుతున్నవి. ఉప్పులు, పప్పుదినుసులు, వెన్న, నూనెలు, కట్టెలు, బొగ్గులు, లోహోపకరణములు, కూరగాయలు, అరటియాకులు, అవియివియని ఏమిటి, ఆదేశ మీదేశమని ఏమిటి-ఏవస్తువు ఎక్కడ దొరుకుతుందో అక్కడనుంచి తెల్లవారుసరికి పాటలీపుత్రమహానగ రానికి వచ్చి చేరుతున్నవి. సమస్తదేశాలు పాటలీపుత్రసేవయందే నిమగ్నమై ఉన్నవన్నా దోషం లేదు. ఆరువందల అడుగులవెడల్పున నలభైఅయిదడు

గులంగోతున పెద్దకందకం తొమ్మిదిమయిళ్లపొడుగు రెండుమైళ్ల వెడల్పూ గల ఆమహానగరాన్ని ప్రదక్షిణిస్తున్నది. శోణానదినుండి జలప్రవాహం వచ్చి ఆకందకాన్ని నింపుతున్నది. కందకంమీద నాలుగువంతెనలు. ఆవంతెనలమీద సరకులబండ్లను పరిశీలించి కరగ్రాహులు ఎల్లిముద్రలు వేసి నగరప్రవేశానికి అనుమతి యిస్తున్నారు. వైదేశికులను పరిశీలించిగాని ప్రవేశ మివ్వడంలేదు.

నగరానికి ఈశాన్యంగా కొంతదూరాన గంగానది ప్రవహిస్తున్నది. గంగనుండి కాలువ త్రవ్వి, ఆకాలువనుండి కందకంమీదుగ తూములు కట్టి నగరంలోనికి గంగాజలం నింపుతున్నారు. సుగాంగప్రాసాదము చెంతనున్న గంగాసాగరసరస్సు గంగాజలంతో నిండి తొణికిసలాడుతున్నది. ఆసరస్సు చుట్టూ ఇంద్రకుబేర ఆశ్వినేయశివుల దేవాలయము లున్నవి. నగరదేవతలగు కుమారీమదిరల ఆలయము లొకచెంత నున్నవి.

రాజప్రాసాదమునకు నలుదెసల పూలతోటలు. ఆతోటలలో క్రీడా సరస్సులు. నగరము, రాజగృహమూ కూడా పాటలపుష్పసౌరభంతో గుమ గుమలాడిపోతున్నవి. పుష్పపురమనే సార్థకనామం వహించిన ఆనగరంలో పుష్పసంపదనుగూర్చి చెప్పడం పునరుక్తి. రాజగృహానికి నాలుగుద్వారాలు. ఆరుగు రాశ్వికులు, పన్నెండుగురు కాల్బలు ప్రతిద్వారంచెంత ఎనిమిది జాములు కాపుదలగా నుందురు.

రాజగృహము రెండవ దేవేంద్రభవనమే. దారునిర్మితమైన ఆమూడంతస్థులప్రాసాదము విశాలములైన ప్రాంగణములతో, చత్వరములతో ప్రతిక్షణము రాకపోకలొనర్చు దాసదాసీసహస్రములతో కనులపండువు చేస్తున్నది. చిత్రశిల్పాభిరామము లైనద్వారములు, స్తంభములు, తోరణములు, ఆసనములు చూపులనుపట్టి లాగుతూవున్నవి. దారువుతో, దంతముతో పనితన ముట్టిపడునట్లు నిర్మించిన పీఠములు, పచ్చలుతాపినకోళ్లతో, సరిగంచుల పట్టు పఱుపులతో, పాముకుబుసమువంటి తెల్లని వలిపవస్త్రపు మేల్కట్లతో చింతా

మణిపీఠములవలె ధగధగలాడుచున్నవి. ఆరడుగుల వెడల్పుమూతులుగల సువర్ణకుంభములు, తామ్రకాంస్యపాత్రలు, గోడలకు తళతళమెఱయునట్లు నిలిపిన స్ఫటికముకురములు, ఇత్తడిఅద్దములు ఆకొలువుసాలలలో, అంతఃపుర ములలో, కుమారమందిరములలో ఎచట జూచిన కనులపండు వొనర్చుచుండెను రాజప్రాసాదమున కించుకయెడముగా నున్నది ధర్మశాల. ఆనాడు పర్వదినమగు టచే ధర్మాధికారియగు చంద్రగుప్తుడు వేయిమంది బ్రాహ్మణులకు సమా రాధన ప్రయత్నములు చేయించుచుండెను. మగధేశ్వరుడు సోదరులతో పది గడియలవేళ కచటికి వచ్చును. చంద్రగుప్తునియింట ఆనాడేదో నైమిత్తిక మున్నది కావున ఆతడు ఏర్పాటులన్నియు పరిచూచువారిని నియమించి, ప్రాసాదమున కొకదెసనున్న తనగృహమున కేగుచుండెను. చంద్రగుప్తున కప్పటికి పందొమ్మిదేండ్లు. అంతపొడవును పొట్టియుగాని దృఢశరీరమును, శౌర్యముట్టిపడుచున్నముఖమును ఆతని మహానుభావమును పట్టియిచ్చుచుండెను. సన్నని నిలువుటంగీ తొడిగి, దానిపైన పట్టు అంగరఖాదాల్చి, సరిగంచుశాలువ వలెవాటు వైచుకొని అట్లు గృహాభిముఖుడై ఏగుతరి నాతనికి త్రోవలో నొక చిత్ర మెదురయ్యెను.

త్రోవకిరుదెసల దర్భలు ఒత్తుగా పెరిగి ఇంచుక ఏకాంతముగానున్న చోట నల్లనిబ్రాహ్మణుడొకడు దర్భలనుకాల్చి తనచేతిలోని తామ్రజలపాత్రలో గలుపుచుండెను. అప్పుడే గంగలో స్నానముచేసి విభూతిరేఖలు దాల్చి బ్రాహ్మణసమారాధనమునకు వచ్చుచున్న ఆబ్రాహ్మణునిరూప మాతడు దాక్షి ణాత్యుడనియు, నుదుటిపైతిలకము సామవేదియనియు తెలుపుచున్నవి. ఆబ్రాహ్మణుడు తదేకధ్యానముతో చేయుచున్న ఆపని యేమియో చూతమని చంద్రగుప్తుడు సమీపముననే నిలిచియుండెను. అట్లు నీళ్లలో బూడిద గలిపి బ్రాహ్మణు డానీటిని గుటగుట త్రాగి, ఘనకార్యము చేసినవానివలె సంతుష్టుడై లేచెను.

చంద్రగుప్తుడు సమీపించి, నమస్కరించి, "స్వామీ! ఇందాకటినుంచి తమరేదో ప్రక్రియ చేస్తున్నారు. అదియేమి ఓషధియో, ఎందుకు సేవిస్తున్నారోఅని నిలిచి చూస్తున్నాను" అని పలుకరించెను.

బ్రాహ్మణుడు, "స్నానమునచేసి వస్తున్న నాకీదర్భముళ్లు కాలిలో గ్రుచ్చుకొని చాలాబాధపెట్టినవి. వీటిపొగ రణచవలెనని కాల్చి బూడిదచేసి నీళ్ళలో కలిపి త్రాగుతున్నాను. అంతేగాని ఇది ఔషధం కాదు. కాక, శత్రుమారణం వల్ల మనస్సుకు శాంతికలిగించింది కనుక ఔషధమని చెప్పినా చెప్పవచ్చును." అనిబదులు పలికెను.

చంద్రగుప్తుడాబ్రాహ్మణుని మొగమున వెలుగు బ్రహ్మతేజమును దృఢదీక్షయు, సంకల్పస్థిరతయు గాంచి అచ్చెరువంది, ఆయననుగూర్చి అరయువాడై, "పాపం, ముళ్లు అచేతనములు గదా, స్వామీ! వాటి కేమి తెలుసును. ఇంత క్రూరదండనం విధించారేమి?" అని ప్రశ్నించెను.

బ్రాహ్మణు డించుక నవ్వుచు. "ఇది దండన మెందుకవుతుంది బాబూ! కంటకపరిహారంవల్ల నాకు క్షుధాశాంతీ, ఇతరుల కిట్టిబాధకలగకుండా లోకోపకారం కూడా జరిగింది. మనస్తాపం కలిగినప్పుడు చేతనాచేతనభేదం చేయడీచాణుక్యుడు. వెధవముల్లుగదా అని అవమానం సహించడం ధీరలక్షణంకాదు.

చాణుక్యు డనే పేరు విననంతనే చంద్రగుప్తునకు తనతాతయగు మౌర్యుడు చెప్పినమాటలు జ్ఞప్తికిరాలెను. "మహామేధావి. పండితుడు, నీతిజ్ఞుడు, అఘటనాఘటనాపటిష్ఠుడు అయిన చాణుక్యుడనే ద్రవిడబ్రాహ్మణు డున్నాడు. నాయనా! నువ్వాతనినాశ్రయించి బ్రతుకవలసిం" దని మౌర్యుడుపదేశించిన దీతనిగూర్చియే కదా! వెదుకబోయినతీగ కాళ్లకు పెనవేసుకొన్నట్లయినది అని చంద్రగుప్తుడు సంతోషించి, "స్వామీ! మీదర్శనంవల్ల నేడు నాకు సుదినం. తమ రెక్కడనుంచి వస్తున్నారు? తక్షశిలలో వున్నారని వింటున్నాము."

చాణక్యుడు.—కాశీనుంచి వస్తున్నా నిప్పుడు. జన్మదేశమైన కేరళభూమి పదుమూడోయేట ఏమి వదిలానో! అదిమొదలు ప్రవాసమే అయింది. ఆరేండ్లు కాశీలో వేదాధ్యయనం. తక్షశిలలో ఆరేండ్లు ఆయుర్వేదం, రాజనీతి, అర్థశాస్త్రం దేర్చి ఇప్పు డాయూరు వదలి వచ్చినాను.

చంద్ర.—స్వామీ! ఇందాక తమరు అపరాధివిషయంలో చేతనాచేతనభేదం చేయము అన్నారే. అపరాధి పరాక్రమసంపన్నుడైనమహారాజయితేనో ?

చాణ.—వట్టివాడా! నాప్రభావం నీవింకా ఎఱుగవు. అవమానం చేసినవాడు మహారాజుగాదు, ఫాలాక్షుడైనాసరే నేను ప్రతీకారంచేసి నిశ్శేషంగా పగతీర్చుకొంటాను. నామంత్రబలం, నీతిప్రయోగకుశలతా అటువంటివి. ధర్మరక్షణంకొఱకు నాశక్తి అంతా వినియోగించి కార్యం సాధిస్తాను. నాధర్మబలంముందు ఈప్రభువుల చతురంగబలాలు పని చేయవు.

చంద్ర.—ఈకలిలో ధర్మాని కింకా అంతబల మున్నదా స్వామీ ?

చాణ.—ధర్మ మెప్పుడూ బలీయమే. ధర్మకవచం తొడుగుకున్న స్వార్థపరులకు ధర్మం పనిచేయనిమాట నిజమేకాని ధర్మపరుణ్ణి ధర్మమే రక్షిస్తుంది.

చంద్ర.—చిత్తం. తమరు తక్షశిల ఎందుకు వదలిపెట్టినట్లు?

చాణ:—ధర్మరక్షణంకొఱకే వదలిపెట్టవలసి వచ్చింది. తక్షశిలాపతి ధర్మచ్యుతుడై యవనాశ్రయంకోరి ఆలీసాందరుతో సంధిచేసుకొబోయినాడు. యవనప్రాబల్యంవల్ల ఈపుణ్యభూమికి విపత్తు రాకుండా కాపాడడానికి ధర్మరక్షకుడైన ప్రభువును వెదకికొంటూ ఈమగధదేశం ప్రవేశించాను. పాణిని, వరరుచులవంటి శాస్త్రకర్తల కాశ్రయమైన ఈమగధసామ్రాజ్యం చేత ధర్మరక్షణం చేయించే తలంపుతో నాఅర్థశాస్త్రగ్రంథం తీసుకొని వచ్చాను. ఈసార్వభౌమునకు సమర్పింతుదా మని.

చంద్ర.—చిత్తము. వేదశాస్త్రపారంగతులైన మహావిద్వాంసులు తమరు మగధపుణ్యంకొద్దీ ఇచటికి దయ చేశారు.

చాణ.—నువ్వు అతిశయోక్తులు పలుకుచున్నావు. వేదశాస్త్రముల పారం జూడడానికి నేనెంతవాణ్ణి. సర్వమూ తెలుసు ననుకొనే కించిజ్ఞుణ్ణికాను నేను. ఏదో కొంత తెలుసుకోవడంవల్ల వేదశాస్త్రము లపారములని మాత్రం నేను తెలుసుకోగలిగాను. "సత్యాన్ని మరుగుపరచడం నామతంకాదు. అందువల్లనే స్వోత్కర్షకఖయినా జంకక నేను ధర్మహాని కలిగినప్పుడు ఎంతటి మహారాజునైనా లెక్కచేయనని చెప్పాను. అంతేకాని నేనేమీ సర్వజ్ఞుణ్ణి కాను, సరేకాని భోజనవేళ అతిక్రమిస్తున్నట్లున్నది. ధర్మాధికారియైన వృషలు డెక్కడ ఉన్నాడో చెప్పగలవా?

చంద్ర.—(నమస్కరించి) స్వామీ ! వీడే అవృషలుడు.

చాణక్యు డాతని మొగముసెదుట వృషలు డన్నందుకు చిన్నబుచ్చుకొని, "నాయనా! నిన్నెఱుగక అలవాటుకొద్దీ అలా వృషలుడని నోరుజారాను. నేను పరధ్యానంలోఉండి ఇంతసేపు నీసుక్షత్రియలక్షణాలు, నీమహానుభావం గుర్తించలేకపోయినాను. అకారణావమానం చేసిన నన్ను మన్నించి, నీకేమి కావలెనో, కోరుకో. నీ కాకోర్కె తీర్చి సంతుష్టి గూర్చేవఱకు నాకీ మనస్తాపం చల్లారదు.

చంద్ర.—స్వామీ! ఎంతమాట సెలవిచ్చారు. తమబోటిపెద్దలు నన్ను వృషలుడనటయే నాకు శ్రేయం. మీఅనుగ్రహం ఉంటే నాకు సమస్తకామములుం తీరినట్లే. నందసేనానియైన మౌర్యునిగూర్చి తమరు వినే ఉంటారు. నందవంచితుడై మరణించిన ఆపూజ్యుడు నాకు తాతగారు. మిమ్ము నాశ్రయించి అభయం కోరవలసిందని వారు నా కనేకపర్యాయములు ఉపదేశించారు. కాబట్టి మిమ్మును అభయప్రదానం వేడుచున్నాను. నేనెన్ని అపరాధములు చేసినా క్షమించి నేటి యీవాత్సల్యం నాయెడ చిరకాలం తమరు నిలపడమే నాకు వరం.

చాణ.—శుభం, నాయనా ! శుభం. మీతాతగారినిగూర్చి నేను విన్నాను.

నీసుగుణసంపదను చూస్తే ఆమహాపురుషునకు నువ్వు తగినవనుమడవని కని పిస్తూనే వుంది. నిన్ను ఆమాత్రం పోల్చుకోలేక పోయినాను. మీతాత గారిచరిత్ర వినవలెనని ఎన్నాళ్లనుంచో అనుకుంటున్నాను. భోజనానంతరం మళ్లా నాకు కనిపించు.

చంద్ర.—చిత్తం. మౌర్యచరిత్ర తమకు సావకాశంగా వినిపిస్తాను. భోజన శాలచెంత నాచారుణ్ణి నిలిపి వుంచుతాను. వానివెంట దయచేసి నాగృహం పావనం చేయండి. నాకు అనుజ్ఞ ఇప్పించండి!

అని చాణక్యునకు భోజనశాలకు మార్గము చూపి తాను స్వగృహమున కేగెను. ముఖ్యచారుడగు భాగీరథుని పిలిచి, చాణక్యపండితుని రాక వానికెఱిగించి, ఆబ్రాహ్మణుని ఆకారమును వానికి వర్ణించి చెప్పి, "నీవు సమారాధనానంతరం వారిని వెంటబెట్టుకొని ఇచటికి తీసుకురా. ఆయన ధర్మనిష్ఠ చూస్తే ఇవ్వాళ్ల అక్కడనుంచి తిన్నగా బయటికి వస్తాడని తోచదు. అయినా, ఆయనశక్తి కూడా కొంత తెలిసి వస్తుంది. కనిపెట్టి ఉండు." అని చెప్పి పంపెను.

---

# 4

## చాణక్యప్రతిజ్ఞ

చాణక్యుడు భోజనశాల ప్రవేశించునప్పటికి బ్రాహ్మణబృందమంతయు వెండిపళ్లెరముల ముందు బారులుతీర్చి కూర్చుండి యుండెను. వేఱుగా ఒక పంక్తిలో పని బంగారుపళ్లెము లమర్చియుండుట చాణక్యుడు చూచి, ధర్మశాలాధికారితో "ఈబంగారుపళ్లెము లెవరికోస" మని ప్రశ్నించెను. "నవనందులకును, పదవది పండితశ్రేష్ఠుడైన మహాబ్రాహ్మణునకునూ" అని ధర్మశాలాధికారి బదులు పలికి, "మీ రావెండిపళ్లెముల పంక్తికి దయచేయం"

చెనెను. చాణక్యు డంతట, "నేను తక్షశిలలోను, కాశీలోను పండితసభలను జయించిన మహాపండితుణ్ణి. నన్ను చాణక్యుడంటారు. నే నీపదోపీటకు అర్హుణ్ణి" అని సమీపించుచుండ, చాణక్యుడనే పేరు వినబడునంత బ్రాహ్మణులందఱు హర్షవిస్ఫారితములైన చూడ్కులతో నాతనివంక అత్తెత్తి చూచుచుండిరి. ధర్మశాలాధికారి చాణక్యునితో, "స్వామీ! ఆపదోపీటమీద రాజగురువులైన సుబంధులవారు కూర్చుంటారు. కాబట్టి తమ రాబ్రాహ్మణపఙ్క్తిలోకే దయ చేయండి" అనెను. చాణక్యు డాతని నెగాదిగ జూచి, "అది యేమయ్యా! మళ్లా అలా మాట్లాడుతావు? పండితశ్రేష్ఠునికోస మేర్పడినపీటపై సుబంధు డెట్లా కూర్చుంటాడు? అత డేమంత పండితుడు కాడే!" అనుసరికి సుబంధుని పాండితీసార మంతకుమున్నే ఎఱుగుదురుగాన, పండితులందరు నవ్వుచు, దమలోదాము గుసగుసలు పోవజొచ్చిరి. చాణక్యుడు ధర్మాధికారిమాటలు లెక్కచేయక, పదియవపీటను సమీపించి, "ఈపండితపరిషత్తు అనుజ్ఞతో నే నీ మహాపండితపీఠంమీద కూర్చుంటున్నాను" అని పలికి దానిపై నాసీను డయ్యెను.

చాణక్యునిసాహసమునకు పండితులందఱు సాధువాదము చేయుచు నాత డొనర్చు శాస్త్రప్రసంగములను శిరఃకంపన పూర్వకముగా వినజొచ్చిరి. ధర్మశాలాధికారి, చాణక్యుని "మీరు నామాట వినండి, ఈసాహాసం తగదు" అని హెచ్చరింప, చాణక్యుడు, "మీరెన్ని చెప్పినా నాకంటె మహాపండితుడు వచ్చేవఱకు నే నీపీఠం దిగను" అని అట్లే కూరుచుండెను.

ఇంతలో శకటాల వక్రనాసరాక్షసాది మంత్రిగణముతో, సుబంధుపండితునితో గూడి నవనందులు భోజనశాల ప్రవేశించిరి. బ్రాహ్మణబృందమును చాణక్యుడును తమతమ పీటలనుండి లేచి నిలిచిరి. నవనందులుపఙ్క్తు లన్నియు దాటి రాజపఙ్క్తి సమీపించి, అచట పదవపీటపై నిలిచియున్న కాలవర్ణుడగు చాణక్యునిగాంచి ఆశ్చర్యముతో నిలిచి చూచుచుండిరి. కొంతవడికి సుబంధుడు

తెప్పిరిల్లి, "ఎవరుస్వామీ! మీరు, ఈపంక్తిలోకి వచ్చారు" అని ప్రశ్నించెను. చాణక్యుడు, "నేను చాణక్యుడనే విష్ణుగుప్తుడను. తక్షశిలలో, కాశిలో పండిత పరిషత్తులను జయించిన మహాపండితుడను." అని బదులు చెప్పగా, సుబంధుడు తెల్లబోయి వెనుక కొకయడుగు వైచెను. రాజసోదరులలో కడపటివాడగు ధననందుని గాంచి, సుకల్పనందుడు, "! ఈకొంటెతనమేదో నీపనివలెనే యున్నదే" యని నవ్వెను. ధననందుడు, "శివశివా! నే నేమీ ఎఱుగను. రాజ గురువులవారిని అపహాస్యం చేస్తానా, మహారాజా! నేను?" అని బదులాడెను. సుకల్పు డంతట, "అయితే మఱి యేమిటీ ఆగడము? దిగమను, ఆబ్రాహ్మణుని పీట దిగమను." అని ఆజ్ఞాపింప, ధననందుడు చాణక్యునితో "స్వామీ! తమ రాపీట దిగండి" అనుచుండ చాణక్యు డాతని లెక్కసేయక, సుకల్పునితో "మహారాజా! నేను తమయేర్పాటుకు భిన్నంగా ఏమీ చేయలేదు. పండిత శ్రేష్ఠునికొఱకు ఏర్పడిన ఈపీఠానికి నాకంటె అర్హులిచట లేరు."

ధననందుడు.—అయితే నాయాజ్ఞ వినుపించుకోవటయ్యా నీవు?

చాణక్యుడు.—నేను మహారాజాజ్ఞను ప్రతీక్షిస్తున్నాను.

సుకల్పుడు.—ఈపీటమీద సుబంధులవారు కూర్చోవాలని మాఆజ్ఞ. మీ రావెండిపళ్లెముల పంక్తికి వెళ్లండి.

చాణక్యుడు.—చిత్తం. మహారాజులు అట్లు నిర్ణయించేముందు సుబంధునకు నాకూ పాండిత్యంలోవుండే తరతమభావం తెలుసుకోవడం ధర్మం, కనుక ఈపరిషత్సమక్షంలో మాపుభయులకు శాస్త్రార్థానికి అనుజ్ఞయిస్తే జయాపజయాలు తేలిపోతవి. అప్పుడు దేవరవారు ధర్మనిర్ణయంచేస్తే దానికి బద్ధుణ్ణవుతాను. సుకల్పు లనే తమనామధేయమే తమరు ధర్మావతారులని తెలుపుతూవుంది.

సుకల్పుడు.—అయితే మామాట కెదురాడతావటయ్యా నువ్వు?

చాణక్యుడు.—నేనే కాదు, ధర్మం చెప్పవలసినప్పుడు ఇంతబాలుడైనా చెప్ప వచ్చు. 'బాలాదపి సుభాషితం' అన్నారు. సుబంధుడు పండితశ్రేష్ఠుడని తెలేవటకు ఈపీఠం ఎక్కడగడని నావిన్నపం. అట్లాకాక, ఈపీఠం రాజ గురువులకో, సుబంధులవారికో ఏర్పాటుచేశామంటారా, నాఅభ్యంతరం లేదు. పండితపీఠమంటే తప్ప లేకపోతే నా కీపీఠ మక్కఱలేదు. నేను ఆబ్రాహ్మణు లందరితో పాటు కూర్చుంటాను.

సుకల్పుడు.—జేవురించిన కనులతో, కోప మణచుకొనుచు, వెఱ్ఱిబ్రాహ్మడా! నువ్వు వైదేశికుడవు. ఇక్కడిమర్యాద లెఱిగినట్లు లేదు. వెంటనే మర్యా దగా లేచి వెళ్లి బ్రాహ్మణపంక్తిలో కూర్చో. పెంకెతనం చెయ్యకు."

చాణక్యుడు.—ఆమాటలకు జంకక సభవంక జూచి, "ఇచట రాజమంత్రు లెవ్వరూ లేరా! మహారాజునకు హితం చెప్పడానికి" అని ప్రశ్నించి, అంతట నిలువక మరల మహారాజుతో, "ప్రభువులు సుబంధుణ్ణి నాతో వాదానికి డీకొల్పండని మనవిచేసుకొంటున్నాను. క్షణంలో ఆతణ్ణి పరా భవించి నాఅర్హత రుజువుచేసుకొంటాను. కాశీలో కొమ్ములుదిరిగిన పండి తులను పలాయితుల్ని చేశాను."

సుకల్పుడు.—మళ్లా కాశీకే వెళ్లి నీవాదకండూతి తీర్చుకో, ఇక్కడ పెంకె తనం చూపకు. దిగు, పీటదిగు.

చాణక్యుడు.—వేదశాస్త్రాలను ఆర్యధర్మాన్ని రక్షించేప్రభువులు మీరు. ధర్మా శ్రయమైన ఈమగధాస్థానంలోనే నాకు అన్యాయం చేసి, ప్రభువుల వారు ధర్మదేవతను దిక్కుమాలినదాన్ని చేస్తున్నారు. వేదశాస్త్రములందే కాక రాజనీతియందు కూడా నేను అసమానుణ్ణి. రాజధర్మానికి విపర్యయం జరగడం నేను సహించను. అధర్మాన్ని ప్రతిఘటించడం నాకు విహితమైన ధర్మం.

సుకల్పుడు.—ఎవడురా, అక్కడ? ఈపెంకె బ్రాహ్మణ్ణి జుట్టు పట్టుకు బయటికి ఈడ్వండి.

మహారాజాజ్ఞ నెరవేర్చుటకు ఆయుధపాణులగు రాజభటులు వచ్చి చాణక్యుని ఆక్రమింపసాగిరి. ఇంతదనుక ఇతికర్తవ్యతామూఢుడై చూచుచున్న రాక్షసమంత్రి, కార్యము పాకను తప్పుచున్నదని యెంచి, రాజభటులను వారించి, చాణక్యునితో, "అయ్యా! నామాట వినండి. సాటిబ్రాహ్మణులు, మీకు అవమానం జరగడం నాకెంతో కష్టంగావుంది. చూడండి, శకటాలుడు వక్రనాసుడు, నేనూ అంతా బ్రాహ్మణపంక్తిలోనే కూర్చున్నాము. మీరు కూడా మాపంక్తికి దయచేయండి." అని ప్రార్థించెను.

చాణక్యుడు.—సుబుద్ధి శర్మగారూ! తమ మాట తీసివెయ్యాలని పట్టుదలగాని, మహామంత్రులకంటె నాకధిక సమ్మానం జరగాలనే అతిశయంగాని, రాజపంక్తిలో ఏదో భావుకోవాలనే ఆశగాని నాకు లేదు. ఇది పాండితీ విషయం, ధర్మవిషయమూ గనుక నేను పట్టుబట్టుతున్నానుగాని లేకపోతే నాకు వెండిపళ్లెం కూడా అక్కరలేదు. విస్తరంటలో తింటాను మహారాజులాగ. మూకుట్లోకూడా తినడానికి రోయనివాడికి, నాకివ్వాళ్ల వెండిపళ్లెంలో తింటే ఏమో జరుగుతుందని కాదు. సుబంధయ్యకు పండితుడని పేరుపెట్టి ఈఅగ్రసత్కార మిస్తామంటేమాత్రం నేను ఒప్పుకొనేదిలేదు.

రాక్షసుడు.—మహారాజులు విష్ణ్వంశసంభూతులు. వారిఆజ్ఞయే ధర్మం.తమకు తెలియని దేమున్నది?

చాణక్యుడు.—గొప్ప రాజభక్తుడవయ్యా, మహామంత్రీ! నువ్వు. సంతోషమే గాని, రాజచరితమే ధర్మమనేమాట పామరులకు చెప్పవలసిన సామాన్యవిధి. అంతేకాని బ్రాహ్మణులకు, శ్రావకులకు అది వర్తించదు. అధర్మమైన రాజశాసనాన్ని ధిక్కరించి ధర్మస్థాపన చేసే విశేషవిధి మాయందు వున్నది.

రాక్షసుడు.—రాజశాసనధిక్కారం రాజద్రోహ మవుతుంది.

చాణ.—ఒక్కనాటికీ కాదు. రాజశ్రేయమునూ, ప్రజాక్షేమమునుకోరి శాసనాన్ని ధిక్కరిస్తామేకాని రాజ్యాశచేత కాదు. 'ధర్మలోభమేకాని రాజ్య

తృష్ణ లేదు మాకు. మిథిలేశుడైన జనకునంతటివాని ఆస్థానంలో, యాజ్ఞ వల్క్యునకు అగ్రపీఠ మివ్వడానికి వీలుపడదని గార్గి వివదించటం మీరు ఎరుగనిది కాదు. ఇక ఇక్కడ సుబంధయ్యమాట వేరే చెప్పేదేమిటి. అగ్రపీఠార్హుడైన ఆమహాపండితుని పాండిత్య మెటువంటిదో చూతామంటే ఇంతవఱకు బెల్లంకొట్టినరాయివలె ఆయన నోరు మెదల్ప డెందువల్ల?

ఈమాటలకు సభాజనము పక్కున నవ్వెను. సుకల్పు డంతట మండిపడి, మంత్రితో "ఎందు కాయనతో వాగ్వ్యయం చేస్తారు? లాగండి జుట్టు పట్టుకొని బయటికి. ఇటువంటి కొండముచ్చుల కదే శాస్తి." అనెను.

చాణక్యుడు.—ఈకొండముచ్చుతోనే ఢీకొనగల ప్రజ్ఞాశాలి యీసభలో వుంటే లేచి రమ్మనే నేను కోరుతున్నాను. వాదంలో నన్ను ఓడ్చినవారికి తలయొగ్గి ఈపీఠం దిగుతానేగాని, వేదశాస్త్ర గౌరవం మంట గలిసిపోతూ వుంటే, మీకత్తులు కటార్లుచూచి భయపడతా ననేది కల్ల. ఎంతటిరాజైనా ధర్మోల్లంఘనం చేస్తే మాత్రం సహించేది లేదు.

ధననందుడు.—సరేకాని, బంగారంవంటి దీర్ఘకాయాన పీతాంబరాలు ధరించిన సుబంధులవారిని కాదని, నీవంటికోతిని మాపంక్తిని కూర్చోబెట్టుకోమంటావుటయ్యా?

చాణ.—పండితులకు గౌరవం అంతస్సారంచేత కలుగుతుందిగాని బహిర్వేషంచేత కాదు. రాజ్యాంధు లెరుగ రీవిషయం.

ఆమాటలకు సభలో మరల గొల్లుమని నవ్వులు.

సుకల్పుడు.—"ఇక నింతట చాలును. గెంటండి వీడ్ణి వెలుపలికి."

అని ఆజ్ఞాపించునంత రాజభటులు మూగి చేతులొకరు, జుట్టొకరు పట్టుకొని లాగుచు, ఒకరు ముందునకు, త్రోయుచు వెలుపలికి పడలాగుచుండ, వీడిన కేశబంధముతో, సడలిన కటిబంధముతో చాణక్యుడు నేలపై బడెను.

సుబంధుడు అగ్రపీఠముపై ఆసీనుడయ్యెను. సభాజనమంతయు ఈ అత్యాచారమునకు నివ్వెఱగంది, ఊపిరైయైన విడువక నిశ్చేతనమై చూచుచుండెను. చాణక్యు డంతట క్రోధతామ్రవిలోచనుడై, దంతసందష్టాధరుడై ఒడలెల్ల కంపింప లేచి నిలిచి, సడలినబట్ట సవరించుకొని, నందులవంక చుఱచుఱ జూచుచు కేలెత్తి ఇట్లు పలికెను. "మహాపండితుణ్ణి నన్ను అవమానించిన ఈపాపం కట్టి కుడుపుతుంది. నాతోపాటు వేదశాస్త్రాలను కూడా నేడు నేలపై పడవేసి కాలితో మట్టిన మీరాజ్యమదాంధతకు అవసానకాలం చేరువయింది. మీవంటి క్షత్రియకులపాంసనులవల్ల వేదశాస్త్రాలకు, మగధ రాజ్యానికి పట్టినపీడ వదలించేదాక ఈచాణక్యుడు నిద్రపోడు. ఆర్యధర్మ రక్షకుడైన సుక్షత్రియుణ్ణి ఈమగధసింహాసనంమీద నిలిపేవఱకు, నేడు వీడిన ఈజుట్టు తిరిగి ముడవను. నందకులవినాశకమైన నల్లత్రాచిది." సుకల్పు డామాటలకు మండిపడి, "ఎవడురా, అక్కడ? నోటిమీద కొట్టండి ఈకుక్కను. పట్టుకుపోయి కొఱతవేయండి" అని ఆజ్ఞాపింప బ్రాహ్మణసంఘమంతయు హాహాకారములతో లేచి నిలిచి, 'అత్యాచారం' 'అబ్రహ్మణ్యం' 'అధర్మం' అనుచు పలువిధముల పలుకసాగెను. రాక్షసమంత్రి అంతట కార్యము పాకముదప్పుచున్నదని యెఱింగి, బ్రాహ్మణసంఘమును శాంతింపజేసి, సుకల్పునితో, "ప్రభువులు పిచ్చుకపై బ్రహ్మాస్త్రం సంధిస్తున్నారు. అపరభార్గవరాములవలె దిగ్విజయంచేసిన మహాపద్మనందుల వారి పుత్రులు తమరు, ఈ పేదబాపని ప్రలాపాలను లక్ష్యంచేసి కనుబొమలు ముడువ వలదని విన్నవిస్తున్నాను. దినదినం వేయిమంది బ్రాహ్మణులకు సంతర్పణం చేస్తున్నారు ప్రభువులు. ఏలినవారి జన్మదినోత్సవానికి అరవైవేలమంది బ్రాహ్మణులను సంతర్పణం చేస్తున్నారు. ఇలానిరంతరం బ్రాహ్మణసమారాధన పవిత్రములైన ప్రభువులహస్తాలు బ్రాహ్మణరక్తంతో పంకిలంగావడం కంటె, పాపరాశియైన ఈ బ్రహ్మచారిని విడిచిపుచ్చడం ఎక్కువ ఉదారంగా వుంటుంది. మూర్ఖ దంతవాణ్ణి సామంతశతకంతో పట్టి నిర్జించిన మహారాజులు

నిరాయుధుడు, నిస్సహాయుడు అయిన దాక్షిణాత్యబ్రాహ్మణమాత్రునికిభయపడి, బ్రహ్మహత్యకు ఒడిగట్టా రనిపించుకోవలదని మనవి. ఈతని దుస్తంత్రాలకు ప్రతిక్రియ చేయడానికి ఈసుబుద్ధిశర్మ వుండగా ప్రభువులవారు నిశ్చింతంగా వుండవచ్చును. ఇంతకు ఈబాపని దురాగ్రహం మనల నేమి చేస్తుంది" అని విన్నవింప, సుకల్పనందుడు శాంతించి, పెదనవ్వునవ్వి, "మేలు. సుబుద్ధి శర్మా! మేలు" అని మెచ్చుకొనుచు, "ఇక ఆలస్య మెందుకు? భోజనశాలకు కూర్చుంద" మనెను. బ్రాహ్మణులందఱు పీఠములపై నాసీనులైరి

క్రోధవివశుడైన చాణక్యుడు భోజనశాలనుండి వెడలిపోయెను. ఈవృత్తమంతయు పరికించి చూచుచున్న భాగీరథి, చంద్రగుప్తుని దూరదృష్టిని మెచ్చుకొనుచు, చాణక్యునికి సన్నయొనర్చి, చంద్రగుప్తగృహాభిముఖుడై తాను ముందు నడువసాగెను.

భాగీరథిని వెన్నంటి వచ్చిన చాణక్యుని చంద్రగుప్తుడు గోనికి గొంపోయి, కడచిన వృత్తాంతమంతయు విని "స్వామీ! ఈ పాపిష్ఠి కాలంలో ధర్మాని కింకా దిక్కెక్కడ? తమరు తొందరపడి ఘోరప్రతిజ్ఞ చేశారు. రాక్షసమంత్రి అడ్డపడకపోతే తమరు ప్రాణములతో వెలుపలికి వచ్చిపడడమే దుర్ఘటమయ్యేది" అని నొచ్చుకొనెను.

చాణక్యుడు.—రాక్షసమంత్రి కాకపోతే మఱివాకరైన అడ్డపడతాడుగాని చూస్తూ వూరుకొనరని నేనెరుగుదును. సుకల్పుడైనా, కోపవేగంచేత అజ్ఞ యిచ్చాడేకాని, బ్రాహ్మణహత్యకు సాహసించడనే నాకు నమ్మకం. అయినా దేమో అయింది. ఇంతకు నువ్వు అదృష్టవంతుడవు. ఈదుర్జాతిని నాశం చేసి నిన్ను మగధరాజ్యాభిషిక్తుణ్ణి చేసి తీరుతాను. ఈచాణక్యప్రతిజ్ఞ కిక అడ్డులేదు. ముందు జరగవలసినకార్యం చెపుతాను విను. దేశమంతటా నాచారు లనేకులు మారువేషాలతో తిరుగుతూవుంటారు. నువ్వు కూడా

కొందరిని విశ్వాసపాత్రులను చారులుగా ఏర్పాటుచేసుకో, నాకబురు నీకు, నీకబురు నాకు ఎప్పటికప్పుడు చేరుతూ వుండాలి. మన ఉభయుల చారులకు ఒక్కటే సంకేతం ఉండడం మంచిది. 'శ్రావకులకు స్వస్తి' అనీ, 'నాగులకు, దేవతలకు స్వస్తి' అనీ 'బ్రహ్మదేవునకు కుశధ్వజునకు స్వస్తి' అనీ సామాన్యసంకేతాలు. సంశయం కలిగినప్పుడు మాత్రం చంద్రుడికి స్వస్తి' అని సంకేతం. చారుల నిజాయితీ నిశ్చయమయ్యేవరకు, వాళ్ళకు చెప్పే మాటలకు బాహ్యార్థం వేరుగా ఆంతర్యం వేరుగా వుండాలి. ముందు జరగవలసిన కార్యం చాలా వుంది.

చంద్ర.—దుర్ఘటమైన కార్యానికి పూనుతున్నారు తమరు.

చాణ.—సర్వం బుద్ధిసాధ్యము. దుర్ఘటమంటూ వుండదు. ఇంతకుధర్మభ్రష్టులై నందులు తమనాశం తామే తెచ్చుకొన్నారు. నువ్వు భయపడకు.

చంద్ర.—భయమనేమాట నేను నేడు వింటున్నాను.

చాణ.—మేలు, వృషలా! మేలు. నీ వంటటి ధీరుడవని ఎరుగుదును. మహా పురుషలక్షణాలన్నీ నీయందున్నవి. రాజ్యలక్ష్మి నిన్ను అవశ్యం వరిస్తుంది.

చంద్ర.—దేవరవారు శిష్యుణ్ణిగా అనుగ్రహించడమే నాకు సర్వార్థసిద్ధి.

చాణ.—మంచిది. నాయనా! గోబ్రాహ్మణులను వర్ణాశ్రమములను రక్షించి తివా, ధర్మమే నిన్ను రక్షిస్తుంది.

చంద్ర.—ఆచార్యుల ఉపదేశం శిరసా వహిస్తున్నాను.

చాణ.—తరుణం వచ్చేవరకు రహస్యరక్షణవిషయంలో ఏమరకు. శుభకాలం వచ్చేదాకా అణగి వుండడమే ధీరలక్షణం. అకాలసాహసం కార్యహాని చేస్తుంది.

చంద్ర.—చిత్తం. తమరిక ఇచ్చట నిలవడం క్షేమం కాదు. నందులకు ఫుల్లా ఏమి దుర్బుద్ధి పుట్టుతుందో చెప్పలేము. దేశాటనానికి వేసంచెందిన నాన్నో

హితుడొకడున్నాడు. అతనిరథం సిద్ధంచేయిస్తాను. నమ్మకమైన బంటొకడు మీకు రథం గడపుతాడు. తమరు ప్రయాణంకండి. కార్యసాధనకు కావల సినధనం నావద్ద పుష్కలంగా వున్నది. నందవినాశనానికి వినియోగించ వలసిందని తాతగారు నాకప్పగించిన ధనరాసులు మూలుగుతూ వున్నవి. ప్రస్తుతావసరానికి పదిసంచుల సువర్ణములు రథంలో పెట్టిస్తాను.

చాణ.—నీజాగ్రత్తకు సంతోషమే కాని, కార్యసాధనకు మన కెవరెవరు సహాయులవుతారో ఆసంగతేమైనా ఆలోచించావా?

చంద్ర.—చిత్తం. నందవిరక్తుడైన కళింగుడొకడున్నాడు. నేను రెండులక్షల సైన్యాన్ని పోగుచేస్తే తాను ఏబదివేలతో బాసటఅవుతాడు.

చాణ:—(పెదవి విరిచి) అది పులగంమీని పప్పువంటిది. ఇంకా ఎవరైనా?

చంద్ర.—వైరాత్యుడనేశబరుడు, భోండవీరుడనే భోండుడు, చెరియైదు వేలతో చేరతారు నన్ను, తాతగారు వారికి చేసినమేలుకు ప్రత్యుపకారంగా.

చాణ.—ఆంతగా వుపయోగించక పోయినా, ఎదో గుడ్డిలో మెల్ల. అందు లోనూ ఈఆటవికులు చాలావిశ్వాస్యులు. నేనిక బయలుదేరి వర్ధమానపురం వెళ్లి కార్యసాధనోపాయాలు అన్వేషిస్తాను. నందవినాశనానికి విలంబ మవుతుందేమో కాని నాశనం కావడంమాత్రం తప్పదు. సర్వనాశనం జేసి తీరుతాను. నీవు మాత్రం కనుగలిగి వుండు.

చంద్రగుప్తు డంతట నమస్కరింప నాతని దీవించి చాణక్యుడు నాలుగు కబళములు త్వరత్వరగా నోటవైచుకొనుచుండ, చంద్రగుప్తుడు రథము సన్నద్ధము చేయించెను. చాణక్యు డారథము నధిరోహించి వర్ధమానపురాభి ముఖుడై వెడలిపోయెను.



# 5

## జీవసిద్ధితంత్రములు

చాణక్యునకు జరిగిన అవమానమునుగూర్చి వ్యాకులపడుచున్న రాక్షస మంత్రి ఆనాటిసాయంవేళ ధననందునితో ఆవిషయమై ప్రసంగించుచు, "తీరా, కార్యం మించిపోయింది. రాజనీతిధురంధరుడు, వేదవేదాంగవిదుడైన బ్రాహ్మణునితో అకారణవైరం తెచ్చిపెట్టుకొన్నాము. చతుష్షష్టికళలే కాదు, సంధి విగ్రహయానాదులేకాదు, మంత్రప్రయోగోపసంహారాలే కాదు, ఆయనకు రానివిద్యయే లేదట. దీనికి తోడు ఎంతటి కార్యమైనా సాధించే బుద్ధిసంపద పట్టుదలగలవాడు, అహంకారం తప్ప ఇతరదుర్గుణాలు లేనివాడు. ఇంతటివాణ్ణి పరాభవించామని బ్రాహ్మణులందరికీ మనమీద గుఱ్ఱుగావుంది." అనిపలికెను.

ధననందుడు.—చాలింతురూ ఇంతట. ఆవెఱ్ఱిబాపడి మాటలకు నిజంగా భయ పడుతున్నట్లున్నారు మీరు. అతగాడు ఎంతపండితుడైతేమాత్రం మంత్రా లకు చింతకాయలు రాలవు.

రాక్ష.—అను రలా తోసివేయడానికి వల్లగాదు. మంత్రతంత్రములలో ఎంతైనా మహిమ వుంటుంది. శతఘ్ని మొదలైన మారణాస్త్రాలమాట ఏమంటారు? విషప్రయోగాలచేత అనేకవ్యాధులు కల్పించే సాధనా లుంటవి. ఇటువంటి తంత్రాలకు కేరళదేశం చాలా ప్రసిద్ధి. ఈబ్రాహ్మణు అక్కడివాడేనని చెప్పుకొంటున్నారు. తన అర్థశాస్త్రం మన ఆస్థానంలో సమర్పించాలని వచ్చినట్లు వింటాను. అటువంటివాడు మనకు అనురక్తుడైతే ఎంతో అండగా వుండేవాడు.

ధననం.—నిజమే. నేనెన్నితంటాలుపడినా,చివరకు తోళ్ళమీదా,జిగుళ్ళమీద, చెట్లమీద, గుట్టలమీదా పన్ను వేసినా ఎన్నైలక్షలపణాలకు మించడంలేదు కోశంలో. ఈబ్రాహ్మడు కోశవృద్ధికేమైనా ఉపాయాలు చెప్పేవాడేమో?

ఒకపూట మనపంక్తిని కూర్చోనిస్తే ఏమో మునిగిపోతుందన్నట్లు త్రాచు పాముతో చెలగాటలాడాము. పోనీ, సుబంధుడివల్ల ఏమైననిరాహ్వాకమన తుందాంటే, శాంతులనీ,దానాలనీ అయినకాడికి ధనం వెచ్చింపజేయడం తప్ప రెండోది కనబడదు. అయినా, చాణక్యుణ్ణే మళ్లా దుప్వ తీసుకు వస్తేనో?

రాక్ష. మరే, అపాకం తప్పింది. మొదలే అతడు కొఱుకరానికొయ్య. మనం లక్ష ఇస్తామన్నా లోభించేవాడు కాడు. ఆశ్రయిస్తే లొంగేమనిషేకాని. ఆశ పెట్టితే లొంగేవాడు కాడు.

ధనసం.—మరి దీని కేమి ప్రతిక్రియ ఆలోచించావు.

రాక్ష.—'వజ్రం వజ్రేణ భిద్యతే' అని మళ్లా అంతటి తంత్రకోవిదుణ్ణి ఒకణ్ణి మనం సంపాదించి చాణక్యతంత్రానికి ప్రతిక్రియ చేయించాలి, అటువంటి సమర్థుడు ఎక్కడ దొరుకుతాడా అని చారులను పంపి గాలిస్తున్నాను దేశమంతా.

ధనసం.—సెబాస్. ఈ ఆలోచన బాగుంది. కానివ్వండి.

పాటలీపుత్రమున రాక్షసమంత్రి ఇట్లు విచారించుచుండ,చాణక్యుడు వర్ధమానపురమున కేగి అచట ఇందుశర్మ యను బాల్యమిత్రుని, ఆయుర్వేద జ్యోతిశ్శాస్త్రములందును మంత్రతంత్రములందును కుశలుడగువానిని జూడ నేగెను. పాటలీపుత్రమున తనకు వాటిల్లిన భంగపాటంతయు ఇందుశర్మకు దెలియజెప్పి, "నీవు నాకిందు సహాయుడవు క" మ్మని యడిగెను. ఇందుశర్మ వల్లె యనెను. చాణక్యు డాతనికి కార్యసాధనమునకు, మంత్రరక్షణమునకు వలయునుపాయములెల్ల నెఱిగించి, 'నీవు బౌద్ధక్షేత్రుక వేషంతో చరిస్తూ, నందులకాప్తుడవు కమ్ము. చంద్రగుప్తు డచట నీకు సర్వసహాయం. నీవాతని రహస్యంగా కలసికొంటూ ఆతనివల్ల నందులగుట్టుమట్టులు తెలుసుకొని నీజ్యోతిషంతో, మంత్రశాస్త్రంతో నందులను వశ్యులను చేసికో. నందులకు రోగం

నొప్పి పుట్టించు. అనేక ఉత్పాతాలు కలిగించు. ఆనేరమంతా నామీద మోపి ప్రతిక్రియలు చేస్తూ వుండు. ఎప్పటి వర్తమాన మప్పుడు చారులవలన నాకు తెలుపుతూ వుండాలి. నందరాజగృహం అడుగునుంచి ఎట్లా తొలంచుకు వస్తావో నీదే భారం" అని ఉపదేశించెను.

ఇందుశర్మ, "మీ ఉపదేశ ప్రకారం సర్వమూ సాధిస్తాను. నాపేరు నేటినుంచి జీవసిద్ధి. జీవసిద్ధిశక్తి త్వరలోనే మీకు తెలిసి వస్తుంది. నాకు సెలవు" అని చాణక్యుడిచ్చిన ధనపుసంచి అందుకొని పయనమై పోయెను.

వారము దినములు గడచునప్పటికి పాటలీపుత్రమున ఎవరినోట విన్నను జీవసిద్ధి అనేక్షపణకుని గూర్చియే. చాణక్య ప్రతిజ్ఞనుండి నందవంశమును రక్షించుటకై నగరమున జేరిన జీవసిద్ధియొక్క ప్రభావమును ప్రజలు వేనోళ్ల జెప్పకొనజొచ్చిరి. బ్రాహ్మణకులముతో గూడ చాణక్యుని నాశనము చేయుటకై ఆక్షపణకుడు మంత్రతంత్రములకు దొడంగెను.

శకటాలుడను నందామాత్యుని కుమారునొకని పూర్వము మహాపద్మనందుడు వధించి కోటలో నొక చీకటిగదిలో నాతనిశవమును పాతిపెట్టించెను. ఈరహస్యమును మౌర్య డొక్కరుడు దక్క నొరు లెరుగరు. చంద్రగుప్తుని వలన ఈగుట్టు నెఱింగిన జీవసిద్ధి నందులకు తనయెడ విశ్వాసముపుట్టించువాడై, నందులతో, "ఈకోటలో మనకు విరోధిభూతములున్నట్లు నాకు పొడకట్టుతూ వుంది. ఆగ్రహములు చాణక్యునిమంత్రానికి సహాయం చేస్తున్నవి. మనం ముందుగా గ్రహబాధ తొలగించుకోవాలి. అదియేదో బ్రాహ్మణగ్రహమై వుండాలి. కాబట్టే బ్రాహ్మణుడైన చాణక్యునిపక్షాన పని చేస్తున్నది" అని చెప్పెను. పిమ్మట నందులకు రాక్షసమంత్రిని వెంటగొని కోటలో బ్రాహ్మణాస్తు లున్నప్రదేశము గనుగొనుటకు బయలుదేరెను. "కోటలో ఏమిటి? బ్రాహ్మణ ఎముకలేమిటి! వట్టిది" అని వారందరు వాపించిరి. జీవసిద్ధి, "అట్లా కాదు. నామాట నమ్మండి. నేనుచూపెట్టితే సరికదా" అనుచు, ఒకొక్కగదిలోనికే

వారిని దోడ్కొని యేగి, 'ఇదిగో అదిగో' అని పసిపట్టువానివలె అభినయించుచు, తుద కా ఎమ్ములున్న చీకటిగదిలోనికేగి "ఇదిగో ఇక్కడనే వున్నవి. త్రవ్వు"డనెను. నందు లొకరిమొగము నొకరు చూచుకొనుచు, త్రవ్వించి చూడ నచట నాయస్థిపంజర మగుపడెను. నందులు ఆశ్చర్యచకితులై జీవసిద్ధి ప్రభావమును గొనియాడి, అతని యుపదేశానుసార మాయస్థులను గంగలో గలిపిరి. ఆది మొదలు జీవసిద్ధియంతటి మంత్రవేత్త లేడని నందులును రాక్షస మంత్రియు నమ్మిరి. జీవసిద్ధియు, "దుర్గంలో ఇక శత్రుభయంలేదు. పొలిమేర కట్టుకట్టివేశాను. ఇక ఆ దుష్టబ్రాహ్మణుని ఆటలు సాగనివ్వను" అని ప్రగల్భములు పల్కుచు, సమయము దొరకినపుడెల్ల బ్రాహ్మణులను నిందింప జొచ్చెను. క్రమముగా నందులకు బ్రాహ్మణద్వేష మెక్కించి బ్రాహ్మణసంతర్పణములు మాన్పింపనెంచి, "ఇన్ని అపకారములు మనకు చేస్తున్న బ్రాహ్మణుల నెందు కిట్లా మేపుతారు" అని యడిగెను. రాక్షసమంత్రి "బ్రాహ్మణపూజ నందులకు కులాచారము. బ్రాహ్మణసంతుష్టిచే రాజ్యానికి వృద్ధికలుగుతుందని శాస్త్రములు చెప్తూతున్నవి" అనెను. క్షపణకు డామాటలకు నవ్వి, "ఇన్నాళ్లూ చేస్తున్న సంతర్పణఫలం చూస్తూనే వున్నారుగా. రాజ్యవృద్ధిమాట అలా వుంచండి, పైపెచ్చు చాణక్యునితో జేరి యీబ్రాహ్మణులందరు రాజ్యవినాశం కూడా తలపెట్టుతూ వుంటే ఇంకా శాస్త్రాలంటూ యీ వెఱ్ఱి యేమిటి! ఆశాస్త్రాన్ని బ్రాహ్మణులు వ్రాసినవి కావా? వాళ్లంత పరమద్రోహులు ఇంకొకళ్లుండరు. వీళ్లను మేపటంకంటె పాములకు పాలుపోసి పెంచడం మేలు. ఇకనైనా కట్టిపెట్టండి వీళ్లకు సంతర్పణలు" అని బోధించి మఱునాటినుండి మాన్పించెను.

అంతటితో బ్రాహ్మణులందఱు నందకులమునెడ విరక్తులు కాదొడగిరి. ఇది ఇటులుండ, జీవసిద్ధి ఔషధప్రయోగాదులచే నందులకు జ్వరములు, తాపములు, మనశ్చాంచల్యము పుట్టించి, ఇదియంతయు చాణక్యప్రయోగమే యని చెప్పి, ఆ నందులకు విరుగుళ్లు గలిపిన మంత్రోదకము లిచ్చి ఆపీడలు

వారించుచుండెను. ఈమంత్రతంత్రములచే నందులకు జీవసిద్ధిపై పరమ విశ్వాస ముదయించి, బంగారుపళ్లెరము నిండ వెలలేనిరత్నములు పోసి ఆతనికి కానుక పెట్టిరి. జీవసిద్ధి ఆపళ్లెర మందుకొని రత్నరాసులు నేలపై పాఱజిమ్మి చీదరించుకొనుచు, బుద్ధదేవుని పాదములతోడు నే నిచటికి ధనలోభముచేత వచ్చినవాడను కాను. నాకు కావలసింది బ్రాహ్మణవినాశంకాని రత్నరాసులు కావు. అదిన్నీకాక, ఈధనపిశాచానికి నేను వశమైతే నావల్ల మీకు పూచిక పుల్లంతయినా ప్రయోజనం వుండదు. లోభరహితులకేగాని మంత్రములు పనిచేయవు.'' అని పలికి వారల నాశ్చర్యమున ముంచివైచెను.

బ్రాహ్మణ సంతర్పణములు మానిన పిమ్మట ఇంక ధర్మశాలాధికారి యొందులకని చంద్రగుప్తు నాయుద్యోగమునుండి తప్పించి ఎప్పటి దళవాయి తనమున నందు లాతని నియోగించిరి. నందవిరక్తులగు బ్రాహ్మణులంపటు నంతకు మున్న చంద్రగుప్తుని సౌజన్యాదిక మెఱిగినవారు గావున నాతనియందు మఱియు ననురక్తులు కాజొచ్చిరి. చంద్రగుప్తుని ధైర్యసాహసముల నెఱింగి యున్న నందసైన్యము లాతడు మరల దళవాయియగుట కెంతయు సంతసించి ఆతని దైవమునువలె గొలువసాగిరి.

ప్రకృతివర్గము క్రమముగా చంద్రగుప్తునియం దనురక్తమగుటయు, దమయెడ విరక్తమగుచుంటయు నందులు గ్రహించిరి. నానాటికి ప్రజల యాదరానురాగములకు చంద్రగుప్తుడు పాత్రుడగుట వారికి కన్నెఱ్ఱగా నుండెను. అంతట నొకనాటిరేయి నందులు సామాత్యముగా ఆలోచనామంది రమున జేరి దీనికి ప్రతిక్రియ విచారింప దొడగిరి. జీవసిద్ధి, చంద్రగుప్తుని మగధరాజ్యమునుండి వెడలగొట్టుడని యుపదేశించెను. రాక్షసామాత్యు డందులకు సమ్మతింపక ''విషసర్పాన్ని పూజించవలెనైనా పూజించాలి, చంప వలెనైనా చంపాలిగాని వదలిపెట్ట గూడదు. చంద్రగుప్తుణ్ణి రాజ్యభ్రష్టుణ్ణి చేస్తే చాణక్యునితో జేరి విపత్తు కలిగిస్తాడు మనకు. ప్రజల అనురాగానికి

పాత్రుడు, మన గుట్టుమట్టు లెఱిగినవాడూ గనుక ప్రజలలో విద్వేషాంకురాలు పుట్టించి ఎంతైనా హాని చేస్తాడు. కనుక ఆతణ్ణి వదలిపెట్టి సహాయసంపన్ను డైనపిమ్మట నిర్జించాలంటే గోళ్లదీశేపనికి గొడ్డళ్లుపట్టవలసి వస్తుంది. ఈనిస్సహాయ స్థితిలోనే బంధించి, దోషారోపణం చేసి, ఏదో విచారణతంతు నడిపి శిరచ్ఛేదం చేయడం క్షేమం. ప్రజలకు మొదట కొంచెం కష్టమనిపించినా క్రమంగా సద్దు మణిగి మారుకొంటారు. అట్లుకాక ఆతణ్ణి వదలిపెట్టితే విరక్తులంతా, ఆతడు మాంధాతృ బింబిసారాజాతశత్రుల వంశాంకురమనీ, ధర్మరక్షకుడనీ, బ్రాహ్మణభక్తుడనీ చెప్పి ఆతనిపక్ష మవుతారు. కాబట్టి ఈరాత్రి తెల్లవారగానే చంద్రగుప్తునికట్టి బంధింపు'' డని ఉపదేశించెను. నందులును జీవసిద్ధియు, రాక్షసుని ఆలోచనమే మేలని అంగీకరించి చంద్రగుప్తుని వేకువనే బంధించుటకు భద్రశాలున కాజ్ఞయిచ్చిరి.

జీవసిద్ధియు చాణక్యునకు ''నందకాననమునకు చిచ్చు ముట్టించితిని. కాలి మసియగుట కెంతో వ్యవధి లేదు'' అని చారముఖమున వార్తనంపెను.

---

# 6

## పిట్ట ఎగిరిపోయినది

నాటిరేయి తెల్లవారుజామునసే చాణక్యాచారుడగు సిద్ధార్థకుడు చంద్రగుప్తుని యింటికేగి ''బట్టలబండి, వర్ధమానపురానికి వెళ్లుతూ వుంది. తమరు బయలు దేరండి.'' అని హెచ్చరించెను. ''ఇదిగో, వచ్చుచున్నా'' నని చంద్రగుప్తుడు లోనికేగి పరిచారకవేషముతో బయటికి వచ్చెను. బండివానివేసముతో నున్నసిద్ధార్థకుడు చంద్రగుప్తుని మారువేషమున కక్కజపడి ''గురువులవారికి తగినశిష్యులే ప్రభువు'' లని మెచ్చుకొనెను. చంద్రగుప్తుడును తనయొద్దనున్న కనకసంచయమును రత్నరాసులను ఆబండిపై గుడ్డలమడతలలో దాచి బండి

యెక్కెను. పిమ్మట నాబండి బయలుదేరి ఆగ్నేయద్వారమున కర్గ్రాహులచే అనుమతిని బొంది వర్ధమానపురమార్గమునుబట్టి పోవుచుండెను.

చంద్రగుప్తుడు పలాయితుడైనవార్త నందులు విని ఆతని బట్టితెచ్చిన వారికి బదివేల బంగారుపణములు బహుమానమిత్తుమని నగరమున జాటింపించిన నలుదెసలకు అశ్వికులను బంపిరి. అందు వర్ధమానపురమార్గమున వెదుకవచ్చిన అశ్వికులు సిద్ధార్థకుని బట్టలబండి నిలిపి, "ఈత్రోవ నెవరైన గుఱ్ఱమెక్కి పారి పోవుట చూచితివా" యని సిద్ధార్థకుని ప్రశ్నించిరి. "నేను చూడలే" దని యాతడు బదులుచెప్పెను. రాజభటులు చంద్రగుప్తుడు పారిపోయెననియు నాతని వెదకుచుంటిమనియు, నాతని బట్టితెచ్చినవారికి బదివేల పణముల బహుమానమిత్తురనియు చెప్పిరి. సిద్ధార్థకు డంతట' ' ఎంత పనిజరిగినది !" అని ఆశ్చర్యపడి, అంతలో జ్ఞప్తికి దెచ్చుకొనువానివలె నభినయించి, ' ఔనండోయి ! చంద్రగుప్తయ్యాగారో ఎవరో నాకైతే తెలియదుగాని గుఱ్ఱపురౌతొకడు తెల్లవారువేళ అగ్నిదేవుని గుడిదగ్గరనుంచి ఈబాటనే పట్టి పోయినాడండి." అని తెలిపెను. "నువ్వు చూచి ఎంతసేపైన" దని రాజభటులు ప్రశ్నించిరి. "ఎంతసేపు కాకేమండి ! ఈపాటికి చాలాదూరం వెళ్లివుంటా"రని సిద్ధార్థకుడు బదులు చెప్పెను. రాజభటు లామాటలువిని ముందునకు సాగిపోయిరి. సిద్ధార్థకచంద్రగుప్తులు, "శత్రువులకు కన్పించకుండా వుండాలంటే వాళ్లకళ్లముందరే దాగివుండాలి" అని నవ్వుకొనుచు పయనము సాగించిరి.

బండి మొదటిమజిలీ చేరునప్పటికి జాముప్రొద్దెక్కెను. ముందువచ్చిన రాజభటులుగూడ అచటనే సేదదీర్చుకొనుచుండిరి సిద్ధార్థకుడు వారిని గాంచి "ఏమి దొరకలేదాండి ?" అని ప్రశ్నించెను. "లేదు. ఎక్కడా జాడ చెప్పిన వాళ్లే లేరు. ఈగొల్లవాడు ప్రొద్దుటినుంచి ఇక్కడే మందలను మేపుతున్నాడట. ఈదారి నెవ్వరూ వెళ్లలేదంటాడు". అని బదులు చెప్పిరి.

సిద్ధా.—కావచ్చును. ఆపౌర చాలాజిత్తులమారి అని చెప్పుతారు. ఈగొల్లను దూరాన్నే చూచి చాటుదారిని దాటిపోయి వుంటాడు.

రాజభటుడు.—ఈగొల్లవాడి కప్పటి కాతనిపై అనుమానం ఉండదు . గదా. వీనిని చూచి భయపడడ మెందుకు ?

సిద్ధా.—అట్లా కాదు. ఇటువంటిరాజభక్తుడైన గొల్లవానికంటబడితే తరవాత నైనా మీకు జాడలు చెప్పి పట్టియిస్తాడని భయంకాదూ ?

గొల్ల.—అంతేనండి బాబూ ! మాకంట బడితే వదులుతామాండి ?

రాజభ.—నిజమేకాని, ఇంతకు పిట్టపారిపోయింది. అయినా ఇంతటితో వదులుతామా ? ఏదారిని పోతాడు ? ఎంతదూరమని పోతాడు? దేశంలో ఎక్కడవున్నా గాలించి పట్టుకొంటాము.

సిద్ధా.—సరేకానండి బాబూ ! ఇంతకు ఆదొర ఎందుకు పారిపోయినట్లు ?

రాజభ.—అదుగో ఆకొండముచ్చుబ్రాహ్మడు చాణక్యుడితో చేరి కుట్రలు పన్నడానికి ఈచంద్రగుప్తుడికేమో ఆయన పట్టంగట్టుతాడట మగధదేశానికి.

సిద్ధా—అయ్యో బాబూ! ఎంతమాట ! పట్టం గట్టడమే ! అంతమొనగాడాండి ఆబాపనయ్య.

రాజభ.—అతడి మొనగాడితనం మాముందు పనికివస్తుందటగాని,—కాకపోతే, అతడు బహుమహేంద్రజాలి అనిచెప్పుకొంటారు. చూస్తుండగానే మాయమై పోతాడట. అదీ చిక్కు. కంటిముందర కనబడుతూంటే మాఖడ్గాలు పనిచేస్తాయిగాని మాయమయ్యేవాణ్ణి ఏంచేస్తాము ?

చంద్ర.—ఆబాపనయ్య తను మాయమవుతాడేమోగానండి. ఈదొరగారిని గూడా ఎట్లా మాయం చేస్తాడబ్బా !

రాజభటు.—ఔనవును. అదీ ఆలోచించదగినదే.

గొల్ల.—అదొర్ని మాయంచేస్తే మట్టుకు గజ్జి మేమవుతుంది ?

సిద్ధా.—తను మాయమై చంద్రగుప్తయ్యను మాయంచేసేవాడికి ఇక గజ్జి మద్దుకుంటుందటోయి, వెఱ్ఱివాడా ?

గొల్ల.—బాగా చెప్పావు. నువ్వు మంచి తెలివిగలవాడవుగా వున్నావు. మీదే వూరోగాని, బండిలో ఏమిటి సరుకు? బట్టలా? మధురపంచెలుంటే నాకో జత యిప్పించు.

సిద్ధార్థకుడాబట్టలమడతలనుండి ఒకచాపుదీసి గొల్లనికిచ్చి మూల్యము గైకొనుచుండ, రాజభటముఖ్యుడు తనకు గూడ నొకజత యిమ్మనెను. చంద్రగుప్తుడొకజతకు బదులు రెండుజతలం దీయ రాజభటుడు విప్పిచూచి, ఒకజత తిరిగి యిచ్చుచు సిద్ధార్థకునితో "మీనౌకరుది నీకంటె భారీచెయ్యి. ఒకటడిగితే రెండిస్తున్నా"డని నవ్వెను. సిద్ధార్థకుడును "మీరు గొప్పవారుగనక గొప్పగా యిచ్చా"డని పలికెను. ఈలోపల ప్రొద్దు పడమరతిరుగుట చూచి సిద్ధార్థకుడు మరల బండికి ఎడ్లను పూన్చి రాజభటులకడ సెలవుగైకొని పయనమై పోయెను.

కొంతదవ్వేగినపిదప సిద్ధార్థకుడు చంద్రగుప్తునితో "ప్రభువులచెయ్యి దాచుకొందామన్నా దాగదు కదా?" అనెను. చంద్రగుప్తుడు నవ్వి, "మరి గురువులవారి చెయ్యో?" అని ప్రశ్నించెను. సిద్ధార్థకుడు, "వారు సరేసరి. చాణక్యులవారి ఔదార్యాన్నిగూర్చి వేరేచెప్పేదేమిటి! వారు యిచ్చినదాన్ని బట్టికాక మిగుల్చుకొన్నదాన్నిబట్టి విచారిస్తే గురుదేవుల ఔదార్యం నిస్సమానమని చెప్పాలి. ఇవ్వడమేగాని తమకోసం మిగుల్చుకోవడమంటూ వారెరగనే ఎరగరు." చంద్రగుప్తుడామాటల కెంతయు సంతసించి, "చాణక్యులవారి ప్రతిజ్ఞానిర్వహణంమాట ఏమంటావు?" అని యడుగ, "ఏమనడానికీ నేనెంతవాణ్ణి? సముద్రజలాన్ని కుంచాలతో కొలవవచ్చు, హిమాలయం ఎంతెత్తో మూరలువేసి లెక్కించవచ్చు; అంతేగాని చాణక్యదేవుల ప్రభావం ఎంతటిదో ఎవరుచెప్పగలరు? వారు ఎంతఉన్నతులో అంతగంభీరులు. వారు ఏమిచేస్తారో ఎందుకు చేస్తారో వారికే తెలియాలి, మాటయిచ్చారా అంటే హరిహరాదులు అడ్డినా జరిగి తీరవలసిందే. ఆశ్రితరక్షణమంటారా, అది వారి సొమ్మే." అని బదులు పలికెను.

మఱునాటి మధ్యాహ్నపుమజిలీలో సిద్ధార్థకచంద్రగుప్తులు బావిచెంత ఎడ్లకు నీరుపెట్టుచున్నసమయమున రాక్షసామాత్యుని చారుడగు విరాధగుప్తుడు రథారూఢుడై అచటికే వచ్చెను. చంద్రగుప్తు డాతని దవ్వులనే గుర్తించి చేరువనున్న మఱ్ఱిచెట్టు తొఱ్ఱలో దాగెను. విరాధగుప్తుడు సిద్ధార్థకుని సమీపించి, ఇంచుక నీరిమ్మని యడిగి పైకొని దప్పి తీర్చుకొనెను. "చాలాదూరం నుంచి వస్తున్నట్లున్నారు?" అని సిద్ధార్థకుడు ప్రశ్నించెను. విరాధగుప్తుడు, "ఈదిక్కుమాలిన చంద్రగుప్తుణ్ణి వెదకలేక చచ్చిపోతున్నాము. వర్ధమానపురమంతా గాలించి వస్తున్నాను. పెద్దలు పొరపాట్లుచేయడమూ, చిన్నలు నలిగి చావడంగా వుంది. మొదటనే చాణక్యుణ్ణి పట్టి బంధిస్తే ఇంతశ్రమ ఉండకపోవునా? అప్పు డూరకోవడంవల్ల చంద్రగుప్తుడుకూడా తుర్రుమన్నాడు, ఇక నేముంది! ఒకరి కిద్దరయినారు" అని విసుకుకొనెను.

సిద్ధా.—ఇంతకు ఆమాయదారి బాప డెక్కడ వున్నట్లు?

విరా.—నట్టేట్లో! ఎక్కడ వున్నాడని చెప్పను? ఏక్కడా లేడు. అంతటా వున్నాడు. అన్నట్టుగా వుంది. నువ్వే చాణక్యుడవో, నేనే చాణక్యుణ్ణో అన్నంత దిగ్భ్రమ కలుగుతూవుంది.

సిద్ధా.—సేబాసు. మఱి చంద్రగుప్తయ్యగారో?

విరా.—అతణ్ణి పట్టడ మంతకష్టం కాదు. చుట్టుప్రక్కల ఇరవై ఆమడల్లో ఎక్కడున్నా పసిపట్టుతాను. నేడుగాకపోతే రేపైనా దొరకకపోడు. పొద్దు వాలుతూవుంది. నేనిక వెళ్లాలి" అని రథమెక్కి వెడలిపోయెను.

చంద్రగుప్తుడు వటకోటరమునుండి నవ్వుచు వెలుపలికి వచ్చి, "కళ్లముందరే దాగవలెనని నువ్వు నిన్నచెప్పినమాటకు సరిపోయింది." కాని ఆ యిరుకుతొఱ్ఱలో వూపిరాడిందికాదు." అనెను. సిద్ధార్థకుడు, "నిజమే మఱి. మఱ్ఱితొఱ్ఱలు మహారాజులకోసం ఏర్పడ్డవా?" అని నవ్వెను.

ఇట్లు దినదిన గండముగా వారు పయనముసాగించి నాల్గవనాడు కను చీకటివేళ వర్ధమానపురము జేరి చాణక్యుని బసకేగిరి. చాణక్యుడు, "వచ్చితివా, వత్సా!" యనుచు జంద్రగుప్తుని కౌగిలించుకొని లోనికి గొంపోయి, "చూచితివా! నందు లెంతపని తలపెట్టిరో! తెల్లవారినచో ఎంత ప్రమాదమయినా జరిగేది. ఆయాసమయితే అయిందికాని సుఖంగా చేరావు" అనెను. చంద్రగుప్తుడు, "మనము పూనినకార్యాని కిదియొక ఆయాసమా, స్వామీ? ఆర్యులు వేయికనులతో రక్షిస్తూ వుండగా నాకేమి ప్రమాదము" అని బదులుచెప్పెను. చాణక్యుడు, "నువ్వు ముందు స్నానంచేసి భోజనము కానివ్వు. తరువాత మాట్లాడుకొందాము" అని అంతర్గృహములోని కంపెను.

---

# 7

## మహా రోహాఖ్యానము

చంద్రగుప్తుడు భోజనమొనర్చినపిమ్మట గురుశిష్యు లిద్దఱు సల్లాపింప దొడగిరి.

చాణ.—చూచితివా, నందులమంత్రం ఎంత సురక్షితంగా వుందో?

చంద్ర.—నిజం. తమశిష్యుడు జీవసిద్ధి అక్కడ చేరినపిమ్మట ఇంకా సురక్షితం కాకుండా వుంటుందా? జల్లెడకైనా చిల్లు లుంటాయికాని జీవసిద్ధి రక్షితమైన మంత్రానికి రంధ్రముంటుందా? గురుదేవుల ప్రజ్ఞముందు ఇతర మంత్రములు గాలి కెగిరిపోయే దూదిపింజలు. మా తాతగారు చెపుతూ వుండేవారు 'రాతితో ఢీకొన్న మట్టికుండలు నిలుస్తవా?' అని.

చాణ.—(నవ్వుచు) ఔనుగాని, ఏదీ మీ తాతగారిచరిత్రం వినిపిస్తానంటివి. చెప్పు, వింటాను.

చంద్ర—చిత్తం. సుగృహీతనాములైన మహానందులవారికి పిప్పలవనప్రభు కుమారియైన మురాదేవియందు పుట్టినకొడుకు మౌర్యుడు. మురాదేవి వ్రాత్యురాలైన కారణంచేత మౌర్యుడికి రాజ్యార్హత లేకపోయింది. సునందాదేవి యనే క్షత్రియపట్టమహిషికి ఇద్దరు కుమార్లు. అందులో పెద్దవానికి మహానందులవారి అనంతరం మగధరాజ్యం సంక్రమించవలసి వుంది. అయితే మహాపద్ముడనే క్షురకుడొకడు మహారాజులుంగారికి ప్రియతముడై ఆప్తుడుగా వుండేవాడు. మహాపద్మునితల్లి అయితే శూద్రస్త్రీయేగాని తండ్రిమాత్రం క్షత్రియుడు. పేదతనంవల్ల క్షురవృత్తి అవలంబించి మహానందులవారికి విశ్వాస్యుడై క్రమంగా సైన్యాధిపత్యమే కాకుండా మంత్రిత్వం కూడా సంపాదించి మగధసామ్రాట్టును తనచేతి కీలుబొమ్మను చేసుకొన్నాడు.

సునందాదేవికికూడా ప్రీతిపాత్రుడై, తనకార్యఖడ్గములచేత మగధ సామ్రాజ్యాన్ని విస్తరింపజేసి, ఇటు ప్రకృతిమండలికి, అటు సైన్యములకు కూడా గౌరవానురాగపాత్రుడైనాడు. ఉన్నట్టుండి ఒకనాటిరాత్రి మహానందునీ, సునందాపుత్రులిద్దరినీ రహస్యంగా సంహరించి, అదివరకే హస్తగతమైయున్న సింహాసనం ఎక్కి కూర్చున్నాడు. చతురంగబలమూ, సామంతమండలి అతనిచేతిలోనివే గనుక ఎవ్వరూ ఎదురాడినవారు లేరు. శకటాలునికొడుకు కొంచెంధిక్కరించేటప్పటికి, రెండోకంటివాడికి తెలియకుండా అతణ్ణి మటుమాయంచేశాడు. తరువాత సునందాదేవిని పట్టమహిషినిచేసి ఆమెవల్ల ఎనమండుగురు కుమాళ్ళను కన్నాడు. వారే మనసు కల్పనందుడూ అతని తమ్ములూను.

మహాపద్ములవారి ప్రతాపం మాత్రం అద్వితీయమని చెప్పాలి. కాళింగులు మొదలైన సామంతులను వశంవదులను చేసుకోవడమే కాక, ఆర్యావర్తమును దక్షిణాపథమును జయించి రెండవభార్గవరాము డనిపించుకొన్నాడు.

“మురాసుతుడైన మౌర్యుని తెలివితేటలను ధైర్యసాహసములను చూచి ఆబాలుని తనచేతిక్రిందికి తీసుకొని చివరకు సైన్యాధిపతిని చేశాడు. మౌర్యుడు మహాపద్ములవారికి కుడిభుజమై, మగధసింహాసనానికి ఆధారభిత్తియైనాడు. తననూరుగురుమౌర్యులూ తానూ మహాపద్ములవారికి అంగరక్షగా ఉండేవాడు. కామరూపమునుండి కుంతలంవఱకు విస్తృతమైన మగధ సామ్రాజ్యమంతా, మహాపద్ములవారి అనంతరం సుకల్పయ్యకు, తమ్ములకు సంక్రమించింది. వీరికి, తండ్రిగారి తేజమూ శౌర్యమూ లేకపోయినా, దురభిమానంలో మాత్రం ఏమీ లోపం లేదు. పూజ్యావమానం, నీచానురక్తీ అవిమృశ్యకారిత్వం మొదలైన దుర్గుణాలకు భోగపరాయణత తోడయింది. బాగా సుఖం మరిగారు వ్యసనాసక్తులై రాచకార్యాలు మంత్రులకు వదలి పెట్టారు. నక్రనాసామాత్యుడు. రాజసోదరులను వివిధ రాష్ట్రాలకు రాజప్రతినిధులుగా వెళ్లి అక్కడి రాచకార్యాలు చూచుకోవలసిందని హితం చెప్పితే ఆయనమాట పెడచెవినిబెట్టి, సుబుద్ధిశర్మను ముఖ్యమంత్రిని చేసుకొన్నారు. నక్రనాసుడు శకటాలుడూ కొఱకొఱలాడుతున్నారు. సామంతులు అలక్ష్యభావంతో వున్నారు. కాళింగుడు సమయంకొఱకు ఎదురుచూస్తున్నాడు. సైన్యాలకు ప్రకృతివర్గాలకు తలలో నాలుకగావున్న మౌర్యుణ్ణిచూస్తే నందులకు కన్నెఱ్ఱ ఏర్పడింది. అతనివల్ల తమ కెప్పుడేమి ముప్పుమూడుతుందో అనేభయం ఆవహించింది. మౌర్యుణ్ణి ఏలాగైనా తొలగించి, తమకు ఆప్తుడైన భద్రశాలుణ్ణి సైన్యాధిపతిని చెయ్యాలనే దురూహతో ఆలోచన మొదలు పెట్టారు.

“భద్రశాల రాక్షసామాత్యులతో ఆలోచించి ఆలోచించి మౌర్య వినాశంకొఱకు చివరకు నాల్గుసంవత్సరాలనాడొకయుక్తి పన్నారు. పాంచాలంమీదికి దండెత్తేవిషయంలో ఆలోచించడంకొఱకనే మిషతో మౌర్యుణ్ణి అతని అనుచరులు నూరుగురినీ రహస్యమందిరానికి పిలిచారు. గంగాతీరంలో ఉన్నకోశాగారం ప్రక్కనే వున్నది. నేలమాళిగలో

ఆమందిరం. మౌర్యానుచరులతో నేనుకూడావున్నాను. మమ్ము నూటొక్క మందినీ ఆబోనులోనికి రానిచ్చి ఏదో ఆలోచనమొదలుపెట్టి ఒక్కొక్కరే తప్పుకొని మమ్ము నాభూగర్భమందిరంలో బంధించి చక్కాపోయినారు. మానూటొక్కమందికీ ఒక్కరోజుకు సరిపోయే భోజనాలు మాత్రం అక్కడదిగవిడచి, మాదహన సంస్కారంకోసం కాబోలు ప్రక్కగదినిండా కట్టెలు నింపి చక్కా పోయినారు.''

''ఈవిధంగా ఆవృద్ధసింహం కిశోరశతకంతో బోనులో పడింది.''

''మహానుభావుడైన మౌర్యుడు ఆ విపత్సమయంలో ఆశ్చర్యం చెందలేదు. ఊరక పండ్లుగీటుతున్న మమ్మునందరిని చూచి, జరిగిన మోసానికి నగచి ''నాయనలారా! జరిగినదేమో జరిగింది. ఏనాటికైనా నందులు విడిచి పెట్టితే తప్ప, మనం ప్రాణాలతో బయటపడడం పట్టిది. ఈమందిరమునూ, దీనినిర్మాణమునూ నేనెరుగుదును: కనుక కర్తవ్య మాలోచించండి. మీరంతా బుద్ధిమంతులు'' అన్నాడు. ''ఈసంగతి తెలిస్తే, ప్రజలు, సైన్యములూ వచ్చి మన కీచెఱ విడిపించరా?'' అన్నాను నేను. మౌర్యుడు నా మాటలకు నవ్వి, ''వెఱ్ఱివాడా! ప్రజా, సైన్యమూ, గెలు పెవరిదో వారి పక్షాన వుంటుంది గాని మనవంటి హతభాగ్యులపక్షానవుండదు. కాబట్టి ఆయాశ పెట్టుకోకండి. ఏనాటికైనా ఇందులోనుంచి బయటబడితే నందుల వల్లనే పడాలి. ఆశుభదినం వచ్చేదాక మనం బ్రతికివుంటేనూ, అనయినా. కాబట్టి ఈవున్న ఆహారమంతా ఇవ్వాళేమనమంతాతిని రేపటినుంచి అందరం మాడిచావడంకంటె మనలో ఒక్కరు మాత్రం ఈపదార్థం తింటూ, శుభకాలం ప్రతీక్షిస్తూవుండాలని తక్కినవారు నేడే మరణించాలనీ నాఅభిప్రాయం. ఇందుకేమంటా'' రన్నాడు. మేమంతా, ''ఈ ఆలోచన బాగున్నదంటే బాగున్న'' దన్నాము. అయితే, ఎవరు జీవించి వుండాలి? అనే ప్రశ్న వచ్చింది. మేమంతా ''సర్వవిధాలా, నందులపై పగదీర్చు కోవడానికి మీరే

సమర్థులు గనుక జీవించి వుండండి" అని మౌర్యుని ప్రార్థించాము. మౌర్యుడొక్కక్షణం మౌనంగావుండి, ఒక్కసారి నిట్టూర్చి మమ్ములనందరినీ గంభీర దృష్టులతో కలయజూచి, "అన్నలారా! నేను వృద్ధుణ్ణి! సర్వమూ ఉడిగిన వాణ్ణి. నందవినాశం ఒక్కనాటితో అయ్యేపని కాదు. చిరకాలం ఓపికపట్టి సాధించవలసిన ఈమహాకార్యానికి పడుచువాళ్లు కావాలి. ఉత్సాహవంతులు కావాలి. అంతేగాని వృద్ధుణ్ణి నావల్ల ఏమవుతుంది? అంతే కాదు. ఇంకోసంగతి కూడా ఆలోచించండి. నందులు ఇంతపని చేసింది నామీది పగచేతకద. కనుక నేను జీవించివున్నా నన్ను వారు వదలి పెట్టరు. కనుక వ్యర్థంగా నాకొఱకు మీరంతా మరణించవద్దు. ఎంత విచారించినా, నావల్ల ఈకార్యం కాదనీ, నేను బ్రదికివున్నందువల్ల మనకీ పగ తీరదని తోచి యిలా చెపుతున్నానేగాని బ్రదికివుండడానికి భయపడి కాదు. కనుక మనఅందరిలోకి చిన్నవాడై మంచి బుద్ధిశాలీ, ధీరుడూను చంద్రగుప్తుడు. నందులచేత, రాక్షసమంత్రిచేతా మంచివా డనిపించుకొన్నవాడు. ఏనాటికైనా చక్రవర్తి అవుతాడని జ్యోతిష్కులు చెప్పినవాడూను. కనుక చంద్రగుప్తుడు మనప్రార్థనము ఆలించి బ్రదికివుండి నందవినాశం చేయడం నామతం" అన్నాడు. "నేను ఆత్మహత్యచేసుకోకుండా జీవించి వుండి నందవినాశం చేస్తాను." అని నాచేత ప్రమాణంచేయించి నన్ను వీడ్కొని ప్రక్కగదిలోకి వెళ్లిపోయినారు. మౌర్యు డక్కడ వారినందరినీ సంహరించి రక్తసిక్తమైన ఖడ్గంతో తిరిగి నాచెంతకు వచ్చి, నన్ను కౌగిలించుకొని, "నాయనా! ఈభారం నీమీద పెట్టిపోతున్నాను. ఈమహాకార్యం సాధించి పెట్టగలవాడు, చాణక్యపండితు డనే మహాబ్రాహ్మణు డొక్కడే వున్నాడు. నువ్వు ఆయన్ని ఆశ్రయించి అభయం కోరితివా నీకు సర్వార్థసిద్ధి అవుతుంది. ఆశ్రితవత్సలు డాబ్రాహ్మణుడు" అనిఉపదేశించి నాశిరస్సు కడసారి మూర్కొని నాయెదుటనే కత్తిపైబడి పోయెను."

తాతగారికీ, జ్ఞాతులకు దహనసంస్కారం మాత్రం చేసి వారిఆజ్ఞ తల దాల్చి, వారు దిగవిడిచిపోయిన మెతుకులు తింటూ, దినాలు లెక్కపెట్టు కొంటూ చాల్గుమాసాలు గడిపాను. తిరుబండారాలు తరుగుతున్న కొద్దీబంధ ముక్తిపై ఆశకూడా తరిగిపోతూంది. ఆ నాడు బంధువులంతా నాపైనా భారం పెట్టి, నిశ్చితంగా మరణిస్తూవుంటే నేను బ్రతికివుండడానికి ఎంతో ధైర్యం కావలసివచ్చింది. వారు దిగవిడచిపోయిన మెతుకులు తరిగిపోతూ తెగీతెగని కత్తికోతగా ఆనాటికానాడు శల్యావశిష్టుణ్ణి చేస్తున్నా, ప్రతీ కారవాంఛా, బంధుబుుణభారమూ ప్రాణాలునిలబెట్టి వుంచుతున్న వేగాని ఒక్కసారిగా చచ్చిపోదామంటే ధైర్యం చాలడం లేదు. అలాగే యమ యాతన పడుతూ మఱియిరవై దినాలు గడిపాను. ఇరవై ఒకటో నాడుఏదో అలికిడయినట్టు తోచింది. లేచి ఆలకించడానికి కూడా ఓపికలేక అలాగే కళ్లు మూసుకొని ఒకమూల పడివున్నాను. క్రమంగా మనుష్యుల అడుగుల చప్పుడూ, తలుపులు తెరుస్తున్న సందడీ వినిపించినవి. తిరిగి ప్రజలలో పడతాను కాబోలు అనే ఆశచేత గుండెతిరిగి కొట్టుకోవడం ప్రారంభించింది. ఎవరో లోపలికి వచ్చారు. మెల్లిగా కళ్లు విప్పిచూచాను. రాక్షస మంత్రీ, ఘననందుడూ ఎదుట నిలిచివున్నారు. వారు నన్ను చూచి సంతోషం పట్టలేక "చంద్రుడు బ్రదికి వున్నాడు, చంద్రుడు బ్రదికి వున్నా" డంటూ కేకలువేస్తూనన్ను సమీపించారు. ఇంతలో సుకల్పాదులు కూడా లోపలికి వచ్చారు. రాక్షసమంత్రి నా అవస్థనూ, ఎదుట నున్న ఎముకలపోగులనూ చూచి, చూపులతో నన్ను ప్రశ్నించాడు. "మమ్ము బంధించిననాడే తక్కినవారంతా "ప్రభువునకు ద్రోహులమనితోచినపిమ్మట మనం బ్రదికిఏమి ఫలం? చంద్రుడు మనలోకి చిన్నవాడు. ఏపాపమూ ఎరగక పోయినా మనతో కూడివున్న దోషంచేత ఈఅవస్థ వాడికి కూడా వచ్చింది. ప్రభువుల కేనాటికైనా వానిపై దయ వస్తుందేమో. కనుక చంద్రుణ్ణి బ్రదివుండ నివ్వండి" అని చెప్పి మరణించా" రని చెప్పాను.

సుకల్పుడు ఎంతో నొచ్చుకొంటూ, నాచెంతకు వచ్చి, నాయొదలిపై చేయివేసి, "చంద్రా! విచారించకు. నీవు నిర్దోషివి. కనుకనే దైవం నీశిక్షల కాచిందిరా! నాయనా! నీసంపదంతా మళ్లా నీకు ఇస్తాము. జరిగినదంతా మఱచిపోయి, సుఖింతువుగాని రమ్మనెను. పొంగివస్తున్న సంతోషాన్ని అణుచుకొంటూ నేను, విరక్తునివలె, "ప్రభూ! తమకు పుణ్యం వుంటుంది. నన్ను నాబంధువులచెంతకు పోనివ్వండి. తిరిగీ నన్ను పాపపులోకంలోకి ఎందుకు లాగుతు పోతారు" అని వేడుకున్నాను. రాక్షసమంత్రి, "అట్లా కాదు నాయనా! మీవాళ్లంతా నిన్ను బ్రతుకవలసిందనే కోరారుగాని వాళ్లతోపాటు చావుమనలేదు. మార్కో డింతటి మహానుభావుడని నేను గ్రహించలేక పోయినాను. ఇంతకు ఇలా జరగవలసివుంది. పోదాము. లే నాయనా! నీఅదృష్టమేనట! ప్రభువులవారికి నీతో అక్కర కల్గించింది. లేచిరా, నీకు వచ్చినభయము లేదు. ప్రభువులు నిన్ను తోడబుట్టిన వానిగా చూచుకొంటారు" అని అనునయించెను. సుకల్పుడును నాకభయ ప్రదాన మొనర్చి వెంట గొనిపోయెను.

"నందులకు నావలన తీరదగిన అక్కర ఏమి వచ్చిందంటారేమో, వినండి. సింహళదేశంనుంచి బోనులో ఉన్న ఒకసింహాన్ని పంపారు. బోను తెరవకుండా ఆసింహాన్ని బయటికి తీయవలసిందని ఆబోనుమీదనే ప్రతిజ్ఞా వాక్యం లిఖించివుంది. దేశంలో ఒక్కొక్కరాజాస్థానానికే వెళ్లి వచ్చిందాబోను. ఎవ్వరికీ ఉపాయం తోచిందికాదు. చివరకు పాటలీపుత్రం చేరింది. ఇక్కడ కూడా ఎవరికీ దానిమర్మం తెలిసింది కాదు. ఆసింహాన్ని బయటికి తీయలేకపోతే మగధసంస్థానపు పరువుపోతుంది. సింహళవాసులదే ప్రజ్ఞగా పైచేయి అవుతుంది. అందుకని; నావల్లగాని ఈపని కా దని నందులకు తోచింది. అదీ రహస్యం".

"సరే, నేను వెళ్లాను. బోనును అందులో సింహాన్ని చూచాను. ఎంత సేపు చూచినా ఆసింహం ఒక్కటేకీతిని తల ఆడిస్తూ, ఒక్కటే విధంగా

అటూ ఇటూ తిరుగుతూవుంది. అది లక్కసింహ మయ్యుంటుందని నాకు తట్టింది. వెంటనే ఇనుపచువ్వ ఒకటి తెప్పించి ఎఱ్ఱగా కాల్చి ఆసింహాన్ని కంటించాను. సింహం కరిగి కాల్వగట్టి బయటికి పారింది.

"సభలోవారంతా నా ప్రజ్ఞకు సంతోషించారు. రాక్షసమంత్రి భద్రశాలుడూ మెచ్చుకొన్నారు. "పాటలీపుత్రప్రపరువు నిలిపావు వంటు" సుకల్పుడు నన్ను వెన్నుపై తట్టాడు. పిమ్మట మాతాతగారి సంపదంతా దాకిచ్చి, సైన్యంలో నాకు దళవాయితనం ఇచ్చారు. సైనికులు నాపట్ల చూపుతూ వున్న గౌరవాభిమానాలకు అసూయపడి పళ్లా ధర్మశాలాధిపత్యం ఇచ్చారు. తన్మూలంగా తమదర్శనభాగ్యం కలిగింది. స్వామీ! ఇదీ మౌర్యునికథా, నాకథాను. మౌర్యుని ఆజ్ఞచొప్పున తమపాదముల మరుగు చొచ్చాను. ఇక మీదే భారం" అనుచు చంద్రగుప్తుడు చాలించెను.

చాణ.—ఎంత దారుణం! ఎంత చిత్రచరిత్ర నీది! జోస్యము ఫలించి నువ్వు చక్రవర్తివైనచో ఇంకా ఎంతో విచిత్రంగా వుంటుంది నీ చరిత్ర.

చంద్ర.—చిత్తం నేను తమ అనుగ్రహామునే నమ్మానుగాని జోస్యమును గాదు.

చాణ.—జోస్యం మాత్రం వట్టిదెందుకనుకోవాలి. పురుషప్రయత్నం జోస్యాన్ని యథార్థం చేస్తుంది. మన మిక ముందుపని విచారించుకోవాలి. ఇప్పటివేడి కొంత చల్లారేవఱకు ఈపట్టణాంలోనే దాగి వుండి పిమ్మట కార్యసాధనోపాయాలు విచారించాలి. ప్రొద్దుపోయినది నేటికి విశ్రమింతాము.

# ౮

# మగధదేశపు పొలిమేరలు

చాణక్యచంద్రగుప్తులు వర్ధమానపురమున ప్రచ్ఛన్నులై రెండుమాసములు గడపిరి. చంద్రగుప్తుని బట్టితెచ్చినవారికి సంపు లిచ్చెద మన్న బహుమానము నానాటికి హెచ్చుచున్నను వెదకువారి జాగరూకతమాత్రము సడలజొచ్చెను. ఆసన్న యెఱింగి చాణక్యు డొకనాడు చంద్రగుప్తునితో నిట్లనియె. "ఇట్టి చట ఎన్నాళ్లయినా, రెండవకంటివానికి తెలియకుండా నిశ్చింతగా కాలక్షేపమయితే చేయవచ్చునుగాని, నందనిర్మూలనభారం పైనబెట్టికొన్న మనకు తలదాచుకోవడమే ప్రధానంకాదు. ముందుపని ఆలోచించి కార్యసాధనకు ఉద్యమించవలసిఉంది. కార్యశూరులకు అసాధ్యమంటూ వుండదు. దుర్జ్ఞేయమైన పారసీకరాజ్యాన్ని జయించిన అలెసాందరు శౌర్యము తలచుకొంటే నాకు ఆశ్చర్యం కలుగుతూవుంది. ఆ యవనవీరు డిప్పుడు తన సైన్యసమూహంతో గాంధారములో విడిసివున్నాడు. ఈసమయంలోనే మనంకూడా శతద్రూనదిని దాటి, ఆరట్ట బాహ్లీక (Bactrians) కిరాతకాంభోజులతోను తక్షశిలాభిసార కాశ్మీరవితస్తా(Jhelum)ప్రభులతోను నెయ్యం చేసుకోవడం మంచిది. పనిపట్టితే శకయవన పారసీకాది మ్లేచ్ఛులసాయంగూడా మనం పొందవచ్చును. వితస్తాప్రాంత పాలకుడైన పర్వతకుడు, తమ్ముడైన వైరోచకునితో గూడి అభిసార కాశ్మీరపతులను జయించింది చాలక, వారి సాయంతో ఇతరదేశాలను గూడా ఆక్రమింపజూస్తున్నాడు. అతనికి తగినంతఆశ పెట్టితే మనకు బాసటఅవుతాడు. అలాగే ఆరట్ట కిరాతులనుగూడ మనం లోగొనవచ్చును." చంద్రగుప్తు డా మాటలు విని, "మనం ఇంతటి ప్రబలులతో సంధిచేసుకుంటే చివరకు మగధరాజ్యం వీళ్లకు ధారపోసి వూరకోవడ మవుతుందేమో అని భయం కలుగుతున్నది. నందులు ఏలుకున్నా నాకు సమ్మతమేగాని చూస్తూచూస్తూ నామగధను వీళ్లచేతుల కెలా వప్పగించను ?" అనెను.

చాణక్యుడామాటలకు నవ్వి, "నీ కాభయం అక్కరలేదు. మనకు సాయం చేయడమే వాళ్ల వంతుగాని రాజ్యం అనుభవించడానికి వాళ్లెవరు? సముద్రాన్ని మథించి అమృతం తేవడంమట్టుకే అసురులపనిగాని అనుభవం మాత్రం దేవతలదే. కాబట్టి నువ్వాచింత పెట్టుకోకు. వాళ్లు ఎంత ప్రబలులైతే మాత్రం, మావటివాడికి లొంగే మదగజంలాగా, మంత్రానికి కట్టుబడే మహాసర్పంలాగా, నామంత్రానికి వశులవుతారు," అనెను. చంద్రగుప్తుడు, "చిత్తం. అలాగయితే వాళ్లందరికీ ఏమి ఆశలు చూపుతారో, ఏమి మంత్రం ప్రయోగిస్తారో, ఆభారమంతా ఆర్యులకే వదలిపెట్టుతాను. ఖడ్గసాధ్యమయ్యే పని ఉంటేటే మట్టుకు అది నామీదపెట్టండి" అనెను. చాణక్యుడును, "మంచిది, నాయనా! అలాగే కానియ్యి; కాని నామాటలకు నువ్వేమీ కాదనక వినీవిననట్లు వూరుకో. నాపనికి అడ్డంరాక నువ్వల్లా చూసీ చూడనట్లు ఊరుకుంటూ వుండు. కార్యమంతా నేనే చక్కబెట్టుతాను." అనెను.

ఆమరునాడు గురుశిష్యులిరువురు మారువేసములతో పాంచాలమునకు బయనమైరి. చాణక్యచారులగు సిద్ధార్థకసమిద్ధార్థక ఉదుంబరనిపుణకులు గూడా ఉచితవేషములతో కొంచెము వెనుకముందుగా వారితో గూడ జనుచుండిరి. గమానగరం చేరినపిమ్మట నందచారుడగు కాయస్థుడచట చంద్రగుప్తునను మానించి, చాణక్యునితో, "స్వామీ, ఈమీశిష్యు డెవరు? బ్రాహ్మణునివలె కనుపించడే" యనెను. చాణక్యుడామాటకు నవ్వి, "నిజం నాయనా! ఎవరినీ ఫలానిజాతి అని పోల్చడానికి వీలుగాని కాలం వచ్చింది. నీమట్టుకు నీవు కాయస్థుడవేఅయినా స్వచ్ఛమైన బ్రాహ్మణునికంటె ఇనుమిక్కిలిగా ఉన్నావు" అని వాని నుబ్బించి ఆగండము గడపించెను. అంతట నచటి ధర్మశాలల చేరుట క్షేమముగాదని యెంచి చాణక్యుడు నదీతీరమునకేగి అచట బడియున్న శ్రాద్ధపిండము లిన్నిమూటగట్టుకొని వచ్చి ఉపయోగింపు మనగా చంద్రగుప్తుడు, "ఆర్యా శ్రాద్ధపిండము లెట్లా తినను?" అని సంశయించెను. చాణక్యుడు

"వెఱ్ఱివాడా! దేవశేషం పితృశేషం పరమపవిత్రములు. నువ్వు సంశయించ నక్కఱలేదు. అదిన్నీగాక మన కిప్పుడిది ఆపద్ధర్మం. వెనుక విశ్వామిత్రు డంతటివానికి చండాలవాటిలో భోజనం చేయవలసి వచ్చింది" అని సమాధాన పఱచెను.

నందచారుల కగపడకుండుట కిట్లెన్నియో ఇడుమలు గుడుచుచు దుదకు వారు కాశీనగరమును జేరిరి. అచట వారిరువురు మణికర్ణికాఘట్టమున స్నానము చేయుచుండ నందసేనాని యొక డాచెంతకు వచ్చెను. చంద్రగుప్తు డాతని గుర్తించి చాణక్యున కాతని జూపెను. "నీవు నీటిలో మునుగు"మని చంద్రగుప్తునకు గఱపి చాణక్యు డచటి కించుకదూరమున మహారాష్ట్రబ్రాహ్మణవేషమున స్నానమొనర్చుచున్న సిద్ధార్థకుని కడ కేగి ఆతనితో గర్హ్యాట కలహమున కుపక్రమించెను. వారిరువురకు క్రమముగా మాటలు ముదిరి చేతులు గలియు వఱకు వచ్చుటగాంచి పలువు రచట మూగిరి. ఆకలకల మాలించి నందసేనాని యచ్చోటికే తెంచి వారిరువురకు గలహము వారించి ఆవలి కేగెను. నీట మునిగి యున్న చంద్రగుప్తు డాసందడిలో చల్లగా దప్పించుకొని యేగెను. త్రోవలో నొకనాడు బిచ్చగాడొకడు యాచింప చంద్రగుప్తుడు సాజమగు నౌదార్యము మెప్పున వానిచేత నొకపైడినాణెము వైచెను. ఆబిచ్చగా డక్కఱపడి, "ఇంతటియీవి చంద్రగుప్తునకుగాక ఎవరికుంటుంది? నీమూలాన లక్షణాలు నాకు దొరకి నాదరిద్రం తీరుతుంది", అనుచు లేచెను. వానినోటినుండి యామాటలు వెడలుటయే తడవుగా చంద్రగుప్తు డాతని శిరము ఖండించెను. చాణక్యుడు 'దురాశ దుఃఖముచేటు" అనుచు సాగెను. వెనుకనుండి వచ్చుచున్న చాణక్య చారు లాభిక్షుకుని మొండెము నీటిలో బారవైచిరి.

మధురలో నొకనాడు చాణక్యచంద్రగుప్తులు విప్రగేహమున భుజించుచుండిరి. రాక్షసమంత్రి చారులలోని ప్రియంవదకు డాయింటిలోనికే ప్రవేశించుచుండెను. ఇంతలో నొకనాగుబాము పాములవాని బుట్టలోనుండి తప్పించుకొని ఆయింటిలో దూరెను. "పాము పా"మని యింటిలోనివారు కలవర

పడిరి. చాణక్యచంద్రగుప్తులు తినుచున్న అన్నమును వదలి దొడ్డిదారిని పారి పోయిరి. పాములవాని వేసమునున్న సిద్ధార్థకుడు పాముకోటి కాయిల్లుజొచ్చి దానిని వెదకి పట్టుకొనెను. ఆగేస్తు సంతోషభరితుడై వాని కింతయన్నముపెట్టి పంపెను. ఊరివెలుపల మఱ్ఱిచెట్టుక్రింద వేచియున్న చాణక్యచంద్రగుప్తులును సిద్ధార్థకుడును ఆయన్నమును గడుపార భుజించిరి. చాణక్యుడు సిద్ధార్థకుని పామున కిన్నిపాలుపోసి "కోరలూడిన నాగన్నా, పాలుతాగు, మాప్రాణాలు నిలిపావు" అనుచు దానిమేను నిమిరెను.

చాణక్యచంద్రగుప్తులిట్లు దినదినగండముగా మూడు నెలలకు యమునా తీరస్థమగు ఇంద్రప్రస్థము చేరిరి. కొంచెము వెనుకముందుగా వచ్చి చేరిన చారులును వారును ధర్మశాలలో నెవరికి వారు వేర్వేర విడిసి యుండిరి. మఱునాడు చాణక్యుడు నగరములోని కేగునంత ఎటుచూచినను రథగజతురగ ములతో నందసైన్యములు నిండియుండుట కానవచ్చెను. తక్షశిలాద్వారము చెంత బలగుప్తుడను నందసేనాని చాణక్యుని నిలిపి 'మీరెవ'రని ప్రశ్నించెను. "మేము తీర్థవాసులము, అరుగురము గూడి అమరనాథం సేవింప బోతున్నా" మని చాణక్యుడు బదులు చెప్పెను.

బలగుప్తుడు.—త్రోవలన్నీ అలకసుందరుని మ్లేచ్ఛసైనికులతో నిండివున్నవి. తీర్థయాత్రల కిది సమయంకాదు. ఆయవనవీరుడు తక్షశిలాంబష్ఠుల సాయముతో పర్వతకుని ఓడించి సాంగలక్షత్రియులను కాలచుర్యులను కూడా పరాభవించాడు. ఈయవనులు కిరాతులు ఆర్యావర్తంలో అడుగు పెట్టకుండా అరికట్టడానికి మాసేనల నిక్కడికి కాపుపంపారు.

చాణక్య.—అలాగా! మీసేనాపతి యెవరు?

బల.—భద్రశాలుడు.

చాణ.—చంద్రగుప్తసేనాపతి యెక్కడ వున్నాడో మీకేమైన తెలియునా?

బల.—పరభూములకు పారిపోయినాడు. ఆయనను పట్టితెచ్చినవారికి మగధేశుడు లక్ష బంగారు పణాలు బహుమాన మిస్తాడు.

చాణ.—అన్నన్నా! లక్షణాలే!

బల.—ఏమి, నీకు నోరూరతున్నట్లున్నదే?

చాణ.—నాకే కాదు. లక్షణాలంటే ఎవరికైనా వూరుతుంది.

బల.—నిజమే కాని చంద్రగుప్తులవారిసౌజన్యం ఎరిగినవా ళ్లెవరూ ఆపాపపు సొమ్ముకు ఆసించరు.

చాణ.—ఏమిటింత అభిమానం వారియందు మీకు?

బల.—మౌర్యులవారు నన్నింతప్పటినుంచి పెంచి పెద్దవాణ్ణి చేశారు. నావృద్ధి అంతా వారిది. అయితే నే నా విశ్వాసంచేత చెప్పడం కాదు. నిజంగా చంద్రగుప్తులవారి సుగుణసంపద అటువంటిది. వారికొఱకు ప్రాణమైనా యిస్తాను నేను.

చాణక్యు డీమాటలచే కుదుటబడి బలగుప్తునకు దమరహస్య మెఱిగించి నందసైన్యముల బారినుండి గడపి యమునానది దాటింపుమని కోరెను.

పిమ్మట బలగుప్తుని సాయమున వారు యమునను నందసేనావాహినిని దాటిరి. యమునానది యవ్వలియొడ్డున నిలిచి, చంద్రగుప్తుడు దీర్ఘదీర్ఘముగా నిశ్వసించి, చెమర్చిన కన్నులతో చాణక్యున కిట్లనియెను. "ఆర్యా! మగధకు విపత్తు వస్తున్నట్లున్నది. ఈశరుణాంగా నాబంధుమిత్రులంతా శత్రువుల నెదుర్కొని నిలిస్తే నేను నామగధను విడిచి పరభూములుపట్టి పోతున్నాను. ఎంత దౌర్భాగ్యుడనో?"

చాణ.—వత్సా! విచారించకు. మగధను విడిచి ఎక్కడికి పోతున్నా వని నీకీ సంతాపం? దైవం రక్షిస్తే మహాబలసంపన్నుడవై తిరిగి వచ్చి మగధరాజ్య రక్షణంచేసి యీఅక్షౌహిణులన్నింటికి అధిపతి వౌతావు. ముందు ఈనంద కీటకాలను రూపుమాపే ఆలోచన చెయ్యి.

చంద్రగుప్తుడు.—తాను వీడివచ్చిన అవ్వలియొద్దనకు దృష్టి సారించి, చేతులు మోడ్చి, "మగధరాజ్యలక్ష్మీ సెలవు. పుట్టి యెన్నడూ నిన్ను విడిచి యెరగను. మరల ఎప్పటికో నీసేవ" అనుచు నవ్వలిమొగమాయెను.

చాణక్యుడు "కుమారా! అధీరుడవు కాకు. అచిరకాలంలోనే మగధరాజ్యలక్ష్మి నిన్ను వరిస్తుంది" అని యూరట చెప్పి చారచతుష్టయముతో గూడ పయనమైపోయెను.

---

# 9

## భరతఖండముపై పిడుగుపాటు

అచట యవనసైన్యములు హెఫిస్థాన పృథుకేశులు నడప, అంభియు దక్షశిలేశుడును త్రోవ జూప ఉదబంధపురమును జేరెను. త్రోవపొంగా నెదు ర్కొన్న భారతవీరులు తక్షశిలేశుని అనునయమునకు, యవనప్రతాపమునకు వశులై ఆమహావరూధినికి మిన్నక తెరువొసంగిరి. పుష్కలావతీభర్తయగు హస్తిమాత్రము సామము చేలొంగక పరాక్రమించెను. యవనులుపుష్కలావతీ దుర్గమును ముట్టడించిరి. నెలదినములు గడచినను దుర్గము పట్టువడలేదు. యవను లంతట భేద ముపయోగించి సంజయుడను రాజబంధువును జీలగిసి తత్సాహాయ్యమున దుర్గము జొచ్చి హస్తిని సంహరించిరి. పుష్కలావతీదుర్గ మును నేలమట్టమొనర్చి సంజయునకు బట్టముగట్టిరి. సంజయుడు యవనదాస్య మును తలదాల్చెను.

హెఫిస్థానపృథుకేశులసైన్యము లిట్లుదబంధపురము జేరుచుండ ఆలీ సాందరు తన మహాసైన్యములతో కుశధ్వజముపై నెత్తిపోయెను. అచటసమర మున యవనవీరుడగు తులమాయికి (Ptolemy) కుశధ్వజవీరుడగు ఘోరుని పరాక్రమముచే తలప్రాణము తోకకు వచ్చెను. తులమాయి ఎట్టకేలకు ఘోరుని సంహరించి తచ్ఛవమును గొనిపోవుచుండ అంగరక్షకు లడ్డుపడి నిలుపరించిరి.

ఆలీసాందరు నాటియుద్ధమున క్షతగాత్రుడయ్యు, తులమాదిక్ పోరు భారమగుట పరికించి, వానికి బాసటయై, ఘోషని అంగరక్షకులను బారద్రోలి, వానిశవమును బట్టితెచ్చెను. కుశధ్వజపతియగు అండకుడు గూడ యవనులకు బందియయ్యెను.

కుశధ్వజము నిట్లు జయించినపిమ్మట నాయవనచక్రవర్తి హారిగ్రామముపై నెత్తి విడిసెను. కశ్యపపురముచెంత ప్రవర్తించిన ఘోరయుద్ధమున ఇరువదివేల అశ్వపాశ (Aspasians) వీరులు హతులైరి. నలువదివేలు యవనులకు బట్టువడిరి. యవనులానగరమును కొల్లగొట్టి రెండులక్షల ముప్పదివేల వృషభములను హరించిరి. వానిలో మేలైన పదివేలింటికి, మాసిడోనియా కరుగుచున్న క్షతగాత్రులవెంట తోలిపెట్టిరి.

అనంతరము నైశా (Nysa) పురిని యవనులు ముట్టడించిరి. అచటి వీరులు అసమానపరాక్రములై యవనులను బలాయితుల నొనర్చిరి. కాని అలకసుందరుని ధాటికి వెరచి తత్పురపాలకుడైన అక్షోభ్యుడు సంధి నిచ్చగించెను. నైశానగరవాసులగు తామెల్లరు ధ్యానేశుని సంతతియగుటచేయావన సగోత్రులమని యిచ్చకములాడి మూడువందలు నైశానగరవీరులను యవనులకప్పనమిడి అలకసుందరుని మరుగుజొచ్చెను.

అలకసుందరు డిట్లు ప్రచండాగ్నివలె సింధుతీరము జేరవచ్చుచుండ, నీలోపల తక్షశిలాపతి అశ్వకరాజధానియగు మశకావతికి కరాళుడను దూతనంపెను. అశ్వకవిభుండగు నశ్వజిత్తు, రాణియగు కలాపిసియు దాను కరాళసందేశము వినెను. అతిరథశ్రేష్ఠుడగు ఆలీసాందరు పరాక్రమౌదార్యగాంభీర్యములను కరాళుడు వర్ణించి చెప్పెను. ఆజగజ్జేతకు మారొడ్డుట క్షేమము గాదనియు, అతడాశ్రితసులభు డనియు శాత్రవప్రచండు డనియు జెప్పి అతనినెదిరించి సర్వనాశనమునకు పాల్పడినదేశముల వృత్తాంతము విన్పించెను అశ్వజిత్తంతయు వినివిని, తుదకు, "నీవు లక్షచెప్పు. ఆలీసాందరు ఎంతబలవంతుడైనా,

పరాక్రమైకధనమగు అశ్వకజాతి ఆతనికి తలవొగ్గదు. పిఱికికందలేని శూరులు నాతాతతండ్రులు నాకప్పగించిన ఈరాజ్యాన్ని ఆలీసాందరు దాక్షిణ్యాని కాసించి అనుభవిస్తాననేది కల్ల. మాది ఇర్వది వేల అశ్వికదళం, ముప్పదివేల కాల్బలం. మా సైన్యములకు బాసటగా విజయవర్మ, ముక్కాకలు తీఱిన ఏడు వేల మద్రకవీరులను తోడు నడుపుతాడు. మశకావతీదుర్గం శత్రుదుర్భేద్యం. ఈకోట పడినా 'ఊర్ణాశ' మనే గిరిదుర్గం మాఅమ్మగారిది వున్నది. దాని నాశ్రయించి శత్రువు నెదిరించి ముప్పతిప్పలు పెట్టి మూడుచెఱువులనీళ్లు త్రాగిస్తాము. యవనసేనలు ఆయిసుపతలుపులను ఢీకొని తలలు చిదుకగొట్టుకోవడం ఖాయం. మాకు ప్రాప్తమున్నదా, నా తాతతండ్రులేలిన ఈపర్వతభూములను అనుభవిస్తాము; లేదా పైతృకమైన ఈరాజ్యరక్షణార్థం ప్రాణములువిడుస్తాము. అంతేగాని మద్రకులు అశ్వకులు మాతృభూమికి ద్రోహం చెయ్యరు.'' అనుచుండగనే వేగులవాడు వచ్చి, యవనసేనలు రెండుయోజనములదవ్వున నున్నవని విన్నవించెను. అశ్వజిత్తు "శుభం" అనుచు లేచి విజయవర్మతో యుద్ధతంత్రమునుగూర్చి విచారింపనేగెను. అశ్వజిద్రాజ్ఞియగు కలాపిని విలాసిని కరాళునకు దూరపుచుట్టము. కావున కరాళుడు చనవుపెంపున నారాజ్ఞితో "మహారాజు తప్పుదారిని బడుచున్నాడు. వారిది పెంకెమతమని అంభికుడు మొదటినుంచీ యెరిగివుండీ కూడా, రాణి సమయజ్ఞురాలనీ, మహారాజులుంగారికి హితం చెప్పుతాడనీ నమ్మాడు. మీరాజ్యాన్ని కుమారమహారాజులుంగారిని ఎలా కాపాడుకుంటాడో?" అనుచు హెచ్చరించెను. రాణియుం గొంతతడవు ధ్యాననిశ్చలయై, అంతలో చెప్పరిల్లి, చెవిదాకు వెడదకన్గవ విప్పార, కరాళుం గాంచి, "ఔనుగాని, కరాళా! అలకసుందరుడు అందగాడట నిజమేనా" యని అడిగెను. కరాళుడు చిఱునవ్వు దోప, "నిజము దేవీ! రాణులలో నీవెంత యందకత్తెవో, రాజులలో నావీరు డంత అందగాడు," అని బదులు పలికెను. కలాపినియు సిగ్గుపెంపున బుగ్గలు జోత్తులుగా దల వంచి చరచర లోనికేగెను. కరాళుడును స్వామికార్యము సఫలమైనట్లే యని సంతసించుచు దన

దారిం బట్టిపోయెను. మశకావతీదుర్గమునకు దక్షిణపశ్చిమదిశల దుర్గారోహములగు పర్వతములు పెట్టనిగోడలై నిలిచియున్నవి. తూర్పున మశకావతి యనునిర్ఝరిణి త్రవ్వనికందకమై పారుచుండెను. వీనికిదోడు వజ్రదుర్భేద్యమగు ప్రాకారమును, దాని నంటి పాతాళమునంటు కందకమును దుర్గమును నిండు కౌగిళ్లబోదివి కాపాడుచుండెను.

ప్రొద్దు ప్రాలుచుండగా యవనసేనలు దుర్గముపై బడజొచ్చెను. అశ్వజిత్తు ససైన్యముగా దుర్గము వెడలివచ్చి, యవనులను మూడుమైళ్ల దూరమునను న్నకొండ కంట దరిమెను. అలిసాందరంతట బరవసమొనర్చి సేనలను జేయివీచి మరల కోటపైకి నడచి అశ్వకులను దుర్గములోనికి దరిమెను. నాటిరేయుభయసైన్యములు విశ్రమించి వేకువనే మరల పోరికి గడంగెను. నాడు ప్రవర్తిల్లిన సంకులసమరమున అలకసుందరునకు కాలిపై గాయమయ్యెను, అతడద్దాని లెక్కగొనక సేనల నెసకొల్పి కందకముపై సేతువునిర్మించెను. దుర్గము నుండి వర్షపాతముగా బహుశరపరంపరను గ్రేణిసేయక యవనులు కోటకు లగ్గలు సాచిరి. మందుగుండ్లతో గోడలకు క్రంత లొనర్చిరి. ఇంతలో ప్రొద్దుగ్రుంకుడు అలీసాందరు స్కంధావారమునకు జని పరీక్షింప గాయముపై నెత్తురు గడ్డకట్టియుండెను. వైద్యుడు కట్టుకట్టుచుండ దుర్భరమగు వేదనపాలై అవీరుడు, "నన్నందరు దేవపతిపుత్రుడనీ దివ్యుడనీ కీర్తింతురు. నిజానికి నేను మానవమాత్రుడ నని ఇపుడు తెలిసి వచ్చినది" అని యాముసేశునితో సల్లాపించెనట.

మఱునాడు యవనులు చీమలదండువలె కోటగోడల కెగబ్రాకుచుండ నాశ్వకులు తేనెటీగలవంటి భల్లముల బఱపి యు, కొండరాళ్లు దొర్లించియు వారిని జక్కుసేయజొచ్చిరి. కోటగోడలయెత్తున దిబ్బలుపోసి యవను లామెట్ట లపై నిలిచి మందుగుండ్లు ప్రేల్చిరి. ఎంతసేసియు కోటలో నడుగిడుట శక్యముగామి తలపోసి అలీసాందరు సేనానులతో విచారించి, "ఇంతవ అశ్వజిత్తు

శౌర్యసాహసములే మనల నిలువరిస్తున్నవి. ఎక్కడ జూచిన అతడే సేనలకు ముందు నడుస్తున్నాడు. కాబట్టి ముం దాతని వధించాలి. రేపు అందరు అత నినే గురిచేయండి'' అని బోధించెను.

మఱునాడు యవనసైనికు లందఱు తన్నే గురిచేసి వదలినదానిలో నొక యమ్ము దాకి అశ్వజిత్తు వీరస్వర్గము చూరగొనెను. ప్రభుమరణఖిన్నములై ఆశ్వకబలము లితికర్తవ్యతామూఢములై యున్న అయ్యదనున యవనసైన్యములు ఒక్కుమ్మడి కోటలో జొరబడెను. అనాథములైన సైన్యములగాంచ గన్గొని రాణి యగుకలాపిని అధీరయై, కర్మోపదేశము స్మరించి, కుమారుని చంకనెత్తికొని ఆలీసాందరు చెంతకరిగి ఆవీరుని మోమున నిశ్చలవీక్షణములు బఱపి ''నాకు పుత్రభిక్ష పెట్టు'' మని వేడెను. వీరరసావతారు డగు నాజగజ్జేత రాణివిలాస మున కచ్చెరుపడి, ''పుత్రభిక్షయే కాదు. ముందు ఈకోట పట్టుకొననిమ్ము, ఆమీద నాఅనుగ్రహానికి పారములేదని ఎరిగింతు''నని ఊరడించెను.

మశకావతి యవన వశంవద మగుడు మద్రకసైన్యములు ఊర్ణాశ దుర్గము నాశ్రయించి యవనులను బాధింపజొచ్చెను. ఆలీసాందరు సామ మవలంబించి, ''మారంతా కైదువులుపెట్టి కోటవిడిచి పోయినచో మన్నింతు'' నని విజయవర్మకు రాయబార మంపెను. విజయవర్మయు, ''అశ్వజిత్తు పడినా నేను జీవించే ఉన్నాను. కైదువులు పెట్టి జితోస్మి యనవలసినగతి మాకు పట్ట లేదు. నిన్ను, నీసైన్యములను, నీమిత్రులను ఏడాటలాడించక విడువను. మీా కేట్లో, మాకు అట్లే ప్రాణములపై తీపిలేదు. సాయుధులమై మాయిచ్ఛ వచ్చినతెరువున బోనిచ్చినచో ఈకోట విడుతుము. లేనిచో ప్రాణములు విడు తుము'' అని బదులంపెను. ఆలీసాందరు, ''ఆయుధాలతో మిమ్ము విడుచుటే కాదు. నాసేనలో జేర్చికొని భారతవిజయంలో మీాకు పాలుగూడపంచెదను'' అని మరల వార్తయంపెను. ''మాతృభూమిని నీకు కట్టియిచ్చుటకు మద్రకులు దేశద్రోహులు కారు. చాణక్యుడు చెప్పనే చెప్పెను. 'క్షత్రియుండు ఆర్య

భూమిపై. ఆర్యధర్మముపై గత్తికట్టరా' దని" అని విజయవర్మ బదులుచెప్పెను. "అశ్వకులు ఓడినపిమ్మట ఎవరికొరకు మీకీపట్టుదల" అని అలకసుందరుడు ప్రశ్నింప, "అశ్వకులు వలదనేదాకా మేము పోరుమాన" మని విజయవర్మ కబురంపెను. "అశ్వకుల కిపుడు నేనే ప్రభువును. నాయాజ్ఞ పాలింపు" దని అలీసాందరు. "కలాపినీదేవి బ్రదికియుండగా నీవెట్లు ప్రభువౌతా" వని విజయవర్మ. "ఆమె నాబందీ" యని యవనచక్రవర్తి. "అగుగాక, మూరాణి కాకపో" దని మద్రకపతి. అలీసాంద రీజవాబు సవాళ్లకు విసివి, కలాపినీదేవికి, "నీ కొడుకును కాచుకో దలచినచో మద్రకులను కోటవిడిచి పొమ్మనుము" అని వార్త నంపెను. పాప మూరాణి చేయునది లేక, విజయవర్మ చెంత కేగి, "నాయనా! మాకర్మమునకు నీ వేమి చేయుదువు? వృథాగా నీవీరులను యవనాగ్నికి ఇంధనములు చేయకు. కోటవిడిచి పొండు. నాబిడ్డను రక్షింపు" దని కన్నీటితో వేడుకొనెను. విజయవర్మ యంతట ససైన్యముగా కోట విడిచి అచ్చటికి యోజనదూరమున నున్న పర్వతము నాశ్రయించెను. కోట విడిచి యేగునపుడు అలీసాందరు విజయవర్మతో, "ఎందుకు వృథాచలము సాధిస్తావు. మామాట విని మాసైన్యంలో చేరు. భారతభూమికి మేము ద్రోహం చెయము. విశ్వమంతటిని స్నేహబంధనాలతో గట్టడమే మాఆశయం. మాకు స్వపరభేదం లేదు. ఈశశిగుప్తుణ్ణి అడిగిచూడు" మని పలికెను. "నేను ఆలోచించి రేపటికి బదులుచెప్తాదు" ననెను విజయవర్మ. పిమ్మట నాలీసాందరు శశిగుప్త కర్తరీశులతో మంతనముండి, "ఈమద్రకులు మనసేనలలో జేరుట కొడబడిరా, మంచిమాట. లేనిచో వీరిని తుదముట్టించవలసినదే కాని ప్రాణములతో వదలుటకు వీలులేదు. వీళ్లు మమ్ము తృణీకరించి బ్రదికిపోయిరన్నవార్త దేశంలో వ్యాపిస్తే మనల నిక ఎవ్వరూ లెక్కచేయరు. కాలికివచ్చిన ఈ మద్రకుల దురభిమానం యవనపౌరుషాన్ని కూడా మించుతూ వుంది. కాని ఏమి చేస్తాము? వీరిని వదలిపెట్టడం కొఱవితో తలగోకికోవడమే అవుతుంది. కాబట్టి వీరిని కనుపెట్టి జాడలు తీయుండి" అని ఆజ్ఞాపించెను.

మఱునాడు మద్రకులు యవనసైన్యమున చేరకుండుటకే నిశ్చయించి రనువార్త చారముఖమున నెఱింగి, యవనసేన లున్నట్లుండి వారిపైబడెను. మద్రకులు స్త్రీబాలవృద్ధముగా నసువుల లెక్కసేయక పోరి మడసిరి. విజయవర్మ యొక్కడు మాత్రము తప్పించుకొని యేగెను. చావగా మిగిలిన స్త్రీలను అలీసాందరు విడిచిపుచ్చెను. దేశద్రోహమునకు బాల్పడనొల్లక ప్రాణములువిడిచిన ఆపీరజాతియొక్క శౌర్యమును కర్తరీశుడు దుగ్గడించి పలుక, నాలీసాందరు, "నిజమే. ముందుపని తేలికచేసికోవడానికి వీళ్లను వధింపక తప్పించికాదు. ఆలీసాందరును ధిక్కరించిన వారికందరికి ఈచేటు తప్పదు మఱి" అని సమాధానము చెప్పెను.

నాటిరేయి యవనసేనలు ఆటపాటలతో మధుపానముతో విజయోత్సవ మొనర్చుకొనెను. ఉత్సవము ముగిసినపిమ్మట కలాపినీదేవి ఆలీసాందరు శయ్యామందిరమును బ్రవేశించుటగాంచి యవనవీరులామెభాగ్యమునునుతించుకొనిరి. డేరియసుచక్రవర్తి భార్య జగదేకసుందరియయ్యు గరంచజాలని అలకసుందరహృదయమును కలాపిని వశమొనర్చుట కొనుట కెల్లరు నక్కజమందిరి. "చక్రవర్తి కంటినిండా నిద్రపోడు. స్త్రీల నెప్పుడు కన్నెత్తి చూడడు. అట్టివాడు కలాపినీదాసుడైనాడు. అదృష్టమన్న కలాపినిదే అదృష్టము.జగదేకవీరుడైన కొడుకును కంటుంది" అనెను కర్తరీశుడు. శశిగుప్తుడు నవ్వి, "రాజ్యమొక్కటే కోఱతగాని కొడుకులకేమి భాగ్యం. ఆర్యధర్మముల నెరుగవు నీవు. యవనసంజాతుణ్ణి భారతీయులెన్నడు రాజుగా వరించరు. అశ్వకు లప్పుడే అశ్వజిత్సాత నభిషేకించి ఊర్ణాశదుర్గమునకు జేరుకొన్నారు. నీవు వింటివో, లేదో, చక్రవర్తి ఊర్ణాశమునకు నన్న బట్టముగట్టుదు నని సెలవిచ్చాడు. ఏమవుతుందో! ఆకోట కొరకరానికొయ్య" అనెను.

ఆరువేలడుగులయెత్తును రెండుయోజనములవిస్తీర్ణమును గలపర్వతముపైనున్న ఊర్ణాశదుర్గముదక్షిణమున సింధునదియు, దక్కినదెసల పర్వతకందరము

లును బలిసి కాచుచుండ శత్రుదుర్నిరీక్ష్యమై యుండెను. ఆలీసాంద రాకోట దెట్ట తనమున కచ్చెరువంది, "ఏమి యీభారతభూమి భాగ్యము! వాయవ్యదిశయం దున్న యీకొండలన్నీ కోటలే కదా! యిచటి ప్రజలందరు వీరులే కదా!" అని ముక్కుపై వేలిడుకొనెను.

మఱునాడు యవనసేనలు నలువైపులనుండి ఊర్ణాశదుర్గమును ముట్టడించెను. అగాధములగు కొండలోయలను చెట్లతో నింపి వానిమీదుగా నడచి యేగి యవనులు మూడవనాటికి దుర్గప్రాకారమును సమీపించిరి. మద్రకులు శక్తివంచనసేయక, ప్రాణములు దాపక పోరిరి. తుదకు అపజయము నిశ్చయించుకొని, కోటదాటి యేగునుద్దేశముతో సంధిప్రస్తావమునకు గడంగిరి. ఆలీసాంద రాసన్న గ్రహించి, సంధికి సమ్మతించినట్లే నటించి, మద్రకుల నేమరించి కోటలో ప్రవేశించెను. మద్రకులలో దప్పించుకొని పోగా మిగిలినవారిని సంహరించి శశిగుప్తునకు దుర్గాధిపత్యమొసంగి సన్మానించెను.

అనంతరము యవనసేనలు ధాత్రృ (Dyrto) పురముపై నెత్తి విడిసెను. తప్పిదారి, యచట తలదాచుకొన్న ఆశ్వకు లటనుండి వెడలి అభిసారపర్వతకుల నాశ్రయింప నేగిరి. యవనులు ధాత్రృపురమును జయించి అటనుండి ఉదబంధపురమున కేగి హెఫిస్థానపృథుకేశుల బలములను గలసికొనిరి.

ఆలీసాందరు ఉదబంధపురమును జేరునప్పటికి తక్షశిలేశుడు మరణించెను. తత్పుత్రుడగు అంభి ముప్పది మదగజములను, సుపుష్టములగు మూడువేలవృషభములను పదివేల గొఱియలను ఇనూరు నిష్కములను యవనచక్రవర్తికి కానుకయంపెను. ఆలీసాంద రాపసదనము లందుకొని అంభి యుచితజ్ఞు డని ప్రశంసించెను. హెఫిస్థాను ఆమాటలకు నవ్వుచు, "చిత్తము. మనమీద భక్తిచేతకాకున్నా అభిసారపర్వతపుల భయంచేతనైనా అంభి మనపక్షాన ఉండక తప్పదు. ప్రబలులగు అభిసారపర్వతేశులతో చేరితే ముందుముందు వారివల్ల తనకు ముప్పు తప్ప దని మనల నాశ్రయిస్తున్నాడు. తక్షశిలలో బ్రాహ్మణులకు

అంభి మనపక్షం చేరడం సుతరామూ ఇష్టం లేదని తెలుస్తుంది. అంభి వారి కేమాటా చెప్పక కాలహరణం చేస్తున్నాడట" అని పలికెను.

ఆలీసాందరు.—బ్రదుక దలచెనా మనపక్షం వుంటాడు, లేదా, మద్రకులకు పట్టినగతే పట్టుతుంది.

హెఫిస్థాను.—అన్నట్లు తమరు విన్నారో, లేదో, మద్రకుల నట్లా నమ్మించి చంపడం మనవారిలోనే చాలామందికి రుచించింది కాదు.

ఆలీసాందరు —మాకూ రుచింపకనే ఆడవాళ్లను విడిచిపెట్టాము.

హెఫిస్థాను.—తమ అనుగ్రహం వాళ్ల పట్ల బూడిదలో పోసిన పన్నీరయింది. విజయవర్మ మనపై పగసాధించడానికి విశ్వప్రయత్నంచేసి, రాజమండలాన్ని మనమీదికి ఎసకొల్పుతున్నాడు.

కర్తరీశుకు.—పెనంమీద పగబూనిన ఆవగింజ ఏమి సాధిస్తుందో విజయవర్మా అదే సాధిస్తాడు.

ఆలీసాందరు.—బాగా చెప్పావు.

ఈరీతి సల్లాపములతో నృత్యగీతవినోదములతో దేవబలులతో యవన సేనలు సింధుతీరమున నొక్కనెల గడపెను. ఈలోపల సింధునదిపై పడవలతో సేతువు నిర్మించుట పూర్తియయ్యెను. చతురంగబలములతో యవనులట్లు సింధు నదితరించి తక్షశిలవెనకు నడచిరి. కతిపయదినము లట్లు పయనమొనర్చి "తక్ష శిల ఇదిగో, అదిగో" యనుచు సమీపించుచుండిరి. తక్షశిలనుండి వచ్చిన దూతలు తెరువు సూప యవనవరూధినులు నిశ్చింతగా నేగుచు తక్షశిలకు రెండుకోసులదూరమున నున్నతరి రథగజతురగపదాతులచే సైన్యమొక్క టెదురై వచ్చుచుండుట కాననయ్యెను. బ్రాహ్మణులు అంభిమనసు విరిచి విగ్రహో యత్తుని చేసియుందు రని ఆలీసాందరు నిశ్చయించి తనసేనలను సన్నబంచెను. అంభియు పవ్వులనే యవనబలవ్యూహరచన పరికించి భయభ్రాంతుడై, కతి

సపరివారముతో ముందున కేతెంచి తాను మిత్రుడై వచ్చుట యెఱిగించి, "జగజ్జేతయగు అలీసాందరునకు అర్హగౌరవంగా వుంటుందని సైన్యసమేతంగా ఎదురు వచ్చాను" అని విన్నవించి, "మేము యుద్ధానికిదిగితే ముందుగా చెప్పి దిగుతాముగాని దొంగపోటుగా రావడం మాపని కా"దనెను. విజయవర్మ పట్ల తా నొనర్చిన ద్రోహమును స్మరించి అలీసాందరు మిన్నకుండెను.

---

# 10

## ఇంద్రతనయుడు

అలకసుందరుడు తక్షశిలానగరద్వారము చేరునంత అచటి బ్రాహ్మణులు కాళ్లతో నేల చదునుచేసి కొలుచుచుండిరి. "ఇది యేమి" అని యడుగ వారిలోనొకడు, "చిత్తము, మాలో ఎవరికి కావలసినది వారు కొలుచుకొంటున్నాము. ఈవిశ్వమంతా ఏలుకోవాలని బయలుదేరి ప్రజలను పీడించే తమకూ, పేదబాపలం మాకూగూడా చివరకుమిగిలేదీ, కావలసిందీ ఏడడుగుల నేలయేకదా," అని బదులుపలికెను. అలీసాందరామాటలకు నవ్వి "బాగున్నది, ఈవిరాగము, చచ్చినపిమ్మట ఏడడుగులు చాలునుకదాఅని బ్రదికిఉండగానే ఈనిర్లిప్తత ఎందుకు? లోకంలో అందరూ మీవంటి జీవచ్ఛవాలే అయితే ఇక పురుషకారానికీ, ఉత్సాహానికీ గతిఏమిటి? మీమతమేమో మాకు బోధపడ్డంది కాదు. తీరికగా మిమ్ము కలుసుకొంటాము" అని వారిని సాగనంపెను. పిమ్మట అణుశుక్ర (Onesikritos) డను యవనపండితుని బిలిచి "ఈబ్రాహ్మణ పండితులనుగూర్చి విచారించి వారిలో గొందరిని వెంటగొనిర"మ్మని పంపెను.

అణుశుక్రుడు నగరములోనికి కరిగి అచట అఘోరప్రతులు. ముండధారులు, దిగంబరులు, పాశుపతులు నగునానాప్రకారులను గాంచి, నగర బాహ్యమున వారియునికియని తెలిసికొని అచటి కేగెను. అయ్యాశ్రమమునకు దండిస్వామి కులపతి. కల్యాణస్వామి యనునామాంతరము గల శోభనస్వామి

ఉపాచార్యుడు. అచట సలసలగ్రాగుచున్న ప్రస్తరశయ్యపై వివస్త్రుడై శయనించియున్న శోభనస్వామి నణుశుక్రుడు దరియఁజేరి, అభివాదన మొనర్ప నాత డాశీర్వదించి, ఆపాదమస్తకము నుడుపులు ధరించియున్న అతనిరూపమును గలయఁగాంచి, "ఈవేష మేమిటి! ఎందు కింత బరువు మోయడం? అతిసంచయం సర్వనాశనం చేస్తుంది. మీరెవరు, ఏమిపనిమీద వచ్చారు?" అని ప్రశ్నించెను. అణుశుక్రుడు, "స్వామీ! యవనచక్రవర్తి ఆస్థానపండితుడను నేను. తమ దర్శనంచేసి ఉపదేశం పొందుదామని వచ్చాను" అని సవినయముగా బలికెను. కల్యాణస్వామి, "మంచిమాటేకాని. నాఉపదేశం కావలసివుంటే, ముందు నీవేషం తీసివేసి దిగంబరుడవు కమ్మనెను. ఇంతలో దండిస్వామి యచటికి కరుదెంచి వారిసంభాషణ మాలించి, "కల్యాణస్వామీ! నీదిగంబరత్వముపై అంత అభిమాన మెందుకు? చెప్పవలిస్తే వారడిగినదేదో చెప్పి పంపు" మని మందలించెను.

అణుశుక్రు డామాటలకు సంతసించి దండిస్వామినే ఆశ్రయించెను. దండిస్వామియు దిగంబరుడే. డెబ్బదియై దేండ్లవయఃస్సువాడయ్యు నాపరివ్రాట్టు దృఢకాయుడు. అణుశుక్రు డాతని ప్రసన్నగంభీరవిలోకనములను, మహానుభావమును గాంచి నమస్కరించి, "స్వామీ! యవనచక్రవర్తి, అలిసాందరు తమదర్శనము గోరి నన్ను తమచెంత కంపెను. నావెంట దయచేయండి. పండితప్రియుడైన మాచక్రవర్తి మిమ్ము నెంతైనా సత్కరిస్తారు. వారిఆస్థానంలో సమస్తభోగాలు అనుభవిస్తూ వారికి సదుపదేశాలు చేస్తూ సుఖంగా ఉండవచ్చు. ఎందు కీఅరణ్యాల్లో కష్టాలనుభవించడం?" అని విన్నవించెను.

దండి.—నాయనా! మేము నిర్లిప్తులం. మాకు చక్రవర్తితోనూ అయనభాగ్యభోగాలతోనూ ఏమి పనివుంటుంది?

అణు.—ప్రాణికోటిఅంతా సుఖం కోరుతుంది. ధనంవల్లనేకాని సుఖం లభించదు. ధనప్రాప్తి రాజాశ్రయణంవల్ల కలుగుతుంది.

వండి.—మా కిచట సుఖాని కేమి తక్కువయిం దని? ఈచెట్లపు పండినపండ్లు తింటాము. ఈనీటిలో పారేనీళ్లు త్రాగుతాము. ఈపర్ణశయ్యపై పరుం టాము. మేము దిగంబరులం,మాకింక ఏమికావాలి? జగజ్జేతలైన మీ ప్రభు వ్వైనా ఇంతకంటె ఎక్కువసుఖం లభిస్తూ వుందా? ఎంతరాజ్యమున్నా సంతుష్టిలేనికారణంచేత మీరాజు దుఃఖమే అనుభవిస్తున్నాడు. ఏమీ లేక పోయినా సంతుష్టులమై మేము సుఖం అనుభవిస్తున్నాము. మనం దేవు లాడే ఈవిషయప్రపంచమంతా నశ్వరమైనది. దానికోఅకుప్రాకులాడడం వల్ల దుఃఖమేగాని సుఖ మెలా లభిస్తుంది? కాబట్టి క్షణికమైన ఈప్రపం చాన్ని వదలి మేము శాశ్వతపదార్థాన్ని పొందగోరుతున్నాము.

అణు.—స్వామీ! ఆశాశ్వతపదార్థ మెటువంటిది?

వండి.—అద్వితీయం, అవికలం, అఖండమైన సత్యజ్ఞానానందమే శాశ్వత మైనది. ఈజగత్తంతా దాని అభాస. ఆ అద్వయపదార్థమే మాయావృతం కావడంచేత ఇన్ని భేదాలతో కనిపిస్తున్నది. ఈ అసత్తునే సత్తని మనం భ్రమపడుతున్నాము. నిర్గుణమైనదానికి గుణము లారోపించి సుఖ దుఃఖము లనుభవిస్తున్నాము. పరమసుఖాన్ని ఇచ్చే పదార్థాన్ని తెలంసుకో లేక విషయప్రపంచంలో సుఖప్రాప్తిని గోరి కర్మ చేస్తున్నాము. ఆకర్మచే బద్ధులమై చచ్చుచు పుట్టుచూ సంసారచక్రంలో తిరుగుతున్నాము.

అణు.—అయితే ఆసత్పదార్థాన్ని పొందడానికి మార్గ మేమిటి?

వండి.—ముందు మాయావరణాన్ని ఛేదిస్తేగాని సత్పదార్థదర్శనం కాదు. మాయను దాటవలెనంటే మనస్సును విషయములనుండి మరల్చి నిర్గుణమం దందు లగ్నంచేయాలి. దానికి భక్తిజ్ఞానములు సాధనములు.

అణు.—అయితే స్వామీ! కర్మ బంధకారణ మంటిరే. కర్మహీనుడైన మను ష్యుడు ఏలాజీవిస్తాడు?

దండి.—ఫలాపేక్ష లేకుండా చేసేకర్మం బంధకారణంకాదు. లోకసంగ్రహం కొఱకు సత్కర్మలు చేస్తూ, సత్సాంగత్యంతో కాలంగడుపుతారు జ్ఞానులు.

అణు.—చిత్తం. మఱి తక్షశిలేశుడైన అంభికి యవనచక్రవర్తితో సాంగత్యం మంచిదంటారా, కాదంటారా?

దండి.—అధికునితో సాంగత్యం మంచిదికాదని ఎవ రంటారు? మీరాజు యోగ్యుడనడానికి సందేహంలేదు. పండితగోష్ఠి కోరే జిజ్ఞాసువులు నేటి రాజులలో కనుపించరు. ఇంతకు, మీదేశంలో ఈశ్వరవిచారణ చేసే ముముక్షువులు లేరా యేమి?

అణు.—లేకేమి స్వామీ! పీతాక్షరులవా (Pythagoras) రున్నారు. శుక్రతీర్థులవా (Socrates) రున్నారు. మాగురుపాదులు దివ్యజ్ఞాను (Diogenes) లున్నారు. వారును మీవలెనే నిర్మమత్వం బోధిస్తారు, సాత్వికాహారం సేవిస్తారు. అంతేగాని దిగంబరత్వం మాత్రం లేదు మాదేశంలో.

దండి.—కావచ్చును. ఆచారోల్లంఘనం కష్టం. అంతేకాదు; దేహాభిమానం కూడా చావడం కష్టం.

అణు.—హిందూకుశపర్వతప్రాంతాల్లో కొందరు చచ్చిన పితరులను తింటారు. వారెవరు స్వామీ?

దండి.—వారు అఘోరులు. వారైనా ఇతరజంతువులను చంపి తినరు. పితృశవ భక్షణం వారికొక యజ్ఞమై వుండవచ్చును.

అణు.—చిత్తం. తమదర్శనం లభించడంవల్ల నేడు నాకు సుదినం. తమరు ఒక్కసారి మాచక్రవర్తిని దర్శించవలెనని నావిజ్ఞాపం. తమవంటి జ్ఞానుల గోష్ఠిఅంటే వారికి పరమప్రీతి. తమకైనా వారితో సంభాషించవలెనన్నే కుతూహలం వుండవచ్చును.

దండి.—నిజమే. వారిని ఒక్క ప్రశ్న అడుగుదామనివుంది. ఏమిటంటారా? 'అయ్యా! తమరు ఇంతదూరం ఎందుకు శ్రమపడి వచ్చారూ' అని.

అణు.—తమ రీ ప్రశ్న అడుగుతారంటే నాకో సంగతి జ్ఞాపకంవస్తున్నది. వెనుకటికి, దివ్యజ్ఞానులవారు కోరింత (Corinth) పురంలో ఈలాగే ఒక మట్టికాగులో ఏకాంతంగా కూర్చుని వుండగా, మా ప్రభువులవారు వెళ్లి, కాగుమూతిమీదుగా తొంగిచూచి, 'స్వామీ! నేను అలీసాందరును. తమకేమి ప్రియం చేయుదును' అని అడిగారు. "నాయనా! నువ్వు ఎండపొడకు అడ్డంవస్తున్నావు. తొలగిపోవడమే మాకు ప్రియ" మన్నారు దివ్యజ్ఞానులు. ప్రభువులామాటకు చిన్నబుచ్చుకొని "అయితే అలీసాందరు కావాలి, కాకుంటే దివ్యజ్ఞానులైనా కావాలి" అన్నారు.

దండి.—అయితే మఱి అలీసాందరుగానే ఎందు కుండిపోయినారు?

అణు.—వారు విశ్వమును జయిస్తారనీ, వారి నితరులు జయింపలేరనీ చిన్ననాడే జోస్యులు జోస్యం చెప్పారు.

దండి.—విశ్వవిజేతకు మాత్రం అపజయం లేదా?

అణు.—ఎవరిచేత?

దండి.—"కాలంచేత. మనమంతా కాలవశులం. సర్వమూ కాలాధీనం." అని ఇరువురు శిష్యులను బిలిచి, "ఏదీ కాలచక్రస్తోత్ర" మనిరి.

ఆశిష్యులు కాలచక్రము నిట్లు కీర్తించిరి:—

ప్రాణప్రవాహమ్ము పాటుపోటులు చెందు
భూతజాలము పుట్టు బోలియు పల్మారులును.
రాజ్యములు ధర్మములు రావచ్చుఁ బోవచ్చు
నీవు మాత్ర మ్మొక్క నియతినే తిరిగేవు
కాలచక్రమ నీదుగతికి భంగము లేదు.

పగటివెంబడి రేయి, పగలు రాతిరివెంట
తిరుగు, దినములు నెలల్ తిరుగు ఏండ్లును, బూండ్లు
చీమలును బ్రహ్మలును, చిటుకలును గల్పములు
సర్వమును ఓకాలచక్రమా నీభ్రమణ
వేగమున బడి నలిగి విగతాసులయ్యేరు.
నానాత్వమును భ్రాంతి నమ్మి చెడునే గాని
ఎఱుగునే పామరుం డేకమగు తత్త్వమ్ము.
పాఱేటి ఏఱ్ఱెఱుగు, పామపడు, కాలమా!
మూలకారణజలము కీలు దానెఱుగునే
చిఱునవ్వు నవ్వుతూ తిరిగేవు చక్రమా!
నిష్కామమగు ప్రేమ నిర్మమమగు మనసు
నిర్మలమ్మగు భక్తి స్వేచ్ఛధన్యుల కెఱుక
ప్రేమబద్ధుండైన విశ్వాత్మకునిమహగు
లయ తప్పకుండ కాలమ నీవు పాడవే
భద్రాత్మకుండైన పరమాత్ముపాడవే
ఆర్తరక్షకుడైన అఖిలేశునాజ్ఞమై
పంచిపెట్టుచు గర్మఫలము జీవులకెల్ల
కాలకాలునియాజ్ఞ గడవగా రాదనుచు
ఛందోనుగతి కాలచక్రమా! పాడవే
కాలచక్రమ! దైవగతి కడ్డమెవ్వరే!

శిష్యులు పాటముగించునప్పటికి దండిస్వామి సమాధిగతు డయ్యెను. అణుశుక్రు డచ్చెరువంది, దండిస్వామిని పల్కరింపబోవ, ఇంతలో నటకు వచ్చియున్న కల్యాణస్వామి వల దనివారించి యాతని నెడగలుగ గొంపోయెను. అణుశుక్రు డంతట కల్యాణస్వామితో, "ఏమి ఆశ్చర్యము ఏమ ప్రభావం! నే నెక్కడా చూడలేదు ఇట్టివింతలు. ఇటువంటి అద్భుతం కళ్లబడడం నాభాగ్యం. మీరు

నాతో చక్రవర్తిసన్నిధికి దయచేయాలి; తప్పదు. మీరు స్వయంగా వారి కిదంతా విప్పి చెప్పాలి. మీవంటి మహానుభావులు జాతిమతభేదాలు పాటించ గూడదు." అనుచు బలవంతపెట్టెను. కల్యాణస్వామి మొదట గొంచెము విముఖుడుగా నున్నను క్రమముగా మెత్తబడుచుండుటను అలుఖుశ్రుడు గ్రహించి మఱియు మోమోటపెట్టెను. చక్రవర్తిసన్నిధానవర్తు లనుభవించు భోగములను నోరూరునట్లు వర్ణించెను. జగజ్జేతయైన చక్రవర్తికి సమ్మాన్యుడవై యాయింద్రభోగము లనుభవింపక ఈశుష్కవైరాగ్యము నేల పట్టుకొని ప్రేలాడుదు వనెను. ఒక్కసారి ఆసౌఖ్యము రుచిచూచినచో మరల వదల వనెను. నీకు రుచింపకున్నచో తిరిగిరావచ్చును. ముందు నాతో బయలుదేరి రమ్మనెను. ఇట్లు పలుగతుల మోమోటపెట్టి, మెత్తబరచి, తుదకు ఒడబరచి కల్యాణస్వామిని వెంటగొనిపోయి ఆలీసాందరు సమ్ముఖమున నిల్పెను. చక్రవర్తియు సాదరముగ నాతని నాలింగనమొనర్చుకొని, సత్కారపూర్వముగ దనచెంత నిడుకొని, "మీరాకవల్ల మేము ధన్యులం. నేడు మొదలు మాసమస్తైశ్వర్యములు మాతో పంచి కుడుస్తూ మాకు గురుపదం వహించాలి" అనుచు అనునయించెను.

కల్యాణస్వామియు, చక్రవర్తి చూపు అతిమాత్రాదరమున, కుబ్బిపోయి యచటి ఆహారపానీయాదుల రుచి మరగి, అచటి రాజోపభోగముల కాస్థచెంది, "తమకోరికప్రకారం నడచుకోవడానికి నాకేమీ అభ్యంతరం లేదు. నలభైఏళ్లు వ్రతస్థుడనై తపస్సుచేశాను. ఆవ్రతం పరిసమాప్తమయింది. ఇక ఈరాజభోగా లనుభవిస్తాను. మనసు దాచడం, అసత్యం పలకడమంటే నాకు గిట్టదు. మాపండి స్వాములకు అసత్యమంటే కంటగింపు కనుక నిజమే చెప్తున్నాను. మీతో ఈభోగా లనుభవించాలని నాకు ఆస్థపుట్టుతున్నది. కనుక మీవెంట దేశదేశాలు తిరిగి చూస్తాను. మావేదమతరహస్యాలు దేశదేశాల ప్రచారం చేస్తాను" అని యంగీకారము దెలుపగా చక్రవర్తియు మిగుల హర్షించెను.

మఱి మూన్నాళ్లకు చక్రవర్తి వాహ్యాళికేగినపుడు మరల గొందఱు బ్రాహ్మణులు కన్పించిరి. చక్రవర్తి వారిని జేర బిలిచి కల్యాణస్వామి తన

యాస్థానమున నున్న వార్త వారికెఱిగించి, "మీరు గూడ మావెంట రండు" అని కోరెను. ఆబ్రాహ్మణులు ఆలీసాందరు కోరికను లెక్కసేయక, "కల్యాణస్వామి పతితుడు. నలభైయేళ్ళతపస్సు పాడుచేసుకొని యవనుల మద్యమాంసాల రుచి మరిగాడు. అతని పేరు స్మరిస్తేకూడా పాపం" అని నిందించిరి. ఆలీసాందరామాటల కించుక కనలి, "దేవపతిపుత్రులమైన మాఆశ్రయం ఎవ్వరినీ పతితులను చేయదు. మీమాటలను మిమ్ము చు మే మెఱుగకపోలేదు. మేము కోరితే మాఆజ్ఞను మీరున్నూ ధిక్కరింప లేరు" అనెను. ఆబ్రాహ్మణు లంతట, "ప్రభువులవారి ఆగ్రహానికి మేమెంతటివాళ్ళం! తమరు దండిస్వామితో అని చూడండి ఈమాటలు. రాజాశ్రయానికీ మోక్షానికీ చాలదూర మంటారు వారు. సార్వభౌముల నిగ్రహానుగ్రహాలు ఆసిద్ధపురుషుణ్ణి చలింపచేయవు" అని బనులు పలికిరి. చక్రవర్తియు, "మీరే చూస్తారు. దండిస్వామి సిద్ధపురుషత్వం. రేపీవేళకు మాఆస్థానంలో దండిస్వామి కల్యాణస్వామితో గూడ మాఅనుగ్రహాన్ని అర్థించడం మీరే చూడగలరు" అని పలికి, చరచర బటకు టీరమున కేగి అణుశుక్రుని జేర బిలిచి, "నీవు దండిస్వామికి మాయాజ్ఞ తెలిపి ఇక్కడికి వెంటబెట్టుకురా. నిరాకరిస్తే శిరచ్ఛేదం చేస్తామని చెప్పు." మని పంపెను.

అణుశుక్రుడు సార్వభౌమాజ్ఞ తలదాల్చి దండిస్వాముల యాశ్రమమున కరుగ స్వామి యచట పర్ణశయ్యపై పండియుండెను. అణుశుక్రు డభివాదన మొనర్చి యవనసార్వభౌముని యాజ్ఞ యెఱిగించి "తమరు సార్వభౌముల ఆజ్ఞ పాలించండి, వారికి ఆగ్రహం కల్పించకండి" అని విన్నవించెను.

దండి అనాదరసూచకమైన మందహాసం చేసి, "జగత్పతిఆజ్ఞతప్పఇతరుల ఆజ్ఞ మేము లెక్కచేయము. మాకు రక్షకుడూ శిక్షకుడూ ఆపరమాత్మ తప్ప ఇతరులు కారు. సత్యజ్ఞానానందమయుడైన ఆసర్వకర్త శిక్షించినా రక్షించినా మాకు సంతోషమే. ఆపరమాత్మ అనుగ్రహించిన ఈదేహంతో ఆయనకు పని

తీరిపోతే మళ్లా తీసుకొంటారు. వారిఆజ్ఞ అయినప్పుడు ఈజీర్ణవస్త్రం వదలి వేసి వారిసన్నిధికి వెళ్లుతాము. మాతప్పొప్పులు ఒప్పుకొంటాము. అంతేకాని మీప్రభువుతో మాకు అయ్యేది, పోయేదీ లేదు. వారి నిగ్రహానుగ్రహాలతో మాకేమిపని? తరుతలవాసం చేస్తూ, పవనపర్ణభక్షణం చేసేమావ మీరాజుతో ఏమి కావాలి? కాక, తనఆశలేతీరక ప్రపంచంమీదపడి సివమెత్తి రక్తనదులు పారించేవాడు మాకోరిక లేమితీరుస్తాడు? ఈమహావిశ్వంలో మీరాజు జయించినదేశం అణుమాత్రంకూడా కాదు. మీరాజుపేరుకూడా విననిదేశాలు సీమలు ఎన్నో ఈప్రపంచంలో! అనేకులు రాజులు అనుభవించి రోసి విడిచిన ఈమంటిముద్దకోసం ఆశించి దేశదేశాలు తిరిగి ప్రజాక్షోభం చేస్తూ మిమ్మునందరినీ క్షోభపెట్టే మానవమాత్రుడు నిర్లిప్తులం శాంతిమయులమూ అయిన మమ్ము నేమిచేయగలడు? కనుక మీరాజుతో చెప్పండి, 'దండిస్వామికి మీతో ఏమీ పనిలే' దని, మీరాజుకు మావల్ల నేమైనా కావలసివుంటే మాచెంతకు స్వేచ్ఛగా రావచ్చును. మాతలయే వారికి కావలసివస్తే నిరభ్యంతరంగా తీసుకువెళ్ళ వచ్చును" అని బదులు పలికెను.

అణుశత్రునివలన జక్రవర్తి యీసందేశము విని, కల్యాణస్వామితో, ధీరుడంటే దండిస్వాములే ధీరుడు. జగజ్జేతలమైన మమ్మును తృణీకరించడం ఆస్వామికే చెల్లింది. నిజానికి జగజ్జేత దండిస్వామేకాని మేము కాదు" అని వగచెను. కల్యాణస్వామియు, "ప్రభువులు యథార్థం సెలవిచ్చారు. తమరు బహిశ్శత్రువులనే జయిస్తే స్వామి అంతరశత్రువులను కూడా జయించారు. విజయశబ్దం మీకిద్దరికే చెల్లుతుంది. మీవిజయం రాజసం, స్వామిది సాత్త్వికం. తమరు కర్మవీరులు, స్వామి యోగవీరులు. మీకుభయములకూ మృత్యుభయం లేదు. ఇహాభోగవాంఛ తమది. పరభోగవాంఛ స్వామిది" అనెను. అలక సుందరుడు "కాని మాయిద్దరికి సమాగమమయ్యే భాగ్యంలేదు" అని నిట్టూర్పువిడిచెను.

# 11
## పండితగోష్ఠి

అనంతర మొకనాడు తులమావి యామునేళ హెఫిస్థానాదిసచివులును, కృతబల (Critobulus), కృతద్యుమ్నాది (Kritodemos) పండితులును బరివేష్టింప నలకసుందరుడు తక్షశిలానగరమందలి గురుకులమును దర్శింప జనెను. నానాదేశాగతులగు శిష్యగణములతో మూర్తిగైకొన్న శాస్త్రములబోలి వెలుగుచున్న పండితుల ప్రజ్ఞాదికమును, దత్తదభిమానశాస్త్రములను అంభి యెఱిగించుచుండ జక్రవర్తి వారిలో నొక్కొక్కరి దరియనేగి వారివారి విద్యాపరిశ్రమమును సాకల్యముగ నరసెను.

ఆయుర్వేదవిశారదు లున్నకూటమునకు దొలుత నేగి వారితో సంభాషించెను. వస్తుగుణపాఠమును, రోగనిదానమును, గజాశ్వపశుపక్షిచికిత్సాస్థానములను వారు బోధించుపద్ధతి నాలించెను. మృతసంజీవనమును గూర్చియు,రసవిషలోహాదులనుగూర్చియు యావనపండితులు భారతవైద్యులతో జర్చించిరి. భాస్కరు డాయురారోగ్యప్రదుడనియు, తత్కాంతి ఓషధులకు శక్తినిచ్చుటయేకాక మృతులను బ్రదికింప సమర్థ మనియు భారతపండితులు తెలిపిరి. సూర్యపుటమున నోషధులను పాకమొనర్చుపద్ధతి నెఱిగించిరి. అష్టోత్తరశతపుటములచే సిద్ధమైన ధన్వంతరితైలమును జూపిరి. నూనెగుడ్డలో దేవదారుఖండమును బొదివి అగ్నిపుటమున తైలముం దీయుపద్ధతిని బోధించిరి. పిమ్మట లోహాదులను భస్మమొనర్చుపద్ధతులను సర్పవిషము నౌషధముగా వాడుమార్గమును దెలిపిరి. పిమ్మట శల్యశలాకతంత్రములచే దుష్టాంగఖండన మొనర్చుటయు, గర్భకోశశోధనవిధియు బోధించిరి. విఱిగినయెముకల నదుకుటకు, తొలగినవానిని సరిచేయుటకు నవలంబించువిధి నెఱింగించిరి. పిమ్మట దా ముపయోగించు శల్యశలాకాది శాస్త్రభేదములను 127 ని చూపెట్టిరి. వానిలో కేశములను నిలువున రెండుగా జీల్చుటకు గూడ సమర్థములైన సున్నితపుబనిముట్లును,

గాంచి యవనపండితు లచ్చెరువందిరి. శస్త్రవైద్యమున శవఖండనవిధి కూడ తప్పనిదగుటచే భారతభూమిలో శాస్త్రనికేతనములగు కాశి మున్నగుచోట్ల దానిని నిరసింతు రనియు, శస్త్రవైద్య దనపత్యుదగునని ప్రజలు విశ్వసింతు రనియు విని యవనులు భారతీయుల మౌఢ్యమునకు వగచిరి. వైద్యవిద్యను బోధించు నిట్టిగురుకులము నొకదానిని తాను గూడా నెలకొల్పుదు నని చెప్పి చక్రవర్తి అట గదలి సాహిత్యశాఖ నరయనేగెను.

అచట నేడేండ్లబాలురు గూడ వేదాధ్యయన మొనర్చుట గాంచి అచ్చెరువందు యవనులకు, వేదవేత్తలు ఘనపాఠులు నగునాపండితులు, చిన్న నాటనే ధారణశక్తి నిశితముగా నుండు నని చెప్పిరి. ధారణ కనువుగా నుండు నట్లు పదక్రమజటాఘనములు చెప్పుపద్ధతి వివరించిరి. పిమ్మట గురుశిష్యులు ఉదాత్తానుదాత్తాది స్వరములతో వేదపనసలు సెప్పగా విని, యవనులు ఛందస్సుల గంభీరత కచ్చెరువంది, శబ్దబ్రహ్మసాక్షాత్కారము ననుభవించిరి. పిమ్మట భారత రామాయణేతిహాసములగూర్చి అంభి ప్రస్తావనచేసి వానిగుణములను గొని యాడెను. సాహిత్యశాఖలోని శిష్యులను గురువులుంగూడ యవనచక్రవర్తిని తదనుచరులను శ్లోకరూపమున గీర్తించిరి. ఆకవనమునందలి కల్పనాకుశలతకు నలంకృతికి యవనపండితులు మెచ్చిరి గాని చక్రవర్తిని అన్యులనుగూడ ఒక్క విధమున అతిశయోక్తులతో ఉత్ప్రేక్షలతో బొగడుట ఉచితము గాదని తెలి పిరి. పిమ్మట వైయాకరణులతో బ్రసంగించి పాణినీయశాస్త్రవిస్తరతను తత్సూత్రనిబంధనలను గాంచి, "ఇన్నికట్టుబాట్లతో కూడినభాష మాట్లాడటం, ఎలాసాధ్యమౌతుంది?" అని చక్రవర్తి ప్రశ్నించెను. "చిత్తము మాకంటె గూడ వాచాలురుందురు కాబోలు" అని నవ్వుచు వ్యాకరణాచార్యుడు సమాధానము చెప్పెను.

పిమ్మట గణితశాస్త్రశాఖ కేగిరి. అచట గణకులు అమేయమగు కాల మును లిప్తలతోగూడ లెక్కింప గలుగుట యరసి యక్కజమందిరి. దేశము

నందలి జనసంఖ్యనే కాక గజాశ్వపశుసంఖ్యాగణనము గూడ చేయువాచార మచట గలదని తెలిసికొనిరి. పిమ్మట నచట క్షేత్రగణకులు వృత్తము, కేంద్రము, కోణము, బిందువు మున్నగువానిని పరిగణన మొనర్చుచుండుట యరసి ఐగుప్తుదేశపు గణకులకు వీరు తీసిపోరని సంతసించిరి. "పిరమిడ్లస్వరూపము మీకు తెలుగుదురా?" యని తులమావి యాగణకులను ప్రశ్నించి వారెఱుంగమిగాంచి వారికి దానిస్వరూపమును బోధించెను. అంతట వారిలో దాక్షిణాత్యు డగు గణకుడు, గణితశాస్త్రమునకు మాకావేరీతీరము పెట్టినది పేరు. అచటిదేవాలయాలకు ముఖభాగంలో, మీరు చెప్పిన పిరమిడ్లవంటి గోపురాలు నిర్మింపజేస్తాను" అని చెప్పెను. సెబాసు. మీ రలా చేయిస్తే భారతానికి ఐగుప్తానికి చెలిమి ఏర్పడి మాసార్వభౌముల ఆశయం ఫలిస్తుంది." అనెను తులమావి.

పిమ్మట జ్యోతిశ్శాస్త్రశాఖ నిలకింప నేగిరి. అచట గణకులు సౌరవత్సరమును 365 దినముల 5 గంటల 50 నిమిషముల 35 సెకండ్లుగా గణించుటగాంచి తులమావి "యీవత్సరమాన మెపుడు నిర్ణయించి" రని యడుగ, "చాల శతాబ్దులనాడే" యని వారు బదులుచెప్పిరి. తులమావి చాల హర్షించి, "భారతీయులు పట్టి మిథ్యావాదులని ఇన్నాళ్లు మేము అనుకొనే వాళ్లం. మీ రింత సత్యతత్పరులని ఎఱుగము" అనెను. అపు డాగణకుడు, "మీరన్నది నిజమే కొందఱు బాహ్యతత్త్వం విచారిస్తారు. మే మంతస్తత్త్వవిచారణ చేస్తూవుంటాము" అని బదులు పలికెను. తులమావి, "మీరు జ్యోతిశ్శాస్త్ర జ్ఞానమున మాపండితులవద్ద నేర్చుకోవలసిన విషయము లున్నవి" అని తెలుప, "ఆశాస్త్రగ్రంథ మొకసారి పంపండి, చూచి యిస్తాను" అని ఆగణకు డడుగ, తులమావి "అవశ్యం పంపుతాను" అనెను.

పిమ్మట చక్రవర్తి సపరివారముగ శిల్పశాఖ కేగి, యచట చతుర్ముఖ షణ్ముఖ సహస్రనేత్రాది మూర్తులంగాంచి అందలి పరమార్థము తెలియగోరెను. "అనంతము అమేయమూ అయిన ఈశ్వరశక్తిని మాఋషులు ధ్యానించి,

దానిని లీలలను చిద్విలాసాన్ని మననంచేసి ఒక్కొక్క లీలకు ఒక్కొక్క మూర్తినీ కల్పించారు. ఈశ్వరుని సంహారశక్తికి, సృజనాశక్తికి, జ్ఞానశక్తికి-ఇట్లే అనేకశక్తులకు రూపకల్పన చేశా''రని ఆశిల్పులు తెలియజెప్పిరి. చక్రవర్తియు భారతశిల్పుల శిల్పమునందలి గంభీరతకు విస్మయమంది, యవన శిల్పులు మలచినబుద్ధవిగ్రహ మొకదానిని జూపెట్టి అందలిసౌకుమార్యతను సారళ్యతను వివరించి, ''మీశిల్పంలో అట్టిప్రసన్నతలే'' దనెను. భారతశిల్పులావిగ్రహసౌకుమార్యత కచ్చెరువంది ''చిత్తము బుద్ధభగవానుని శాంతగంభీరత యిందు లేదు. మీప్రసన్నతను మాగంభీరతను మేళవింపజేస్తే క్రొత్తసంప్రదాయం బయలుదేరుతుంది'' అని బదులు పలికిరి. చక్రవర్తి ఆమాటలను హర్షించి తన బుద్ధవిగ్రహము నచటి గాంధారశిల్పి కొకనికి పారితోషికముగా నొసంగెను.

పిమ్మట వారెల్లరు సంగీతశాలకేగి అచట జంత్రములను బరీక్షించి భారతీయుల గానమాధుర్యమున కచ్చెరువంది ''మీగానమంతా సంప్రదాయ బద్ధమై ఎదుగుబొదుగులు లేకుండా వుంది. మాయవనసాంప్రదాయంలో వుండే మెఱుగులు కలిస్తే అద్భుతమైన నూతనసంప్రదాయం పుట్టుతుంది'' అనిరి.

అనంతరము వారెల్లరు తంతువాయులున్నశాలకేగి అచట ప్రత్తి కొనర్చు సంస్కారములను, ఏకులనుండి నూలుతీయు నైపుణ్యమును, వస్త్రముల సౌకుమార్యమును గాంచి చాల మెచ్చుకొనిరి. అంభి వారినెల్లరను వంగదేశపు వలిపములతో సత్కరించి చక్రవర్తికి కామరూపక్షౌమమును సమర్పించెను. చక్రవర్తియు మిగుల సంతసించి 'ఇన్నిశాస్త్రములు, కళలు ఒక్కచోట నేర్పే యీవిద్యాలయం తక్షశిలకు అలంకారంగా వుంది. సకలకళానిలయమైన యీ మహానగరాన్ని యుద్ధజ్వాలలకు ఆహుతి కాకుండా రక్షించడానికి కారణం ముఖ్యంగా మీవిద్యాపక్షపాతమే' అని అంభిని పొగడెను. అంభియు, ''ఈ విద్యలన్నీ ఈగురుకులంలో నేర్పేవికావు. ఏకత్ర తమరు చిత్తగించడానికి

ఇక్కడ ఏర్పాటుచేశాము. నేత, అద్దకం, దారుకర్మ, లోహకర్మ మొదలైన విద్యలన్నీ అయాకర్మకారసంఘములలోనే నేర్పుతారు" అని చక్రవర్తి కెరిగించెను.

పిమ్మట వస్త్రములకు, వర్ణలేపన మొనర్చుశాలలను అంభి వారికి జూపించి వారినెల్ల చిత్రాంబరములతో సత్కరించెను. పిమ్మట లోహకర్మశాలలో చక్రవర్తికి సునిశితమగు ఖడ్గమును కానుకపెట్టెను.

యవనపండితులలో భూగోళశాస్త్రజ్ఞుడగు అర్షలుడు, (Archelaos) తక్షశిలాపతిని, "ఇచట భూగోళశాస్త్రంలో కృషిచేయుట లేదా," అని ప్రశ్నించెను. అంభియం, "లేదు. మాపురాణములు భూగోళశాస్త్రాన్నిగురించి చెప్తూతున్నవి. మా కవే ప్రమాణములు" అనెను. అర్షలుడు "అట్లాకాదు. పురాణములజ్ఞానాన్ని ప్రత్యక్షంగా మీరు ప్రమాణీకరించుకోవాలి; అపుడుగాని యథార్థజ్ఞానం కలుగదు. భూగోళజ్ఞానం లేకపోతే వ్యవహారంలో అనేక చిక్కులు వస్తవి. విదేశాలతో బేహారం చేయాలన్నా, అన్యదేశాలపై మావలె దండయాత్ర వెళ్లాలన్నా భూస్వరూపం తెలుసుకోవాలి" అని చెప్పి తమయొద్ద నున్న భూగోళపటమును జూపెట్టి, అందు సముద్రములను నదులను పర్వతములను వేర్వేర వివరించెను. "ఈపటంలో మాఅనుభవాన్నిబట్టి ఎప్పటికప్పుడు సవరణలు చేస్తున్నాము. మా అరిస్టాటిలుపండితులు చెప్పినదానికి మాఅనుభవానికీ ఎన్నో తేడాలు కనిపిస్తున్నవి" అని వానినెల్ల విశదీకరించెను.

పిమ్మట వారెల్లరు పండితులు తత్త్వవిచారము చేయుచున్నచోటికేగి వారు చెప్పునదెల్ల ఆలించిరి. "పరతత్త్వవిచారంలో మీరు లోకగురువులు. ఇహతత్త్వవిచారంలో ఆచార్యపీఠం మాది" అని చక్రవర్తి పలికెను. తులమాంవి, "దేవర సెలవిచ్చింది యథార్థమే. ఇహపరాలు రెంటికి పరస్పరం విరోధంగా కన్పిస్తుంది. ఈవిరోధాన్ని మాపి సమన్వయం చేయాల్సిభారం తమది" అని విన్నవించెను.

# 12
## వి త స్తా తీ ర ము

తక్షశిలానగరమున నిట్లు వినోదములతో, వేడుకలతో కొన్నాళ్లు గడచెను. ఈలోపల యవనరాజనీతియందును యుద్ధనీతియందును అంభి శిక్షితు డగుచుండెను. అలీసాంద రొకనాడు పెండ్లిచావడికేగి, అచట జేరిన కన్యలను, వారిని బలువిధముల బరీక్షించుచు శృంగారచేష్టలొనర్చు పడుచు వాం డ్రను గాంచి "ఇవి యేమి?" యని అడిగెను. "ఇవి పెండ్లిముచ్చటలు. వధూవరణానికి పూర్వం జరిగే పరీక్ష ఇది." అని అంభి తెలిపెను. తులమావి, "నేను కూడా కొందరిని పరీక్షింతునా" యని నవ్వెను. "అభ్యంతరం లేదు గాని, పరీక్ష కాగినకన్యను పెండ్లిచేసుకోవలసి వుంటుంది. చేసుకోకపోతే కన్నె రికం క్రింద కొంతసొమ్ము దండుగ ఇచ్చుకోవాలి. ఇలాసంపాదించిన కన్నెరికపు సొమ్ముతో ఆపిల్లలు తరువాత భర్తను సంపాదించుకొంటారు. కొన్ని తెగలలో ఇచట ఈయాచారం వుంది." అని అంభి చెప్పినమీదట నందరు నవ్వుకొనిరి.

పదపడి కొన్నాళ్లకు బర్వతకునిచెంతకు రాయబారము గొనిచన్న కళాకరుడు (Cleochares) తిరిగివచ్చి, పర్వతకుడు అలీసాందరునకు గప్పము పెట్టుటకు నిరాకరించెననియు, యుద్ధమునకు సన్నద్ధు డగుచుండెననియు వార్త తెచ్చెను. "మంచిది. యవనప్రతాపం చవిచూపుతాము" అనుచు జక్రవర్తి యు యుద్ధసన్నాహము లారంభించెను. ఉదభాండపురముచెంత నదికడ్డము వైచిన పడవలనన్నిటిని వితస్తానదికి జేర్ప నానతియిచ్చెను. పర్వతకబలములతో జేరనరుగుచున్న అభిసారువి సైన్యములను మరల్చుటకు అశ్వికదళమంపి వానిని జెల్లాచెద రొనరింపజేసెను. ఆభిసారుడు చేయునది లేక, సోదరుడగు ప్రద్యు మ్నుని, అర్కకేశుడను సామంతుని గానుకలతో నాలీసాందరుని చెంత కంపి క్షమాభిక్ష వేడెను. చక్రవర్తియు, నభిసారుడు స్వయము పాదాక్రాంతుడు గాక దూతముఖమున క్షమ నర్థించుట మోసముకా వగచియు, దొలుదొల్త

బర్వతకసింహాముకు బంధింప గోరినవాడు గావున, నీ చిఱుకేపులులపని విమ్మటి బట్టవచ్చునని యెంచి, తనసైన్యములకు వితస్తానదివంకకు నడపెను.

యవనసైన్యముల నరికట్టుటకు వలకడచివచ్చిన స్వాతికేశ విజయవర్మ వైరోచక మలయకేతులు వెనువెంటనే విఱిగిపారిరి. భారతీయరణవిద్యయగు దాటితేరిన తక్షశిలావీరులతో సైనుచేలమంది బాసటయై త్రోవచూప యవన సైన్యములు వితస్తాపశ్చిమతీరమున కేగి విడిసెను. పర్వతకసేన లరిభయంకర ములగు గజయూథములతో నవ్వలియొడ్డున విడిసియుండెను. వెల్లిపాడిచి పారుచున్న వితస్తానదిని, నదికావల గుట్టలవలె నిల్చియున్న యేన్గుపిండ ములను గాంచి, చక్రవర్తి నదినిదాటుట పనిగాదని నిశ్చయించి, శత్రువు నేమరించి దాటవలెనని యెంచెను. నదిని తరింపగోరినవానివలె సైన్యములను ఎగువకు దిగువకు నడప నారంభించెను. యవనసైన్యము లెటునడచిన బర్వత కుడు తనబలముల నటు నడపుచు తుదకు విసివి శాత్రవనదీతరణయత్నము బిభీ షికగా నెంచి హెచ్చరిక మానియుండెను. పర్వతకుని యేమరుపాటు నాలీ సాందరు కనిపెట్టి ఒకనాటిరేయి కర్తరీశునిసైన్యములను, దక్షశిలాసేనలను నదీతీరమున గుగల్లువేసికొని రణధ్వానము లొనర్చుచుండుడని నియమించి, హెఫిస్థాన పృథుకేశ, శైలకాశ (Seleukos), ద్యుమిత్ర (Demetrios) తులమాప్రులతో సేనలు దాను దిగువకేగి యచట నదిని దాటుచుండెను. నెగడి మంటలను రణఘోషయు నచట నదీతరణయత్నము కాబోలునని పర్వతకు డెంచి సన్నద్ధుడగుచుండ దిగువకేగిన చక్రవర్తి ససైన్యముగ వితస్తను దాటెను. అవ్వలియొడ్డున దట్టముగా నున్న యడవిమాటుగా యవనసేనలు పర్వతకు నాక్రమింప వచ్చుచున్న సన్న తెలవారినపిమ్మటగాని పర్వతకున కెఱుగ రాదాయె. కార్యము మించి వచ్చుట బర్వతకు డెఱింగి రెండువేలయాశ్వికులతో నూటయిరువదిరథములతో గుమారుడగు నర్జునుని యవనసేనల నరికట్ట బంపెను. అర్జునబలము ప్రబలమగు యవనధాటి కాగలేదయ్యెను. అర్జునుడు చక్రవర్తిని

ప్రాణములతో బట్టెంచి వృషపాలమును వాడియమ్మున గాయపరచెను గాని ఇంతలో యవనవీరఖడ్గహతికి దానే యెరయయ్యెను. అర్జునునిపాటు గాంచి శత్రుసేనలు, వెఱచఱచి పఱచెను. నన్నూరుగురు హతులైరి.

పుత్రమరణవార్త విన్న పర్వతకుడు నేయివోసిన అగ్నిభట్టారకుడవలె బగ్గనమండి, నాల్గువేలయాశ్వికులతో నిన్నూరుగజములతో, మున్నూరురథములతో, ముప్పదివేలకాల్బలముతో, నడుచు గజబలమును, పార్శ్వముల రక్షకులు నాశ్వికులు నిలుచునట్లు వ్యూహము పన్ని యవనబలముపై నడచెను. స్వాతికేశ వైరోచక మలయకేతు విజయవర్మలు దండనాథులై పర్వతకునివెంట బలసి నడచిరి.

తక్షశిలలో నున్నపుడు చక్రవర్తి తనయశ్వదళమును గజబలముపై నడపి పరీక్షించి చూచినవాడు గావున, శాత్రవవ్యూహమధ్యమందున్న గజములపై బొడిచి నడచుట నీతి కాదని నిశ్చయించి బహుళసంఖ్యాకమగు తన గుఱ్ఱపుదళముతో వైరిపార్శ్వమునయున్న ఆశ్వికదళమును బాణపాతపూర్వకముగా వెనుకముందుల ముట్టడించెను. పర్వతకాశ్వికు లాఘాతక తాళలేక విఱిగి గజబృందముల మఱుగుజొచ్చిరి. యవను లంతట గజయూథమును బాణములతో నొప్పింప జొచ్చుడు నయ్యేనుంగులు నలిరేగి ఘీంకృతులు సల్పుచు అరిబృందముపై బడెను. యవనులును మీదికివచ్చుకరులకు వెఱపియిచ్చి ముందునకు నడచుచుండ పర్వతకతురగదళము ఎదురై సాహసములు గుప్పించెను. యవనులును వెనుదీయక పైపైకరిగి తీక్ష్ణబాణపాతముల నొప్పింప వారు మరల గజయూథము వెనుక కొదిగిరి. యవనులు మరల నేనుంగులపై నాళికాస్త్రములు ప్రయోగింప, నవి వెనుకకు ముందునకు బఱచి యిరువాగును గాళ్ల మట్టగించుచు బీభత్సము సల్పి చెల్లాచెదరౌనర్చుచుండెను. ఆ య్యెడ నెఱింగి కర్తరీశుడు నంభియు నెగువనుండి నదిదాటి వచ్చి తమసేనలతో బర్వతకసేనలను వెనుకనుండి పొదివిరి. ఆసంకులసమరమున బర్వతకపుత్రు లిర్వురు మర

ణించిరి. స్ఫుతికేశుడు బలి యయ్యెను. వైరోచకవిజయవర్మమలయకేతులు పలాయితులైరి. మడియగా మిగిలినసేనలు వెన్నుచూపెను. సాలప్రాంశుడు దీర్ఘబాహుడు నగుపర్వతేశుడు వీరవిహారమొనర్చుచు బోరి డస్సియు, పరాజితములై కాందిశీకములగు తనసేనల దురవస్థయరసి, నిట్టూర్చియు బోరుచాలింపక, ఖడ్గమాత్రసహాయుడై తుదివరకు బోరి, నలుగెసల తనవంక బయలగుటగాంచి భద్రగజమును మాఱుమోము పట్టించి పలాయమాను డయ్యెను. అలీసాంద రయ్యతిరథశ్రేష్ఠుని అనన్యపరాక్రమమున కచ్చెరువంది, అభయ మొసగి కొనిరమ్మని అంభి నంపెను. వెనుకనుండి యంభి ఎంత యఱచినను. బర్వతకుడు చెవి నిడడయ్యె. అంభియు నశ్వముం దఱిమి దరియనేగి యవన చక్రవర్తిసందేశమును వినిపింప బర్వతకుడు చేతనున్నభల్లము నాతనిపై విసరి ముందునకు సాగిపోయెను. చక్రవర్తి ఒకరివెనుకనొకరి నెందఱుదూతల నంపినను ఫలములేదయ్యె. తుదకు బర్వతకున కించుక ఆప్తుడగు మైరేశు (Meroes) నంపెను. మైరేశుడు చేరనరుగునప్పటికి బర్వతకుడు డప్పిగొని నిలిచెను. మైరేశు డాతనికి నీరదెచ్చి చక్రవర్తిపనుపు నెఱింగించెను. పర్వతకుడును అట్లే కానిమ్మని వెనుదిరిగెను.

అలీసాందరు సపరివారముగ నెదురుగ నేగి సబహుమానముగ వెంటగొనివచ్చి ఆసీనుని జేసి, ఆతనిధీరత నుగ్గడించి పలికి, "మీయభీష్టమొన ర్తును సెలవిం" డనెను. "చక్రవర్తి మమ్ము రాజోచితంబు జూచుటకన్న ఇత రాభీష్టములే"దనెను. బర్వతకుడు. "అది మీయకోరకుండానే మేము నెరవపవలసినధర్మం. కనుక తమరు ఇతరమైన కోర్కె కోరడం మాకు సంతోషం" అని చక్రవర్తి పట్టువరకు, "మాకోర్కెలన్నియు మొదటికోర్కెలోనే వున్న"వని పర్వతకుడు బదులుపలికెను. చక్రవర్తి యాతనిగాంభీర్యమునకు మిగులహర్షించి "మీయావద్రాజ్యం మీరు తిరిగి ఏలుకోండి. అంతే కాదు. మేము జయించిన వానిలో ఇంకా కొన్నిభాగాలు మీకు సమర్పించడం మాఅభీష్టం" అని పలికి పర్వతకుని గాటముగా గౌగిలించుకొని వీడుకొల్పెను. ఆయుద్ధరంగమున

నికాయమను నగరము నిర్మించుటకును, వృషపాలము దెబ్బతినినచోట దాని పేర నొకపట్టణము గట్టుటకును కర్తరీశునకు ముదల యొసగి, పిమ్మట నచ్చోట విజయోత్సవములతో దేవబలులతో గొన్నాళ్లు గడపి, అనంతరమున కాల చుర్యులపై నెత్తిపోయి వారిని పరాజితుల నొనర్చి వారిరాజ్యమును బర్వతక రాజ్యమున జేర్చెను.

పదపడి అంభికి బర్వతకునకు జెలిమి గావించి అంభిని "దక్షశిల కేగి మాకు సామంతుడవుగా రాజ్యమేలుకొ"మ్మని పనిచెను. సంధిగోరివచ్చిన పర్వతకకనిష్ఠుని నిజరాజ్యమున నిలిపి, ఉద్దాముడను (Eudemos) దండనాథు నాతనికి సచివునిగా నొసగి పంపెను. అర్మకేశ ప్రద్యుమ్నులతో నభిసారుడు నలువదియేనుగుల మరల గానుకయంప, "ఈదాగుడుమూతలు మాచెంత జెల్లవు. మీరాజు స్వయంగా వచ్చి దర్శించవలసి వుంటుంది. వారికి భారమైతే ససైన్యంగా మేమే వచ్చి వారిని దర్శిస్తాము" అని బదులంపెను.

ఇంతలో అశ్వకులు రాజద్రోహ మొనర్చుచుండి రని శశిగుప్తుడు వార్తపంపెను. చక్రవర్తి మండిపడి, "ఈబుద్ధిహీనులు ఊరకుండరు. మా కోపాగ్ని రగిల్చినవాళ్లకు కాలంచెల్లింది. సర్వనాశనం చేసిరం"డని సైన్యముల నంపెను. పిమ్మట నశిక్నీ (Chenab) నదమును దాటి అవ్వలియొడ్డున నున్న మహారణ్యముం బ్రవేశించెను. అచట నపరూపము లగు వనస్పతుల నెన్నిటినో గాంచి "ఓడలు నిర్మించుట కీదారువులు పనికివచ్చు"నని అనుచరుల కెఱిగించెను. అయ్యడవిలో స్వర్ణకాంతములై పడగలు విప్పి యాడు సర్పములంగాంచి అచ్చెరువందెను. ఆసర్పములచే దష్టులైన ఇరువురు యవనుల కచటి భారతీయ వైద్యుడు చికిత్స యొనర్చి వారిని బ్రదికించెను. చక్రవర్తి సర్పవిషహారమగు నయ్యోషధీరహస్య మెఱుంగగోరి ఆవైద్యు నెంత ప్రార్థించినను నాత డా రహస్య మెఱిగింపడయ్యె. ఆయడవిలో మింటికి గొమ్మలు సాచి, వెదురుగంబముల వంటి యూడలతోనున్న మఱ్ఱిచెట్టుం గాంచి చక్రవర్తి ఆశ్చర్యమంది, "ఇది

యేమిచె"ట్టని యడిగి, అచటివారు "ఇది వటవృక్షం. ఈదేవతావృక్షం మా దేశంలోతప్ప ఇతరదేశాలలో పెరగదు" అని చెప్ప, విని నవ్వుకొనెను. అచ టనే ఖడ్గమృగము నొకదానిని గాంచి దానిపై బాణప్రయోగ మొనర్చెను గాని అది ఆయిూటెపోటులు సరకుచేయక తొలగి యేగెను. అచటివారు ఆ మృగముపేరు గండకమనియు, దానిచర్మమున నీటెలు నాటవనియు, కంటిలో గొట్టిన జచ్చుననియు తెలిపిరి. "ఆమాట ముందుగా తెలిసియుంటే కంటికే గురిపెట్టుదుమే. తీరా దాటిపోయింది. మాఅమ్మగారికి దానిచర్మాన్ని కొన్నుకు చూపుదా మనుకొన్నాము" అని చక్రవర్తి విచారించెను.

ఇంతలో పర్వతకకనిష్ఠుడు తిరుగుబాటుచేసెనని వార్తవచ్చెను. చక్రవర్తి మండిపడి, కనిష్ఠపర్వతకుని మట్టుపెట్టుటకు బయలుదేరెను. అంతలో సంగలా పురిపాలకు లగుకాఠేయులు తన్నెదిరింప సిద్ధపడుచుండి రనువార్త వచ్చెను. కాఠేయులు, మున్ను అభిసారపర్వతకుల నిరువురుని పరాజితుల నొనర్చిన వీరు లని చక్రవర్తి విని, పర్వతకుని గజసైన్యములతో బాసట గమ్మని పంపి, కనిష్ఠ పర్వతకుని బరిమార్ప హెఫిస్థానుకు ఆజ్ఞయిచ్చి, తాను కాఠేయులపై నెత్తి సంగలాపురమున కరిగెను.

---

# 13

## సంగాలసాభూతులు

త్రోవలో సింప్రామపురమును జయించి యవనులు, కాఠేయరాజధాని యగు సంగాలపురమును జేరుసరికి కోటవెలుపల నున్నగుట్టపై కాఠేయసైన్య ములు యుద్ధమునకు బన్ని నిల్చియుండెను. ముందు మూడువరుసలు రథము లును వానివెనుక గాల్బలము నుండుట జక్రవర్తి గాంచి యవనరథికులచే శర వర్షము గురియించెను. అంతటనైన కాఠేయులు రథముల ముందరికి రాక మొదటియరదపు వరుసపైనిలిచి బాణములు గుప్పసాగిరి. చక్రవర్తి యంతట

దనగధికులను అశ్వికులను వెనుకకంపి పాదాతిబలముతో శత్రువుల నాక్రమింప దొడగెను. కాథేయచాపములనుండి పొదలుగట్టివచ్చు శరపాతములకు యవనులు గుదులుగుదులుగా మడియుచున్నను చలము డింపక పోరి పోరి యెట్టకేలకు ప్రథమరథశ్రేణినుండి ద్వితీయరథశ్రేణికిని, అటనుండి మూడవవరుసకును కాథేయులను దఱిమి యవను లింకను ఆక్రమించి వచ్చుచుండిరి. కాథేయులంతట వెలిపోరు చాలించి దుర్గముజొచ్చిరి.

బలిష్ఠమగు సంగాలదుర్గమునకు మూడు దెసల దుర్భేద్యమగు ప్రాకారమును ఒకవంక లోతైన కాసారము నుండెను. ఆకాసారము వెంట కాథేయులు పలాయమానులగుదు రన్నసన్న చక్రవర్తి గ్రహించి మూడువేల సైనికులతో యామునేశు నచట రేయెల్ల గాపుపెట్టెను. నాటిరేయి నాలవజామున కాథేయులు చెఱువుదారిని పలాయమాను లగుచుండ యామునేశుడు వారిలో ఏనూరుగుర సంహరించెను. మిగిలినవారు మరల దుర్గము ప్రవేశించిరి.

మఱునాటికి బర్వతకుని గజదళము వచ్చిచేరుడు యవనులు కోటగోడలు ఉక్కుగుండ్లతో గూల్చి దుర్గముంజొచ్చి పదునేడువేలమందిని సంహరించి డెబ్బదివేవురను పట్టి బంధించిరి. మున్నూ రరదములను ఏనూరింటికి గుఱ్ఱములను గూడ కైవస మొనర్చుకొనిరి.

సంగాలపురము పడినవార్త తక్కిన కాథేయదుర్గములలో బిడుగుపాటై బడెను. యవనుల నెదిర్చి జయింపజాలమని నిశ్చయించి కాథేయు లాకోటలు విడిచి పలాయితులైరి. సంగాలదుర్గమును నేలమట్టమొనర్చి యవనజలములు వ్యాస (Beas) నదమువంకకు నడవజొచ్చెను. యవనధాటికి నిలువలేక పాఱిన కాథేయులు యవనులకన్న మున్న దేశము నల్లడల వ్యాపించి యవనపరాక్రమము దుర్జేయమనియు, వారు దేవతలో, రాక్షసులో యగుదురుగాని వేఱొండుగాదనియు జెప్పసాగిరి. యవనచక్రవర్తి ప్రతాపమును వేనోళ్ల వర్ణింపసాగిరి.

సౌభూతినగరపాలకుడు యవనధాటీనిష్ఠురత నాలించి మంత్రులతో, దండనాథులతో మంతనముండి యవనప్రతాపాగ్నికి దనప్రజల నింధనమొనర్చుట మేలుగాదని నిశ్చయించెను. "మనకు కావలసినన్ని బంగారుకణికలున్నవి. అలీసాందరుకు వలసినన్ని ఉక్కుగుండ్లున్నవి. మనపైడికణికలన్ని పారబోసి వారిఉక్కుగుండ్లనుండి తప్పించుకోవడమే మంచిది" అని సౌభూతిపురపాలకుడు నిశ్చయించి, మంత్రిసామంతగణపరివేష్టితుడై వెలలేని కానుకలతో అలీసాందరు కెదురువోయి పట్టణములోనికి దోడితెచ్చెను.

సౌభూతిపురైశ్వర్యమును తత్పాలకునిసౌజన్యమును బర్వతేశ్వరునివలన జక్రవర్తి యంతకుమున్న వినియున్నవాడు గావున ఆపురమున గొన్నాళ్లు విడిసియుండెను. ఇరువదినాలుగడుగుల ఎత్తున సుదృఢములై నిలిచియున్న కోటగోడలను, రెండేసియేనుగులు పక్కసారిగా జొరనగువైన సుర్గద్వారమును, సుదృఢకోమలగాత్రులగు పౌరులను గాంచి యవనదండనాథులు, "ఈ రాజు నీతిపరుడై సంధిమార్గం పట్టెనుగాని, కాకుంటే ఈదుర్గం భేదించడం ఎంతైనా కష్టమయ్యేది" అని చెప్పుకొని సంతసించిరి. ఆరాజ్యమందున్న లవణపర్వతములలో ప్రపంచమంతటికి లక్షలకొలది ఏండ్లవఱకు సరిపోవు లవణమున్నదని విని యవను లాశ్చర్యమగ్నులైరి. ఆదేశమున వికలాంగులను,వికృతాకారులను శైశవముననే విషమిడి చంపుదురనియు, అచటికాంతల సౌందర్యము సాటిలేనిదనియు, సింగములతో మారుమలసి నిర్జింపగల ఉత్తమజాతి శునకములా దేనిచెంత గలవనియు బర్వతకునివలన వినియున్నవాడు గావున జక్రవర్తి ఆకుక్కలను జూడ వేడుకపడెను.

సౌభూతినగరపాలకుడు చక్రవర్తిని తత్సామంతగణమును సుఖాసీనుల జేసి నవరత్నములుతాపిన బంగారపురాజదండమును చక్రవర్తికి సమర్పించి, తనశునకపాలకుని రావించి చక్రవర్తికి కుక్కలను జూపెట్టుమని అనతియిచ్చెను. అంతట నాశునకపాలుడు, బోనులోనున్న ఒకసింగమును వెలుపలికి

విడిచి, స్వర్ణశృంఖలాలంకృతమైన శునకచతుష్టయమును దానిపై కెసకొల్పెను. గొలుసులనుండి తప్పించుటయే తడవుగా నాభషకములు సింగముపై బోయి పడెను. కాలొకటి, జూలొకటిగా పట్టుకొని పీకుచున్న శునకములను నారసములవంటి గోళ్లతో గొట్టియు, పండ్లతో గఱచియు సింగము ఎంతయత్నించియు వానిపట్టు విడిపించుకొనలేక అలమటజెంది చీకాకుపడుచుండెను. సింగము నాక్రమించి యున్న కుక్కలలో నొకదానిని తత్పాలకుడు కాలు పట్టుకొని లాగెనుగాని అది తనపట్టు విడువలేదు. అంతట వాడాపాదమును కత్తితో ఖండించెను. అప్పటికి నాకుక్క విడువలేదు. శునకపాలు డపుడు దానిని ఖడ్గముతో మేనంతట బొడిచి గాయము లొనర్చెను. ఒడలెల్ల గాయములైన రక్తధార లోడుచున్నను కుక్క తనపట్టు విడువదయ్యె. చక్రవర్తి ఆరాకాసిపట్టుగాంచి ఆశ్చర్యమగ్నమానసుడై, కండలు తెగిపడుచున్న కుక్కను గాంచి జాలిచెంది 'ఇక నంతట జాలింపు" డని వారించెను. సౌభూతిపాలకుడు నవ్వి "అది పోయినచో అట్టివింకా చాలా వున్నవి. తమరు వేడుకచూడు" డనెను. తుద కాకుక్క పాలకఖడ్గప్రహారములచే ఒడలెల్ల ఇంతింతతునియలైనను దనపట్టువిడువక, ఆపట్టుతోనే సింగము మేనిపై నొరగి అసువులు దొరగెను. చక్రవర్తియు దత్సామంతులు ముక్కుపై వ్రేలువైచికొని నిట్టూర్పువిడిచిరి. "ఇంత ప్రతాపం, ఇంతవిశ్వాసం గలజంతువుకు ఫలమిదా, చివరకు?" అని యొకరన, "రాజసేవ కిదే ఫలం ఎప్పటికైనా" అని మఱియొకరుగా నిట్లు గుసగుసలు వోయిరి.

సౌభూతిపాలకుడు చక్రవర్తికి రత్నఖచితమగు పైడికవచమును, సింగంపుగండలైన కుక్కలాఱింటిని కానుకయొసగెను. అలకసుందరుడు హృష్టస్వాంతుడై సౌభూతినగరమును విడిచి ముందునకు సాగిపోయెను.

హెఫిస్థాను పిజీకశాత్రవుడై చేరవచ్చినంత జక్రవర్తి భాగేలాపురముపై నెత్తిచని, సౌభూతివలె శరణుచొచ్చిన తత్పురపాలకుని ననుగ్రహించి అటనుండి కదలి వ్యాసనదమునొద్దకు జేరెను. అరమైలు వెడల్పున ఆఱునిలువుల

లోతున దరులొరసి శరవేగమున బాఱుచున్న అయ్యేటియొడ్డున యవనసైన్యములు విడిచెను. అవ్వలియొడ్డు చేరినచో నంతయు ఎడారినేల యనియు దానిని దాటిపోవుటకు బంద్రెండుదినములు పట్టు ననియు చక్రవర్తి వినెను. అవల నేదేశమున్నదని యడుగ, నామరుభూమికి బూర్వదిశను గంగాయమునా నదులున్నవనియు వానికవ్వల ప్రాచ్యదేశమనియు, బలపరాక్రమసంపన్నమగు మగధరాజ్య మట గలదనియు దెలిపిరి. యమునాతీరమున ఇంద్రప్రస్థమందు ఇర్వదివేలగుఱ్ఱములతో. రెండువేలరథములతో, నాల్గువేలయేనుంగులతో రెండు లక్షలకాల్బలముతో మగధసేనలు పొలిమేరలు గాచుచున్నవనియు, మాగధ మాతంగ బృంహితములగు దిశలు మారుమ్రోగుచున్నవనియు జక్రవర్తి వినియెను. పర్వతకుని జేర బిలిచి చక్రవర్తి మగధరాజ్యబలసంపత్తినిగూర్చి ప్రశ్నింప నాతడును, మాగధాక్షౌహిణులను గూర్చియు, తద్రాజ్యవిస్తృతిని గూర్చియు దనయెఱిగినంతయు దెలిపి, "మగధరాజ్యం ఎంత బలసంపన్నమైనా తమధాటికి నిలవలేదని విన్నవిస్తున్నాను. ఎందువల్లనంటే ప్రభువైన ఔగ్రసేని; వ్యర్థుడు. సైన్యములకు ఆతనియెడ అనురక్తి లేదని తెలుస్తుంది. ఔగ్రసేనితండ్రి క్షురకుడనీ, రాణితో గలిసి నందమహారాజును చంపి, గద్దె ఎక్కినాడనీ, తరువాత ఆ నందరాజ్ఞినే వివాహంచేసుకొన్నాడనీ, తెలుస్తుంది. క్షురకునికొడుకనే కారణంచేత ప్రజలకు గూడా రాజుపట్ల అనురాగం లేదు." అని తెలిపెను.

చక్రవర్తి.—మఱి గంగాయమునలమాట యేమంటారు? వీనిని దాటడం శక్యం కాదంటారే.

పర్వ.—నిజమే. హిమవత్పుత్రిక గంగ ఈదేశపు నదులలోకెల్లా పెద్దది. అయినా విశ్వవిజయంకొఱకు పుట్టిన కారణజన్ములు తమరు. తమధాటిని ఈ నదులు అడ్డలేవు.

యామునేశుడు.—పర్వతకులవారు నిజం సెలవిచ్చారు. దేవేంద్రపుత్రులకు ఈ నదు లడ్డమూ కావు; మాగధుడు పర్వతకులవారికంటె ఘనుడూ కాడు.

# 14

# తిరోగమనము

హెఫీస్థాన యూమునేశతులమాత్ర లవనతవదనులై చక్రవర్తి పటకుటీరమున నిలిచియుండిరి. చక్రవర్తి విచారమగ్నుడై యటునిటు తిరుగువాడు. తటాలున దండనాథాభిముఖుడై నిలిచి, "ఎవరుపోసిన పిరికిమందిది మాసేనలకు? ఇంత అస్థైర్యానికి ఏదో కారణం వుండివుండాలి" అనెను.

హెఫీస్థాను.—చిత్తం. యమునాతీరంలో మగధసైన్యాలు ఎదుర్కోవడానికి సిద్ధంగా వున్నవని విన్నదే మొదలు; దానికితోడు పర్వతేశ్వరుడు కూడా నిజమేనని చెప్పడం ఈ అస్థైర్యానికి మరింత కారణమయింది. 'ఎక్కడి స్వదేశం! ఎన్నడు బయలుదేరాము! ఎక్కడికి వచ్చాము! ఈపర్వతాలు, ఈనదులు, అంతులేని ఈదేశం, నెత్తిమాడే యెండలు. ఇక్కడ ఎన్నాళ్లు బ్రతుకుతాము, ఈఅర్ధాన్నంతో శత్రుమధ్యంలో? నిన్న గెలిచినవాళ్లు మళ్లా ఇవాళ్ల తిరుగబడుతూవుంటే ఈ మొండివాళ్ల నెట్లా మట్టుపెట్టుతాము? ఈఅశ్వకులు, ఈమద్రకులు, ఈ కాథేయులూ—వీళ్లు రాక్షసులు గాని సామాన్యులు గారు. వీళ్లే అనుకొంటే వీళ్లనుమించిన మాగధులు కత్తులు దూసి సిద్ధంగా వుండిరాయె. వెనుక వీళ్లూ, ముందు వాళ్లూ. అడకత్తెరలో వక్కసామెత వచ్చింది మనకు. అడుగడుగునా అడ్డమయ్యే ఈనదులు చాలక ఇంకా గంగాయమునలు దాటాలట. యమున దాటడమే వట్టిది. దాటితే మాగధులచేతులలో పడకుండా బ్రదకడం అంతకంటె వట్టిది. భారతభూమిలో ధనరాసులు తేరగా వున్నవి, ఎత్తుకుపోదామని వస్తే, ధనరాసులమాట వట్టిదయిందిగాని, మలరక్తంతో ఎముకలతో వీళ్లభూములకు ఎరువుగట్టడం మాత్రం నిజమవుతుంది. యమునదాకా వెళ్లి, శత్రువులకట్టెదుట వెనక్కితిరిగి రావడంకంటె ఈవిపాశను దాటకుండా వుండటమే.

మంచిది' అని ఈవిధంగా సైనికులు ఒకరినొకరు హెచ్చరించు కొంటున్నారు.

చక్రవర్తి.—అయితే వ్యాధి ముదురబారుతున్నట్లే కనిపిస్తూ వుంది. వెంటనే చికిత్స చేయకపోతే విషమిస్తుంది.

అనిదండనాథులను చమూపతులను దళవాయులను బిలిపించి శాంతగంభీరస్వరమున వారి నిట్లు హెచ్చరించెను. "సేనలకు కాలు ముందుకు సాగడం లేదనీ, నిరుత్సాహం కలుగుతున్నదనీ వింటున్నాము. అపజయం, వెనుబాటూ ఎట్టివో ఎరగక, మాతో కూడా అగ్నిలో దూకడానికైనా తెంపుచేసే మా సేనలకు ఈనిరుత్సాహం కలిగిందంటే మేము నమ్మలేకుండా వున్నాము. మనము అడుగుపెట్టినచోటెల్లా మనకు పాదాక్రాంతమై వశమయింది. అయోనియా, హెలెస్పాంటు, ఫ్రిజియా, కపడోసియా, లిడియా, కేరియా, లికియా, ఫోనిసియా, ఈజిప్టు, లిబియా, అరేబియా, సిరియా, మెసపుటేమియా, బాబిలోనియా, అస్సీరియా, పర్షియా, బాక్ట్రియా—అవి యివి యేమిటి! సమస్తదేశాలూ మనఘాటికి తలలు వంచినవి. శతద్రుసింధులు, అశిక్నీరావులు మనకు తెరువిచ్చి మనపతాకములకు జోహార్లు చేసినవి. ఈవిపాశా, గంగా యమునలూ మనకు స్వాగతం చెప్పుతున్నవి. మాగధసేనలు సమరానికి ఆహ్వానిస్తున్నవి మాసేనలు వెనుకకు మరలునా? ఇంతదూరం వచ్చి, ఇన్ని దేశాలు సాధించి, విజయచిహ్నితములైన మాపతాకాలు ఎందుకు వెనుక కదుగు వేయాలి?

"పౌరుషోత్సాహకీర్తులకు పేరుబడిన మాసిడోనియనులు పూనిన కార్యం తుదముట్టకుండా, అధీరులై, వెనుక కదుగు వేస్తారా? గంగాయమునా నదులు దాటి, మన దిగ్విజయానికి తూర్పుసముద్రాన్ని హద్దుచేయకుండా మరలడంకంటె నగుబాటు వేరే వుండదు. నగుబాటేకాదు; ఇదివఱలో మనకు తలలువంచి మనశాసనం శిరసావహించినదేశాలే, మన మిప్పుడు వెనకకు మర

లితిమని వింటే మనలను ధిక్కరిస్తవి. దినదినమూ, తెల్లవారేసరికల్లా మనం ఆదేశం జయించామనీ, ఈదేశం జయించామనీ మనవిజయవార్తలు విని ఉప్పొంగుతూ, స్వదేశంలో మనవాళ్లంతా, మన మెప్పుడో విశ్వవిజయుల మై తిరిగి వస్తామని ఉత్కంఠతో ఎదురుచూస్తుంటే, భగ్నోద్యమావనతాలైన ముఖాలు వాళ్లకెట్లా చూపించగలం? తాము వీరమాతలమని సగర్వంగా చెప్పుకొనే మాసిడోనియాయిల్లాండ్రు, దిగంతాలలో విజయధ్వజం నాటకుండా తిరిగి వచ్చిన యీకుమాళ్లను చూచి భగ్నాశలై ఎంత నొచ్చుకొంటారో !

"మీకు సుఖమే కావలిస్తే యిండ్లవద్దనే లభించేది కదా ! సాహస చర్యలు, వీరవ్రతులు అపేక్షించే సుఖాన్ని కోరిన నాసోదరులు సయోధులు, ఉదరపోషణమాత్రమైన సుఖం కోరి స్వదేశంపై బెంగపెట్టుకొంటే మాసిడోనియా వీరచరిత్రకు నేటితో సమాప్తి చెప్పవలసివస్తుంది. హరకులేశుడు, ధ్యానేశుడు మొదలైన మనపెద్దలు శరీరసౌఖ్యం తుచ్ఛమని రోసి పౌరుషప్రతాప కీర్తులు కోరి పురాణపురుషులూ, దివ్యులూ అనిపించుకొన్నారుగాని సుఖంమరగి ఇళ్లలో కూర్చుండలేదు. అట్టివాకికూడా సాధ్యంగాని దేశాలు సాధించి, వారెరుగనిదిక్కులకు పతాకాలు విజయగీతాలతో కొనిపోతూ, మధ్యమార్గంలో అథైర్యోపహతులం, విషాదగ్రస్తులమూ అయి వారిపావనచరిత్రలకు కళంకం తెస్తారా, మాసిడోనియను వీరులు ! అన్నలారా ! వలదు. పురుషార్థాలు ముందుకు పిలుస్తున్నవి. నడవండి, వాటిని చేపట్టండి.

"సాహసికకథావీథులలో ముందు మేము నడచి మిమ్మును పిలుస్తున్నాము గాని మీచాటున దాగి మీకీర్తిని సత్కరించి పంచుకోవడం లేదు. మనం జయించిన ఈవిశ్వసామ్రాజ్యవైభవం మీకు పంచి, మీసౌఖ్యానుభవంలో పాలు పంచుకొంటున్నాముగాని మీకుగాకుండా మేము మిగుల్చుకొన్నదిలేదు. అన్నలారా! ఈప్రాచ్యఖండమంతా మీది. వీరభోగ్యమైన ఈజగత్తును ఆర్జించుకుని అనుభవించండి. సానురాగంగా మీవంకకు చేయి చాస్తున్న యీ సామ్రాజ్యలక్ష్మిని అనాదరించి పోకండి."

చక్రవర్తి యిట్లు పలికి ఒక్కక్షణకాలము మిన్నకుండెను. సేనలును దండనాథులును విజమాకేడినట్లు వినుటయేగాని ఉత్సాహావేశభరితమై ఇంచుకయు జయధ్వానము చేయదయ్యెను. చక్రవర్తి తనసేనల ఔదాసీన్యమును, అనుత్సుకతను బరికించి, దీర్ఘముగా నిశ్వసించి, విచారమందస్వరమున మరల నిట్లు పలికెను. "మావల్ల ఏదో లోపం జరిగివుండాలి. మాకు ప్రాణపదమైన సయోద్ధలూ, మానమ్మినరథికులూ, మావల్ల ఏదో అపరాధం జరగడంవల్లనే ఇంత నిష్ఠురమైన మౌనం వహించారు. సమరశంఖారావముతో, మీ చేత జయజయ ధ్వానములూ, సింహనాదములూ చేయించే మాపలుకులు నేడు చెవిటికి పట్టిన శంఖమై, అరణ్యరోదనమై పోవడానికి కారణ మేమిటో వినగోరుతున్నాము. మేమింతసేపు హెచ్చరించింది శిలావిగ్రహాలనా, మాసిడను వీరులనా?" ఆ మాటలకు దండనాథులు తలలు వంచి మిన్నకుంట గాంచి, "మొగమెత్తి మా వంక జూచుటకుగూడా అంగీకరింపని యీవింతజనులంతా ఎవరు! ఇంతమంది మధ్యనిలిచికూడా ఏకాంతనైశ్శబ్ద్యంలో నిలిచిన మేమెవరము! మీమనసులో మాట వినడానికైనా నోచుకోకపోవడానికి మేము చేసినద్రోహ మేమిటి? ధీరులనిపించుకొమ్మని కోరితిమేగాని మిమ్ము అకార్యకరణానికి ప్రోత్సహించుట లేదే! మీతలంపేమో మాతో చెప్పగూడదా? ఈమూగతనంకంటె గూడా దుస్సహమైన ద్రోహచింత మీమనస్సులలో దాగివున్నదా యేమి?"

ఇట్లు పలికిన చక్రవర్తి హృదయవేదన భరించలేక కోనేశుడు (Koinos) విన్నవింప దొడగెను. "దేవర సైనికహృదయం తెలుసుకోవాలని ఇంతగా కోరుతున్నప్పుడు దాచడం భావ్యంకాదు గనుక తమ చనవును నమ్మి మామనస్సులలో మాటచెప్పడానికి సాహసిస్తున్నాను. తుచ్ఛప్రాణాలు దాచుకోవడానికి నే మాటలు చెప్పడంలేదనడానికి ఏలినవారిసేవలో వ్రణకిణాంకమైన ఈదేహమే సాక్షి. ప్రభుశ్రేయంకంటె ఇతరచింతలు మామనస్సులలో లేవు. తమ విజయపరంపరలను తలచుకొన్నా స్వదేశంనుండి బయలుదేరింది మొదలు ఇప్పటివరకు మనం సంపాదించిన వివిధదేశాలవిస్తీర్ణత తలచుకొన్నా

ఆశ్చర్యమూ, భయంకూడా కలుగుతున్నవి. మనసాహసాలకూ, విజయాలకూ కూడా ఒకహద్దంటూ వుండాలని మనవిచేస్తున్నాము. స్వదేశంనుంచి మనం ఎన్ని అక్షౌహిణులతో బయలుదేరామో, ఇప్పుడెంతమంది మిగిలామో దేవర ఒక్కసారి పారజూడండి. సగందూరం వచ్చి వెనుకకు మరలినవారు కొందరూ, రణభూమిలో రాలిపోయినవారు కొందరూ, రోగగ్రస్తులై విదేశాలమట్టిలో కలిసిపోయినవారు కొందరూ, సేలయూనినట్లుండే మనదండు ఎలా పలచబడి పోయిందో, దేవరకు విశదమే. మిగిలిన యీకొలది మూకలైనా, అనవరత ప్రయాణాయాసంతో, శాత్రవఖడ్గప్రహారాలు మోచి మచ్చలుపడిన శరీరాలతో, చిరతరప్రవాసఖేదంతో నవసి, నలిగి, నీరసించి, నిస్త్రాణములై, ప్రాణాలు కళ్లలో నిలుపుకొని వున్నవి. దేవరకు ప్రాణపదములైన యీసేనలు, ఒడలినిండా బట్టలేక, కడుపునిండా తిండిలేక, అరవరలైన కవచాలూ, మొక్కవోయిన ఖడ్గాలూ తాల్చి, కనుచూపుమేరలో అవధికానరాని యీజైత్రయాత్రలో, ఇంకా బాధ లేమి సహిస్తవి? విక్రమా లేమి చేస్తవి? యుద్ధకార్యానికి అక్కరకురాకపోయినా, విశ్వాసంకొద్దీ ప్రభువులను వెంటనంటివస్తున్న యీస్వల్పసేనలను కూడా పగతుర నిష్ఠురశస్త్రాలకు బలిచేయక, ఇంతటితో గృహోన్ముఖులు కావలసిందని దేవరను వేడుకొంటున్నాము. ఇండ్లకడ ఏనాడో విడిచివచ్చిన తలిదండ్రులను, ఆలుబిడ్డలనూ మళ్లా కళ్లారా చూచుకొని చరమజీవితం వారిమధ్య, ఇంటిపట్టున గడపాలనీ, ఈజైత్రయాత్రలో ఆర్జించిన భాగ్యాలు సుఖంగా కొన్నాళ్లయినా అనుభవించాలనీ కోరుతున్నవి సేనలు. విజయలక్ష్మీస్వయంవృతులైన కుమారులను ఒక్కసారి కనులారా చూచుకొని వ్రణకిణాంకితమైన దేహాన్ని నిమిరి, సార్వభౌమకిరీటందాల్చిన శిరస్సును మూర్కొనవాలని ఉవ్విళులూరే మాతృదేవుల శ్రీపాదపద్మాలు ఒక్కసారి దర్శింపుడని సేనలు దేవరకు విన్నవిస్తున్నవి. ఎట్టివారికైనా కలకాలం ఒక్కరీతిగా గడవదు. విజయలక్ష్మి చంచలురాలు. వంచనాశీలమైన అదృష్టాన్ని

పెద్దయు నమ్మి వుండకూడదు. సాహసవిక్రమాలకు గూడా హద్దు వుండాలి. ప్రభువుల కింతకంటే ఏమిమనవి చేయగలను?

"దస్సిపోయి, ఇంటిపై బెంగపెట్టుకొన్న ఈసేనలతో నింతటనైనా స్వదేశం చేరి కొంతకాలం విశ్రమించడం మేలు. మేము వెంటగొనిపోయిన భాగ్యభోగ్యాలు చూచి అసూయచెందిన మాసిడోనియనులు లక్షలకొలది తిరిగి ప్రభుసేవకు ఆయత్తులవుతారు. ఉత్సాహశీలురూ, కష్టసహిష్ణులూ అయిన ఆపడుచువాండ్రను మళ్లా వెంటగొని కొత్తసీమలపై నడచి, కొత్తదిశలు జయించ వచ్చును.చాలియెరుగని దేవరవిక్రమానికి అనురూపమైన క్రొత్తసేనతో తిరిగి ఒకక్రొత్తశకం ప్రారంభింపవచ్చును. జవసత్వా లుడిగి నిరుత్సుకులైన యీ పాపసేవకుల నింతట ఇల్లుసేర్పుడని సేనలన్నీ నాముఖంగా విన్నవిస్తున్నవి."

ఇట్లుపలికి కోసేశుడు చాలింప దండనాథులందఱు ఆమోదసూచకముగా హర్షధ్వనులు సల్పుట గాంచి చక్రవర్తి మొగము గంటువెట్టుకొని చివాలున లేచిపోయెను.

మఱునాడు సేనాపతులనందఱిని చక్రవర్తి మరల పిలిపించి యిట్లు పలికెను."ఇన్నాళ్ళూ మాకు విశ్వాసపాత్రులై మమ్మును ప్రాణాధికంగా చూచు కొని, మాకష్టసుఖాలలో పాలుపంచుకొన్న మామిత్రులంతా ఇట్లు విముఖులు కావడం మాదురదృష్టం. యుద్ధమధ్యంలో మేము భరపడి పోరుచున్నప్పుడు, మేము క్షతగాత్రులమైనప్పుడు, మేము మేమని మారక్షణకై పంతులుపడిన ప్రాణమిత్రులంతా ఇలా మమ్ము దేశంగానిదేశంలో, శత్రుమధ్యమందు, ఒంటరిగా విడిచిపోతారని ఎన్నడూ అనుకోలేదు. కానివ్వండి. ఇంటికి వెళ్ళేవారందరూ యథేచ్ఛగా వెళ్లవచ్చును. మేమెవ్వరినీ అడ్డుపెట్టము. మీరు సర్వులూ పరిత్య జించి పోయినా మేము సంకల్పించినకార్యం ఒంటరిగానైనా తుదముట్టించి తీరుతాము. మాకు భయముగొల్పే సాహసకార్యములు మాకు ఇనుమడించిన ఉత్సాహాన్ని కల్పిస్తున్నవి. మీరంతా సుఖంగా స్వగృహాలు చేరి, అచట

మనవాళ్లతో చెప్పండి! "మా ప్రభువును కానిదేశాలలో, క్రూరసత్వభయంకరా రణ్యాలలో, శత్రుమధ్యమందు, ఒంటరిగా విపత్పరంపరలకు అగ్గముచేసివచ్చా" మని చెప్పండి. మొదట మాతో విగ్రహించినా, ఇపుడు మాకు పరమమిత్రులూ, ఆప్తులూ అయిన యీసిథియనులు, బాక్ట్రియన్లు, హిందువులే మాకు బాసటై మాకష్టసుఖాలు పంచుకుంటారు. అంతేగాని మాసేవకు విముఖులైనవారిని బలాత్కరింపము. మమ్ము అనుసరింపుడని ఎవ్వరినీ యాచింపము. అవితథోద్యమమైన మాఖడ్గంతోడుగా, దిగంతాల విజయధ్వజాలు నాటడానికి ఇదుగో తరలిపోతున్నాము. మాకు యశమో, మృత్యువో అవుతుంది. మీకందరికీ సుఖం అగుగాక."

ఈమాటలు చెప్పి చక్రవర్తి పటకుటీరములోని కేగెను. మూణ్ణాళ్లదనుక నెవ్వరికి దర్శన మొసగ లేదు. అప్పటికిని సేనలహృదయములలో మార్పులేమి గ్రహించి, ఇక ఫలములేదని నిశ్చయించి, వ్యాసనదీతరణమునకు బూర్వాంగముగా దేవతాపూజ లొనర్చెను. పిమ్మట దన ముఖ్యానుచరులను జేర బిలిచి పురోగమనమునకు దైవము ప్రతికూలమై యున్నదనియు, దుర్నిమిత్తములు దోచె ననియు యెఱిగించి, సేనలను వెనుకకు మరల్ప నాజ్ఞనొసగెను. ఆయాజ్ఞ విన్నంతటనే సేనలన్నియు సంతోషావిష్టములై యెగిరి గంతులు వేయుచు, "దేవరను మేముగాక ఎవరు ప్రతిషేధింప గలరు" అనుచు నానందబాష్పములు విడిచిరి.

విపాశాతీరమున నున్నగుట్టపై డెబ్బదియైదడుగులఎత్తున బండ్రెండు బలిపీఠములు నిర్మించి ఇష్టదేవతలకు బూజ లొనర్చి ఆపీఠములమధ్య కాంస్యస్తంభ మొండు బాతించి దానిపై "అలకసుందరు డిచ్చట ఆగెను" అను అక్షరములు చెక్కించెను. ఆగుట్ట నేటికిని అలకసుందరగిరి యనుపేర బరగుచున్నది. అచటనే పాదాతులకొఱకు నిర్మించినవసతులు శిథిలములై కానవచ్చును. వానిలో $7\frac{1}{2}$ అడుగుల పొడవైనశయ్యలు నిర్మింపబడెను. ఇది

యంతయు యవనుల దీర్ఘకాయతను సుదృఢత్వమును బ్రకటించుటకు జక్రవర్తి పన్నిన పన్నుగడ యని చెప్పుకొందురు.

అభిసారుని చెంతనుండి ఆర్యకేశ ప్రద్యుమ్నులు మరల నచటికి గొని తెచ్చిన కప్పము లందుకొని చక్రవర్తి అభిసారు ననుగ్రహించి విడిచెను. వితస్తా వ్యాసనదమధ్య భూఖండమునకు బర్వతేశ్వరు నభిషేకించెను. పిమ్మట రావీనదము దాటి, వితస్త కరిగి అచట దాను గట్టించిన నగరములలో ప్రణితులను దిగవిడిచి, సింధునదము జేరెను. ఇంతలో థ్రేసునగరమునుండి 5000 అశ్వికులతో, 7000 పాదాతులతో 25000 కవచములతో నచటికి వచ్చి చేరిన 'మెమ్నను'తో "నీ నీరాక వ్యాసనదిచెంత నుండగా వచ్చినచో సేనలు ముందుకుసాగేవి. ఇప్పు డేమి ప్రయోజనం? ఇంతకు, దైవంకూడా ప్రతికూలించింది" అనిపలికి క్రొత్తకవచములను సేనలకు బంచి యిప్పించెను. నృపపాలము వఱకు జక్రవర్తి వెంటనేయున్న ఆర్యకేశ ప్రద్యుమ్ను లాతని చర్యలగూర్చి తమలోదా మిట్లు పలికికొనిరి. "చక్రవర్తి నిజంగా చిత్రచరిత్రుడు. అభిసారుడు జబ్బుగా వున్నాడంటే మొదట వప్పుకోనివా డిప్పుడు వప్పుకొన్నాడు. వ్యాసనదం దాటడానికి దైవం ప్రతికూలమన్నాడు. తనపాదాతులందరను సాలప్రాంశులని ప్రజ లనుకోవడానికి పెద్దపెద్ద మంచాలు కట్టించాడు. మాటిమాటికి తిరుగబడుతున్న ఈ ఆశ్వికులతో మద్రకులతో వేగలేక వేసారి తిరుగుమొగం పట్టి, నూతనదేశాలు జయించబోతున్నా నంటాడు. ఇది అంతా పరవంచన మనుకోవాలా, ఆత్మవంచన మనుకోవాలా."

---

## 15

## అలకసుందరచంద్రగుప్తులు.

చాణక్యచంద్రగుప్తులు చారచతుష్టయముతో శతద్రూతీరము జేరు నప్పటికి యవనచక్రవర్తి విపాశయొద్దన విడిసియున్నాడనియు, మగధరాజ్యముపై నెత్తి వచ్చుననియు వార్తలు వినవచ్చెను. చక్రవర్తి ఔదార్యాదిక

-మును, పర్వతకసౌభూతులను అంభిని ఆదరించుటయు మున్నగువార్తలు విని చాణక్యుడు చంద్రగుప్తునితో "ఆలీసాందరు అంతటియోగ్యు డనుకోలేదు నేను. తక్షశిలాపతి ఈతని నెయ్యము గోరినప్పుడు ఈతడింతటివాడని యెఱుగక నేను ప్రతిషేధించి, నందులతో సంధిచేసుకొమ్మని ఉపదేశించాను. ఆతడు నా మాట పెడచెవిని బెట్టడం మంచిదే అయింది. నామాట విని నందులతోనే సంధి చేసుకుంటే కొఱవితో తలగోకికొన్నట్లయ్యేది. ఇక మనకు పర్వతకాదులతో ఏమిపని? యవనవిజితులై తత్సామంతులైన ఈరాజమాత్రుల నాశ్రయింపడం కంటె ఆలీసాందరుతో చెలిమిచేయడమే మంచిదని తోస్తున్నది. అసాధారణమైన సాహసపరాక్రమాలకు దోడుగా ఔదార్యగాంభీర్యాలు కూడా ఆతని నాశ్రయించి వున్నవి. పారసీకచక్రవర్తిని పాదాక్రాంతుణ్ణిచేసిన మహావీరుడికి మనం కోరేసాయం లెక్కలోనిది కాదు. జిగీషువై పరదేశాలు కొల్లగొట్టుకు పోవడానికి వచ్చినవాడు గనుక కన్నెఱ్ఱగా సువర్ణమూ రత్నాలూ ఆశపెట్టితే మనకు అనుకూలిస్తాడు. బుద్ధిమాలిన సౌభూతి ఒంటెనిండా రత్నాలు సంగ్రహించుకొని రావడం చూచినప్పటినుంచి ఆలీసాందరుకు రత్నాలపై పిచ్చి యెత్తిందని వింటాను" అనెను.

చంద్ర.—ఈతనివల్ల మన కార్యం నెరవేరేమాట నిజమే కాని ఇంత ప్రబలుణ్ణి మనం సాయంతీసి తెచ్చుకొంటే, ఏకు మేకైనట్లు పర్వతకాదులవలె నన్నుగూడ తనకు సామంతుణ్ణి కమ్మని కోరుతాడేమో! అసమానుడితో సంధి విగ్రహాలు తగవని తమరే సెలవిచ్చారు. పిట్టలు పిల్లిని పోరుతీర్చడానికి తెచ్చుకొన్నట్లవుతుందని భయపడుతున్నాను. ఈయవనుడికి సామంతుడుగా నేను మగధను ఏలడానికి ఒక్కనాటికి అంగీకరించను. నేను అలా చేస్తే ప్రజలు నాకంటె నందులే మంచివాళ్లని యెంచి నాయెడ విరక్తులవుతారు. ప్రజలవిరక్తిమాట అలా వుండగా, నందవశంవదమైవున్నా ఇష్టపడతాను గాని నామగధ యవనాక్రాంతం కావడానికి ఒప్పుకోను.

చాణ.—నువ్వు ఎంతసేపూ సామాన్యధర్మం చెపుతున్నావేగాని ఆపద్ధర్మం ఆలోచించడం లేదు. పగతుణ్ణి ఖండించే కత్తే పట్టు దప్పితే మనకంతమే ఖండించేమాటయితే నిజమే కాని, అందుకని కత్తిని మొదలే విసర్జిస్తావా? కనక ఈయవనుడివల్ల మనపని చక్కబెట్టుకొనే ఉపాయముంటే విడనాడ కూడదు. మనం చెప్పిన ప్రకారం లొంగిరాడంటావా, మనదారి మనకు ఉండనే వున్నది గనక ఆతణ్ణి కదిలించి చూడడం మంచిదంటాను.

ఇట్టి యాలోచనలతో గురుశిష్యులు విపాశను చేర బోవునప్పటికి యవనసేనలు పూర్వదిగ్విజయప్రయత్నము మాని యింటిమొగముపట్టి వృషపాలమున విడిసియున్నవని తెలియవచ్చెను. మగధసేనల పెంపును గజయూథ దుర్దమత్వమును విని యవనసేనలు కలచలచెననియు, చక్రవర్తి చేయునది లేక వెనుకకు మరలెననియు విన్నంతనే చాణక్యుడు సంతసించి, చంద్రగుప్తునితో, "మనకు దైవం అనుకూలిస్తున్నది. మగధసేనలు దుర్జయములనీ, గంగాయమునలు దుస్తరములనీ యవనులు వెనుకకు తిరిగారు గనక ఇప్పుడు మనం చెప్పినట్లు వింటారు. మాగధుడవూ, మాగధానురాగపాత్రుడవూ అయిన నువ్విప్పుడు చేరబోయి, నందుల బలహీనతను, ప్రజకూ సేనకూ నీపట్లగల అనురక్తినీ చెప్పి సాయం కోరితే అలీసాందరు అంగీకరిస్తాడు. వాళ్ల సాయంవల్ల నీకు రాజ్యమూ లభిస్తుంది. నీసాయంవల్ల, ఇంటిమొగమై పోతూవున్న వాళ్లకు సులభంగా ధనరాసులూ లభిస్తవి. నీచెయి మీదు కావడానికి ఇదే అదను. పర్వతేశ్వరుడుకూడా మనకు అనుకూలిస్తాడు. అలీసాందరు ధాటితో ఆతడు గర్వపర్వతంనుంచి దిగాడు. భావి మగధచక్రవర్తి అనుగ్రహం సంపాదించాలని చూస్తాడు. అంభి కూడా, ఉన్నదేదో కాపాడుకొనే స్థితిలో వున్నాడుగాని, లేనిదానికి ఆరాటపడడు. కాబట్టి సిద్ధార్థకుణ్ణి వెంటనే పర్వతకుడి చెంతకు పంపి 'మాకు కొన్నాళ్లు ఆతిథ్యమివ్వవలసిం'దని కోరు."

అని ఉపదేశింప వల్లెయని చంద్రగుప్తుడు సిద్ధార్థకుని వృషపాలనగరమునకు దూతగా నంపెను.

పిమ్మట విపాశలో వారు గ్రుంకులిడి, తత్తీరమున యవనులు నిర్మించిన బలిపీఠముల జూడబోయిరి. చాణక్యుడు యవనులు నిర్మించిపోయిన ఆపీఠముల యౌన్నత్యమునకు, బలితనమునకు సక్కజమంది, ఆపండ్రెండుపీఠముల మీద వరుసగా గోవును, వృషభమును, గరుడపక్షిని, నెమలిని, సింహమును, ఏనుగును, కోతిని, పామును, పద్మమును, వటవృక్షమును, ధర్మచక్రమును, స్వస్తికను జిత్రింపజేసెను. చంద్రగుప్తుడు "ఇవి యేమిటి, స్వామీ! యవన దేవాలయంలో భారతీయమతస్థాపన చేస్తున్నారు?" అని నవ్వుచు ప్రశ్నించెను. చాణక్యుడు, "పాపం వాళ్లు కష్టపడి నిర్మించిన ఆలయాలు పూజాపురస్కారాలు లేక బూజుపట్టి పోకుండా, జీర్ణోద్ధారణం చేస్తున్నాను. ధర్మకర్త పోయినాడని ఆలయం పాడుపెట్టుతామా? పాతబడి అరిగిపోయిన నగలు చెడగొట్టి తిరిగి కొత్తనగలు చేయించుకొన్నట్లు నశించినధర్మాలను నూతనరూపాలతో ఉద్ధరించాలి. నశించేదాన్ని ఎన్నడూ ఉపేక్షించరాదు. మతభేదం అని సందేహించక ప్రాణప్రతిష్ఠ చేయడమే ధర్మం. ఈపునరుద్ధారణం చూస్తే యవనులు కూడా సంతోషిస్తారు" అని బదులు చెప్పెను.

చాణక్యచంద్రగుప్తులు వృషపాలము సమీపించునప్పటికి పర్వతకప్రతినిధియు సిద్ధార్థకుడును ఎదురు వచ్చి తోడ్కొనిపోయి పర్వతకమందిరమున ప్రవేశపెట్టిరి. ఆలీసాందరు పేరోలగముండి అచట రాచకార్యములు చక్కబెట్టుతున్నాడనియు, చంద్రగుప్తునకు మరునాడు దర్శన మొసగుననియు దెలిపిరి.

మఱునాటి యుదయమున బర్వతకరాజ్ఞి యగు సువర్ణమయి, సింహపురాధీశుని తనుజయు, దనకు మేనగోడలు నగు శాంతవతితో ప్రాసాదగవాక్షముచెంత గూరుచుండి ప్రాతస్సంధ్యాశోభితమగు నుపవన రామణీయకత నుపలక్షించుచుండెను. శాంతవతి యున్నట్లుండి కేంగేలనున్న మల్లెపూగుత్తి నారామములోని కల్లన విసరి వైచెను. సువర్ణమయి, అది గాంచి, తొంగి

చూడగా, చంద్రగుప్తుడు మందిరములోని కేగుచుండుట గాననయ్యెను. రాణి ముసిముసినవ్వులు నవ్వుచు, "శాంతా! ఎవరికి పుష్పసందేశ మంపుతున్నావు" అనెను. శాంత మోము మరవాంచి, "సందేశం కాదు; అత్తా! ఆవల్లబ్రాహ్మణ్ణి చూచావు కాదూ! అతడంటే నాకు కోపమూ, భయమూను."

స్వర్ణ.—కాదు మణీ! రాజహంస వెంబడి కాకివలె తిరుగుతూవుంటాడు. కాని నీ ప్రేటు గురితప్పి ఏపాపం ఎరగని రాకుమారుడికి తగిలింది సుమా! ఇనుము వల్ల అగ్నికి సమ్మెటపెట్టు లన్నట్లు ఆసుకుమార సుందరాకారుడికి నీపుష్ప బాణం మర్మభేదం చేస్తుందేమో!

శాంత.—మీపరిహాసాలకేమిగాని, అత్తయ్యా! వీరుభయులూ యవనుల సాయం కోరివచ్చారట నిజమేనా? ఆలీసాందరు మగధను జయించగలిగితే తానే యేలుకోంటాడుగాని ఈరాకుమారుడికి అర్పించి పోతాడా? ఇంత అవివేకమేమిటి వీరికి? ఈచాణక్యబ్రహ్మచారి గొప్పబుద్ధిశాలి యని మామ గారుకూడా అన్నారుగదా రాత్రి; చంద్రగుప్తుణ్ణి యిటువంటిపనికి ఎలా పురికొల్పాడు?

స్వర్ణ.—ఆలీసాందరు ద్రోహంచెయ్యడని వారితలంపేమో! అయినా నువ్వుచంద్రగుప్తుణ్ణే అడగగూడదూ 'ఎందు కిలా చేస్తున్నావని?' ఏమి చెప్తాడో!

శాంత.—సమయం దొరికితే అడిగే తీరుతాను.

స్వర్ణ.—సమయం దొరికేదాకా ఓపికపట్టగలిగితేనా, నువ్వు! స్వయంవరానికి సిద్ధపడుతూ వుంటివి. మాఅన్నగారికి సింహపురం వార్తపంపేవరకన్నా కొంచెం ఆగు.

శాంత.—(రాణివక్షమున తల దూర్చి) బాబయ్యగారు నామాట కెదురుచెప్పరు గాని అత్తయ్యా! నా కంతటి అదృష్టమా! మగధరాకుమారుడు సింగపు

పొదలోకి పోతున్నాడు, ఏమి ప్రమాదమో అని మనస్సు పరిపరివిధాల పోతున్నది. యవనులను నమ్మి వుండగూడదు. బావను పొట్టను బెట్టు కొన్నారు వీళ్లు. మామయ్యగారు వీళ్ళను ఏలా నమ్మి వున్నారో!

స్వర్ణ.—"ఏమి చేస్తారు, తల్లీ విధి ప్రతికూలమైనప్పుడు? నాబిడ్డ, అర్జునుడు బ్రతికివుంటే, యీబంగారుతల్లి నాకు కోడలై నాయిల్లు పావనంచేస్తుం దనుకొన్నాను." అని కనుల నీరుబెట్టుకొనెను. శాంత, రాణి నోదార్చుచు, "ఈదుర్వార్త లింతటనైనా దేశంవదలిపోకుండా రాకుమారుడు వెనుకకుపిలు స్తున్నాడు. మగధ కూడా యవనులకు సామంతరాజ్యమైతే ఇంకా ఆర్య ధర్మానికి దిక్కేముంటుంది? రండి అత్తయ్యా! అదిగో! చంద్రగుప్తుడు ఆలీసాందరును దర్శింపబోతున్నాడు. మనం కూడా అభ్యంతరమందిరంలో నుంచి చూతాము, ఏమిజరుగుతుందో. చంద్రగుప్తుడు సింహముఖాన పడ కుండా కాపాడాలి. రండి. నామనస్సు ఎందుకో అనర్థాన్ని శంకిస్తున్నది. ఏమి కానున్నదో!"

అట నాస్థానమంటపమునన్నాలీసాందరు చంద్రగుప్తుని సాదరముగ దనయెదుట గూరుచుండబెట్టుకొని వచ్చినకారణ మేమని యడిగెను. చంద్రగుప్తుడు దొలుత నించుక కళవళపాటు చెందియు గ్రమముగా బ్రకృతిస్థుడై తన వచ్చినకార్యము నెఱిగించెను. మహాపద్మనందుని చరిత్ర మును, దనతాతయగు మౌర్యునిచరిత్రమును సవిస్తరముగా నెఱిగించి, వా రిరువురు నందరాజ్యమును, దక్షిణమున గోదావరివనుక, ఉత్తరమున నేపా ళమువఱకు, తూర్పున గోహతీ కామాఖ్యములవఱకు, బడమట యమునవనుక విస్తరింప జేసినవృత్త మేర్పడజెప్పెను. మహాపద్ముని తనయులు కృతఘ్నులై మౌర్యుల కొనర్చిన ద్రోహమును, దానొక్కడు బ్రదికి బైటబడుటయు వివరించి మరల దన్ను జెఱబెట్టనుంకించుటయు, దాను తప్పించుకొని వచ్చు టయు దెలిపెను. పిమ్మట నందుల దుశ్చరిత్రమును అవ్యవస్థయు దెలిపి,

ప్రజలు సేనలు నందులయెడ విరక్తులై యుండిరనియు, మౌర్యపౌత్రుడును నందవంశాంకురము నగు దనపట్ల సేనలకు ప్రజకు ననురక్తి కలదనియు తెలిపి, యవనసాహాయ్యమున మగధను జయింపగోరు తనపూన్కియు వివరించెను.

అలీసాందరంతయు సావధానముగ విని నందరాజు కులచరిత్రమున కక్కజమంది, తుదకు, "మేము పాటలీపుత్రముపై ఎత్తివచ్చేసమయం మించిపోయింది. మేము తీరా, తిరుగుమొగం పట్టినపిమ్మట వచ్చారు మీరు. మా సేనలకు స్వదేశంపై మనసుపారింది. శకునములు కూడా బాగున్నవి కావు" అనెను.

చంద్ర.—నిజమే. మీసేనలకు ఇంటిమీద బెంగతోపాటు మగధసైన్యములంటే భీతి కూడా కలిగివుండవచ్చును. నాతో ఎత్తివచ్చినట్టయితే అటువంటి భీతికి ఆస్పదం వుండదు. నందసైన్యములు బలవంతములైనమాట నేను కాదననుగాని నందులపట్ల అవి అనురక్తములై లేవు. సేనానులూ మంత్రులూ సమర్థులు కారు. మహాపద్ముడు గాని, ముత్తాతగారుగాని బ్రదికివుండి బలాన్ని నడిపితే ఫాలాక్షుడు కూడా ఎదుర్కోలేడు. సేనాముఖంలో అటువంటివీరులు లేకపోవడమే కాక, ఇటు మీవంటి అతిరథశ్రేష్ఠులు సేనలను నడపడం కూడా మనకు విజయకారణం. ఇటీవల మీకు మళ్లా కొంతరాజుల పరికరాలతో గూడా వచ్చి చేరిందని వింటాను. కనుక మీరు సందేహించక నాకు బాసటయితే గంగాయమునలను అవలీలగా దాటించగలను.

అలిసాం.—మంచిది. మాదండనాయకులతో గూడా ఆలోచించి మీకు ఏమాటా చెపుతాను. ఇంటిమొగం పట్టినసేనలను మళ్లా వెనక్కి త్రిప్పటం సాగుతుందో, లేదో అనే ఆలోచనే కాని మగధను కూడా మాసామ్రాజ్యంలో చేర్చాలనే మా సంకల్పం. దైవం అనుకూలించి మన అభీష్టం

నెరవేరితే మాకు సామంతులుగా, మా ప్రతినిధిసలహాతో మీరే మగధ దేశం ఏలుకోవచ్చును. పర్వతేశ్వరుడు, అంభీ చెల్లిస్తున్నట్లు మాకు కప్పం చెల్లింతురుగాని.

చంద్ర.—అదిమాత్రం పొసగదు. మగధసామ్రాజ్యం ఒకరికి సామంతంగా వుంటుందంటే కల్ల. మగధసింహాసనం మేము అధిష్ఠిస్తే సార్వభౌములుగా అధిష్ఠించవలసిందే గాని ఒకరికి సామంతులంగా అధిష్ఠించడం జరగదు. మగధమహాసామ్రాజ్యాన్ని మేము వచ్చి ఒకరికి సామంతం చేయడం కంటె నందు లేలుకోవడమే మంచిది. ఆదేశద్రోహం మావలనగాదు. పర్వతేశ్వరుడూ, అంభీ మీకు సామంతులుగా వున్నారంటే వారి కది క్రొత్త కాదు. తక్షశిల పూర్వంనుంచీ పారసీకానికి సామంతంగా వుంది. ఇపుడు మీరు పారసీకం జయించారు గనుక అంభి మీకు సామంతుడు గావడం దోషం కాదు. పర్వతేశ్వరు డంటారా, ఆతడు మీవల్ల విజితుడైనాడు గనుక మీకు కప్పం కట్టుతాడు. అంతేకాని, మగధ పూర్వ మెన్నడైనా సామంతరాజ్య మనిపించుకొన్నది గనుకనా, ఇప్పు డనిపించుకోవడానికి? లేక మగధసామ్రాట్టును మీరు జయించారని మీకు కప్పం చెల్లిస్తుందా? ఆలా ఒక్కనాటికి జరగదు. కాకపోతే ఈదండయాత్రలో మీసైన్యాని కయ్యే ఖర్చంతా భరిస్తాము. మీరు సాయం చేసినందుకు రెండున్నరకోట్ల బంగారుపణాలు ముట్టజెప్పుతాము.

ఆలీసాందరు.—బాగున్నది. మాలిపుచ్చుకొని మీపక్షంపోరాడే కుక్షింభరులతో నైతే మీరుచెప్పినమాట ఎంతైనా బాగుంది. కాని మీరు ఒక్కపొరపాటు మాత్రం చేశారు. ఈపని పెట్టుకొని ప్రాచ్యఖండసార్వభౌముల మైన మాచెంతకు రానలసిందికాదు. పర్వతేశ్వరుణ్ణి జయించామనీ, మగధ సామ్రాట్టును మేము జయించలేదనీ, అందువల్ల మీకు సర్వస్వతంత్రులమనీ భ్రాంతి చెందకండి. మగధను జయించడ మెంత భాగ్యం! అముచ్చట కాస్తా

ఎప్పుడు కావాలంటే అప్పుడే తీరుస్తాము. అయినా ఇచ్చట మగధ సామ్రాట్టుయొక్క ప్రస్తావ మే మున్నది? రాజ్యమూ, సైన్యమూ కలవాడు గనుక పర్వతేశ్వరుణ్ణి జయించాముగాని, రెండూ లేని వారిని మేము జయించడం ఎలాపొసగుతుంది? అలా మేము జయించని రాకుమారులంతా పర్వతేశ్వరుడికంటె తాము అధికుల మనుకుంటే హాస్యాస్పదంగా వుంటుంది. ఇంకొక్క మాటకూడా మీరు తెలుసుకోవడం మంచిది. ఒక్కమగధనే కాదు. యావద్విశ్వాన్నీ ఏకచ్ఛత్రం క్రిందికి తేవడమే మాసంకల్పం. పారసీకసామ్రాట్టు కూడా మీవలెనే, మాకు అది యిస్తామిదియిస్తా మనిచెప్పి సంధికోరితే మేము ఏమి బదులుపంపామో మీరెఱుగరు కాబోలు. 'సంధిరాయబారం జరపడానికి మీరు మాతో సమానులు కారు. ప్రాచ్యఖండసార్వభౌములమైన మాకు జితోస్మి అని మేమిచ్చింది పుచ్చుకోవలసిందే కాని, ఇవ్వడానికి మీకేమీ లేదని వార్త పంపాము. ఆసామ్రాట్టుకే చెల్లనిది అన్యులకెలా చెల్లుతుంది ?

చంద్ర.—పారసీకప్రభువు విజితుడు కాబట్టి ఆయనకు మీతో సామ్యం చెల్లదు. మనపట్ల జయాపజయప్రసక్తే లేదు. మాదేశంలో అపహృతరాజ్యుడైన రాజు సాటిరాజుల సాయంకోరడం వారు సాయంచేయడమే కద్దుగాని ఇలా అనుచితపుకోర్కెలు కోరడం మేమెఱుగము. సాయంపొందినవారికి నైచ్యం సాయం చేసినవారికి ఆధిక్యం ఇచట వాటిల్లదు. ఆమర్యాద ననుసరించి, మీరూ మావంటివారే అని మీ చెంతకు వచ్చాముగాని, మీమర్యాద లిట్టివని యెఱుగం.

ఆలీసాం.—(కనులెఱ్ఱజేసి) మామర్యాదలనే శంకిస్తున్నావుగా !

చంద్ర.—శంకింపవలసివస్తున్నది. మీకోరికలనుబట్టి. మీసాయం అపేక్షించడంకంటె, మారాచమర్యాద లెఱిగిన యిచటి కిరాతులను శబరులను కోరి, వారిఅండతో మగధను సంపాదించుకోవడం మేలుగా కనిపిస్తున్నది.

ఆలీసాం.—శుభం. ఆలాగే చెయ్యవచ్చును. ఈలోపల మేము ఎత్తివెళ్లి మగధను స్వాధీనపరచుకుంటాము.

చంద్ర.—అది మీవల్లగాదు. కుంటివాడు హిమాలయం దాటితే సాసాయం లేకుండా మగధను జయిస్తారు మీరు.

ఆలీసాం.—వంటయింటికుందే లెక్కడికి పోతుంది గనుక? నీసాయం మాకు సిద్ధమయ్యే వుంది.

చంద్ర.—నమ్మి శేరవచ్చినవాసికి ద్రోహం చేయడం రాజధర్మవిరుద్ధము.

ఆలీసాం.—రాజధర్మం దేశకాలపాత్రాధీనమై వుంటుంది.

చంద్ర.—ధర్మచ్యుతికి ఒడిగట్టినా మీకోరిక మాత్రం ఫలించదు. మీబిభీషికలు మాపట్ల పనికిరావు. చంద్రవంశ సంభవుడైన క్షత్రియుడు ప్రాణభీతి యెటువంటిదో యెఱుగడు. అతడు ప్రాణములు విడుస్తాడుగాని పరాధీనతకు ఒడబడడు.

ఆలీసాందరు.—మహోగ్రుడై "పదుచుదనపుమాట లిక కట్టిపెట్టు. ప్రాణములు ఏలా విడుస్తావో యిప్పుడే చూస్తాము" అని గద్దియనుండి లేచి, హెఫిస్థానుని బిలిచి "వీనిని పాతాళగృహంలో బంధించి వుంచండి, మాఆజ్ఞ అయ్యేవరకు" అని ఆనతిచ్చెను. చంద్రగుప్తుడు బద్ధుడై యేగుచు "మేము ఆటవికులచెంతకు వచ్చామని తలచలేదు. పాపం! పర్వతేశ్వరుడు, ఆంభి యెలా వేగుతున్నారో ఈ ఆటవికుల కధీనులై" అని తూలనాడెను. ఆలీసాందరు మండిపడి, "వీనికి తిండి, నీరూ ఇవ్వకండి" అని ఆస్థానమంటపము వీడి చనెను.

అట నంతఃపురజాలకముల చెంత గూరుచుండి యీ సంభాషణమంతయు వినుచున్న శాంత స్వర్ణమయితో, "అత్తా! ఈ యవను డెంతటి క్రూరకర్మం చేస్తున్నాడో చూడండి. మనకోటలో ఇటువంటిఘోరం జరుగుతూ

వుంటే ఎలా వుపేక్షిస్తాము! రాకుమారు డెంత ధీరంగా మాట్లాడినాడో విన్నారా? ఈశత్రుణ్ణి కాపాడి తీరుతాను" అని యటనుండి బయలుదేరెను. స్వర్ణమయి వెంటజనుచు "పిచ్చిదానా! ఆడువాళ్లం మనవల్ల ఏమవుతుందే? తొందరపడి మనమేమైనా సాహసం చేసినా, పిమ్మట చక్రవర్తికి తెలిస్తే ప్రమాదం సుమా" యని మందలించెను.

శాంత.—చక్రవర్తంటే మామగారు భయపడవలెనేకాని నాకేమి భయం? ఈదురాగతం ఎలా సహిస్తాము అత్తయ్యా! ఈ రాకుమారుణ్ణి రక్షించే భారం మీరు పూనకపోతే ఎంత అప్రతిష్ఠ! ఆపాతాళగృహానికి గోడలో ప్రచ్ఛన్నంగా ద్వారమున్నరహస్యం చక్రవర్తికి తెలియదు. కనుక మనల ననుమానించడు. అనుమానించినా మనకేమీ భయం లేదు. మామగారు కోపిస్తే నేను బ్రతిమాలుకొంటాను. రెండు జవనాశ్వాలతో కోటగోడ చెంత పరిచారకుణ్ణి సిద్ధంగా వుండమనండి. ఊరివెలుపలనున్న అడవిలో మరి యైదుగుర్రాల నుంచండి. రాకుమారునికోసం ఆయడవిలో వేచియుండ వలసిందని చాణక్యునకు కబురుచేయండి. ఆబ్రాహ్మణుడే సర్వమూ చక్క పెట్టుతాడు. వేగిరం పదండి, అత్తయ్యా.

స్వర్ణ.—అమ్మాయీ! సాహసం తగదు సుమా! బాబయ్యగారు వింటే కూడా ఈపనికి హర్షించరు.

శాంత.—ఎంతమాటన్నారు అత్తయ్యా! సింహపురపు రాచవంగడపు ఆడు బడుచులు మీరు. బాబయ్యగారు ఒక్కనాటికి హర్షించకపోరు. మీరు అధైర్యపడి కాలహరణం చేయకండి. రాకుమారుణ్ణి రక్షించకపోతే మీరు నామీద వొట్టు సుమండీ! అత్తయ్యా రాకుమారుడికి ఏదైనా ప్రమాదం సంభవిస్తే ఇంకా నేను బ్రతికి ఎందుకు? నన్ను హతభాగ్యను చేయకండి.

స్వర్ణ.—"పిచ్చితల్లీ! భయంలేదు. నీమనోహరుణ్ణి రక్షించుదాము. అదిగో! క్రొత్తపెండ్లికూతురవు కంటనీరు బెట్టకు" అనుచు శాంతవతిని కౌగిటజేర్చి

ఘాలము ముద్దుగొని "నీసంభ్రమనిషాదాలు చూస్తే నాచిన్ననాటి ముచ్చటలు మనస్సుకు వస్తున్నవి. [illegible]పస. అధైర్యపడకు. ప్రాణదాత్రివైన నిన్ను చంద్రగుప్తుడు చెట్టపట్టకపోడు. ఆంత చక్కనివాడు ఎన్నటికీ కృతఘ్నుడు కాడు.

అనుచు నత్తాకోదండ్రు చంద్రగుప్తుని బంధముక్తుని జేయు ప్రయత్నమున నుండిరి.

ఆట జీకటికొట్టులో బద్ధుడైయున్న చంద్రగుప్తుడు నలుదెస లరసి, అందుండి తప్పించుకొనిపోవు మార్గము గానక, చాణక్యుని బుద్ధిసంపదను దైవమును నమ్మి, తొల్లి నందులచే బద్ధుడైయున్ననాటి కష్టములను దలపోసికొనుచు, "ఆచెఱనుండి విడిపించిన భాగ్యదేవతయే దీనినుండికూడా విడిపిస్తుంది. భాగ్యదేవతకు చాణక్యదేవుని అనుగ్రహం కూడా ఇప్పుడు తోడ్పడుతుంది" అను నాలోచనములతో గొంతతడవుండి ఒక్కించుక కన్ను మోడ్చెను.

అంతలో నేదియో అలికిడి యైనట్లు దోచి కనువిప్పి పరికింప, గోడయందొకవంక వెలుతురు కాననయ్యెను. తన్నురక్షింప గురుదేవుడురానోపునని యెంచి "ఆర్య లెంతకైనా సమర్థు"లనుచు లేచెను. ఇంతలో నావెలుగున కడ్డముగా నిలిచియున్నది, చాణక్యుడు గాక, ఎవరో యువతియగుట బోల్చిచూచి చంద్రగుప్తుడు ఒకింత విభ్రాంతుడై నిలిచి "ఇది కలగాదుగదా!" అనెను. శాంతవతి నవ్వుచు లోపలికి వచ్చి, "నేను మీగురుదేవులు కాను. శాంతవతి"ననెను. చంద్రగుప్తుడు తెప్పరిల్లి హర్షవిస్ఫారితలోచనుడై, "గురుదేవులూ కావు, శాంతవతివీ కావు. నాఅదృష్టదేవతవు నువ్వు. శాంతా! నాధన్యత నెంతని మెచ్చుకోను. నువ్వు వచ్చి ఈనరకకూపాన్ని స్వర్గం చేశావు. నీఋణ మెలా తీర్చుకోను. ఇదుగో! ప్రొద్దుట నీవనుగ్రహించిన పూగుత్తి. నాహృదయం చెంత పదిలంగా దాచుకొన్నాను. నాహృదయప్రతినిధిగా దానినే మళ్లా సమర్పించుకొంటున్నాను" అని అందీయబోయెను. శాంతవతియు "నేను

పెట్టిన చిన్న కానుక ఇంతటి ప్రతిఫలానికి తగిందికాదు.” అనుచు సిగ్గుపెంపున శిరము వాంచెను. చంద్రగుప్తు డాముద్దరాలి కెంగేలు గ్రహించి, “శాంతా! మగధసింహాసనంకోరి ఇక్కడికి వచ్చినందుకు నాకది లభింపకపోయినా, అదృష్ట దేవతనన్ను ప్రేమరాజ్యాభిషిక్తుణ్ణి చేసింది. మగధసింహాసనం నీతోగలిసి యెక్క వలెనని కోరుతున్నాను. నాకీవరమును గ్రహించు” అనుచు నాబాలికను జెంతకు జేరదీసికొనెను. శాంతవతి, అవనతవదనయై “నేను అస్వతంత్రను. మీరు ఆల స్యంచేయక వెంటనే బయలుదేరండి. చాణక్యులవారు పురము వెలుపల అడవిలో మీకోసం వేచివున్నారు. మీరు సింహపురానికి శీఘ్రంగా చేరడం మంచిది” అనెను. “శాంతా! సందేహించకు. క్షత్రియులకు గాంధర్వం తప్పుకాదు. నిన్నిప్పుడే పరిగ్రహిస్తున్నాను” అనుచు దనవ్రేలి రత్నాంగుళీయకము నా యువతివ్రేలికి దొడిగి, సెమ్మోము ముద్దుగొని, “సింహపురంలో నీరాకప్రతీ క్షిస్తూ వుంటాను” అని శాంతతో గూడ వెలుపలికి వచ్చినంతనే ఆద్వారము మూసికొనెను.

పిమ్మట వారిరువురు నంతఃపురములోని కరిగి, స్వర్ణమయికి తమ పరి ణయవృత్తాంత మెరిగించి ఆమెపాదముల కెరగిరి. స్వర్ణమయి వారల దీవించి, చంద్రగుప్తునితో, “పదుచుదనంచేత మీరు మీరు స్వతంత్రించినట్లు కాదు. తండ్రిచాటుపిల్ల నేలా ఏలుకొంటారో, మీదే భారం. మాఅన్నగారికి నేడే జాబు వ్రాస్తాను. వారు సమ్మతించేవఱకు రహస్యం బొక్కనీయకండి” అని పలికి, “గుఱ్ఱం సిద్ధంగావున్నదో లేదో తెలుసుకు వస్తాను. ఇంతలో మీరీదుస్తులు ధరించండి” అని పరిచారకవేషమును చంద్రగుప్తుని కొసగి యవ్వలికేగెను. ఆవేషము ధరించి అచ్చము బరిచారకు డనిపించుచున్న మనోహరుని గాంచి శాంతవతి బాహులతిక లాతని కంఠమునకు బెనవైచి “ఇంతలో ఇంతచిత్రంగా మారిపోయినారు, ఆర్యపుత్రుల మనస్సు నెలా నమ్మేది” అనుచు నాతని చూపులలోనికి జూడ రాకుమారుడు నవ్వుచు “జేలవుకాకు. నాకనుజ్ఞ ఇచ్చి పంపితే సింహపురంలో నీరాక కెదురుచూస్తూ వుంటాను” అనుచు నామె

నక్కున గదించి వీడ్కొని, స్వర్ణమయిచూపిన దారివెంటనేగి అశ్వారూఢుడై విష్ణుగుప్తుని జేరనేగెను. విష్ణుగుప్తుడును చంద్రగుప్తుని గౌగిలించుకొని, "బంధంనుంచి తప్పించుకొన్నావు, కొత్త బంధంలోనుంచి అప్పుడే బైటపడతావనుకోలేదు" అనుచు బరిహాసింప, "స్వేచ్ఛకంటె ప్రియమైనబంధంలో పడ్డాను" అని జంద్రగుప్తుడు నవ్వుచు బదులు పలికెను. పిమ్మట ననుచరులతో గూడ వారు సింహపురమార్గముబట్టి వాయువేగమున నరిగిరి.

ఇట్లు కతిపయప్రయాణముల నరుగుచు వారు తొమ్మిదవ దివసమున త్రోవలో నొక వృక్షవాటిలో నిదురించుచున్నతరి చాణక్యుడు నిద్రనుండి మేల్కాంచిచూడ గొదమసింగ మొకడు చంద్రగుప్తుని శిరముచెంత మూచూచు చుంట గాననయ్యెను. చాణక్యుడు సావష్టంభముగా పెద్దబొబ్బపెట్టి సింగముపై కుఱుక నది భయపడి పాఱిపోయెను. తక్కిన వారందరాసందడి కులికిపడి మేల్కాంచిరి. చాణక్యుడు, వారికెల్లరికి, బఱుగిడుచున్న సింగముంజూపెట్టి, చంద్రగుప్తుని శరీరము నది నాకుచుండగా తా గనుగొంటిననియు, అచిరకాలమున నాతడు చక్రవర్తి యగుననుట కిది సూచనయనియు, పాటలీపుత్రసింహాసనము చంద్రగుప్తు డధిష్ఠింపగలడనుట కిదియే ప్రబలతార్కాణ మనియు వచించెను. పిమ్మట నీయద్భుత మానోట నానోట బడి క్రమముగా సింహపురమున వ్యాపించెను.

సింహపురాధీశు డీవార్త విని యబ్బురపడుచుండ మఱునాటికిచాణక్య చంద్రగుప్తులువచ్చి నగరమున ప్రవేశించిరి. స్వర్ణమయి పంపిన జాబును సింహపురాధీశుడు జదివికొని తాను విన్నవార్తల కది తార్కాణమగుడు, స్వర్ణమయి వ్రాసిన భంగి శాంతవతికి జంద్రగుప్తుడే తగిన వరుడని నిశ్చయించుకొనెను. పిమ్మట చాణక్యుడు సింహపురరాజకుల పురోహితునితో గూడి జేని చెంతకరిగి వివాహప్రస్తావము సల్పెను. ప్రభువగు విజయసింహుడును చాణక్యానుమతమ్మున దన తనూజకు స్వయంవరము జాటబంపెను.

చంద్రగుప్తుడు సేరినపిమ్మట నేడవనాటికి శాంతవతియు సింహపురము సను జేరెను. స్వయంవరప్రయత్నము విని యూపడుచు మనమున నుబ్బి "ఎన్ని సార్లని వరింతును మిమ్ము! నిజమే. మీవంటి అపరూపభర్త లభించె నప్పుడెన్ని సార్లు వరించినా తనివి దీరదు" అనుచు జంద్రగుప్తునకు వార్తపంపెను.

స్వయంవరాహూతులై సింధుమాళవసౌరాష్ట్ర మహారాష్ట్రపాంచాల ములనుండి యేతెంచిన రాకుమారులతో సింహపురము కలకలలాడుచుండెను. విజయసింహప్రతినిధులు రాకుమారుల కందరికి విడుదులుసేసి సత్కారపూర్వ ముగ నుపచరించుచుండిరి. వివాహసమాగతులగు రాజకుమారులందరిలో జంద్ర గుప్తుడు తారాగణమధ్యమున జంద్రునిమాడ్కి శోభిల్లుచుండెను. మచ్చలేని ఆయందమును, ఎనలేని యాశౌర్యసాహసములును, కేసరి జిహ్వపల్లవోల్లివ్యా మానతనుడగు నాతని యదృష్టమును రాచబిడ్డలు పలువిధముల దమలో దాము వర్ణించిచెప్పుకొనుచు మగధసార్వభౌముడు కానున్న చంద్రగుప్తుడే సింహపుర కన్యకు దగినవరు డగునని కొనియాడజొచ్చిరి. చంద్రగుప్తుడును ఆరాజన్యు లతో సౌహార్దము నెఱపుచు వారికి దలలోని నాలుకయై వారిమైత్రి గౌరవ ముల నార్జింపుచుండెను. కాథేయులు మున్నగు ప్రాజాపత్యవాయకులు చంద్ర గుప్తుని దమకెల్ల నేలికగా వరించి అలీసాందరుపై బగదీర్చుకొన గోరుచుండిరి.

స్వయంవరాహూతులై నానాదేశములనుండి యరుదెంచిన బ్రాహ్మణ బృందమును జాణక్యుడు తన ప్రజ్ఞాపాండిత్యములచే వశీకరించి అలీసాందరు నెడ విద్రోహాంకురములు వెదజల్లదొడగెను. "ఆర్యధర్మం నశిస్తూవుంటే మహా బ్రాహ్మణులు మీరంతా ఎలాచూస్తూ ఊరకుంటారు. మీరంతా తలచుకొంటే యవనసేనలు ఒక్కక్షణంలో పలాయమానములవుతవి. అత డేమి నిర్భయుడు, దుర్జయుడు అనుకొంటున్నారేమో మీరు ! మీమీదేశాలలో విప్లవం పుట్టిం చండి. ప్రజలలో ఆర్యధర్మాభిమానం పురికొల్పండి. యవనులకు ఈదేశంలో చేరెడు ఉప్పు పుట్టకుండా చేయండి. విపాశనుంచి (Beas)అలీసాందరు నను

కను మళ్లనే మళ్లాడు. మీరు పూనుకొంటే సింధునదం దాటగొట్టవచ్చును" అనుచు బ్రాహ్మణులకు బోధించి, మాళవకక్షుద్రకులకు ప్రియతమమైన స్వాతంత్ర్యగీతిని వారి కుపదేశించి, ఆగీతమును కోటికంఠములతో పాడించి ప్రజలలో నుత్సాహాగ్నిని సంధుక్షణము సేయుడని కోరెను.

పౌష్యమాసమున శుభలగ్నయుక్తమగు సోమవాసరమున స్వయంవరోత్సవము మహావైభవముగా బ్రవర్తిల్లెను. రత్నతోరణాలంకృతమై సుధర్మం దలపించు సింహపురాస్థానమంటపమున కనకమంచాసీనులై వెలుగొందు రాజన్యసమక్షమున, శాంతవతి సముజ్జ్వలవేషయు పుష్పమాలికాపాణియునై యరుదెంచి అల్లనల్లన జంద్రగుప్తుని దరియజని పుష్పమాలచే నారాకుమారుని కంఠము నైసేసి తత్పాదముల బ్రణమిల్లెను. మంగళవాద్యము లొక్కపెట్ట బోరుకలంగెను. రాజన్యసాధువాదములు చెలరేగెను. సింహపురరాజ పురోహితుడు "అయం ముహూర్తస్సుముహూర్తోஉస్తు" అని మంగళాక్షత లావధూవరులశిరముల నొలికెను. ముత్తైదువలు మంగళారాత్రికలెత్తి కలకంఠములెత్తి పాటలు పాడిరి.

---

# 16

## పేరోలగము

తోరణపతాకాలంకృత మగు కొలువుసాలలో నాలీసాంపరు నిండు కొలువుండెను. రత్నకంబళములపై, దిండ్లమర్చిన మంచములపై సామంతరాజన్యులు, రాయబారులు ఆసీనులై చక్రవర్తిమోమున చూడ్కులు నిలిపియుండిరి. యవనసేనాపతులును మంత్రులును చక్రవర్తిచెంత నుజ్జ్వలకవచాలంకృతులై పరివేష్టించి యుండిరి. అంభియు బర్వతేశ్వరుడును చక్రవర్తి సమీపమున నర్హాసనములపై నుపవసించిరి. అర్సకేశుడును సౌభూతి భగేలాపురాధీశు లొకచక్కి, అభిసారప్రతినిధియు నైశానగరపు రాయబారియు

నౌకచక్రి, వారల కాసి కాథేయ కాలచుర్య ప్రతినిధులును, నానాదేశాగతు లగు సామంతమండలాధిపులు వర్తవర్ణాసనమున నాసీనులైరి. సభామధ్యమున రత్నసింహాసనమున యవనచక్రవర్తి, శోభమతిసమర్పిత కనకకవచము ధరించి వెలుగొందుచుండెను. కవిగాయకులు, వందిమాగధులు, నానాభాషలలో శ్లోకములు గీతములు రచించి చక్రవర్తిని జగదేకవీరుడనియు, సర్వలోకపాలకు డనియు, ఇంద్రపుత్రుడనియు కీర్తించుచుండిరి. చక్రవర్తి శిరమును కంఠ మును, సామంతసమర్పితములగు రత్నాలదండలతో పుష్పమాలికలతో నిండి పోయెను. బ్రాహ్మణులు స్వస్తివాచనపూర్వకముగా పూర్ణకుంభములు సమర్పించి కర్పూరనీరాజనము లెత్తిరి.

అలిసాందరు సంతుష్టమగు నిండు మనమ్మున నయ్యుపచారములెల్ల నంగీకరించి, అంభిని, పర్వతకుని జేరబిలిచి వారివారిరాజ్యములకు, తానొసగిన భూఖండములకు గూడ వారిని సభామధ్యమున నభిషిక్తులనొనర్చి "మీ రిరువురు పూర్వవైరము మఱచి స్నేహంగా వుండడం మా అభీష్టం" అని సోచ్చరించి, పర్వతక సోదరుడగు వైరోచకుని తనయను అంభికొసగి వివాహ మొనర్చుటకు వారిరువురుని సమ్మతింపజేసెను. సభ్యులెల్లరు జక్రవర్తి యుచితజ్ఞతకు సంతసించి, "ఈవియ్యము లెస్స" యని సాధువాదము లొనర్చిరి. పర్వతకునిచెంతను, అంభి యొద్దను జక్రవర్తికి ప్రతినిధులై సాచివ్యము సల్పుచున్న యవనమంత్రులు మిగుల హర్షించిరి.

అర్మకేశాఫిసారసౌభూతులను వారివారి రాష్ట్రముల కభిషిక్తులనొనర్చి, దండనాథుల కెల్లరికి సత్కారములు సల్పి, అనంతరము చక్రవర్తి సభ్యులతో నిట్లు పలికెను.

"మాచిరతరాభీష్టం సిద్ధించిన ఈదినం మాకెంతైనా సుదినం. ఉభయ ఖండవాసులైన మాసామంతులు, మంత్రులు, దండనాథులు, మిత్రులు పరస్పరం స్నేహభావంతో ఇచట సమాగమం కావడంవల్ల ప్రాచీప్రతీచులకు

సైన్యమూ, వీర్యమూ లభించింది. ఈఫలసిద్ధికొఱకే మేమీ దండయాత్రలు
చేస్తున్నది. మేము గంగానదిని దాటి ప్రాచ్యులను జయించకుండానే ఇప్పటికి
మరలుతున్నాం, మహారాజువలెంచుకంత సేద దేరినపిమ్మట, దైవానుగ్రహముంటే,
ఆకార్యశేషం తీర్చడానికి మళ్లా వచ్చి మీ ఆదరణీయదర్శనం చేస్తాము. ఆశ్వా
సాంతం చేయకుండానే మాసేనలు నిరుత్సాహం చెందడం వల్లనేగాని లేకుంటే
మాయుత్సాహశక్తి శ్రాంతి ఎటువంటివో యెరుగము. మాగధరాజకుమారుడు
చంద్రగుప్తుడు చెప్పినమాటలు వింటే ఈప్రాచ్యులకు గంగాపుత్రులను మట్టు
పెట్టడం లెక్కలోది కాదని తోచింది. ఆచంద్రగుప్తుడు సెలికోజాల
ముందుగా వచ్చియున్నట్లయితే ఆకొరవ కూడా తీర్చియే వెళ్లేవాళ్లము.
ఆరాజకుమారుణ్ణి యిపుడు మీసమక్షానికే పిలిపిస్తాము. అతడు చాలా గర్వి,
పరుషాలాపిన్నీ. మాసమ్ముఖంలో ఆచిన్నవాడు పలికిన గర్వోక్తులకు అతని
దండింపవలసి వుంది. ఇప్పటికైనా దోషినని చెప్పి సవినయంగా మన్నలు
కొంటాడా బ్రతికిపోతాడు. లేదా, శిరచ్ఛేదానికి ఆజ్ఞయిస్తాము."

చక్రవర్తి పలికిన ఈయుదారోక్తులకు సభవారెంతయు హర్షించిరి.
అంత, పర్వతకునితో సాభిప్రాయముగా, "ధీరులకు క్షమాగుణం భూషణ"
మనెను.

చక్రవర్తి యానతిమై చంద్రగుప్తుని గారాగృహమునుండి తోడ్తేర
నేగిన హెఫెస్తానాదులు వెలవెల్లబోవుచు తిరిగివచ్చి కారాగారము మూసినది
మూసినట్లే యున్నదనియు, చంద్రగుప్తు డందు గానరాడనియు, నిర్గమన
మార్గ మెందును గన్పించదనియు, ఎట్లు తప్పించుకొనెనో వింతగా నున్నదనియు
విన్నవించిరి. ఆలీసాందరు మండిపడి 'ఆనల్లబాప నెక్కడ వున్నాడో పట్టుకొని
రండు. అంతయు తేలును" అని యానతీయ, చాణక్యునికొఱకు వెదకి సేనాని
ఆతడు నెందును గానరాడని సైనికులు విన్నవించిరి. "ఏమయి" రంటే,
"ఏమయి" రనుచు సభ్యులెల్లరు నాశ్చర్యచకితులై యొకరి మొగము లొకరు

చూచుకొన జొచ్చిరి. అంతట నంబి "ఆ బ్రాహ్మణుడు గొప్ప మంత్రవేత్త. మాయామాట, ఆకలి యింద్రజాలమే యిది, లేనిచో చంద్రగుప్తు డెట్లా మాయమవుతాడు. చాణక్యుని ప్రతిజ్ఞ నేనెరుగుదును. పూర్వం తక్షశిలలో వుండేవాడు." అని విన్నవించెను. అలీసాందరు మాటలకు నవ్వుచు, "చాణక్యుడే కాదు. ఈదేశమే ఇంద్రజాలమయంగా వుందిమాకు. పోనిండు. ఇప్పుడా చాణక్యునికోసం, చంద్రగుప్తునికోసం మనరాచకార్యాలు మానుకోవలసిలేదు" కని వచింప సభ్యులెల్లరు హర్షధ్వానము గావించిరి.

చక్రవర్తి కొలువు చాలించినపిమ్మట పర్వతేశ్వరుడు అంతఃపురమునకేగి, రాణియగు శాంతవతిని జేర బిలిచి, "చంద్రగుప్తుడు మీకు తెలియకుండా పారిపోయే సాధనం లేదు. నిజము చెప్పండి" అని ప్రశ్నించెను. శాంతవతి "అవును. అతిథిని చంపించారనే అపకీర్తి మనకు వచ్చిపోతుందని నేనే తప్పించా"నని ధీరముగా బదులాడెను. పర్వతనుడు గినుకమై కనులు జేవురింప "చక్రవర్తికి ద్రోహంచేసి నాకు తలవంపులు తెచ్చిపెట్టారు. నేనిద్రోహం దాచిపెట్టి ఆ యనముఖం ఎలా చూడను" అనుచు చిడిముడి పడ, రాణి "నేడు వచ్చిన చక్రవర్తికి ద్రోహం జరిగిందన్న ఆలోచనేగాని మీకు, అతిథికి ద్రోహం చేయకూడదనే చిరాగతమైన మనధర్మానికి హాని వచ్చేదని ఆలోచన లేదు" అని హెచ్చరించెను. అంతట శాంతవతి యందుకొని, "చంద్రగుప్తుణ్ణి చక్రవర్తికి బలిచేయడం తప్పిపోయిందని మీకు విచారంగా వుంటే, ఈద్రోహం చేసినందుకు నన్ను బంధించి చక్రవర్తిచేత దండనం చేయించండి. సంతోషంగా ఆరాకుమారునికొఱకు ప్రాణాలు వదులుతాను. మామగారూ! మీకుమారులు ముగ్గురు మన కులధర్మరక్షణంకొఱకు ప్రాణము లర్పించారే, దానిని మీరు చేతులారా నాశనం చేయబూనింది దేనికొఱకు? ఈవృద్ధపాంచాల సింహం జీవించి వుండగానే క్షత్రియధర్మం దిక్కుమాలిన దవుతుందా?" అనుచు రోషగద్గదయై వచించు ముద్దులకోడలి అభిమానమునకు పర్వతేశ్వరుడు దక్కుజ

మంచుచు, నిరుత్తరుడై ఆసనమున గూలబడి, "ఇంతలేసి వాళ్ల చేత గూడా ఇలా మాటలు పడడానికే, దైవం వితస్తాతీరయుద్ధంలో చంపుకొని పోకుండా, ఈజీర్ణదేహంలో ఇంకా ప్రాణములు నిలిపి వుంచాడు" అనుచు నిట్టూర్పు విడిచెను. స్వర్ణమయి భర్తమూపున జేయివైచి "పిల్లకాయ మాటలు పట్టుకొని దిగులు పడకండి. మీశౌర్యం ఎవరెఱుగనిది. శాంత దుఃఖాంక్రాంతై ఏదో కుఱ్ఱతనపుమాట లన్నది" అని యోదార్చుచు, చంద్రగుప్తుడు శాంతా మనశ్చోరకుడై, గాంధర్వమున నాపైవలిని చెట్టఁబట్టినవార్త అల్లన చెవిదండ బలికెను. "ఎట్లా" అనుచు బర్వతకుడు, శాంతవతిజన నాశ్చర్యావలోకనములు నిగుడ్చ నాయుంపతియు, సస్మితముగ, సలజ్జముగ, సభయముగ నాజేలిపాద ములకు మ్రొక్క నాత డాయమశిరము నిమురుచు "సౌభాగ్యవతిఏక" మ్మని దీవించి, లేవనెత్తి, రాణితో "ఈకాలపు బడుచువాళ్లకెంత స్వాతంత్ర్యం, ఎంత సాహస" మని సస్మితముగా బలికి, కోడలితో "ఇందాకటినుంచీ ఇదంతా భర్త్రాభిమాన మనుకొన్నానుగాని భర్తకోసం పరితాప మనుకోలేదు. ఎంతలో ఎంత మాయలాడివైనావు" అనుచు మేలమాడగా నాయుంవతి చెప్పకుటద్దము నల్లన స్పృశించెను. స్వర్ణమయి "కోడలితో సరసములు తరువాత నాడుదురు గాని ముందు మా అన్నగారికి జాబు వ్రాయండి. చంద్రగుప్తునితో సంబంధం మీకంగీకారమే అని."

పర్వతకుడు.—"ఆవశ్యం. 'శుభస్య శీఘ్ర' మన్నారు. మీఅన్నగారు మాత్రం చంద్రగుప్తునికంటె అధికుణ్ణి ఎక్కడ తెస్తారు. చంద్రగుప్తుడు సర్వథా వృద్ధికాము డవుతాడు. చాణక్యుని ఆశ్రయం ఊరికే పోదు."

అనుచు, అంతకుమున్న రాణి లిఖించి యుంచిన జాబుపై, నాస్త్రీమాలి ముఖాననము సస్మితముగా నవలోకించుచు వ్రాలుంచెను.



# 17

## జ్వాలలు, ఖడ్గధారలు

చాణక్యోపదేశము ననుసరించి మాళవులు, క్షుద్రకులు యవనోత్పాతము నెదుర్కొనుటకు దమ ప్రాతపగలు మఱచి పరస్పరము సంధి యొనర్చుకొనుట క్షేమమని నిశ్చయించిరి. ఈక్రొత్త నెయ్యములకు దోడు ఉభయదేశములవారును వియ్యమందుట కూడ లగ్గని యెంచి ఒక్కపెట్టున అయిదువందల కన్నెలకు వరులను నిశ్చయించిరి. అందు క్షుద్రకపాలుడగు దామోదరుని తనయ రూపమంజరిని మాళవకోట నేలు తాళజంఘున కొసగి పరిణయ మొనర్చిరి.

మఱి యాఱుమాసములకుగాని యవనులు దాడివెడలి రారను నిశ్చయముతో క్షుద్రకమాళవకులు పెండ్లివేడుకలందు మునిగియుండి యుద్ధసన్నాహములపట్ల సించుక ఆలస్యమొనర్చుచుండిరి. ఇంతలో నొకనాటి నడురేయి చారుడొకడరుదెంచి, గాఢనిద్రాధీనమైయున్న మాళవకోటదుర్గమును మేల్కొల్పెను. యవనసేన లైదుదళములుగా జీలి మాళవమునంతటిని చుట్టుముట్టెననియు కామలకోట, హారప్ప, తులాంబ, అవతారీనగరముల యవనులాక్రమించిరనియు, మాళవులు శాత్రవు నెదుర్కొనుటకు సజ్జులుగానుండియును నోపి నంతవట్టు పోరి స్త్రీబాలవృద్ధముగా వేలకువేలు మరణించుచుండిరనియు, పల్లెలు, నగరములు నగ్నిభట్టారకున కాహుతులయ్యె మాళవము సర్వనాశన మగుచున్నదనియు నాచారుడు చెప్పినవార్తవిని తాళజంఘుడు పిడుగడిచినట్లయి కొంతవడికి తెప్పిరిలి, "యవను లెప్పుడు మాళవం ప్రవేశించారు? ఇంతపని యెప్పుడు జరిగింది?" అని ఆశ్చర్యముతో ప్రశ్నించెను.

చారుడు.—వృషపాలనుంచి బయలుదేరిన యవనసేనలు రెండువేలపడవలలో వితస్తానదిని దాటినవి. ఆశిక్నీ వితస్తాసంగమంలో నీటివడి చేత రెండుపడవలు మునిగి కొందరు ఏటిపాలై పోయినారట. మాళవం ప్రవేశించగానే

సేనను అయిదుభాగాలుచేసి అందులో ఒకభాగంతో చక్రవర్తిస్వయంగా బైలుదేరి ముందు శిబినగరం ధ్వంసంచేశాడు. ప్రజలు మబ్బులేని పిడుగు వలె వచ్చిపడిన యీశత్రువులధాటికి తాళలేక గ్రామాలు తగులపెట్టి పారి పోతున్నారు. ఈ అయిదుసేనలూ మళ్లా అశిక్నీ ఐరావతితో కలిసేచోట కలుసుకొంటాయట. ఇక దేవర ఏమి ఆలోచిస్తారో?

తాళ.—"ఇంకా ఆలోచన కేమున్నది? యవనులకంటె ముందు మనమే నదీ సంగమానికి వెళ్లి కాచివుండి అయిదుసేనలు మళ్లా కలుసుకోకుండా ఒక్కొక్క దానినే నాశనం చేతాము." అనుచుండ నీసంభాషణమంతయు చెంతనుండి వినుచున్నక్రొత్తపెండ్లికూతురు రూపమంజరి, భర్తతో "మన బలం ఇంకా యుద్ధానికి సిద్ధంగా లేదుగదా, ఇటువంటి మూకలతో తమరు యవనులపై ఎత్తివెళ్ళడంకంటె కోటలోనే వుండి బలాలు సిద్ధంచేసుకోవడం మంచిది కాదా?" అనెను. తాళజంఘుడు "ఉన్న సేనలో మెరుగైనది కోట లోనే వుంటుంది. దుర్గరక్షణభారం నువ్వు వహించు. యవనులు ఎన్నడో మనకోట ముట్టడికి వచ్చేదాకా నిరీక్షించడంకంటె ఎదురించి పొడిచి గెలవడమే యుక్తంగాతోస్తుంది" అని బదులు పలికెను. రూపమంజరియు నంతట విడువక "దేశాలు తెగించి వచ్చినవాళ్లు గనుక యవనులు ఏమీ చింతా లేకుండా ఎంత దీర్ఘప్రయాణమైనా చేస్తారు. ఎంత వడిగానైనా వచ్చిపడతారు. మనసైనికులు పెళ్లాం బిడ్డలనూ, ఇళ్లూ వాకిళ్లూ వదలి కదలడమంటే కష్టం. యవనబికారుల కున్నంత కటికతనం కూడా మన సంసారుల కుండదు" అనియెను. "నిజమే, మనవాళ్లు కూడా ధనమాన రక్షణంకోసం ఈమండగులలాగా వెనుక జ జాటాలు వదలిపెట్టుకోవాలి. లేకపోతే మనదేశం ఎప్పటికీ ఇంతే" అని తాళజంఘుడు నూత్నవధువును ప్రియమారవీడ్కొని, దుర్గరక్షణమున కాసెలంతను చాలించి తాను కొంత సైన్యము వెంటగొని యవనుల నెదిరింప జనెను.

తాళజంఘుడు ముక్కుడి మూకలతో నైరావతీ తీరము చేరునప్పటికి కప్పుడే ఆలీసాండరు యావద్యవనసైన్యముతో నచట ప్రత్యక్ష మయ్యెను. "మళ్లా కార్యం మించిపోయినదే" అని తాళజంఘుడు వ్రేలు గఱచికొని, సాహసమే బలముగా యవనబలముపై బోయి పడెను. అది యగ్నిలో బడిన శలభములమాడ్కి యగుడు దప్పి తారిన మూకలతో తాళజంఘుడు నింటి మొగముపట్టి పఱతెంచెను. యవనులు వెంటాడి వచ్చుచుండ వారు వెనుకగా, వీరు ముందుగా మాళవకోటలో వచ్చిపడిరి. దుర్గరక్షణమున నప్రమత్తయై యున్న రూపమంజరి భర్తను మాళవసేనలను దుర్గప్రవేశము చేయించి వెంటనే ద్వారములు బంధించి యవన సైనికులలో నొక్కడేనియు గోటలో నడుగిడ కుండ జేసెను. తాళజంఘుడు వెలవెల్లనగుచు భార్యతో "నువ్వు చెప్పినంతా జరిగింది. నీమాట విని దుర్గంలో నేవుంటే ఈఅవమానం తప్పేది" అని పలికెను. రూపమంజరియు, 'ఇపుడు మించిపోయిందిలేదు. ఆలోచనకు వ్యవధానం లేదు. ఒక్కమూర్తైలపాటు కోటను కాపాడగలిగామా అంటే ఇంతలో క్షుద్రకులు సన్నద్ధులై మనకు బాసటవుతారు" అని ధైర్యము చెప్పెను. "ఏమి సన్నద్ధులవు తారో క్షుద్రకులు! వాళ్లు మనకంటెకూడా ఏమరుపాటుతో వున్నారట. ఒక్క మన మాళవకోట తప్ప తక్కిన మాళవదుర్గాలన్నీ శత్రువుల చేతులలో పడినవి" అనుచున్న భర్తతో రూపమంజరి "మాళవదుర్గాలన్నీ పోయినా మాళవశౌర్యం మిగిలి వుంటే చాలు. మాళవాన్ని రక్షించడానికి. ఈయవనులవలె మనంకూడా సర్వానికి తెగించి పోరాడవలసి వుంది. వీళ్లెవళ్లూ స్త్రీజనాన్ని వెంటతీసుకు వచ్చారుకారు. తీసుకువస్తే వాళ్ళనడిగి వుందును. మీమగవాళ్లు రాక్షసులవలె ఎందుకిట్లా మాదేశంమైబడి సర్వనాశనం చేస్తున్నారు? వాళ్ళకు మేమేమి అప కారం చేశాము' అని. ఈప్రశ్న మీమగవాళ్లు అడిగితే బాగుండదు గాని ఆడ వాళ్ళం ఆడవాళ్ళనడిగితే తప్పులేదు. మీరు సేనలను హెచ్చరించండి. నేను కూడా కవచధారణం చేసివస్తాను మీచెంత నిలిచి పోరాడడానికి" అని పోని కేగెను.

ఆలీసాందరు మాళవులను జేయూర్చుకొననీయక వెంటనే ముట్టడి ప్రారంభించి, దుర్గరక్షకుల బాణపాతమును లక్ష్యముసేయక బహిఃప్రాకారము నకు రెండుదెసల గండ్లొనర్చెను. పృథుకేశుడును దాను జెరియొకదళముతో లోనికింజొచ్చెను. దుర్గరక్షకు లంతట వెలుపలి బురుజులు విడిచి అంతఃప్రాకార ముపై నిలిచి యవనుల నరికట్ట దొడగిరి. చక్రవర్తి స్వయము ఖడ్గమాత్రసహా యుడై నిచ్చెనలమీదుగా బురుజుపైకెక్కి అచటి కావలివారల గొందఱి సంహరించి కొందఱిని లోపలికి పడద్రోసెను. ఒంటరియై పోరుచున్న చక్రవర్తి యాపదంగాంచి, బాసటయగుటకు 'మేముం మేమని' తండతండములుగా నిచ్చెన పైకెక్కు యవనవీరుల తోద్రోపులచే నిచ్చెన విఱిగి కూలెను. కోటలోనివారు పలుదెసలనుండి తనపై బాణములు ప్రయోగించుట చక్రవర్తి గాంచి, తన నిస్సహాయత యరసి, ఆత్మరక్షణమునకు వెఱవు గానక శత్రువులను భయపెట్టి పాఱదోలువాడై తటాలున వారిమధ్య కుఱికెను ఆయద్భుతసాహసముచే శత్రువులు చకితులై ఎడగలుగ పాఱి, మఱునిమేషమున శరవర్షముచే నాక్ర మింపజొచ్చిరి. ఇంతలో యవనదండనాథులు గూడ దుర్గప్రవేశముచేసి చక్ర వర్తికి బాసటయైరి. తాళజంఘుడు చక్రవర్తి నెదిరించి పోరి ఖడ్గప్రహారముచే మడిసెను. చక్రవర్తి యంగరక్షకులు శరక్షతులై కూలిరి. భర్త కూలినంతనే రూపమంజరి అధీరగాక మూకల నెలకొల్పి తాను సేనాముఖమున నిలిచెను. రూపమంజరీ చాపవిర్ముక్తమగు శరమొకడు చక్రవర్తి కవచమును భేదించి పక్ష మున గాటముగానాటెను. శరక్షతివలన జివ్వున రక్తము స్రవింప నాలీసాందరు మూర్ఛ మునింగెను. ఇంతలో యవనులమూకలు ప్రాకారమును ద్వారమును భేదించి బిలబిల పురములోనికి జొరబాఱెను. రూపమంజరి ద్వారరక్షణమొన ర్చుచు ఖడ్గహతిచే గూలెను. మిగిలిన మాళవులు స్త్రీబాలవృద్ధముగా యవను ఖడ్గధారల కెరయైరి.

చక్రవర్తి గాయపడినవార్తవిని యవనవాహిను లధీరములై, యార్తిమై హాహాకారము లొనర్ప దొడగెను. తొలుత జక్రవర్తి దివంగతుడయ్యె నను

ప్రవాహము వ్యాపించెను. దేశముకాని దేశమున శత్రుమధ్యమున, అరణ్యములో తోడేళ్లమధ్య జిక్కిన లేటికదుపువలె యవనసేన దిక్కు తెలియక ఇంక ప్రాణములతో స్వదేశము జేరుమార్గ మెద్దియని వాపోవ దొడగెను.

అట జక్రవర్తి పటకుటీరమున కృతద్యుమ్న కృతబలాదులగు వెజ్జులు వక్షమున నాటిన యీటెను పెఱికినచో జక్రవర్తి ఆబాధ నోర్చుకొనునో, లేదో, రక్తమోడినచో ప్రాణములు నిలుచునో, నిలువవో యని కళపళపడ సాగిరి. చక్రవర్తి వెజ్జుల తడబాటు గ్రహించి, "మీరు సంశయింపక ఈటె పెఱికివేయుడు. మేమిచట చావవలసే వుంటే మీరెవ్వరూ తప్పింపలేరు. శరీరంలో ఈయీటెతో పడే యాతనకంటె చావధికంగా"దని తొందరపెట్టెను. కృతబలుడు బాణము తాను పెఱుకుదుననియు, గొందఱు చక్రవర్తిని కదల కుండ బట్టుకొనుడనియు గోరగా జక్రవర్తి "ఎవ్వరూ మమ్ము పట్టుకో వద్దు. మేము కదల"మని చెప్పి కనులు మూసికొనెను. కృతబలుడు మెలకువమై శస్త్రమును వెలికిలాగుచుండ జక్రవర్తి యటులే కనులుమొగిచి నిశ్చలుడై యాబాధ సహించెను. పిమ్మట రక్తస్రావముచే జక్రవర్తి సొమ్మసిలి మూర్ఛిల్ల వెజ్జులును పార్శ్వవర్తులును హతాశులైరి. కాని కొంతవడికి జక్రవర్తి కనులు విచ్చి చుట్టు నున్నవారిని గురుతుపట్టెను. చక్రవర్తి మూర్ఛమునిగి యున్నంతసేపు దీనవదనములతో ప్రాణములు బిగ్గబట్టుకొని పటకుటీరము చుట్టును నిలిచి యున్న సేనలు, చక్రవర్తి తేరుకొనగనే ఒక్కమాఱు దీర్ఘముగ నిశ్వసించి పోయిన తమప్రాణములు తిరిగివచ్చి చేరినవని సంతసించిరి.

చక్రవర్తి వారముదినము లట్లే మంచముపట్టి యుండెను. తనబ్రదుకు పట్ల నాశలువీడిన సేనలకు ధైర్యము గలుపుచు జక్రవర్తి యొకసందేశము వ్రాసి పంపెను. సేన లాసందేశమును నమ్మజాలక అది చక్రవర్తి యంగరక్షకు లొనర్చినతంత్రమని యెంచెను.

తన బ్రదుకుపట్ల నిట్లు సంశయగ్రస్తములైన పరూధినులకు ధైర్యము గఱపనెంచి చక్రవర్తి యొకనాడు సపరివారముగా నావపై నెక్కి వెడలెను. ఆకేశినీ రావీనదసంగమస్థానమున విడిసియున్న సేనలను సమీపించి చక్రవర్తి నావలోనుండియే యెల్లరకు దర్శనమొసగెను. రక్తక్షయముచే పాలిపోయి శుష్కించియున్న చక్రవర్తి రూపముం గాంచి, అది చక్రవర్తి శవముకానోపు నని సేన లింకను సంశయించుచుంట గాంచి, చక్రవర్తి డోలికపై నెక్కి తీరమునకు విచ్చేసెను. సేన లపుడు కనులార చక్రవర్తిం గాంచి ఆనందతాండవమొన ర్చుచు, విజయధ్వానములు సల్పుచు మైమఱచెను. కర్తరీశ తులమావ్రులు "తమరు మాకొఱ కింత సాహసం చేయుట న్యాయం కాదు. దేవరశరీరానికి ముప్పు గలిగితే మాకింక శరణ్యులెవరు? మమ్ము నందరిని స్వదేశమెవరు చేర్చ గలరు" అని గద్గదకంఠులై మందలించిరి. "మాకు వచ్చిన భయమేమీ లేదు. మంచముమీద సంకటపు బ్రతుకుకంటె పౌరుషప్రధానులమైన మాకు కీర్తి కారణమైన మరణమే మేలు. అయినా ప్రియతములైన మీ అందరి ప్రేమాను బంధమే మాకు బ్రదుకుపై తీపి పుట్టిస్తున్న" దని అలీసాందరు మాఱుపలికినంత సేనలు సంతోషము పట్టజాలక దిక్కులదురు జయధ్వానములు సల్పెను.

శరీరము పూర్ణముగా గోలుకొనువఱకు చక్రవర్తి ఆనదీతీరమున నే సేనామధ్యమున వసించెను. పిమ్మట మాళవకక్షుద్రకులు యవనులతో బోరాడ జాలక విసివి, చక్రవర్తికి సింహశార్దూలశ్రేష్ఠములను, మొసలితోళ్లను, అరుదైన తాబేటిచిప్పలను, అరదములను మఱియు పెక్కువిధములైన కానుకలను బంపి శరణము వేడిరి. ఆయారరాజాతులంపిన రాయబారులను చక్రవర్తి సాదరుడై సత్కరించెను. నాటిరేయి యవనస్కంధావారమున బ్రవర్తిల్లిన విజయోత్సవములలో మధుపానమత్తులగు యిరువురు మల్లురు కలహించి మల్లయుద్ధమున కొండొరులతో పన్నిదము సరచి చక్రవర్తిని మాధ్యస్థము కోరిరి. చక్రవర్తిసమక్షమున బ్రవర్తిల్లిన ఆయుద్ధములో మాసిడను మల్లుడగు హారీటుం డోడుటయు,

ఆధీనియామల్లుడగు ధ్యానపాశుడు గెలుచుటయు దటస్థించెను. తమదేశస్థుని యోటమి చక్రవర్తికి నితరులకు దలవంపులాయెను. ఆయవమానము సహింపజాలని మాసిడను సైనికులుగొందఱు నాటిరేయి ధ్యానపాశుని మిష పెట్టిచంపిరి. తన సైనికు లొనర్చిన అకార్యమునకు జక్రవర్తి మిగుల నొచ్చుకొని వగచెను. సాళవరాయబారియొకడు ' మీశరీరాలు తెలుపేగాని హృదయాలు మాత్రం నలు" అని యవనవీరుల నధిక్షేపించెను.

పిమ్మట అంబష్టక్షాత్రయాధేయుల నోర్చి చక్రవర్తి అకేశినీ సింధుసంగమ పర్యంతమగు భూఖండమునకు ఫిలిప్పేశుని మండలాధిపతిగా నభిషేకించెను. ఆసంగమస్థానమున నొకనగరము నిర్మించి యచటనే ఓడలునిర్మించుటకు వలయు వసతు లేర్పఱచెను. అక్కడనుండి సముద్రపర్యంతమగు భూఖండమింకను దాను జయించవలసియున్నను ముందే ఆభూమికి గూడ పాలకుల నభిషేకించి చక్రవర్తి "పండనిపంటకు రైతువలె మేము జయింపనున్న భూముల నిప్పుడే దానము చేయుచుంటి" మని నవ్వుచు బల్కెను.

పిమ్మట నాలీసాందరు సింధువనదుర్గమును ముట్టడించి, అదియెంతకును సాధ్యముగామి, కోటలోనికి భూమిలోనుండి సురంగము దొలిపించి, తద్ద్వారమున గోటలో బ్రవేశించి ఎనుబదివేలశాత్రవుల నుఱుమాడెను. సింధువనపాలుడగు సభేశు డంతట శరణము వేడిన ననుగ్రహించి తద్రాజ్యమున కాతనినే సామంతపతి నొనర్చెను. పిమ్మట మూషకసేనుని అలారనగరముపై నెత్తి విడిసి శరణు జొచ్చిన మూషకసేనున కభయమిచ్చి చక్రవర్తి అలారమున బలిష్ఠమగు దుర్గమును గట్టించెను. పిమ్మట సింధుప్రస్థపాలురగు ఆస్తికసేన పార్థివసేనల నిర్జించి మహోర్ధ్వనగరమును నేలమట్టమొనర్చి తత్ప్రజలను బందిగొని విక్రయించెను. సింధువనపాలుడగు సభేశుడు బ్రాహ్మణచోదితుడై తిరుగుబాటు సల్పెననియు, చాణక్యచంద్రగుప్తులు బ్రాహ్మణులకు ప్రేరకులనియు వార్తయే తేర చక్రవర్తి మండిపడి "ఆపదుచు హాణ్లి, నల్లబాపణ్లీ తప్పిపోనివ్వ

దము ప్రమాదమే అయినది. చేజిక్కినప్పుడే వాళ్లను మట్టుపెట్టవలసింది.. బ్రాహ్మణు లింతగా చెలరేగడాని కానల్లబాపడే కారణం. పర్వతకరాజ్యం లోనూ, తక్షశిలలోనూ బ్రాహ్మల కింతఅధికారం వున్నట్లులేదు. మాళవక్షుద్ర కులలోనూ, సింధుదేశంలోనూ వీళ్లు ఆడినదాట, పాడింది పాటగా వుంది" అని పలుకుచు సింధువనముపైకి సేనల నడిపించెను.

యవనులరాక వినుచునే సభేశుడు పలాయితుడయ్యెను. ఆలేసాందరు సింధువనదుర్గముంజొచ్చి అచటి గజబలమును ద్రవ్యమునుగొని బ్రాహ్మణనికేతన మగు బ్రహ్మస్థలముపై నెత్తివిడిసెను. అచటిబ్రాహ్మణులు దుర్గమును విడుచుటకు నిరాకరించి పోరిరి. యవనులు వారల నిర్జించి ఆఱునూర్ల బాపలను సంహరించి వేయిమందిని బంధించి విక్రయించిరి. కాని నాటియుద్ధములో బ్రాహ్మణచాప ముక్తములగు విషలిప్తబాణములు నాటిన యవనులెల్ల మడిసిరి. చక్రవర్తికి ప్రియతముడును బాంధవుడునగు తులమావికి గూడ నట్టి విషలిప్తబాణమొకటి నాటెను. ఆలిసాందరు నాటిరేయి తులమావిచెంతనేయుండి సమస్తోపచార ములుచేసెను. ఎన్ని చికిత్స లొనరించినను విషము విఱుగదాయెను. పిమ్మట నొక బ్రాహ్మణుడు రహస్యముగా జక్రవర్తిని దర్శించి, ఆవిషమునకు విఱుగుడు తెలిపి, కోటలో నింకను మిగిలియున్న బ్రాహ్మణులను రక్షింపుడనియు, తానీచికిత్స చేసి నట్లు వెల్లడి కానీయవలదనియు వేడుకొనెను. చక్రవర్తి వల్లెయని, నాటిరేయి దనకు స్వప్నమున నొకదేవత సాక్షాత్కరించి విషచికిత్స తెలిపెనని యెఱింగించి తులమావిని బ్రాహ్మణోపదిష్టౌషధ ప్రయోగముచే బ్రతికించెను. మఱునాడు బ్రహ్మస్థలమునుగైకొని పదిమంది విప్రముఖ్యులను సంహరించెను. పాఱిపోయిన పాఱులవెంట సేనలనంపి, చేతికందినవానినెల్ల సంహరింప నాజ్ఞ యిచ్చి, "వారిలో గట్టివాళ్లను పదిమందిని ప్రాణములతో పట్టి తీసికొనిరండు. వాళ్లను చంపేముందు వారిప్రజ్ఞ యెట్టిదో పరీక్షించవలెను" అనియెను.



# 18

## యక్ష ప్రశ్నలు

పేరుగల బ్రాహ్మణపండితుల బృందం గొనితెచ్చి చక్రవర్తి ముందు నిలిపిరి. చక్రవర్తి వారలాగాంచి, "మిమ్ము ఉరితీయించే ముందు మీపాండిత్య మెటువంటిదో పరీక్షిస్తాము. మీఅందరిలోను బుద్ధిమంతుడైనవాణ్ణి తీర్పరిగా ఎన్నుకోండి. పక్కనవాళ్ల నొక్కొక్క ప్రశ్నచొప్పున అడుగుతాము. ఎవరి జవాబు అధమమని తీర్పరిచెప్తాడో వానిని మొదటగా ఉరితీసి పిమ్మట అంత కన్న మంచిజవాబు చెప్పినవాళ్ళనే క్రమంగా ఉరితీస్తాము" అని పలుక, బ్రాహ్మణులు వెంటనే వైజయంతుని తీర్పరిగా వరించిరి. చక్రవర్తి "చాలా త్వరగానే ఎన్నుకొన్నారే తీర్పరి"నని ఆశ్చర్యమున బలుక, "దీపపుగాంతిని పాండిత్యప్రకర్షను నిర్ణయించడం బహుసులభ"మని వారు బదులుచెప్పిరి.

పిమ్మట చక్రవర్తి వారినొక్కొక్కరినే ప్రశ్నింప వారు బదులు చెప్ప దొడగిరి.

చక్రవర్తి.—చచ్చినవారి సంఖ్య ఎక్కువా? జీవించివున్నవాళ్ల దెక్కువా?

మొదటిబ్రాహ్మ.—పోయినవాళ్లుపోయినవాళ్ళేగనుక ఉన్నవాళ్ల సంఖ్యేఎక్కువ.

చక్ర.—సముద్రంలో ఎక్కువుందా, జీవరాశి నేలమీద ఎక్కువా?

రెండవ.—సముద్రంకూడా భూమిలోదేగనుక భూమిమీదే ఎక్కువ.

చక్ర.—అన్నిజంతువులలో తెలివైనదేది?

మూడవ.—మనుష్యుడి కింకా గ్రాహ్యంకానిదేదోఅది. మనుష్యుడనేతాత్పర్యం.

చక్ర.—సభేశుణ్ణి మామీదికి మీరెందుకు పురికొల్పారు?

నాలవ.—ఆతడి చావుబ్రదుకులు మాన్యం గావాలని.

చక్ర.—వయసులో ఏది పెద్ద, పగలా, రాత్రా?

ఐదవ.—రాత్రి ఒకరాత్రిపెద్ద, పగ లొకపగలు పెద్ద.

చక్ర.—చిత్రంగా వున్నదీ జవాబు !

ఐదవ.—చిత్ర ప్రశ్నకు చిత్రోత్తరం.

చక్ర.—ప్రేమపాత్రుడు కాగోరేమనుష్యు డేమిచేయవలసి వుంటుంది?

ఆఱవ.—ప్రతాపశాలియై, భయంకరుడు గాకుండా వుండాలి. ప్రతాప హీను నెవరూ ప్రేమించరు. భయం ప్రేమాంకురాన్ని గిల్లివేస్తుంది.

చక్ర.—మానవుడికి దేవత్వం ఎలా లభిస్తుంది?

ఏడవ.—అనన్యసాధ్యమైన కార్యం చేయడంవల్ల.

చక్ర.—చావుబ్రదుకులలో ఏది అధికం?

ఎనిమిదవ.—దుఃఖాలు భరిస్తూ నిలిచివుండేది బ్రదుకు; దేనిని భరింపక సర్వ శూన్యం చేసేది చావు. కనుక బ్రతుకే పెద్దది.

చక్ర.—మానవునకు బ్రదుకుపైగోరిక ఎంతవఱకు?

తొమ్మిదవ.—ఆలోచించి చూస్తే బ్రతుకుకంటె చావే మేలని తోచేవఱకు.

చక్రవర్తి.—(తీర్పరితో) నీ తీర్పు ఏమని?

తీర్పరి.—ప్రతివాడూ, తక్కిన వారికంటె అధమంగా జవాబు చెప్పాడు.

చక్రవర్తి.—ఓహో ! అలాగా ! అయితే ఇటువంటి తీర్పు చెప్పినందుకు ముందు నిన్నే ఉరితీయిస్తాము.

తీర్పరి.—అందరిలోకి అధమమైన జవాబుచెప్పినవాణ్ణిముందుగాచంపుతామని సెలవిచ్చారుగనుక, నాజవాబు అధమంగావుందని రుజువయ్యేవఱకు నన్ను చంపడానికి వల్లగాదు. ప్రభువులు మాట తప్పకండి.

చక్రవర్తి వారల సమయస్ఫూర్తికి సంతసించి తలకొక హొన్నమిడి అందఱ విడిచిపుచ్చెను. బ్రాహ్మణులు సంతసించుచు దమదారి నేగిరి. ఆకె సౌందరు కల్యాణస్వామిని, "ఇంతటి పండితులకు గూడా ద్రవ్యమంటే ఎందుకింత సంతోషం" అని ప్రశ్నింప, నాతడు, "ఎంత జ్ఞానికైనా భుక్తి తప్పదు.

అందుకనే మావాళ్లు అన్నమే బ్రహ్మమన్నారు. ధర్మహాని లేనంతవఱకు ప్రతిగ్రహంవల్ల జీవించడం దోషం కాదు. అందులోనూ మీవంటి ప్రభువులు దాతలైనప్పుడు ప్రతిగ్రహం దోషమే కాదు" అని బదులాడెను.

అంతట నొక దండనాయకుడు పౌలోమి యను వనితను గొనితెచ్చి, చక్రవర్తి ముందు నిలిపి, "దేవరను సంహరించాలని యత్నించిన తాళజంఘుని తల్లి ఈవిడ" అని విన్నవించెను. నిర్వికారయై నిలిచియున్న పౌలోమిం గాంచి చక్రవర్తి "మేము ఇంద్రతనయులము కామని చెప్పావట ఎందువల్లనమ్మ?" యని ప్రశ్నించెను. పౌలోమియు, "ఇంద్రపుత్రు డెన్నడూ బాణక్షతుడై బాధపడడు; గదాహతుడై మూర్ఛపోడు. ఇంద్రపుత్రుడు పరరాజ్యాలపై అకారణంగా దండెత్తడు. ఆత్మరక్షణంకొఱకు కత్తికట్టినక్షత్రియులపై పగబూన డింద్రతనయుడు నిరపరాధులైన స్త్రీబాలవృద్ధులను సంహరింపడు" అని నిర్భయముగా బదులుపలికెను. దండనాథు డాగ్రహోక్తులు సహింపక, "సెలవైతే ఈయాడదాన్ని కూడా ఉరితీస్తాను" అని విన్నవింప, పౌలోమి "మహాభాగ్యం, నాయనా! అంతకంటెనా! త్వరగా తీర్చుకో ఆముచ్చట. ఆనాడు మాలవకోటలో లేకపోవడంచేత తప్పిపోయినాను గాని లేకపోతే నాకొడుకుకూతుళ్లతో పాటు చావవలసినదాన్ని. నన్నుమాత్ర మెందుకు మిగల్చటం? కానిం"డనెను. చక్రవర్తి ఈషదవనతవదనముతో, "ఆమెను పోనివ్వండి, కొడుకును చంపామనే అక్కసుకొద్దీ ఆమె పలికేమాటలు ఇంద్రపుత్రులం మేము లెక్కచేయము. మాతల్లిగారుకూడా, ఇటువంటి అవస్థపట్టితే ఇలాగే ప్రవర్తిస్తుంది. పో, అవ్వ! పో, ఇకనైనా జాగ్రత్తగా మసలుకో" అనెను. పౌలోమి, 'ఈజన్మాని కింతేజాగ్రత్త. నాకొడుకు పగదీర్చి, నాభర్త రాజ్యానికి చెఱమాన్పేదాకా నాకోపం చల్లారదు" అనుచు వెడలిపోవుచుండ వెంటనున్న దండనాయకుడు "అవ్వా! అధికప్రసంగం చేయ" కనెను. పౌలోమి, "అధికప్రసంగ మేముంది బాబూ! ఇందులో! ధీరుడైనపురుషు

డొక్కడు మాకుచేసిన అపకారానికి ధీరురాలైన ఆడది మాత్రం ప్రతికారం చేయలేదా?" అనుచు నేగెను. ఈమాటలు వినుచున్న కల్యాణస్వామితో నాదండనాథుడు "విన్నారా, ఆయవ్వమాటలు? ఈవిడ ఏమిచేయగలుగుతుంది?" అనెను. కల్యాణస్వామి "ఏమి చేస్తుంది? స్వయంగా ఏమీ చేయలేదు" అనెను. దండనాథుడు "మఱియెందుకా ప్రగల్భాలు?" అని ప్రశ్నింప, కల్యాణస్వామి "ప్రగల్భాలకేమి! అందరం ప్రగల్భాలు పలుకుతాము. పలికినంత చేయడం చక్రవర్తికిగూడా సాధ్యంకాదు" అనెను. ఆలీసాందరామాటలాలించి, "కల్యాణస్వామీ! మేము కూడా ప్రగల్భాలు పలుకుతామా?" అని ప్రశ్నించెను. కల్యాణస్వామియు, "చిత్తం మధుపానవేళ ప్రభువుల గంభీరహృదయం కూడా కొంచెం శ్రుతిమించి పలుకుతుంది. పురపుర పొంగే మినపపిండిలాగ మహాపురుషహృదయాలుకూడా పొంగుతవి. భర్తలు, వీరులు, జ్ఞానులూ అంతా, ఆవేశంచెంది పలుకుతారు. ఈకల్యాణస్వామి కూడా నాయంతటిజ్ఞాని లేడని పొంగుతాడు. అపొంగు చల్లారినమీదట అజ్ఞానినని గుర్తిస్తా" డనెను. ఆలీసాందరు, "స్వామి ఇవ్వాళ విషాదయోగంలో పడ్డారు, దండిస్వామివలె, రండి, మధుపానమే దీనికిమందు" అనుచు లోనికిగొంపోయి కొంతవడి అతనితో సల్లపించెను.

ఆలీసాం.—మాగురుదేవులు అరిస్టాటిలువారు మహాజ్ఞాని. వారివల్లనే మేము పురుషార్థపరుల మైనాము. వారికి గూడా స్వాభిమానదోష ముండేది. మాకంటె ఇతరులంతా అనాగరకులూ, ఆటవికులూ అని వారిఅభిప్రాయం. పారసీకులతోనూ, భారతీయులతోనూ మాకు పరిచయం గలిగినమీదట ఆదురభిమానం నశించింది. దండిస్వామికంటె సిద్ధులూ, పర్వతకునివంటి మహావీరులూ ఉన్నారీదేశంలో.

కల్యాణ.—నిజం. అలాగే మేము ఆర్యుల మని గర్విస్తాము. ఇతరుల మ్లేచ్ఛులని నిరసిస్తాము. దేశాటనంవల్లా, అనుభవంవల్లాగాని ఈదురభిమానాలు నశించవు.

ఆలీసాం.—ఈ పరభిమానాలు నశింపజేసి విశ్వమానవసమానత స్థాపించడమే మాఆశయం.

కల్యాణ.—ఆశుభకాల మెన్నటికో!

---

# 19

## కిరీటధారికి కంఠపాశము

సింధుదేశమున బ్రాహ్మణతంత్ర మింకను సాగుచునే యుండెను. పోలోమిని విడిపుచ్చిన మూడుదినములకే మూషకసేనుడు తిరుగబడినవార్త యేతెంచెను. "వీళ్ల ఆగడం మితిమీరిపోతున్నది. సభేశునిదురవస్థ చూచి కూడా యీరాజులు బ్రాహ్మలమాటలు విని చెడిపోవడం వింతగావుంది. పాము రులు సరేసరి. ఎంత లెంతటివాళ్లైనాకూడా యీబాప లాడించినట్లు ఆడు తున్నారు. చేతజిక్కిన బ్రాహ్మలందరినీ సింధువనంలో ఉరితీసి చంపిస్తిమి. ఇంకా వీళ్లకు బుద్ధిరాలేదు సరిగదా, దేశమంతటా చిచ్చు ముట్టిస్తున్నారు. ఈదుస్తంత్రమంతటికీ మూలకారణం చాణక్యుడని తోస్తుంది" అనుచు చక్ర వర్తి ఆగ్రహావిష్టుడై, పైథాను దండనాథుని బిలిచి "నీవు నీసేనతో మూషక సేనుణ్ణి వెంటాడి పట్టుకురా, మే మాతని దుర్గములపై ఎత్తివెళ్లి వానిని నేల మట్టము చేస్తాము. కంటబడిన బ్రాహ్మలందరినిఉరితీయించు" మని ఆజ్ఞనొసగెను. ఇంతలో కొందఱు చారులేతెంచి, చంద్రగుప్తుడొక రాజపుత్రికను పెండ్లి యాడెననియు, ఆరాకుమారుని శరీరమును సింగము నాకినదనియు, నాకారణ మున నాతడు చక్రవర్తి యగుననియు వదంతి యొకటిదేశమునల్లడల వ్యాపించె ననియు, రాజులెల్ల రావార్త నమ్మి చంద్రగుప్తు నాశ్రయించుచుండి రనియు, కాథేయులుగూడ ప్రాజాపత్యమును వదలి, చంద్రగుప్తు దమకు నేలికగా వరించి రనియు, చాణక్యుడు 'భారతభూమిని యవనపాశములనుండియు, పర్వతక బంధనమునుండియు విడిపింపగలవాడు చంద్రగుప్తుడే' యని చెప్పి బ్రాహ్మణ

బృందము నెలకొల్పుచుండెననియు విన్నవించిరి. చాణక్యోపదిష్టమగు భారతస్వాతంత్ర్యగీతము దశదిశల బ్రతిధ్వనించుచు ప్రజలకు వీరావేశము నుత్పాదించుచున్నదనికూడ చారులు విన్నవింప, నాలేసాందరాలించి "మంచిది. ఈ చాణక్య చంద్రగుప్తులిప్పించే స్వతంత్ర మెటువంటిదో ఈపామరులకు తెలియడంలేదు. మమ్ము వంచింపడానికి పన్నిన పన్నుగడే కాని చాణక్యునకు చంద్రగుప్తుడికి దేశం పరాధీనమైనదనే విచారంలేదు. వీళ్ల నిక విడిచి పెట్టరాదు. ముందు మూషకసేనుని తుదముట్టించి, పిమ్మట వీరిపని పట్టింతుము" అని మూషకసేనుని కోటలపై నెత్తిచని వానిని నిర్మూలమొనర్చి, అచటి విప్రులనెల్ల నురితీయించి, ప్రజలనెల్ల బంధించి జట్టి కమ్మివైచెను. ఇంతలో పైథాను దండనాయకుడు మూషకసేనుని ససైన్యముగా బరాజితునొనర్చి బంధించి తెచ్చెను. చక్రవర్తి యూతనిం గాంచి, "ఎందు కింతమూర్ఖం చేసితి" వని ప్రశ్నించెను. మూషకసేనుడు, "నాచావు బ్రదుకులు సమ్మాన్యంచేయడమే నాకోరిక. నాచబిడ్డకు సంగరమరణం, తప్పితే, అగ్నిప్రవేశంచేత భీరుత్వాన్ని దహించి తిరిగి అగ్నికులుడై జన్మించడం,—ఈరెండే మార్గాలు. ఈరెంటిలో ఉత్తమమైన మొదటిమార్గాన్నే ఆశ్రయించాను; మాక్షత్రధర్మం ఎటువంటిదో మీకు తెలపడానికి" అని బదులుచెప్పెను.

ఆలీసాందరు.—మంచిది. మాధర్మంకూడా ఎటువంటిదో నీకు ఇప్పుడే తెలియజేస్తాము. నీకీతంపిపెట్టిన బ్రాహ్మలు పదకొండుమందినీ, నిన్నూ ఒక్కసంక్తిని ఒక్కముహూర్తంలో, ముచ్చులను జంపినట్లు ఉరిబోసి చంపిస్తాము. ఇంతకంటె సమ్మాన్యం కానివ్వం నీచావు.

మూషకసేను.—మహాప్రసాదం. నాదేశంకొఱకు చావడంకంటె నాకు కావలసిం దేమున్నది! నిశ్చింతగా ప్రాణాలు విడుస్తాను. కాని ఇంతటితోనే నీకోరిక నెరవేరిందని భ్రాంతిమాత్రం పడకు. చాణక్యదేవులూ, చంద్రగుప్తమహారాజూ మిమ్ము ఏడాట లాడించి, వచ్చినదారినే పట్టిచేతులతో

ఈదేశంనుంచి తరమకుండా విడువరు. నీవుచేసిన గోబ్రాహ్మణహత్యలకు, స్త్రీ బాలవృద్ధమారణానికి తగినఫలం నిన్నూ, నీఅనంతరం నీవారినీ కట్టికుడుపు తుంది. బాబిలోనులో మహామారి మీవాళ్లనందరినీ పొట్టను బెట్టుకొంటుంది. నీరాణులలో ఒకతెకు రెండవదానిచేతిలో చావు సూటిస్తుంది. రెండో రాణికూడా సపుత్రకంగా దుర్మరణం వాతబడుతుంది. మిగిలివున్న కొడుకు కూడా హంతకుడికిద్దాని కెరఅవుతాడు. నీసవతితమ్ముడికీ, నీతల్లికీ కూడా ఆదేగతి పట్టుతుంది. నీవు చచ్చిన పంద్రెండేళ్లకు నీవంశం నిర్వంశ మవుతుంది. నీసేనానులు ఈర్ష్యాసూయావశులై పరస్పరం కొట్టుకు చస్తారు.'' అనుచు గన్నుల నిప్పులురాల శపించెను. చక్రవర్తి సందర్లు గీటుచు "వీణ్ణితీసుకుపోయి ఉరితీయండి ఆపదకొండుగురు బ్రాహ్మలతో గూడా పీనినగరంలోనే ప్రజలయెదుట ఉరితీయండి'' అని ఆజ్ఞాపించెను.

మూషకసేనుని బదకొండుగురు విప్రులతో గూడ అలారనగరమధ్య మున మహాజనసమక్షమున ఉరితీసి చంపిరి. ఉరికంబము లెక్కుటకు బూర్వ మా పంద్రెండుగురు మాళవగీతము నేకకంఠమున నిట్లు పాడిరి.

స్వేచ్ఛకొఱకే మేము బ్రదికేము
స్వేచ్ఛకొఱకే ప్రాణ మిచ్చేము
స్వేచ్ఛకొఱకే పాట పాడేము
స్వేచ్ఛకొఱకే యుసురుల ప్రేలేము
సామమ్ముచే మోసపోయేమా
దానమ్ములకు దేశమమ్మేమా
భేదాలచే చీలిపోయేమా
దండమ్ములకు వెఱచి పఱచేమా!
బొమ్మరిల్లే మాకు చెఱసాల
పట్టబంధమె మాకు ఉఱిత్రాడు

పూలచెల్లే మాకు సురపోటు
తల్లిదేశమె మాకు దైవమ్ము.
అన్నలారా! రండు రండోయి
దాస్యబంధము త్రెంప రండోయి
ముందడుగు వేసి నడవండోయి
స్వేచ్ఛస్వర్గము పట్టుకోండోయి
స్వాతంత్ర్యమే తల్లి మనకెల్ల
అరుణోదయమె తండ్రి మనకెల్ల
తల్లికౌగిట వ్రాల రండోయి!
కష్టనష్టము లెంచకండోయి!
స్వాతంత్ర్యతీర్థమ్ము దోడాల
బాటపాడుగున ముండ్లతోడుగేను
స్వేచ్ఛాపిపాసులకు దవ్వేది!
దేశభక్తులకు గడగండ్లేవి!
స్వేచ్ఛ పయ్యెరగాలి సాగింది
ఒడలు చల్లగ సోకి పిలిచింది
స్వేచ్ఛామురళి చెవుల మ్రోగింది
బంధమోక్ష మ్మెదుట పిలిచింది.

స్త్రీలెల్లరు స్వేచ్ఛామధురగీతపరవశంవదులై వారితో గంఠములు గలిపి పాడుచుండ యవనసేనాలు వారింపదొడగిరి. ప్రజలు యవనుల బెదరింపులకు భీతిల్లక "మమ్ము గూడా ఉరితీయండి" అని ముందున కురుకుచుండ, మైధాను దండనాయకుడు, "మిమ్మందరిని ఎవడు ఉరితీస్తాడు? మా కేదిరో పనియా" యని ఆపండ్రెండుగురి కంఠములకు బాశములు తగిలించి వ్రేలదీయించెను. ప్రజలెల్లరు "జయజయ రామా! సీతారామా!" యనుచు జప్పటలు

సరచిరి. పైథాను ప్రజలయావేశమును గోలాహలమును గాంచి, చెంతనున్న దిశవాయితో, "వీరితో ఎవడు వేగగలడు! నారాచరికాని కిక నీళ్లనదలుకో వలసిందే" అనుచు గదలిపోయెను.

---

# 20

## ఇంద్రపుత్రనిర్గమనము

సింధుదేశమున పాటలపురపాలకుడు మహారాజబిరుదాంచితుడు. అత డంపిన కానుకలును గప్పము నందుకొని, అలిసాందరు పాటలపురము జేరబోవ, మహారాజు, బ్రాహ్మణక్రోధమునుభరింపజాలక ప్రకృతివర్గముతో గుండపురము వెడలి దేశమును బాడుపెట్టిపోయెనని తెలిసెను. చక్రవర్తి ఆపురమున విడిసి యచ్చటనుండి హెఫిస్థాను నచట దుర్గనిర్మాణమునకు నియోగించెను.

పొలములు పాడుపెట్టి ప్రజలు లేచిపోవుటచే సేనలకు జాలినంత ఆహారము లేదు బావులన్నిటిని ప్రజలు పూడ్చివేయుటచే త్రాగుటకు మంచినీళ్లులేవు. బావులు త్రవ్వుటకు యత్నించువారలను బ్రాహ్మణప్రేరితులగు శత్రువులు దొంగపాటున సంహరించుచుండిరి. ఇటువంటి శత్రువులమధ్య తాను సిక నివసించుట యెట్లులని పైథానుసేనాని విషాదమంద దొడగెను. చక్రవర్తి యానతిచొప్పున కర్తరేశుడు గజబలమును ప్రణితులను వెంటగొని కార్మన్యదేశమున కరిగెను. చక్రవర్తి సింధునదివెంట సముద్రముదనుక సేనలతో జనుచుండెను. ఇక నిచట మిగిలిపోయినవారి కేమి దిక్కని పైథానుకు దిగులు జనించెను.

చక్రవర్తి నావలునడపి మార్గమెఱిగించుట కచట హిందువు లెవ్వరును లభింపమి, దేశమధ్యమునకు సైనికులనంపి, యటనుండి నావనడపువారల బట్టి తెప్పించి ప్రయాణము సాగించెను. సింధునదము పాటలముచెంత రెండు శాఖలై ప్రవహించుచుండెను. చక్రవర్తి దక్షిణశాఖవెంట జని కొలుాశము

జేరెను. అచట సేనలకు చాలినంత మంచినీరు లభించెను. అచట జక్రవర్తి దేవతలకు బ్రీతిగా బలులొసంగి, అటనుండి సముద్రముంజొచ్చి యిరువదియోజనముల దవ్వరిగి అచట నొకద్వీపముం జేరెను. ప్రశాంతగంభీరమగు సముద్రముంగాంచి మెచ్చుచు, దన్నటకు జేరదెచ్చిన యిలువేల్పులకు, జలాధిదేవతలకు వృషబలియు స్వర్ణకలశములును సమర్పించెను.

అటనుండి మరలి పాటలముం జేరి వామశాఖవెంట జని నారాయణ సరోవరముం జేరెను. ఆసరస్సున శ్రేష్ఠములగు మత్స్యజాతు లెన్నియేనియుం నుండుటచే దత్తీరమున యవనసేనలు నిలిచెను. చక్రవర్తి యటనుండి అశ్విక దళముతో గదలి సముద్రతీరమంతట దిరిగి బావులు త్రవ్వించెను. పిమ్మట బాటలమునకు నావలతో దిరిగి యేతెంచి యచట నౌకాశ్రయము నిర్మించిన యార్యుని నావలతో కొలూతమున నిలిపి, యానానుకూల్యత విచారించి సముద్రముంజొచ్చి, పారసీకముం జేరుమని నియమించెను. పిమ్మట దాను బశ్చిమాభిముఖుడై సైన్యములతో బాబిలోనుకు బ్రయాణమయ్యెను.

పురళినదిం దాటి, అఘోరసీమంజొచ్చి, యచట దమ్మెదిర్చిన మూకలం దఱిమి యవనులు రామబాగునందు విడిసిరి. ఆప్రదేశము నివాసయోగ్యమని యెంచి, చక్రవర్తి యచట గొందఱి నిలిపి, యట గదలి ఓరాపురముం జేరి యచట కద్రూజా ఘోరజాతుల కభయ మొసగి, ఆమండలమునకు ఉపలపాణి (Appolophanes) నధీశ్వరునింజేసి సింహనాగు (Leomatus) నాతనికి బాసటగా గొంతసేనతో నిలిపెను.

అటనుండి హెఫిస్థానముఖ్యులగు సేనానులతో జక్రవర్తి ససైన్యముగా దుర్గమములగు కద్రూజా (Gadrosia) రణ్యామార్గములంబట్టి చనదొడగెను. త్రోవలో నెందును జనపదములు లేమింజేసి అన్నము, నీరు లభింపక పెక్కురు మడిసిరి. దుస్సహ తీక్ష్ణాతపబాధకు తాళలేక, కంటకావృతమార్గముల గాళ్ళువ్రచ్చి కొనుచు బోవంబోవ. దుద కొక్కచో నొండు రెండు పక్కణములు గంట

బడెను. అచటలభించిన ధాన్యములో గొంతభాగము నాయార్యున కిచ్చిరండని కొందఱిని నియమింప వారా సంచులమూతులు విప్పి ఆధాన్యమును దామే ఆహరించిరి. అన్నాతురులై వారు సల్పిన యీదోషమును జక్రవర్తి సైచెను. త్రాగుట కిన్ని మంచినీళ్ళైన దొఱకక, త్రోవ కిరుదెసల నారసములవంటి ముండ్లతో బలిసియున్న పొదలచే నొడళ్లు రక్తసిక్తము లగుచుండ నడచు నాసేనలో నాకలిబాధచే గొంద ఱీల్గిరి. దప్పిచే నోళ్లెండి కొందఱు గూలిరి. పవళ్లెల్ల నిద్రించుచు రాత్రులందు బ్రయాణము సాగించుచు జను నాసేనలకెల్ల నగ్రమున జక్రవర్తి తాను గూడ పాదచారియై యరుగుచు ధైర్యము గఱపుచుండెను. ఒకచో పానయోగ్యమగు పల్వలోదక మొక్కింత గనులబడ సైనికులా చేరెడునీటిని శిరస్త్రాణమున బట్టి ప్రాణపదముగా గొనిపోయి చక్రవర్తికి త్రావ నిచ్చిరి. అమ్మహావీరుడు శిరస్త్రాణమునందున్న జలము నందుకొని, త్రావబోయి, దీనవదనములతో నసవంక గనుచున్న సైనికులం గాంచి, ఆనీరము నచట బాఱపోసి, "అందరికీ చాలినంతనీరు దొరకినప్పుడే త్రాగుదాము" అని ముందునకు నడచెను. సేనలు పట్టరాని సంతోషమున జక్రవర్తివెంట ధైర్యమునై నిడుములోర్చుచు జనజొచ్చెను. ఇట్లు రెండుమాసములు నడచి, త్రోవలో మరణింపగా మిగిలిన కతిపయ సైనికులతో నాలీసాందరు పారాపురము జొచ్చెను. తొల్లి భారతభూమి నాక్రమింపవచ్చిన శ్యామరామ (Semiramis) యనురాణి పలాయితయై పోవుచు నీయరణ్యముం జొచ్చి తుద కిర్వదిమందితో బయటబడెను. సురేశ (Cyrus) చక్రవర్తి యీయడవిం జొచ్చి యేడుగురతో మాత్రము ప్రాణములు దక్కించుకొనెను. భారతభూమింజొచ్చి, విజయలక్ష్మిని జేపట్టి, మృత్యుకల్పమగు కద్రూజారణ్యమును దానొక్కఁడు సేనలతో దాటగలిగితి నని చక్రవర్తి యెంతయు సంతసించెను.

సేనలు సేదదేఱు దనుక జక్రవర్తి పారాపురమున విడిసియుండెను. అచటనున్న కాలముననే ఉపలపాణి దుర్జయుడై ప్రజలబీడించుచున్న వార్త

యేతెంచెను. చక్రవర్తి ఆతనిస్థానమున మఱియొక సేనాని నధీశునిగా నియో
గింప నాతడు మరణించెను. ఆతని యనంతరమున శివరాతుని (Sibyrtios)
గద్రూజాఘోరమండలాధీశ్వరుని గావించెను. పిమ్మట కార్మణ్యాసీమం జొచ్చి
చక్రవర్తి చనుచుండ సింధుమండలేశ్వరుడగు ఫిలిప్పేశుని శవనుచరులే సంహ
రించి రనువార్త యేతెంచెను. వెంటనే సింధుమండలాధిపత్యము వహింపు డని
ఉద్దామునకు, దక్షశిలాపతియగు నంభికి వార్త పంపి చక్రవర్తి సాగి చను
చుండెను. కర్తరీశుడు గజబలముతో నేతెంచి చక్రవర్తిని గార్మణ్యమున
నుండగనే గలిసికొనెను.

కార్మణ్యమున బ్రజలను పీడించుచున్న తన ప్రతినిధులను జక్రవర్తి
పదభ్రష్టుల గావించి మరణదండనము విధించెను. "ఇచటి ప్రజలు మనదేశ
స్థులు కాకపోయినంత మాత్రాన వారిని పీడించడం మేము సహింపము. ప్రాచ్య
ఖండ సార్వభౌములమైన మేము వివిధదేశాలలో వున్న మా ప్రజలలో భేదం
పాటించము. ఇదిగో? ఈకల్యాణస్వామి నడగండి, ఏమి చెప్పుతాడో! ప్రజ
లలో స్వపరభేద మెంచినరాజు, తస్కరుడవుతాడుగాని రాజు కాడని భారత
ధర్మం చెప్పుతున్నది." అని చక్రవర్తి తన సేనానులకందఱకు దెలియ జెప్పెను.

కార్మణ్యమును విడిచి చక్రవర్తి సౌజాదెసకరుగుచు, బూర్వదిగ్విజయ
యాత్రావిశేషములను స్మరించి, చెంతనున్న ఆప్తులతో "భారతవాస్తవ్యులు
మే మింక తిరిగి రామని చెలరేగుతున్నారు. పడమటికి సాగుతున్న ఇంద్ర
పుత్రుడు, మళ్లా ఎప్పుడో వున్నట్లుండి, తూర్పుదిక్కుకు వజ్రపాతం వలె వెళ్లి
పడునని ఎఱుగరు" అని పలికెను.

---

# 21

## సార్వభౌముడు లేని సామంతులు

క్రీస్తుదైవతము పుట్టుకకు పూర్వము 325 వ సంవత్సరము సెప్టెంబరు మాసమున అలీసాందరు భారతమును విడిచి పశ్చిమాభిముఖుడయ్యెను. చక్రవర్తి అప్పటికి దా జయించిన మండలములలో జాలచోట్ల పూర్వపు భారతభూపతులనే పునః ప్రతిష్ఠించెను. కొన్నిచోట్ల తన సేనానులనే సామంతుల నొనర్చెను. అందు సింధుసంగమభూములకు పైధానుసేనాని నధిపతిని గావించి, అక్షరాత్తు (Oxyertes) నాతనికి బాసట యొసగెను. సైంధవవన, మహోర్ధ్వ, అలార, పాటలదుర్గములకుం బాలకు డగుటయేగాక పైధానుసేనాని, మూషకసేన పత్తేశాదులమండలములకు సార్వభౌమ ప్రతినిధియై యుండెను. కాలాంతమున నావలతో నిలిచియున్న నయార్చునకు పైధాను బాసటగా నుండెను.

సింధూర్ధ్వమండలముల కన్నిటికి ఉద్దాముడను సేనాపతి అధీశుడై పరిపాలించుచుండెను. ఉద్దామపరిపాల్యములగు భూములకును, తాక్షాశపుష్కలావతీ నికాయవృషఫాల సంగాలాదినగరములందు చక్రవర్తి నిర్మించిన దుర్గములకును ఫిలిప్పేశుడు మహామండలేశ్వరుడు. అభిసారార్శ్యదేశపర్వతకాంభుల రాజతంత్రమును ఫిలిప్పేశుడే సార్వభౌమప్రతినిధియై పరిశీలించుచుండెను. మాసిడను సేనలను తార్క్ష్యసేనలను ఫిలిప్పేశు నధీనమునందుండెను.

ఫిలిప్పేశునకు నీతినైపుణ్యము చాలమికి దాను జక్రవర్తి యంతటివాడ ననుగర్వము తోడయ్యెను. సేనలో మాసిడను లనియు దదితరులనియు స్వపరభేదము నాతడు పాటింపదొడగెను. అంభియు బర్వతేశుడు మున్నగు భారతరాజన్యులపట్ల ననాదరము వహించి భారతప్రజలపట్ల నవజ్ఞ తాల్పసాగెను. అలీసాందరు నంతటివానికి సమ్మాన్యుడు, నతిరథశ్రేష్ఠుడు నగు పర్వతేశ్వరునకు ఫిలిప్పేశుని అహంకృతియు, దురభిమానమును సహింపరానివై

వైమనస్యహేతువులు కాదొడగెను. ఫిలిప్పేశుడు చీటికి మాటికి బర్వతకుని రాచకార్యముల వ్రేలుబెట్టుచు, నాత డలత్స్యమేనర్ప సీర్ష్యాళువై తుదకు బర్వతకుని అయోగ్యతను, అంభియోగ్యతను గూర్చి దవ్వుల నున్న చక్రవర్తికి విన్నపమొనర్చెను.

ఇది యిటులుండ ఫిలిప్పేశుని భేదబుద్ధికారణముగా యవనసేనలలో మాసిడనులకు నితరులకు జనించిన పోరుపులు వృద్ధికాజొచ్చెను. ఆలీసాందరు దేశము విడిచి యేగెనన్న ధైర్యమున అశ్వకులు మరల విరుగబడి, యవనసేనలను దొంగపోటుగా హింసింపసాగిరి. యవనులు సన్నద్ధులై యున్నపుడు వారు కన్పింపరు. ఇంచుక ఏమరి యున్నపుడు వచ్చి మీదబడి కొందఱి నుఱుమాడి మరల దుర్గమారణ్యమార్గముల జని పర్వతప్రదేశముల దాగియుందురు. మాసిడను సేనలన్నియు తక్షశిలలోను, ఉదభాండపురమునను నిర్విచారముగా సుఖింపుచుండ, అశ్వకుల దొంగపోటునకు దాము గుఱియై బాధపడుచుంటిమి గదా యని తార్క్ష్యులకు, గ్రీకులకు హృదయములలో మెఱమెఱగా నుండెను. అశ్వకులను దొంగపోటునకు బ్రేరేచుచున్న చాళుక్య విజయవర్మ లీ భేదమును గ్రహించి తార్క్ష్యులకు, గ్రీకులకు అసూయాగ్ని రగుల్చుచుండిరి. అంతట నొకనాడు దార్క్ష్యులలో గొందఱు సాహసులు ఫిలిప్పేశుని మొగము నెదుటనే పక్షపాతి వని నిందించిరి. ఫిలిప్పేశు డాసాహసులను కశాఘాతముల పాలొనర్చెను. దానితో ఫిలిప్పేశునిపై ద్వేష మగ్గలమాయెను.

ఇటులుండ నవంబరుమాసములో నొకనాడు ఫిలిప్పేశుడు కతిపయ మాసిడను పరివారముతో నున్న యదనున సెనమండ్రు తార్క్ష్య లాతనిపైబడి చంపివైచిరి. ఈవృత్తాంతము మఱుచటియేట ఫిబ్రవరి నెలలో జక్రవర్తి కార్మణ్యముననుండగా నచటికి చేరుటయు, నాత డంభిని, ఉద్దాముని ఫిలిప్పేశ స్థానమున నియోగించుటయు మన మెఱిగినదియే. తన్ను విడిచి, చక్రవర్తి అంభికి పట్టము గట్టినందులకు, బర్వతేశ్వరునకు మదిలో కినుక జనించెను. తత్కారణ

మున నుద్దామాంబులయెడ నాత డుపేక్షవహించి తద్ద్వైరియగు చంద్రగుప్తుని పట్ల ననురక్తుడు కాజొచ్చెను. పర్వతకజ్ఞాతియగు వైరోచనుడు మాత్ర ముద్దా మునిచెస ననురక్తి వహించియుండెను.

ఆలీసాందరు మఱి తొమ్మిదినెలలకు బశ్చిమాభిముఖుడై యేగు ననగా జంద్రగుప్తుడు విజయసింహునితనయ శాంతవతిని బరిణయ మయ్యెను. సింహ పురాధీశునకు బుత్రసంతతిలేమి జంద్రగుప్తుడే యువరాజై, శూరులని పేరె న్నికగన్న పదివేలమంది దృఘాటసైనికుల కధిపతి యయ్యెను. వెంటనే ఆఱువేల మంది మాళవులు, మూడువేల క్షుద్రకులు, రెండువేల మద్రకులతో విజయ వర్మయు, నొక వేయింటికి శాక్షేయులు చంద్రగుప్త ననుసరించిరి. మగధనుండి వేయిమంది వీరులతో రాజసేనుడు వచ్చి చేరెను. ఈస్వల్పసేనతో నాలీసాందరు నెదుర్కొనుట నీతిగామి దలపోసి, చాణక్యానుమతమ్మున క్షుద్రక మాళవ కులను యవనులపై నెసగొల్పజొచ్చెను. ఆలీసాందరు దేశమువిడిచి యేగినమీదట వెనుకజిక్కిన యాతని సేనానులనోర్చుట సుకరమనియు, జంద్రగుప్తుడు యవ నులనోర్చి పాఱద్రోలెనన్నకీర్తి నలుగడలవ్యాపించి పలువురాతని నాశ్రయింప వత్తురనియు, నపుడు మగధపై నెత్తినడచుట నీతి యనియు జాణక్య డుప దేశించెను.

ముందుగా సంగాలమును వశము చేసికొంద మని శాక్షేయులు పట్టు బట్టిరిగాని అందులకు జాణక్య డనుమతింపలేదు. "సాంగలం పర్వతకుని అధీ నంలోవుంది. దానిపై మనమెత్తివెళ్లి పర్వతకవైరం తెచ్చుకోగూడదు. నందుల వల్ల లంచపంచాలు గ్రహిస్తూ పర్వతేశ్వరుడు వారి కనుకూలంగా వుంటు న్నాడు. అయినప్పటికి కొత్తచుట్టరికంవల్ల మనకింతా అపకారం చేయడం లేదు. ఎప్పటికైనా పర్వతకుణ్ణి నందవిరక్తుణ్ణిచేసి మనపక్షంగా ఉంచుకోవాలి గాని మనకువైరిని చేసుకోగూడదు. అదిన్నీగాక సింహపురసేనలు పర్వతకుడితో పోరాడటాని కొప్పుకోవు. పర్వతకునిమీద మనం కత్తికట్టామా అంటే నందు

లాతనికి సహాయం పంపుతారు. అప్పు డాతని సుఖసుఖాల జయించలేము. జయించినా, మనకు శాశ్వతంగా శత్రుపవుతాడు. నందవిజయంపట్ల మన కెంతైనా వుపకరించదగ్గ పర్వతకునివంటి ప్రబలుణ్ణి మనమిప్పుడు కవ్వించడం క్షేమంకాదు. కాళింగులు, ఆంధ్రులు, పర్వతకుడూ, ఈముగ్గురే మన కేనాటికైనా నందవిజయాని కక్కఱకు వచ్చేవాళ్లు. కనుక పర్వతకునిజోలికి వెళ్లక మనం వూరుకొంటే, అతనిరాజ్యాశా, వైరోచకప్రేరణా అతణ్ణి మనకు అనుకూలుణ్ణిచేసి నందులపై అతణ్ణి కత్తి కట్టిస్తవి. కనుక మనమిప్పు డెవ్వరిమీదా ప్రత్యక్షంగా దండెత్తగూడదు. మాళవక క్షుద్రక సౌవీరసైంధవులను రేగగొట్టాము కదా, ఇప్పటి కది చాలు. మహోర్ధ్వబ్రహ్మస్థలవాసులు గూడా యవనులపై కురకడానికి, ఎప్పుడెప్పుడని, కనిపెట్టుకొనివున్నారు. మూషకసేనుణ్ణి ఆలీసాందరు ఉరితీసినప్పటినుంచి ప్రజలు యవనులపై మరీ కంటగించు కొంటున్నారు. కనుక యవనులపై రగులుచున్న క్రోధజ్వాలకు సమిధలు వేస్తూ వుండడమే మనకిప్పుడు కర్తవ్యం. ఆలీసాందరు దేశం విడిచిపోయిన పిమ్మట మనం రంగంలోకి దిగి సేనానుల నొక్కొక్కరినే మట్టుపెట్టవచ్చును" అని చాణక్యుడుపదేశించెను.

ఇంతలో సెప్టెంబరునెల సమీపించుటయు, ఆలీసాందరు పశ్చిమాభిముఖుడై యరిగెను. గజబలమంతయు కర్తరీశుని వెంటనరిగెను. అపుడు చాణక్య చంద్రగుప్తులు యుద్ధమెచట నారంభింపవలయునని మరల నాలోచించిరి. చంద్రగుప్తుడు, "మనమిప్పుడు పైధానును, ఫిలిప్పేశుణ్ణి, ఉద్దాముణ్ణి కదిలించవద్దు. ఈముగ్గురూ మనకు సులభసాధ్యులు. ఆలీసాందరూ, కర్తరీశుడూ, వీరిరువురితో తుల్యుడని చెప్పదగిన బుద్ధిశాలి నయార్చు డింకా కాలాంతంలో ఓడలతో మిగిలివున్నాడు. అతణ్ణికూడా మనం సాగనంపితిమా అంటే మనల నెదిరింపగలవా ళ్లుండరు. కనుక సింధుదేశమంతటా యవనవిరక్తి జ్వలింపజేసి నయార్చుణ్ణి పారసీకం పంపే ఉపాయం చూడాలి మనం. 'అయి

నూటైనా ఓడల్ని పారసీకం చేరుస్తా''నని ఆతడు చక్రవర్తికి మాట యిచ్చి వున్నాడు. ఆ ప్రకారం ఆతడు ఓడల్ని పారసీకం చేర్చి మాట నిలబెట్టుకో చూస్తాడేకాని, మనతో కయ్యం పెట్టుకొని ఇచ్చట కాలహరణం చేయడు'' అని ఆలోచనము చెప్పెను. చాణక్యు డాతని బుద్ధికుశలతకు గడుంగడు నలరి, తమ చారులలో ఓడనడపుట ఎరిగియున్న ఉదుంబరుని నయార్చుని సేవకొఱకు నియోగించి, 'నయార్చునిచే ఈదేశమునుండి లంగరెత్తింపు'మని యుపదేశించి పంపెను.

ఆలీసాందరు సింధుదేశముదే విడిచి బయలుదేరగనే పదివేల యాశ్వికులతో చంద్రగుప్తుడు సింధుదేశముం జొచ్చెను. మాళవులు, క్షుద్రకులు నాతనికి దోడైరి. వారు కాలిడినచో నెల్లప్రజలలో నుత్సాహ ముప్పతిల్ల సాగెను. ఎక్కడివా రక్కడనే యవనుల నెదిరింపసాగిరి. ఇరువది దినములలో సింధుదేశ మంతటను విప్లవాగ్ని ముట్టుకొని ప్రజలు కత్తులు, కటారులు, కర్రలు సుత్తులు, సమ్మెటలు, చేతి కేదియందిన నది గ్రహించి యవనుల నాక్రమింప దొడగిరి. ఫైథాను తనపాలనముననున్న దుర్గములన్నిటినీ నేక కాలమున రక్షించు కొనవలసిన వాడయ్యెను. కొలూతమున నోడలతో వేచియున్న నయార్చుడు, మిడుతలదండువలె వచ్చి పడుచున్న విప్లావకులం గాంచి కాలు చేయాడక, "సాయముగ"మ్మని ఫైథానుకు వార్తయంపెను. ఫైథాను "నేను దుర్గరక్షణంలో తలమునిగి వున్నాను. నీ త్రిప్పలు నీవు పడు"మని బదు లంపెను.

నయార్చు డిట్లితిగర్తవ్యతామూఢుడై యున్న సమయమున ఉదుంబరుడు, "మన మిక్కడ వుండడం క్షేమంకాదు. నేల యీనినట్లు జనంవచ్చి పడుతున్నది. కార్యం పాకం తప్పకముందే మనం ఇంకొకరేవు చేరడం మంచిది." అని హితము చెప్పెను. "సముద్రం భయంకరంగా వుంది. ఈస్థితిలో ఎలా కదులుతా''మనినయార్చుడు సందేహించుచుండెను. తక్కిన యవనులు "ఈరాక్షసుల చేతులలో బడడంకంటె సముద్రంలో పోయి పడితేనే మంచిది.

పదిలమైన రేవు చేరుస్తానని ఉదుంబరుడు మాట యిస్తున్నాడు గదా, అక్కడికి పోయి తలదాచుకుందాము" అని నయార్చునితో ననిరి. నయార్చుడు వల్లె యని కౌలాతము విడిచెను. ఉదుంబరుడు చోదకుడుగా నోడలు కడలిలో బోయి పడెను. ఓడలు గడలి చొచ్చుట తడవుగా శత్రువులు వచ్చిపడి పోవుచున్న యోడలపై శరవర్షము గురియింపసాగిరి. ఓడలలోని యవనులు "ఇక మీ యిచ్చవచ్చినన్ని బాణాలు వదలండి. సముద్రుడి కేమీ భయము లేదు లెమ్మని తమలో దాము నవ్వుకొనిరి. ఉదుంబరుడు కతిపయదినములకా యోడలను దవ్వులనున్న రేవు జేర్చి, యవనుల బహూకృతు లందుకొని తన దారిని దా నేగెను. నయార్చు డా రేవునకు అలీసాందరు పేరు పెట్టి అనుకూల మారుతమును బ్రతీక్షించుచు నచటనే యుండెను. యవనులు కౌలాతమును విడిచి ఓడలపై బలాయితులైరను వార్త దేశమంతట వ్యాపించి ప్రజల యుత్సాహము నినుమడింపజేసెను. పాటలదుర్గమును జంద్రగుప్తుడును, సైంధవ వనాలార మహోర్ధ్వ దుర్గములను విజయసింహ చాణక్య రాజసేనలును ముట్టడించిరి. దుర్గములు దక్క దక్కిన జనపదములన్నియు భారతీయుల వశమయ్యెను. దుర్గములలోనున్న యవనవీరులు, దుర్గములు విడిచి పాఱినచో జక్రవర్తి యెఱుంగనేని యేమనునో యనుభీతియే ధైర్యమునొసంగ శక్తికొలది దుర్గరక్షణము సేయజొచ్చిరి. పైథాను పాటలదుర్గమున నుండెను. నయార్చు డొకవేళ వెనుకకువచ్చి దుర్గములలో నున్నవారికి బాసట యగునేమోయని చంద్రగుప్తుడు యోజించినవాడై, పాటలపుముట్టడికి విజయవర్మను జాలించి అయిదువేల గుఱ్ఱపుదండుతో దానేగి నయార్చుని ఓడలతో గూడ సముద్రము లోనికి దఱిమెను. నయార్చుడు అక్టోబరు నెలలో 23 వ దినమున సముద్రము జొచ్చి భారతభూమిని విడిచి యేగెను.

చంద్రగుప్తుడు తిరిగివచ్చి దుర్గవిజయ సాధనములగూర్చి చాణక్యునితో నాలోచించెను. చాణక్యుడును, "సామదాన భేదములచే వైరులను స్వాధీనం చేసుకొందామంటే, చక్రవర్తి బ్రతికి వున్నంతవఱకు సేనాను లెవ్వరూ

అందుకు ఒడంబడరు. మారువేషాలతో మనం చారులను పంపితే పట్టుబడి పోతారు. దీర్ఘకాలం ముట్టడి సాగించి అన్నం నీరు లోపలికి పోనీకుండా మాన్పడమే సాధనంగా కనిపిస్తుంది. లేదా, కోటలు త్వరగా పట్టుకోవాలంటే చాలినంత గజబలమైనా వుండాలి" అని తన యభిప్రాయ మెఱిగించెను.

ఈదుర్గములను సాధించుటకే కాక మగధపై నెత్తిపోవుటకు కూడ గజబల ముండవలెను. సింధుప్రాంతమందలి ఏనుగులనన్నిటిని అలీసాందరు తరలించుకొనిపోయెను. సింహపురసైన్యమున మూడుగజములు మాత్రమే యున్నవి. ఏబదియేనుగులనైన సాయమంపుమని బర్వతకుని గోరిరి. ఆత డందుల కంగీకరింపక "నేను ఏనుగులను పంపితే పైథాను కారహస్యం తెలిసి అలీసాందరుకు తెలియజేస్తాడు. అలీసాందరుచేత ద్రోహి అనిపించుకోవడం నాకిష్టం కాదు. ఒక వేళ పైథానుకు సాయం కమ్మని అలీసాందరు నాకు కబురంపితే నేను సాయం కూడా చేయక తప్పదు. అయితే, ఆసాయం అలీసాందరు కోరితేనే చేస్తాను. పైథాను ఉద్దాముడూ కోరితే చేయను" అని బదులంపెను.

చంద్రగుప్తుడావార్తకు గంటగించుకొనుచు, చాణక్యునితో, "అలీసాందరంటే ఎంత భయమో చూచారా, ఈతనికి! అలీసాందరు ఆజ్ఞ గనక యిస్తే మనతో వైరమైనా పెట్టుకోడానికి సిద్ధపడతాడట! ఇటువంటివాడు వితస్తాతీరంలో ఆమహాయుద్ధం చేశాడూ అంటే, అపకీర్తి భయంచేతా, అభిమానంచేతా చేశాడేకాని భారతరక్షణం కోఱకూ, ధర్మం కోఱకూ చేసినవాడు కాడు. గ్రీకులపై కత్తి గట్టడానికే యిష్టం లేకపోతే యిక ఇటువంటివాడు మగధపై ఏమి కత్తికట్టుతాడు? మనకేమి సాయం చేస్తాడు" అనెను.

చాణక్యుడు, "మగధవిషయం వేఱూ, గ్రీకుల విషయం వేఱూను. పర్వతకుడుకి అలీసాందరంటే భీతి వున్నమాట నిజమేకాని అంతకు పదిరెట్లు రాజ్యాశ కూడా వుంది. యవనులు ఈదేశం రాకముందే సింహ్రామ సంగాలములు ఆలోచించా డీతడు. అతని ఆరాజ్యలోభమే మనకు మగధ

విషయంలో సాయం చేయిస్తుంది. ఆలీసాందరు సబహుమానంగా కౌగిలించుకొని మన్నించింది మొదలు తానుకూడా ఆలీసాంద రంతటివా డననీ, ఈదేశమంతా, ఆలీసాందరు అనంతరం తనకు రావాలనీ విఱ్ఱవీగుతున్నా డాతడు. ఆగర్వంచేతనే, నందులిస్తున్నలంచం చాల దనీ, అయిదులక్షలస్వర్ణా లివ్వవలసిందనీ కోరుతున్నాడట. శాకటాల వక్రనాసాదుల కట్లా పర్వతకు డడిగినంతా ఇవ్వడం ఇష్టంలేదట. నందులు తనకు భయపడే లంచమిస్తూవున్నారని ఆతని తలంపు. ఇదివఱ కిస్తూవున్న లక్షసువర్ణాలు కూడా సున్నచుట్టించుమని నేను జీవసిద్ధికి వార్త పంపాను. ఆకాస్తపనీ జరిగితే పర్వతక వైరోచకులకు నందులయెడ విరక్తి కలుగుతుంది. ఆతరుణం కనిపెట్టి మనం సాయం కోరాలి. మనవిశాలాక్షుఁ డీవఱకే వైరోచకుని దగ్గరచేరి, బీజారోపానికి క్షేత్రం సిద్ధం చేస్తున్నాడు. మగధలో సగభాగమూ, సింధుదేశంలో మనం జయించినరాజ్యం సర్వమూ ఇస్తామని ఆశపెట్టామా అంటే చప్పున మనవలలో పడతాడు పర్వతేశ్వరుడు. అయితే మనలను వంచించి మగధ సర్వమూ కబళించుదా మని కూడా ఆతడిమనస్సులో వుంటుంది. దానికి ప్రతిక్రియ నేనుచేస్తాను. ముందు మగధ మనకు స్వాధీనం కావాలేగాని ఆనక పర్వతకుడిబాధ మనకేమీవుండదు. ఆభారం నాకు వదలిపెట్టు" అనెను.

చంద్రగు.— మన మాతనిసాయంపొంది చివరకు వంచిస్తే మహాద్రోహమవుతుంది.

చాణ.— ద్రోహమవుతుందని మనం సందేహిస్తే మనకు ద్రోహంచేయడానికి ఆతడు సందేహించడు; కాబట్టి ఆతనికంటె ముందుగానే మనం మేలుకొని, ఆతడు మనకు చేయదలచిన ద్రోహం ఆతనికే మనం చేయడమే దానికి ప్రతిక్రియ. అదిన్నీగాక,మిత్రద్రోహం,మిత్రహననం దోషములనిచెప్పేది సామాన్యధర్మం ధర్మసూక్ష్మం విచారిస్తే, ఇటువంటివాళ్ల నొకరిద్దరిని చంపి, తదనుయాయులనందరినీ రక్షించడమే మంచిదని తేలుతుంది.

బహుజన క్షేమం విచారించడమే రాజధర్మం. ఈశత్రుణ్ణి వంచించి కడతేర్చక పోతే ఎదుటబడి యుద్ధం చేయాలి. ఆ యుద్ధంలో లక్షలకొలది అమాయిక ప్రజను అన్యాయంగా సంహరించాలి. ఆపాపంకంటె ఈశత్రుణ్ణి వధించడమే పుణ్యం.

చంద్ర.—లక్షలకొలది ప్రజను చంపవలసివచ్చినా బహిరంగంగా యుద్ధంచేసి చంపుతాము. అది దోష మెందు కవుతుంది?

చాణ.—రాజధర్మదృష్ట్యా ఏదీ దోషం కాదు. ఒకప్పుడు కత్తికట్టి యుద్ధ రంగంలో నిలబడని స్త్రీబాలవృద్ధులను చంపవలసివస్తుంది. గ్రామములు తగులబెట్ట వలసివస్తుంది. ఆలీసాందరు మద్రకులనెలా వూచకోత కోశాడో చూడు! కామలకోటలో నిరపరాధప్రజ నెలా హింసించాడో చూడు! నీదృష్ట్యా ఈహింస యావత్తూ ధర్మమే కావలసి వస్తుంది. నే ననేదేమి టంటే, ఒక్కణ్ణి చంపి లక్షమందిని కాపాడమంటాను. అదే ధర్మం. ఆ ఒక్కణ్ణీ చంపడమే ప్రధానంకాని, ఎలాచంపుతామా అనేదికాదు. శ్రీరాము లంతటివాడు వాలిని దొంగపోటున చంపవలసి వచ్చింది. కృష్ణ భగవానులు, దుర్యోధనుణ్ణీ ఒకణ్ణీచంపి పద్దెనిమిది అక్షౌహిణులను రక్షించ వలసిందని ఉపదేశించారు ధృతరాష్ట్రుడికి. దురాశకొద్దీ, అహంకారం కొద్దీ ఒకొక్కడు అకార్యానికి ఒడిగట్టుతూవుంటే వాడికోసం బహుజనక్షయం ఎందుకు కావాలి?

చంద్ర.—చిత్తం. తమ ఇష్టం చొప్పునే జరిగించండిగాని, ముందు మనం కళింగపతి చెంతకువెళ్లి ఒక 500 లైనా గజబలం సంపాదించుకురావాలి. ఆతడు చిరకాలంనుంచి రమ్మని కోరుతున్నాడు ఆగజబలం తెచ్చామా అంటే యవనమర్దనమూ సుకరమవుతుంది. పర్వతకుడూ మనవైపునకు మొగ్గుతాడు.

చాణ.——శుభం. అవశ్యంగా బయలుదేరు. సమిద్ధార్థుడు కూడా కళింగము నుంచి, రాజు మనపట్ల అనురక్తుడేనని తెలిపాడు.

చాణక్యచంద్రగుప్తులంతట రాజసేన విజయసింహ విజయవర్మలను కోటలను ముట్టడించుమని కందాము నిలిపి, కళింగమున కేగిరి. కాళింగుడును వినయసౌహార్దములు నెఱయ వారల గారవించి మున్నూరేనుంగుల నొసగెను. ఆమున్నూటితో నడవుల వెంట దిరిగి మఱి మున్నూరువనగజములను మచ్చిక చేసి పట్టి తెచ్చిరి. వానిలో యూథపతియగు గజరత్నమునకు చంద్రగుప్తుడు చంద్రలేఖ యను నామమిడి దానిని తాను గైకొనెను. ఆభద్రగజము సార్వభౌమలాంఛన లాంఛితుడగు చంద్రగుప్తుని చూడగనే మోంగాళ్లువంచి అవనతమై ఆతని దన కుంభములపై నెక్కించుకొనెనని చాణక్యుడు దెలుప కాళింగుడు మిగుల సంతసించి, చంద్రగుప్తుడు తప్పక మగధసార్వభౌముడు కాగలడని నమ్మెను. చంద్రగుప్తుడు పాటలీపుత్రముపై నెత్తివచ్చినంతనే తాను ఏబదివేలసేనలతో దక్షిణమునుండి మగధపైకుఱికెదనని బాస చేసెను. చంద్రగుప్తచాణక్యులందులకు సంతసించి అరువదియేండ్లవఱకు కళింగమునుండి కప్పము గైకొనకుండుట కంగీకరించిరి. అటుపిమ్మటనైన నూఱుక కప్పము గైకొనుటయే కాని కళింగవ్యవహారములజోలికి రామని మాటయిచ్చిరి. కాళింగుడు సమ్మతించి "మీతాతగారు కళింగమును బంధించిరి. మీతరమున ఆ బంధనం నుంచి కళింగమును తప్పిస్తున్నారు. ఇది మహాప్రసాదం. నే నిప్పుడే మగధపై ఎత్తివెళ్లుదునుగాని ఒంటరినై నందులను జయించలేను. కాబట్టి మీ రాకప్రతీక్షిస్తూవుంటాను" అని పలికి చంద్రగుప్తచాణక్యులను వీడ్కొల్పెను.

చాణక్య చంద్రగుప్తులు గజబలముతో, అశ్వసహస్రముతో కళింగము నుండి బయలుదేరి మార్గమధ్యమున వైరాత్యఖండవీరులతో జెలిమి గావించి క్రీ. పూ. 323-వ యేట జూలై నెలలో సింహపురము చేరిరి.

ఈలోపల నిచట ఫిలిప్పీశుడు మరణించుటయు, పర్వతేశుడు యవనులమీద విరక్తుడగుటయు వటస్థించెను. జీవసిద్ధి యుపదేశము నాలించి, నందులు పర్వతకున కిచ్చుచున్న లక్షసువర్ణములను నిలిపివైచి, "పాటలీపుత్రం వచ్చి మమ్ము యాచిస్తే మాకు తోచినంత యిత్తు" మని కబురంపి యవమానించిరి. నందులు వ్రాసినజాబును పర్వతేశ్వరుడు విశాలాక్షునకు జూపెట్టగా, నాతడు "యవనచక్రవర్తి యంతటివాడు తమతో సంధిచేసుకొన్నాడు గదా, యీ క్షురకపుత్త్రుల కింతగర్వమా" యని పలికి కోపాగ్ని ప్రజ్వలింపజేసెను. నాటి రేయి పర్వతేశ్వరుడు, రాణి కీవృత్తాంతమంతయు నెఱింగించి, 'ఈనందులకు గర్వభంగం చేసితీరుతాను. నేను తలచుకొంటే మగధను జయించడ మొక లెక్కలోనిది కాదు. దేశము కొత్తది, గంగాయమున లడ్డమున్నవి అని ఆలోచిస్తున్నాను. చంద్రగుప్తుడు కళింగమునుండి రాగానే మగధపైకి సైన్యములు నడిపిస్తాను. నందులను పాదాక్రాంతులను చేసి తీరతాను. నేను యాచిస్తే నాకు భిక్షం పెట్టేపాటివాళ్లుగా నందులు! నాకాళ్లమీదనే పడి ప్రాణభిక్ష వేడేటట్లు చేయకపోతే నేను పౌరవుడగాను" అని పలికి చంద్రగుప్తునిరాకకై ఎదురు చూచుచుండెను.

చంద్రగుప్తుడు కళింగమునుండి మరలివచ్చులోపలనే క్రీ. పూ. 323వ యేట జూను నెలలో అలీసాండరు ముప్పదిమూడేండ్ల నడిపయస్సున బాబిలోనులో మరణించెను. చక్రవర్తి మరణవార్త భారతభూమియందున్న యవనులకు దిగులుపుట్టించెను. భారతసేనలు పరమోత్సాహముతో యవనదుర్గముల నాక్రమించెను. చంద్రగుప్త విజయవర్మలు అలోరదుర్గము నాక్రమించి ఎనమన్నూరువంది గ్రీకులను సంహరించిరి. గ్రీకుసేనాపతిని బదుకొండుగురు పరిషత్తులను ఉరితీసి చంపి, మూషకసేనుని బ్రాహ్మణులను, యవనులు సంపినదానికి బదులు సల్పిరి. ఉద్దామపైథానులు భారతీయాక్రమణమును సైపజాలక పర్వతకుని సాయ మగర్థింపి యెంతవేడినను అతడు పెడచెవినిబెట్టెను. చంద్ర

గుప్తవిజయవర్మలు మహోర్ధ్వమును గూడ సాధించి వేయిమందియవనుల గసి మసంగి యచటగూడ బండ్రెండుగురు దళపతుల ఖైదీసిరి. ఆలీసాంద్ర రేడు వేలమంది మద్రకులసంహారించినందున దానుగూడ నంతమంది యవనుల సంహారింతునని విజయవర్మ ప్రతినపట్టెను. ఉద్దామపైథానుల యవస్థ నానాటికి శోచనీయమగుచుండెను. పర్వతకుడు మొఱ యాలింపడాయె. అంభి యచట నశ్వకులపోరుపడలేక సంకటపడుచుండెను. అర్యకేశాభిసారులును గాన్ధారపతియుం యవనుల నలక్ష్యమొనర్చుచుండిరి. పైథాను మార్గాంతరము గానక, పర్వతేశ్వరునకు "పాటలసైంధవవనదుర్గములనుండి మిమ్ము విడిపిస్తే మేము సింధుపశ్చిమ భూములకు పోతాము. సింధుపూర్వదేశమంతయు నీవే యేలుకొనుము" అని రాయబార మంపెను. పర్వతేశ్వరు డిదే యదనని చంద్రగుప్తునకు, "సైంధవవన పాటల దుర్గముల ముట్టడి మాని మీరు సింధుదేశము నాకు విడిచిపెట్టండి. మగధను జయించడానికి శకయవన పారసీకాదులతో నేను సమస్తసేనాసమేతుడనై మీకు తోడ్పడ టవుతాను. మగధను జయించినతరువాత నాకందులో సగభాగమివ్వండి. ఇందుకు మీరు అంగీకరించకపోతే యవనులతో జేరి మిమ్ము సింధుదేశమునుంచి సాగనంపుతా"నని వార్తయంపెను. చాణక్యు డారాయబారము నాలించి చంద్రగుప్తునితో మంతనమున "చూచితివా, పర్వతకుని దురాశా, ద్రోహబుద్ధిని. ఈ ఆతతాయి నిక ఏమిచేసినా దోషంలేదు. అతడు కోరిన ప్రకారం మనం సంధిచేసుకోవడమే మేలు. ముంజవత్పతీ, కామరూప పాలకుడూ తమసేనలతో మగధపైకి ఎత్తివచ్చి మనకు సాయపడడానికి అంగీకరించారని మన నిపుణకుడు నిన్ననే కబురుచేశాడు. కనక పనిపట్టినప్పుడు పర్వతకునికంటె మనదే పైచేయి అవుతుంది. వీనికి దగినశాస్తి చేయవచ్చు"నని ఉపదేశించెను.

చంద్రగుప్తుడు సింధుదేశమును బర్వతేశ్వరునకు విడిచిపెట్టుట కంగీకరించి, అలారపాటల మహోర్ధ్వసైంధవవనదుర్గముల మాత్రము తదధిపతుల

కిచ్చి వారివలన పర్వతేశ్వరుడు గప్పము గొనుచుండునది యని కోరెను. పర్వతకు డందుల కంగీకరించి ఆదుర్గములను వారి కప్పగించెను. ఉద్దామప్రైథానులు కోటలు విడిచి సింధునదపశ్చిమభూముల కరిగిరి.

చాణక్యచంద్రగుప్తులు స్వసైన్యముతో సింహపురము ప్రవేశించిరి. అప్పటికి జేరవచ్చిన మాళవక్షుద్రకసౌవీర సైంధవసేనలతో మౌర్యునిసేనలు ఒకటిన్నరలక్ష లాయెను. అలారపాటల మహోర్ధ్వ సైంధవవనపాలకులు ఈసమస్తసేనల కగువ్యయము నైదువత్సరముల దనుక భరింతుమని కృతజ్ఞతనై నొడబడిరి.

పిమ్మట చాణక్యచంద్రగుప్తులు మగధపైనెత్తి యేగుటకు వలయు నాసగ్రి సమకూర్చుకొనుచు రెండేండ్లు గడపిరి. అలీసాంద రంతటి జగదేకవీరునకు భరమనిపించిన కార్యముపట్ల వేగిరపాటుకూడదని యెంచి సర్వశక్తులను సమీకరించిరి. క్రీ. పూ. 321-వ వత్సరమున సెప్టెంబరు నెలనాటికి బర్వతకుడు మున్నూరేనుంగులతో నేనూరురథములతో, పదివేలగుఱ్ఱములతో నేబది వేలకాల్బలముతో మగధపైనడచుటకు సిద్ధమయ్యెను. మఱి డెబ్బదివేలకు బారసీకశకయవన కిరాత కాంభోజ బాహ్లీకులు కూడబడి చంద్రగుప్తు ననుసరించువారైరి. చంద్రగుప్తుడును ఆరునూర్లయేనుగులను, వేయింటికరథములను, ఇర్వదియేనువేల హయములను, లక్షయు నిర్వదియైదువేలింటికి గాల్బురను బ్రోగు చేసెను.

ఇట్లేకరాశియైన సేనాసముద్రముంగాంచి చాణక్యచంద్రగుప్తపర్వతకులు జయము నిశ్చయమని పొంగుచుండిరి. ఈసేనలకు గాళింగకామరూప ముంజవత్సేనలు గూడ తోడయ్యేనేని మగధసేకాదు, విశ్వమునే జయింపవచ్చునని-తూర్కించిరి. మఱియు చంద్రగుప్తానురక్తులగు మాగధులు గూడ గొందఱు దమకు బాసట కాగలరని ఆశించిరి.

మంగళసూచకమో యన్నట్లు పర్వతేశ్వరునకు మఱియొక శుభము సంప్రాప్తించెను. క్రీ. పూ. 321 వ యేట అలీసాందరురాజ్యవిభాగము జరిగెను. అందు వితస్తకు తూర్పుదెస నున్న దేశమును, సింధుదేశమును పర్వతకునివంతునకు వచ్చెను. వితస్తాసింధు మధ్యదేశము మాత్రము అంభివంతునకు వచ్చెను. సింధునదికి పశ్చిమముననున్న భూములకు పైథా యధిపతియయ్యెను. కావున పర్వతేశ్వరుని సింధుదేశాధిపత్యము నిస్సంశయము నిరంకుశము నయ్యెను.

మగధపై నెత్తిచనుటకు సిద్ధముగానున్న ఈమహాసైన్యములవార్త దేశమున వ్యాపింపగనే కళింగపతి జయము నిశ్చయమని యెంచి, తనసేనలతో దక్షిణమునుండి మగధపై బడుటకు సిద్ధమయ్యెను. కామరూపాధిపుడు తూర్పు దిక్కునుండియు, ముంజవత్పాలుడు ఉత్తరమునుండియు మగధపై నడచుటకు సిద్ధముగా నుంటి మని చంద్రగుప్తునకు వార్తలంపిరి.

అంతట నొక శుభముహూర్తమున నామహాసైన్యము కదలెను. అందు చాణక్య చంద్రగుప్త లొకభాగమును నడపుచుండిరి. రెండవభాగమును పర్వతక వైరోచక మలయకేతులు నడపుచుండిరి. "ఎన్నాళ్లకు! ఎన్నాళ్లకు మళ్లా పాటలీపుత్రం ప్రవేశిస్తున్నాను" అనుచు బరమహర్షమున జంద్రగుప్తుడు పలుక, చాణక్యుడు, "మనం యమున దాటినప్పుడు చెప్పనే చెప్పాను. 'తిరిగి రాకకే మనపోక' అని. అది నేటికి నిజమయింది. మళ్లా ఇవాళ చెపుతున్నాను. "తిరిగి రాకకే మనపోక" అని పలికెను. చంద్రగుప్తు డామాటల కరుదుపడి, "ఆచార్యదేవా! విజయమో, మరణమో—అంతేగాని ఇంకా వనక్కుతిరగడ మెక్కడిది?" అనెను. చాణక్యు డామాటలకు నవ్వుచు "మేలు, వత్సా! మేలు. నాయభిప్రాయమూ అదియే. నందవిజయానంతరం, తిరిగి యిచ్చటికి వచ్చి, హిందూకుశపర్వతపాదమునుండి సింధుసాగర సంగమపర్యంతమై ఆరాజకమైన యీరాష్ట్రములను నువ్వు సార్వభౌమపదాభిషేకం పొందవలసి వుంటుం దని నా తాత్పర్యం" అనెను.

---

# 22

## నందవినాశము

అట పాటలీపుత్రమున నందులును సమరసన్నాహములు చేయువారై చక్రనాస శకటాల జీవసిద్ధి రాక్షస ప్రముఖులగు నమాత్యులతో సర్వసేనాపతియగు భద్రశాలునితో మంతనమాడిరి. నాల్గువేల గజబలమున కధిపతియగు భద్రభటుని, ఇర్వదివేల యాశ్వికదళమున కధినాయకుడగు పురుషదత్తుని, రెండువేల యరదముల కధిపతియగు బలగుప్తుని, రెండులక్షల కాల్వర కధిపతియగు సింహబలుని, శకటాధ్యక్షుడగు చంద్రభానుని, చారముఖ్యుడగు భాగురాయణుని కూడ బిలిచి సర్వసేనాధిపతియగు భద్రశాలు డా క్రిందటి దినముననే యుద్ధతంత్రమునుగూర్చి ఆలోచించెను.

భద్రశాలుని ఆకారపు మున్నతియు, ముఖగాంభీర్యమును నాతని నిస్సారత నెంతకప్పిపెట్టినను, యుద్ధావసరములం దాతని శౌర్యవిహీనత బయల్పడక మానదు. యుద్ధతంత్రమునకు భద్రశాలునకు గడుదవ్వు. మీసములు దువ్వుచు దంభవర్తనుడై నందుల విశ్వాసము జూరగొని మగధసామ్రాజ్యరక్షణముపట్ల ప్రమత్తుడై తిరుగుచుండును. కోశాధ్యక్షుడగు ధననందునకు ప్రీతిపుట్టించుటకై సేనాంగమునకు వలయు వెచ్చముపట్ల నఱగొఱ గావించుచు, గొంత దామిగిల్చికొని, సేనల కేకభుక్తము సల్పు దుశ్శీలు డాతడు. తాను సర్వసేనాపతిననియు నందులకు గూర్చువాడ ననియు విఱ్ఱవీగుచు తోడిసేనానుల కాత డవమానము గూర్చుచుండును. ఈవిధముగా దన దుశ్చరిత్రముచే నాతడు నందసైన్యములం దైకమత్యమును బటిష్ఠతయు గొఱవడజేసెను. తుదకు యుద్ధము సమీపించునప్పటికి సేనానులలో నొక్కడును గూడ నాతని విజయమును గోరు విశ్వాసి కానరా డయ్యెను.

నందుల దుశ్చరిత్రముచే నంతకుమున్నె విరక్తులైయున్న భద్రభట బలగుప్త పురుషదత్త సింహబల చంద్రభాను భాగురాయణులు చంద్రగుప్తునిజయమును గాంక్షించుచున్నవా రగుటను మహాసేనానియు నవిదితయుద్ధతంత్రుడు నగు భద్రశాలునకు నపజయము గూర్పువారై దురుపదేశ మొనర్చిరి. "శత్రువులను మనరాజ్యపు పొలిమేరలలోనే ఎదుర్కొని ఓడిస్తే వెనుకకు పారిపోయి, తిరిగి బలం చేకూర్చుకొంటారు. కాబట్టి వాళ్లను పాటలీపుత్రంవఱకు నిరభ్యంతరంగా రానిచ్చి ఒక్కసారిగా నిశ్శేషం చేయడం మంచిది. మీవంటి సేనాధిపతిబారి పడిన తరువాత వాళ్లు మళ్లా బ్రతికిపోవడం కల్ల" అనుచు భద్రభటు డుపదేశించెను. తక్కిన సేనానులు భద్రభటుని యాలోచనమే లెస్సయనిరి. పురుషదత్తుడు "శత్రువులను నాశనంచేసిన మీదట మన అశ్వబలంతో వాళ్లదేశాలమీద పోయిపడవచ్చు" ననెను. భద్రశాలుడును వల్లెయని మఱునాటి రాజసభలో నీయుద్ధతంత్రమును వివరించి చెప్పెను.

రాక్షసమంత్రి సర్వసేనాపతి యుపదేశమున కక్కజంపడి, "శత్రువును రాజధానికి నిరభ్యంతరంగా రానిస్తారా! ఇంద్రప్రస్థ హస్తినాపుర కాన్యకుబ్జ కాశీప్రయాగలనూ, వైశాలీవర్ధమాన నందగృహ రామపూర్వాలను శత్రువు లొక్కొక్కటిగా ఆక్రమించి వస్తూవుంటే చేతులు ముడుచుకొని పాటలీపుత్రంలో కూర్చుండవలెననే ఈయాలోచన సేనాపతికే తోచిందా, ఇతరు లెవరైనా చెప్పిరా! అశ్వదళాధిపతి పురుషదత్తుడూ, గజదళాధిపతి భద్రభటుడూ, ఊరకే కూర్చుంటామన్నారా, రాజధానిలో?" అని ప్రశ్నించెను. "సేనాను లందఱు ఆలోచించినమీదటనే ఈనిశ్చయం చేసినా" మని భద్రశాలుడు పలికెను. అంతట జీవసిద్ధి యందుకొని 'సేనాధ్యక్షులవారి ఆలోచనం చప్పగా తోసివేయదగింది కాదు. ఎందువల్లనంటే, శత్రువులు నాల్గుదిక్కుల నుంచీ వచ్చిపడుతున్నప్పుడు, వాళ్లను అరికట్టవలెనంటే, మనసేనలను నాలుగు భాగాలు చేయవలసివస్తుంది. అలా చీల్చడంవల్ల మనసేనల్లో ప్రతిభాగమూ

బలహీనమై శత్రువు నరికట్టలేకపోతుంది. పైగా సేనలను నాలుగుదిక్కులకూ పంపితే రాజధానికి రక్షణముండదు, శత్రుసేనలు, విభక్తములైన మనసేనలను జయించి రాజధానిమీదవచ్చి పడగలవు. రాజధానిలోవున్న చంద్రగుప్తాను రక్తులు శత్రువులకు సాయమై రాజధానిని వప్పగించి వూరుకొంటారు. శత్రువులచూపంతా కోశంమీద వుంటుంది. కోశం శత్రువులచేతిలో పడినపిమ్మట మనం చేయగలిగిన దేమీ వుండదు. కాబట్టి మనం సర్వశక్తులా, రాజధానినీ, కోశాన్ని రక్షించుకోవాలి గనుక యావత్సైన్యాన్ని యిచటనే అట్టిపెట్టితే శత్రువులను వచ్చినవాళ్లను వచ్చినట్లల్లా సంహరించవచ్చు. శత్రువు ఏదిక్కున నుంచివచ్చినా మనసర్వశక్తులతో హతమార్చవచ్చును. దుర్గంలోవుండి పోరాడతవి గనుక మనసేనలు, మనకు నష్టంలేకుండా, శత్రువుకు అపారమైన నష్టం కలిగించవచ్చును. అంతేకాదు. శత్రువును పొలిమేరలోనే అడ్డగించడానికి అయ్యేఖర్చుకూడా మనకు తప్పిపోతుంది. కనక నాబుద్ధికి చూడగా ఈ యాలోచనే బాగున్నట్లు కనిపిస్తుం" దనెను. సేనలను రాజధానినుండి కదల్పకున్నచో, వ్యయము తప్పిపోవుటయేకాక, కోశము భద్రముగానుండునని జీవసిద్ధిచెప్పిన యాలోచనము నందుల మనస్సులకు బాగనిపించెను. ధననందుడు "ఈఆలోచన లెస్సగా వున్నది. రాజధానిలో అడుగు పెట్టిన వాళ్ళనందరినీ మనమిక్కడవుండే హతమార్చవచ్చు" ననెను. సుకల్పాదు లందు కామోదించిరి. శాకటాల వక్రనాసామాత్యులకు, రాక్షసామాత్యోపదేశము నామోదింపతుండుటయే మతముగావున వారును జీవసిద్ధి యుపదేశము నామోదించిరి. రాక్షసమంత్రి చేయునదిలేక, "పోనిండు." మనసేనలను పంపకపోయినా, ఎక్కడిదుర్గరక్షకు లక్కడ శత్రువుల నెదిరించే ఏర్పాటైనా చేయవలసివుంటుంది. ప్రతిదుర్గమును సాధించుకు వచ్చేటప్పటికి శత్రువు బలహీనుడౌతాడు. దుర్గములను పట్టుకోకుండానే ముందుకు సాగివస్తాడా, నిర్గమనమార్గం వుండక మగధలోనే ఉచ్చుసపడిన ట్లవుతుంది. మనదుర్గరక్షకు లెక్కడివా ళ్ళక్కడ

శత్రువు సెవెరిస్తూవుంటే తక్కిన ప్రజలకు ధైర్యంగానూ వుంటుంది" అని యుపదేశించెను. జీవసిద్ధియు భద్రశాలుడు నీయుపదేశము లెస్సగనే యున్నదని ఆమోదించిరి.

నందులొనర్చిన యీనిశ్చయమును జీవసిద్ధి చాణక్యునకు వెంటనే తెలియజేసెను. చాణక్యచంద్రగుప్తులు ససైన్యముగా యమునానది చెంతవిడిసి అరక్షితమగు తన్నదిం దరించి, ఇంద్రప్రస్థము సమీపించిరి. ఇంద్రప్రస్థపాలకుడును, రాజధానినుండి తనకు సాహాయ్యము రాదని యెఱిగి, దుర్గరక్షణకార్యమునెడ నిరాశచెంది శత్రువునకు ద్వారములు తెఱచెను. ఈవిధముగా, దుర్గపాలకులెల్లరు నిస్సహాయత్మై దమతమ దుర్గములనెల్ల చంద్రగుప్తునకప్పగించిరి. ఇట్లొక్కొక దుర్గమునే స్వాధీన మొనర్చుకొనుచు నేతెంచు చంద్రగుప్తుడు, ఆయానగరవాసుల కభయమొసగి వారల యనురక్తికి బాత్రుడగుచుండెను. పట్టణములను బల్లెలను గొల్లగొనరాదనియు, మగధదేశమునందెచ్చటను ఏప్రాణికిని హింసయొనర్పరాదనియు జంద్రగుప్తుడు దనసేనల కాజ్ఞాపించెను. పర్వతేశ్వరుడును శకయవనపారసీకాదులును దొలుత నీయాజ్ఞకసమ్మతి జూపిరి,కాని. చాణక్యుడు నందులకోశ మపారమని వారికి వర్ణించిచెప్పి దానిని సేనలకు జూఱవిడుతుమని ఆసపెట్టిన మీదట వారును ప్రజాపీడ సలుపకుండుటకు సమ్మతించిరి. చంద్రగుప్తుడు దనసేనల కగువెచ్చమును దానేభరించుకొనుననియు, తక్కినవారి కగువ్యయమును నందకోశమునుండి గ్రహింపవగుననియు జెప్పి, చాణక్యుడు వారివారికగు దినవెచ్చమును గ్రమముగా వ్రాసికొనుచు వారిని నమ్మించెను.

అటు కాళింగుడు అరువదివేల నిజసైన్యముతోడను బదివేలశబరులతోడను దక్షిణమునుండి బయలుదేరి వర్ధమానమును జయించి పాటలీపుత్రమును సమీపించుచుండెను. కామరూపపాలకు డేబదివేలసేనతో తూర్పు దెసనుండి వైశాలీనగరమును గ్రహించి రాజధానిపై నడతెంచుచుండెను. నల్వదివేల

నేపాలబలముతో ముంజవంతాధిపతి నందగృహారామపూర్వముల జయించి చంద్రగుప్తునకు బాసటయగు వానివలె పాటలీపుత్రముజొచ్చి కొల్లగొనుసిచ్ఛమై వచ్చుచుండెను. ఇట్లు శకయవన పారసీకాదులతో చాణక్యపర్వతక వైరోచకు లుత్తరదిశను, ముంజవత్కాశ్మీరూపాధిపులు దూర్పునను, కాళింగ చంద్రగుప్తులు దక్షిణమునను, కిరాతబాహ్లీకాదులు పడమటిదెసను పాటలీపుత్రమును ముట్టడించి విడిసిరి.

నాడు పూర్ణిమాసోమవారము. జీవసిద్ధి నాటిరేయి భద్రశాలాదులగు సేనానుల, కొకరెఱుగకుండ నొకరికి బిఱికిమందుపోసెను. మఱునాడు మంగళ వారము నందులకు అశుభహేతువనియు, నాటియుద్ధమున నందుల కపజయము దప్పదనియు నామహాజ్యోతిష్కుడు సెప్పినపల్కు లాలించి, సేనాను లెపరి ప్రాణములు వారు దక్కించుకొనువారైరి. మఱునాటి యుద్ధములో నుత్తర దక్షిణదిశలందున్న చాణక్య చంద్రగుప్తులను ముందుగానోడించవలెనని నందులును రాక్షసమంత్రియు నిశ్చయించిరి. జీవసిద్ధి దక్షిణదిశ యామ్యము గాన నందులాదెసకేగుట క్షేమము గాదని జోస్యము చెప్పెను. కావున మఱునాడు పాండుగతి భూతపాలరాష్ట్రపాల గోవిశంక దశసిద్ధ కైవర్త ధనాఖ్యులగు సోదరులతో, నందాగ్రజుడు రథసహస్రముతో, ద్విసహస్రమాతంగములతో, పంచదశ సహస్రతురంగములతో, శతసహస్రపదాతులతో బలగుప్త భద్రభట పురుషదత్త సింహబలులు తోడై నడవ భద్రశాలసమేతముగా స్వర్ణగర్భముపై నుత్తరద్వారము వెడలి చాణక్యపర్వతకులపైబడెను. నందుల మాతంగఘటలు సమీపింపగనే - వానిధాటికు భీతిచెందినవానివలె బర్వతకుడు ససైన్యముగా వెనుదిరిగి పఱచునదియని చాణక్యుడొనర్చిన సంకేతమ ననుసరించి పర్వతకుడు పలాయన మొనర్చువాడయ్యెను. నందులును బర్వతకపలాయనము శారసి, రథములతో వారిని వెంబడించి నిజసైన్యముల విడిచి దవ్వరిగిరి. వెంటనే చాణక్యుడు ఇన్నూరు మాళవమాతంగములతో నందుల పిఱిందిదెస బన్నినిలిచి నందసేనల నిలువరించెను పర్వతకసేనల వఱిమిచనుచున్న నందులు దమవెనుకనున్న శాత్రవ

గజఘటలను గాంచిరి. దొరలు శత్రువ్యూహమున జిక్కుట యరసి నిరాశపై వెనుదిరిగి కాందిశీకములగు నిజసేనల గుర్తించిరి. అంతట నలువైపుల గ్రమ్ముచున్న పర్వతకమలయకేతు సైన్యముల గాంచి నందులు ప్రాణాశవదలి, రథములు డిగ్గనుఱికి ఖడ్గమాత్రసహాయులై పోరి రణరంగమున మడిసిరి. దొరల మరణము విని, చెల్లాచెదరై నగరము సొచ్చినసేనలను నందవిరక్తులగు విప్రులును జంద్రగుప్తానురక్తులును సంహరింపజొచ్చిరి.

అట దక్షిణద్వారమున లక్షకాల్వురతో, వేయిరథములతో, నైదువేల గుఱ్ఱములతో, రెండువేలేనుంగులతో జంద్రగుప్తునెదిరింపబోయిన రాక్షసమంత్రి భరపడి పోరుచున్నతఱి నందమరణవార్తయు, దత్సేనల పలాయనవార్తయు నేతెంచెను. ఆమహామంత్రి ఖిన్నుడై, పోరుచాలించి, తనసేనలను నగరములోనికి మరల్చి, సేనలకంటె ముందుగా దాను నగరముసొచ్చి యుత్తరద్వారముచెంతకు బఱుగిడెను. అనాయకములగు రాక్షససేనలను చంద్రగుప్తసైన్యములు వెన్నంటి ఖండించుచు, నగరముం జొచ్చెను.

రాక్షసమంత్రి, చాణక్యానుమతితో నందరాజశవముల గాంచి, యింతలో నింతటి వైపరీత్యము ఘటించినదుర్విధికి బిట్టు వగచి, ఆ శవములను నగరప్రవేశము చేయించి, నందవృద్ధుడగు సర్వార్థసిద్ధిచే యథావిధి దహన సంస్కారాదికము నిర్వర్తింపజేసెను. అనంతరము శాత్రవాక్రమితమై, అరాజకమై పాడఱియున్న పాటలీపుత్రదురవస్థం గాంచి, సేనాపతులు పలాయనమందుటచే దెసమాలియున్న సేనలపాటుం గాంచి, రాక్షసమంత్రి సర్వార్థసిద్ధిని 'రాజతంత్రము గైవసమొనర్చుకొని సామ్రాజ్యమును రక్షింపు' మని కోరెను. విరక్తుడగు నావృద్ధుడు తనయశక్తత నెఱిగించి, కావులు గట్టి తపోవనమున కేగెను. నగరవాసులు శాత్రవపీడ భరింపలేక తమ్ము రక్షింపుమని రాక్షసామాత్యుని వేడదొడగిరి. నందవంశాంకురమేనియు లేక అరాజకమై యున్న సామ్రాజ్యము నప్పటికి శత్రుపీడకు దప్పించి కాలాంతరమున మరల

శత్రునాశనమొనర్చుట నీతియని యెంచి, రాక్షసామాత్యుడు చాణక్య చంద్రగుప్తపర్వతకులకు పాటలీపుత్రము నప్పగించి చనెను. శత్రుసేనలు విజయధ్వనులు కసలముట్ట నగరమున ప్రవేశించెను.

చాణక్యుడు పర్వతకచంద్రగుప్తుల కొకప్రాసాదముననే విడుదులుచేసి, వైరోచకమలయకేతు ముఖ్యులకు వేఱ్వేర నివాసము లేర్పరిచి, రాక్షసమంత్రి వలనను, పర్వతకాదులవలనను జంద్రగుప్తునకు ఏమి కీడు వాటిల్లునో యని వేగనుల గను పెట్టియుండి, రాక్షస పర్వతక సర్వార్థసిద్ధులను బరిమార్చుట కుపాయము లారయుచుండెను. నాటిరేయి చంద్రగుప్తుని విడిదినుండి ఏగునపుడు చాణక్యుడు "వత్సా! నందవధప్రతిజ్ఞ నేటితో తీరినది. సుగాంగ ప్రాసాదంలో నిన్ను నందసింహాసనాభిషిక్తుని చేసినగాని నాప్రతిన పూర్తికాదు" అని పలికెను.

---

# 23

## చంద్రగుప్తాభిషేకము

చంద్రగుప్తాభిషేకమునకు రాక్షసపర్వతకు లిరువురును విఘ్నకారులు గాగలరు. నందవంశాకురము మిగిలి యున్నంతవఱకు రాక్షసమంత్రి తన ప్రయత్నము మానడు. ప్రజల కామంత్రిపట్ల నభిమానము మెండు. సర్వార్థసిద్ధి రాజ్యలోభము నుజ్జగించి అప్పటికి వనమునకేగినను రాక్షసమంత్రి యాతనిని విడువక, "రాజ్యము మీకు అక్కఱలేకపోతే పోయింది. మీరు వివాహంచేసుకొని నందవంశం నిలబెట్టండి. రాజ్యం నేను సాధించి సమర్పిస్తాను" అని కోరెను. వద్దు డామాటలు పెడచెవి నిడెను. రాక్షసమంత్రి యంతట జంద్రగుప్తుని చెంతకరిగి, "నందరాజ్యం తమకు సంక్రమించడం నాకూ, ప్రజలకూకూడా చాలా సంతోషమే కాని వైదేశికుడైన పర్వతేశ్వరు

నకు అర్ధరాజ్యం కట్టబెట్టితే మాత్రం ప్రజలామోదించరు. మగధరాజ్యానికి పర్వతేశ్వరబాధ వదిలింపుడని ప్రజలు నాముఖంగా తమకు విన్నవిస్తున్నారు. తరతరాల మేము నందరాజ్యమును సేవిస్తున్నాము గనుక ఏలినవారు అనుగ్రహిస్తే అమాత్యపదమందుండి కొలుచుకొంటాను" అని విన్నవించెను.

చాణక్యచంద్రగుప్తులు నాటిరేయి మంతనముండిరి. పర్వతేశ్వరుడు వైరోచకమలయకేతులతో ప్రబలసైన్యముతో రాజధానియందు పేటపెట్టుకొని తానే సార్వభౌముడనన్నట్లు విఱ్ఱవీగుచుండెను. అర్ధరాజ్యమునుండి వీనిని వంచించుట యెట్లులని చాణక్యు డుపాయము లారయుచున్నవాడు గావున, రాక్షసమంత్రిచే నాకార్యము నెరవేర్చుకొనువాడై, చంద్రగుప్తునకు రాక్షసమంత్రిత్వము నంగీకరింపుమని యుపదేశించెను.

రాక్షసుడును దనమంత్రము పాటినదని సంతసించి వనమునందున్న సర్వార్థసిద్ధి దేవతాప్రసాదమును బంపెనన్నమిషతో జంద్రగుప్తునకు విషఫలము లంపించెను. సిద్ధార్థునివలన జాణక్యు డీరహస్యము నెఱిగియున్నవాడుగాన నావిషఫలములను మార్చి, చంద్రగుప్తునకు మంచిపండ్లు పంపించెను. విషఫలములను రాక్షసుడంపినట్లు సర్వార్థసిద్ధికే అంపించెను. ఇచట రాక్షసుని యెదుటనే చంద్రగుప్తు డాపండ్ల నారగించి చెక్కుచెదరక యుండెను. రాక్షసు డిదియేమి వింతయని యోజింపుచుండ, విషఫలములు భక్షించి సర్వార్థసిద్ధి మరణించెనని వార్తవచ్చెను. రాక్షసుడు ఖిన్నుడై హతవిధిచెయిదముల నిందించుచు నానాటికి కింటికేగెను.

సర్వార్థసిద్ధి కూడ గతించిన పిమ్మట నింక దానెవరికొఱకు రాజ్యము సంపాదింతునని రాక్షసుడు నాటిరేయెల్ల విచారించెను. నందు లంతరించినను, వారిసొమ్ము దినియున్న తాను జీవించియుండగా నందవైరులు మగధసింహాసన మెక్కుట కామంత్రిపుంగవు డోర్వలేడయ్యెను. ఎటులైన బర్వతకచంద్రగుప్తులకు భేదము పుట్టించి పరస్పరనాశము కల్పించి స్వామిఋణము తీర్చుకొందు

నని నిశ్చయించి మఱునాడు పర్వతేశ్వరునిచెంత కరిగి, "మగధసామ్రాజ్యమునకు నిన్నభిషిక్తుని చేస్తాను. చంద్రగుప్తుని వధింపు" మని కోరెను. రాజ్యమంతయు దానే కబళించుటకు బర్వతకు డంగీకరించెగాని, శాంతవతీభర్త యన్న బంధుప్రీతిచేతనో ఏమో చంద్రగుప్తుని జంపుటకు సమ్మతింపదయ్యె. రాక్షసుడును "నాకైనా కావలసింది అంతే" అని పర్వతకుని నమ్మించి తన ప్రయత్నము దా జేయనెంచెను. పిమ్మట నాతడు జీవసిద్ధితో నాలోచించి జగదేకసుందరియగు విషకన్యను నిర్మింపజేసెను. ఆకన్యాసంసర్గ మెట్టివారికైన దత్క్షణమే మృతిఘటించును గాన దానిని చంద్రగుప్తునకు గానుకపెట్టుటకై కొంపోయెను. చాణక్యు డంతకుమున్నె జీవసిద్ధివలన నీతంత్రమంతయు విని ప్రతిక్రియ నాలోచించి యుంచెను.

పర్వతకచంద్రగుప్తులు సౌహార్దముమై సరససల్లాపములతో నాటిరేయి వినోదించుచుండిరి. పర్వతకుడు మధుపానముచే మత్తుడైయుండెను. చాణక్యమంత్రియు జెంతనే కనుపెట్టియుండెను. అట్టి యవసరమున రాక్షసమంత్రి విషకన్యతోగూడ వినీతుడై ప్రవేశించి, చంద్రగుప్తున కాకన్యకను గానుక పెట్టి పరిగ్రహింపుడని వేడుకొనెను. వలిపంపు మేలిముసుగులోనుండి తళతళ మెఱయుచున్న దానివీక్షణములను దానిరూపసంపదను గాంచి పర్వతేశ్వరుడు చంద్రగుప్తుని యదృష్టమును గొనియాడుచుండెను. చాణక్యు డపుడు చంద్రగుప్తునితో "పర్వతేశ్వరులవారు పెద్దలు, సర్వదాపూజ్యులు. కాబట్టి యీకన్యను వారికి సమర్పించడం యుక్తంగా వుంటుంది" అనెను. చంద్రగుప్తుడును వల్లెయని విషకన్యను, మధుపానముచే మైమఱచియున్న పర్వతేశ్వరున కర్పించెను. అప్రయత్నముగా లభించిన పెన్నిధానమువంటి యాకన్యకను బర్వతకుడు వెంటగైకొని శయ్యామందిరమున కరిగెను. తనకనులయెదుటనే ఆప్రయత్నము వమ్మై విపరీతఫలమొసగుచుండ రాక్షసుడు కొయ్యయై కూర్చుండెను. మృత్యుకరగ్రహణమొనర్చి యేగుచున్నపర్వతకుని వారించినచో తా నొనర్చిన ద్రోహము వెల్లడియగును. వారింపక మిన్నకున్నచో బర్వతకమరణ

ణము తనతలపై బడకమానదు. నూయియుం గోయియున్నైన తన సంకటమునకు ప్రతిక్రియ నెమకి కానక, యెట్లెట్లో చాణక్యచంద్రగుప్తులయొద్ద సెలవు గైకొని స్వగృహమున కేగెను.

తెల్లవారుసరికి పర్వతేశ్వరుడు శయ్యామందిరమున విగతజీవుడై యుండెను. విషకన్య కానరాలేదు. రాక్షసమంత్రి విషకన్యాప్రయోగముచే పర్వతేశ్వరుని జంపెనని చాణక్యుడు నగరమంతట ప్రవాదము పుట్టించెను. రాక్షసుడపాయము శంకించి, భార్యను, బుత్రుని చందనదాసుడను రత్నవర్తకుని యింట విడిచి, పలాయనము చిత్తగించెను. చాణక్యుడు రాక్షసపలాయనమెఱిగియు నెఱుగనట్లూరకుండెను. పర్వతకసేన హాహాకారములు సల్పుచు భయాశ్చర్యపరీతము లైయుండెను. పర్వతకవైరోచకమలయకేతులను జంపుటకు చాణక్యుడు దలచియుండ పర్వతకమరణ మిట్లు రాక్షసుని పుణ్యామాయని ఘటిల్లినది. ఇక మిగిలిన యిరువురిలో మలయకేతువుపైకి భాగురాయణుని ప్రయోగించెను. ఆతడు మలయకేతువు చెంత జేరి "నీతండ్రిని మాయలమారి చాణక్యుడే సంహరించె" ననెను. మలయకేతువు "మఱి రాక్షసు డెందుకు పాఱిపోయినా"డని ప్రశ్నింప, "తన్నుగూడా చాణక్యుడు చంపునని భయపడి పాఱిపోయెనేమో. ఆ బ్రహ్మచారి మిమ్ముగూడా తుదముట్టించడానికి చూస్తున్నాడు" అని భాగురాయణుడు భీతి పుట్టించెను. "అయితే నాకేమిటి గతి? చంద్రగుప్తుని శరణందునా?" యని మలయకేతువు ప్రశ్నింప, "చాణక్యుడు తలచుకొంటే చంద్రగుప్తుడు అడ్డగలడా? ప్రతినపట్టి నందనిర్మూలంచేసిన దుర్మార్గుడు ఏమిచేసినా చేస్తాడు. ఇప్పటికి మీరెక్కడకైనా పోయి ప్రాణాలు రక్షించుకొంటే తరువాత శుభకాలం వచ్చినప్పు డీపగదీర్చుకోవచ్చును. అంతేకాని ఈనగరంలో ఒక్కక్షణమైనా నిలవడం క్షేమంకాదు" అని యాతడు చెప్పెను. మలయకేతువును ఈయాలోచనము బాగుగనే యున్నదని నాటి రేయి కతిపయాప్తులతో నగరము విడిచి వృషపాలనమున కేగెను. చాణక్యుడెఱుగనట్లూరకుండె

ఇక మిగిలియున్న వైరోచకునివిషయమై చాణక్యుడాలోచించుచుండగా రాక్షసతంత్రమొకటి యాతనిచెవుల బడెను. రాక్షసమిత్రుడగు దారువర్మ యను శిల్పి యొకడు సుగాంగప్రవేశోత్సవసమయమున చంద్రగుప్తు నంత మొందించువాడై నగరిద్వారమున మారణయంత్రకీలితమగు బంగారుతోరణము నిర్మించెను. ఆ యుత్సవావసరమున చంద్రగుప్తు డధిరోహించు చంద్రలేఖయను భద్రగజమును తోలవలసియున్న భైరవారకుడను మావటీడు కూడ రాక్షస ప్రేరణమున దారువర్మకు తోడ్పడుటకు నిశ్చయించెను. ఈరహస్యము తెలియ వచ్చినంతనే, యీరాక్షసతంత్రమును వైరోచకునిపై ప్రయోగించువాడై యాతనిచెంతకరిగి యిట్లు వచించెను. "మలయకేతుకుమారుడు, చూచారా, ఎంత తెలివిమాలినపని చేసెనో! నేనే మహాపర్వతేశ్వరులను చంపించితిననీ, తన్ను కూడా బ్రదుకనివ్వననీ, ఎవరో నిర్భాగ్యులుచెప్పినమాటలు నమ్మి, నిక్షేపంవలె చేతికందిన అర్ధరాజ్యం వదులుకొని పోయినాడు. తెలివితక్కువవాడు కాక పోతే, చెప్పినవాళ్లు చెప్పితేమాత్రం తన కెందుకు తోచకూడదు? పర్వతేశ్వరులవారిని నేను చంపించినమాటే నిజమైతే తన్ను మాత్రం ప్రాణాలతో పోనిస్తానా? అల్పపరివారంతో పారిపోతూవున్న తన్ను, నేను తలచుకొంటే, చంపించడం ఎంతపని? ఈమాత్రం ఆలోచన లేకపోయెను. సరే, కానివ్వండి. ఇలా జరగడం ఒకందుకు మంచిదేఅని నాకు తోస్తున్నది. ఏమి టంటారేమో ఇటువంటి అధీరుణ్ణి బుద్ధిహీనుణ్ణి అర్ధరాజ్యాభిషిక్తుణ్ణి చేయడం తప్పిపోయిందని మనం సంతోషించవలసిందే. పర్వతేశ్వరులు దుర్మరణంపాలై పడినప్పటినుంచీ, నామనస్సులో ఉన్నమాట పాపమో, పుణ్యమో, చెప్తున్నాను. మీవంటి పరాక్రమశాలీ, బుద్ధిశాలీ అర్ధరాజ్యం అధిష్ఠించితే సర్వవిధాల బాగుంటుందని తోచింది. తోచినందుకు దైవంకూడా కుఱ్ఱవాని కాదుర్బుద్ధి పుట్టించి, మనకను కూలించింది. కనుక, తమరు నామనవి చిత్తగించి, అర్ధరాజ్యం అంగీకరిస్తే మగధరాజ్యానికి బలమూ చేకూరుతుంది. రాజ్యభారం వహించడానికి తమ వంటివారు పూనుకొంటే నేనూ నిశ్చితంగా తపోవనానికి వెళ్లి ఈశ్వరధ్యానం

చేసుకుంటాము. అయితే, 'శ్రేయాంసి బహు విఘ్నాని' అని మీకొక ఆక్షేపణ
వస్తుంది. ఏమిటంటారా! విన్నవిస్తాను, సావధానంగా ఆలకించండి. మొదట,
రాజ్యం రెండుగా చీల్చడానికి ప్రజలు సమ్మతించరు. సమ్మతించినా వైదేశిక
డికి పంచిపెట్టడానికి ఏతరామూ అంగీకరించరు. 'మరి పర్వతేశ్వరుడికిచ్చు
యంలో ఏలా ఒప్పుకున్నారు' అంటారేమో. దానికి మాత్రం ప్రజలు ఒప్పు
కొన్నారా! మాలో మేమేదో ఒడంబడిక చేసుకొన్నాముగాని తీరా, అర్ధ
రాజ్యం పర్వతేశ్వరులకు పంచిపెట్టేవేళకు ఏమి వచ్చేదో! అప్పుడేదైనా
ఆక్షేపం వచ్చినా, మేము చేసుకున్న సంధిప్రకారం జరిగి తీరాలని పట్టుబట్టి
క్రిందామీదా పడేవాళ్లం. అది అలా వుండనీండి. ఇప్పుడు పర్వతేశ్వరులు
గతించారు గనుక వారితో మేము చేసుకొన్న ఒడంబడిక చెల్లనక్కరలేదు, అని
ఆక్షేపించబోతారు ప్రజలు. ఇదంతా సామవర్యులలో వున్న సందేహాలు తమతో
మనవిచేస్తున్నాను సుమండీ! ఆనక ప్రజలు అభ్యంతరపెట్టినా, పెట్టకపోయినా నాకు
ఇక్కడి ఆనుపాను తెలిసి వున్నవాడను గనుక కీడెంచి మేలెంచుతున్నాను.
సరే, వారి అభ్యంతరం చెప్పేపక్షంలో, మరి మేమంటామూ? పర్వతేశ్వర
మరణంవల్ల మా సంధికి భంగం కలగకూడదను కావాలి. అంతేనా? సంధికి భంగం
కలగకపోతే ఇప్పుడేమి జరగవలసివుంటుంది అనే ప్రశ్న వస్తుంది. ఇదుగో,
ఇక్కడేవున్నది చిక్కు. పర్వతేశ్వరుల అనంతరం సంధిప్రకారం అర్ధరాజ్యం
మలయకేతువుకు ఇవ్వాలి. మా అభ్యంతరం లేదు అని ప్రజలుగనుక అంటే మనం
నిరుత్తరులం కావలసివస్తుంది. పోనీ, మలయకేతువుకే ఇద్దామా అంటే ఏదీ?
అతడు దేశం విడిచిపోయాడు. తిరిగివస్తాడే అనుకోండి అతడు. వస్తేమాత్రం అటు
వంటి పేటమనసువానికి చూస్తూ చూస్తూ రాజ్యం ఎలాగు కట్టిపెట్టడం! అందు
కని మనం రాచబాట నేపోయి యీ వివాదాలన్నీ కొని తెచ్చుకోవడంకంటె గుట్టు
చప్పుడు కాకుండా మిమ్మును ముందు సింహాసనమెక్కించివేస్తే ఆనక గతించిన
దానికి ప్రజలు వచ్చినట్టు అంగీకరిస్తారు. అయితే రహస్యంగా పట్టాభిషేకం
పొందడం యుక్తంగా వుండదంటారు తమరు. దానికి నేనొక ఉపాయం మాలో

చేస్తాను. చంద్రగుప్తులవారికే పట్టాభిషేకమని చాటించుదాము. ప్రజలు సంతోషించి నిస్సందేహంగా చంద్రగుప్తపట్టాభిషేకం చూడడానికి మూగుతారు. చంద్రగుప్తులవారి దుస్తులు ఆభరణాలు మీమరు ధరించి, చంద్రలేఖపై అధిరోహించి సుగాంగప్రవేశం చేయండి. సమస్తప్రాసమక్షంలో చంద్రగుప్తులవారి పేరుతోనే తమరిని అభిషేకిస్తాము. అభిషేకం ముగిసినతరువాత వైరోచకులవారిని అర్ధరాజ్యాభిషిక్తులను చేశామని ప్రకటిస్తాము. అప్పుడెవ్వరూ నోరుమెదల్చడానికి వీలుండదు. తరువాత చంద్రగుప్తులు అర్ధసింహాసనం అధిరోహిస్తారు. ఇదీ నాకు తోచిన ఆలోచన. మీరేమి అభిప్రాయమేమిటో సెలవివ్వండి."

వైరోచకుడును, ఈ ఉపాయమే సాగునేని సామ్రాజ్యము సగము గైకొనవచ్చునని తలపోసి, "మాకిది సమ్మతమేగాని, సుగాంగప్రవేశసమయంలో పర్వతేశ్వరసైన్యములు మా వెంట ఉంటే బాగుంటుందని మాకు తోస్తున్నది" అనెను.

చాణక్యుఁ డందుల కంగీకరించి చంద్రగుప్తపట్టాభిషేకము చాటింపించి సుగాంగప్రవేశోత్సవసన్నాహము లాచరించి వైరోచకుని చంద్రగుప్తునియొక్క వుడుపులతో, నాభరణములతో నలంకరించి చంద్రలేఖపైని నధిరోహింపజేసెను. వైర వారకుడు చంద్రలేఖకుంభస్థలమున గూరుచుండి ఆభ్రగజమును నడపుచుండెను. దారువర్మయు స్వర్ణతోరణయంత్రమును చేసి యుండెను. కంఠమునుండి నిండునట్లలంకరించిన పూలమాలికలచే నగముమఱుగుపడియున్న మోముతో చంద్రగుప్తవేషముతో బట్టపేనుగుపైనున్న వైరోచకుని చిరుటీలు వెలుగున గాంచిన ప్రజలెల్ల చంద్రగుప్తుడేయని యెంచిరి. చంద్రలేఖవెనువెంట పర్వతేశ్వరునిసేనలును, వానివెన్నదన్ని చంద్రగుప్తసేనలును నడచుచుండెను. పార్వతకసైన్యము ఉత్సవపువేడ్కలో మైమఱచియుండ చంద్రగుప్తసైన్యములు సశస్త్రములై కనుగల్గియుండెను. భేరీభాంకృతులతో మంగళధ్వానములతో మిన్నుముట్టుచుండ నాయుత్సవము స్వర్ణతోరణము సమీపించెను. దారువర్మ

మఱునాడు కళింగ కామరూపముంజవత్పతులను చంద్రగుప్తుడు సత్కరించి, సువర్ణములను రత్నములను కొల్లలుగా నొసంగి వారివారిదేశములకు సాగనంపెను. మగధాధీశ్వరుని నెయ్యమును నుపొందుచు వారు తిరిగి పట్టాభిషేకోత్సవమున కరుదెంతుమని విన్నవించి చనిరి. నాటిసాయంసమయమున చంద్రగుప్తప్రేషితుడై రాజసేనుడు చాణక్యునియింటి కరుదెంచెను. చాణక్యుడింటలేడు. రాజసేనుడు చాణక్యగృహిణియగు గౌతమికి నమస్కరించి లక్షసువర్ణములను బట్టుపుట్టములను సమర్పించి, "మహారాజులుంగారు ఆచార్యదేవులకు శిష్యపురస్కారం సమర్పిస్తున్నారు. ఈ ప్రథమానసమయం అంగీకరింపవలసిందని నాముఖంగా మనవిచేస్తున్నారు. మగధసామ్రాజ్యమహామాత్యులకు తగిన ప్రాసాదమొకటి ఆచార్యులకొఱకు సిద్ధంచేయించారు. అందు ప్రవేశింపుడని విన్నవిస్తున్నారు" అని పలికెను. గౌతమి నవ్వుచు, 'వీటిని తిరిగి తీసుకువెళ్ళడానికి మీరేవస్తారా?' అనెను. రాజసేను డామాటలకు కాశ్చర్యమునంది "అంతటి అపచారం నావల్ల జరగ"దనెను. "అయితే ఆర్యపుత్రులే తీసుకవచ్చి వప్పజెప్పుతారు లెండి" అని గౌతమి రాజసేనుని వీడ్కొల్పెను.

చాణక్యుడు గృహమున కేతెంచి, జరిగినవృత్తమంతయు గౌతమివలన విని, సువర్ణరాశిని బట్టించుకొని రాజప్రాసాదమున కరిగెను. చంద్రగుప్తునియెదుట "మాకేమిపని? మాయిరువురకు ఇప్పుడున్నకుటీరమే చాలు. ఈధనమంతా ఏదైనా సద్వినియోగం చేయించు" అనెను. చంద్రగుప్తుడును 'ఆర్యులీమాట అందురని ఎఱుగుదును. అయినా ఈధనం తిరిగి మేము గ్రహించము. ఆర్యులే సెలవివ్వాలి ఏమిచేస్తే బాగుంటుందో" అనెను. "రాజధానిలోనూ, వారాణసీ తక్షశిలలోనూ విద్యాదానంచేస్తున్న పేదపండితులకు ఈధనం వినియోగపడితే బాగుంటుంది" అని చాణక్యుడు పలుక, చంద్రగుప్తుడు "ఇంకొకలక్షసువర్ణాలు కూడా దీనికి కలిపి ఈసత్కార్యానికి వినియోగిస్తాము. కాని, ఈసంతోషసమయాన గురుపత్నులకేమైనా సమర్పించుకోవడానికి అనుజ్ఞ యివ్వండి" అని

విన్నవించెను. చాణక్యుడు "ఆబిడ కేమికావాలో కనుగొని మరీ యివ్వడం మంచి"దని చంద్రగుప్తునివెంటగొని నిజగృహమునకరిగి గౌతమికి, మహారాజాభిలాష మెఱిగించెను. గౌతమియు, "మహారాజానుగ్రహంవల్ల నాకేమీ కొఱత లేదుగాని, తమగురువులైన ఆర్యపుత్రులు పేదబాపడివలె రాగిపాత్రతో సంధ్యవార్చుకోవడం నాకు బాగుండికాదు. వారికొక వెండిపాత్రా, ఉద్ధరిణె యిప్పిస్తే అదే పదివేలు" అనెను. చంద్రగుప్తుడు వాయిల్లాలిచతురతకు నవ్వుచు, చాణుక్యుని గన్గొని "ఆచార్యులసెలవైతే సమర్పించుకుంటాను" అని యాదంపతులకు నమస్కరించి సుగాంగమున కరిగెను.

నాటిరేయి శాంతవతితో నేకాంతమునయున్నవేళ మహారాజీవృత్తాంతమామెకెఱిగింప మహారాజ్ఞి "ఆర్యులు ఇంత నిస్పృహులని అనుకోలేదు. నా మేనబావలను పర్వతేశ్వరులను చంపించినందున గురువులవారిమీద ఇన్నాళ్లు నాకు కోపంగావుండేది. లోకసంగ్రహంకొఱకే వారీపనులన్నీ చేస్తున్నారని నేడు తెలిసివచ్చింది" అనెను.

చంద్రగుప్తుడు.—"లోకసంగ్రహంకొఱకు ఆర్యులు చేసినదుష్టశిక్షణం మన భాగ్యంకొద్దీ మనపట్ల పరమానుగ్రహంగా పరిణమించింది.

శాంతవతి.—ఆర్యులు తమకు నందులుచేసినఅవమానం తీర్చుకోవడానికే యింతపని చేశారనుకోవడంగూడా పొరపాటే. శిష్టరక్షణంకొఱకే దుష్టశిక్షణం చేశారుగాని క్రోధశాంతికోసంకాదు. ఇంతకు, మనమదృష్టశాలురంగనక ఆర్యులను సేవించుకొనేభాగ్యం మనకు లభించింది.

---

# 24

# రా జ ద్రో హు లు

చంద్రగుప్తునకు పట్టాభిషేకమైనపిమ్మటగూడ కొంతకాలమువఱకు చాణక్యుడు, మహారాజున కెప్పుడేమికీడు మూడునోయని వేయికన్నుల గని పెట్టియుండెను. రాక్షసమంత్రి నగరమువిడిచిపోయినను పరుచపలును రహస్యచారులును బురమున నదనుపేచి మహారాజునకు గీడుసల్పయత్నించుచుండిరి. రాజభృత్యులలో నింకను నందానురక్తులెందఱో యుండిరి. ద్రోహము బయల్పడువఱకు నిట్టివారిని దొలగించుట నీతి కాదనియు, నందునొందఱు క్రొత్త జేసినయెడల ననురక్తులు కాగలరనియు చాణక్యుడెంచి వారినెల్ల కనిపెట్టియుండెను. కంచుకిముఖ్యుడగు వైహీనరిని, అంతఃపురరక్షకుడగు రాజసేనుని, రాజగృహరక్షకుడగుబలగుప్తుని, చారముఖ్యుడగుభాగురాయణుని విడిపించి, యేకాంతమున వారివారినియోగములం దేమరకుండవలయు నేర్పాట్లుగావించుచుండెను. నగరములోనికి వచ్చుచు బోవుచునుండుక్రొత్తమనుజులను పరీక్షించుపట్ల, విషదాయకులను గ్రహించుపట్ల రాజోద్యోగులను, అంతఃపురపరిజనమును కనిపెట్టియుండుపట్ల ప్రతిదినము వారల హెచ్చరించుచుండెను. మహారాజు భుజించుటకునున్న ప్రతిభోజ్యమును పక్షులకు దినిపించుచుండిరి. శయ్యాగృహము నేమరక రక్షించుచుండిరి. మహారాజు ప్రాతఃకాలమున మేల్కొన్నతోడనే విల్లమ్ములుదాల్చినప్రతీహారిణులు సౌఖశాయనికులగు చుండవలెను. శయ్యామందిరము దాటగానే మహారాజునకు రెండవకక్ష్యలో వైహీనరి ప్రాకరుచితవేషము నందింపవలెను. మూడవకక్ష్యలో కుబ్జవామనాదులు మహారాజు ననుసరింపవలెను. నాలవకక్ష్యలో శస్త్రధారిణులగు ప్రతీహారిణులయెదుట రాజబంధువులకు మంత్రిపురోహితాదులకును మహారాజు దర్శనమొసగును.

ఇన్నికట్టుదిట్టములతో మహారాజు నహోరాత్రములు కేయికన్నులతో రక్షించుచుండ శత్రుకుతంత్రము లొక్కొక్కటిగా బయల్పడ నొడగెను. మహారాజొకనాడస్వస్థుడైయుండ రాజవైద్యుడగు నభయదత్తుడు బంగారుగిన్నెతో నౌషధ మొసగెను. మహారాజాయౌషధమును సేవింపనున్నతఱి, చాణక్యుడదను మానించి, ఔషధపాత్రము దానందికొని, పాత్రమునకు వర్ణాంతరము గలుగుట యరసి ఆయౌషధ మభయదత్తునిచేతనే త్రాగించెను. అభయదత్తుడును విష సమ్మిశ్రితమగు నాయౌషధమును మారుమాటాడకుండ త్రావి, యచటనే మరణించెను. "ఇంతటి ఘనవైద్యుడు మఱి జన్మించడు. ఈతని కీర్తిప్రతిష్ఠల నెవ్వరు నెంచలేరు. నమ్మికరోగిని చేతులారా చంపెడువైద్యున కిదియే శాస్తి" యనిపలికి చాణక్యుడభయదత్తునిశవమును కాకిగ్రద్ధలచే సంస్కారాదికము నిర్వర్తింపఁ జేసెను. శయ్యాగారరక్షకుడగు ప్రమోదకుడు ద్రవ్యమునమితముగా వెచ్చించి భోగము లనుభవించుచుండెననియు, 'నీకీద్రవ్యమెక్కడిది' దని యడిగినవారికి పలకొకవిధముగా బదులు చెప్పుచుండెననియు జాణక్యునకు చారులెఱింగించిరి. చాణక్యుడు దుంబురుని బ్రయోగించి ప్రమోదకునకు రాక్షసమంత్రి చంద్రగుప్తవధార్థము ధన మొసంగెననియు, వాడును మహారాజు నంతమొందించుటకు వలెవేచి యుండెననియు దెలిసికొని ప్రమోదకుని జిత్రవధచేయించి తద్ధన మెల్ల బొక్కసమున జేర్పించెను.

అనంతర మొకనాడు బలగుప్తుడింగగారు రాజసేన భాగురాయణునితో చాణక్యుడు రాజగృహము పరిశోధించుచుండ, శయ్యాగృహకుడ్యమునం దొక రంధ్రముగుండా నూకలుగొని యేతెంచు చీమలబారు గన్పించెను. చాణక్యుడిచటికి భోజనసంభారము లెటనుండి వచ్చెనని యనుమానించి యాగోడను పట్టి చూడ నది యొకటిమ్రోత మ్రోగెను. వెంటనే యచట ద్రవ్వించి చూచి నంతట లోపలనొకసొరంగము కాన్పించెను. సొరంగములోపల నెవరో పురుషు లుండుట నిశ్చయించి చాణక్యుడందు దట్టముగా బొగవెట్టించి ద్వారము

మాయించెను. చంద్రగుప్తుని జంపుటకై రాక్షసప్రేరితులై యందు నివసించి సమయము కాచియున్న బీభత్సకాదులా పొగచే కనులు గానరాక తొల్లి తా మందు జొచ్చినమార్గము గుఱితింపలేక యాసొరంగమున నూపిరియాడక మరణించిరి. పిమ్మట చాణక్యుడు మహారాజు శయనించుటకు వేర్వేరు శయ్యామందిరము లేర్పఱచి దినమునకొకమందిరమున శయనించున ట్లొనర్చెను.

వైదేశికవేషమున జ్యోతిశ్శాస్త్రవేత్తయొకడు మహారాజును దర్శించి భూతపూర్వములగు విషయములన్నియు బాగ గ్రుచ్చినట్లు చెప్పెను. చాణక్యు డాతని ననుమానించి రాజసేవకుని హెచ్చరికమై నుండుమని సన్న చేసెను. ఆజ్యోతిష్యుడు తంతట దనకు సాముద్రికమున గూడ ప్రవేశము గద్దని తెలిపి మహారాజుహస్తమును జూడగోరెను. చంద్రగుప్తుడును చేసాప సాముద్రికుడు సమీపించి, తటాలున మొలలోనిసకటారి వెలికి చంద్రగుప్తునివక్షమును బొడుచుటకు జేయెత్తెను. చంద్రగుప్తుడును గళపళపడక తటాలున వానిహస్తమును గ్రహించి పట్టుకొనెను. వెనుకనె సిద్ధముగానున్న రాజసేవకు డాకపటసాముద్రికుని కత్తిపోటున కెఱగావించెను. చాణక్యు డపుడు "పాపం! ఈజ్యోతిష్యుల వారికి తనమరణాన్తరణంమాట తెలియలేదు కాబోలు" ననెను. మహారాజును "జ్యోతిషమే కాదు; కత్తిపట్టుగూడా ఎఱుగడీమూర్ఖుడు. బాకపోటుఎఱిగిన వాడైతే చేయి పైకెత్తి మాకు పట్టుచిక్కనిచ్చునా? క్రిందినుంచి పొట్టలో పొడిచేవాడు" అనినవ్వెను. నాటినుండి రాజదగ్గఱ కార్థులనందఱిని బరీక్షించిన మీదగాని ఆస్థానమున బ్రవేశింపనీయకుడని చాణక్యుడు ద్వారపాలకుల కానతిచ్చెను.

పిమ్మటనొకనాడు అశ్వవర్తకులు గొందఱుఆరట్ట కాంభోజవనాయుజము లగునశ్వముల నమ్మవెచ్చిరి. వానిని బరీక్షించుటకై చాణక్యబలగుప్తరాజసేనా పురుషదత్తసమేతముగా మహారాజచటికేగెను. మహారాజశ్వముల బరీక్షించుచుండ నావర్తకులు ఖడ్గములు ధరించి మహారాజు నాక్రమించిరి. చాణ

క్యుడు గనుసన్న యొనర్ప జంద్రగుప్తు డాయశ్వములలో చెంతనున్నదానిపై వ్రాలి తటాలున నెగిరిపోయెను. చాణక్యాదులును ఖడ్గములు దూసి కపటవర్తకుల నెదుర్కొనిరి. మహారాజు దప్పించుకొని యేగుటయు, నిక నచట పడసినచో నగరమునుండి సేనలువచ్చి తమ్ముబట్టుకొనుననియోచించి వర్తకులు గుఱ్ఱముల నెక్కి పాఱిపోయిరి. పిమ్మట జంద్రగుప్తునిపంపున పురుషదత్తు డాశ్వికదళముతో నాకపటవర్తకుల వెంటాడి పట్టి తెచ్చెను. చాణక్యుడు వారలు రాక్షసప్రేరితులగుట గ్రహించి చిత్రవధపాల్పఱిచెను.

సంకర్షణాలయమున మహారాజున కచటియర్చకుడు స్వామితీర్థమున విషము గలిపి యిచ్చెను. చెంతనున్న వైహీనరి తీర్థపాత్ర నందిపుచ్చుకొని పిల్లిచే ద్రావింప నది యనుపదమే మరణించెను. చాణక్యుడాయర్చకుని కాళ్లు చేతులు బంధించి నదీగర్భమున ద్రోయించి చంపెను.

ఒకనాటిరేయి దొలిజామున వానరవ్యాలమున కెవరో నూనెగుడ్డలు చుట్టి నిప్పంటించి మహారాజభవనముపై నవలిరి. ఆమర్కటము మంటకాగలేక ప్రాసాదముపై గంతులిడుచుండ ప్రాసాదమందొకచోట మంటలు లేచెను. కావలివారలు వెంటనే మంటలు చల్లార్చి కోతినిబట్టుకొని విచారింప దద్యుజమాని రాజగృహోపవనమున నొకచో దాగియుండెను. వాని నచటనే నిలువున గాల్చిచంపిరి. ఇట్లు రాక్షసప్రయోగములన్నియు చాణక్యునిజాగరూకతచే విఫలములగుటయు, ద్రోహులనెల్ల బహువిధదండనముపాల్సేసి వారిద్రవ్యమును బొక్కసముల జేర్చుకొనుచుంటయు నరసి రాజద్రోహమొనర్పుట కెవ్వరును మఱి సాహసింపరైరి. రాక్షసమంత్రియు నిక రహస్యవధప్రయత్నములచే ఫలములేదని గ్రహించి చాణక్యచంద్రగుప్తులను నాశనమొనర్చుటకై యుపాయాంతరము లరయుచుండెను.

నందవంశాంకుర మెవరు మిగిలియున్నను రాక్షసమంత్రి తనప్రయత్నము విడువడని యోచించి చాణక్యుడు సర్వార్థసిద్ధినిగూడ దునుమట్టించెను గాని.

ఆకసివనోదము కుదమట్టపయ్యె. రాక్షసుడు మలయకేతువు నాశ్రయించి చంద్రగుప్తోచ్ఛేదమునకై ప్రబలయత్నములు సల్పుచుండెను. 'నీతండ్రిని చాణక్యుడే చంపించె' నని మలయకేతువునకు భాగురాయణునిచే జెప్పించి చాణక్యు డాతనిభయపెట్టి పురమువెడలి పారిపోవునట్లొనర్చి, పర్వతకుని యర్ధ రాజ్య మాతనికొసగకుండ దప్పించుకొంటినని సంతసించుచుండెను. ఇప్పుడా మలయకేతువే రాక్షసప్రేరణమున చంద్రగుప్తునిరాజ్యమంతయు గబళింప సన్నద్ధుడగుచుండెను. కౌలూతపతియగు చిత్రవర్మయు, మలయేశుడగు సింహనాదుడును, కాశ్మీరపాలకుడు పుష్కరాక్షుడును, సింధురాజు సుషేణుడును, పారసీకపతియగు మేఘనాదుడును, శకయవన కాంభోజగాంధారకిరాతబలములతో మలయకేతువునకు బాసటలై పాటలీపుత్రముపైకెత్తివచ్చు నాలోచనము సల్పు చుండిరని దేశమంతట బ్రజలు చెప్పుకొనసాగిరి. అంతకుమున్నె చారులవలన నీవృత్తాంతమంతయు వినినచాణక్యునకు క్రోధమగ్గలమై కనులు జేవురించెను.

నందవంశకాననమును బూడిద గావించి, చల్లారిన దనుకొన్నచాణక్య క్రోధాగ్ని కీవార్త లింధనములై దొరకినట్లయ్యెను. నందకులమునుమాపిన నల్ల త్రాచువలె ప్రేలాడునాతని జుట్టు నిప్పటికిని ముడువనీయక వధ్యులుకాగోరు చున్నశత్రువులను తలచుకొని మహాత్ముడు పండ్లుగీటదొడగెను. "నందోన్మూలనం చేసి నేను ఉపశమిత క్రోధుడనై యుండగా, చంద్రగుప్తునకు కీడుతలపెట్టు తున్నారీమూర్ఖులు! కడుపునిండా గజరక్తపానంచేసి ఆవులిస్తున్న సింహ ముఖంలో గజరక్తారుణమై కనుపించేకోరలను పెకలింప జూస్తున్నారు వీళ్లు! రాజ్యగర్వాంధకారంచే కన్నుగానక నన్ను పీటనుండిలాగి పరాభవించినందుకు ఫలంగా సర్వనాశంచెందిన నందులదురవస్థ చూచికూడా చంద్రగుప్తునికి ఎగ్గు తలపెట్టడం చూడగా వీళ్లకు బ్రతుకుపై తీపిలేనట్లు తోస్తున్నది. ఆగ్రహఫలం నందులకు, అనుగ్రహఫలం చంద్రగుప్తునకు పంచిపెట్టిన విష్ణుగుప్తునిచే మళ్లా, శస్త్రంపట్టిస్తున్నాడు మూర్ఖుడు మలయకేతువు. వీనిలెక్కయేమిటి! క్షణంలో

నా క్రోధాగ్నికి శలభమై మాడిపోతాడు. రాక్షసమంత్రి చే చిక్కాలి. అతడు పట్టుబడేవఱకు వృషలునకు రాజ్యం సుస్థిరం కాదు. తనప్రయత్నాలన్నీ పడటి గలిసిపోయినా, ఇంకా యీబ్రాహ్మణుడు పగ సాధించడం మాత్రం ఎంతైనా వింతగావుంది. నందసింహాసనంపట్ల ఆతనికిప్పుడున్న ఈవిశ్వాసానికి హద్దుకనుపించ కుండావుంది. సర్వార్థసిద్ధికూడా సమసిపోయె గదా, ఇంకా ఎవరికోసం ఈ బ్రాహ్మణు డింత పెనుగులాడడం! నిజంగా మంత్రి అంటే రాక్షసుడే మంత్రి. రాజభక్తి అంటే ఇతనిదే రాజభక్తి. రాజు బ్రతికివుండగా ద్రవ్యకాంక్షచేత మంత్రులు సేవిస్తారు. రాజ్యభ్రష్టుడైనరాజునుకూడా భవిష్యదాశచే సేవించే మంత్రులుంటారు. అంతేకాని నశించిపోయినరాజవంశంమీద విశ్వాసంతో యిలాదేవులాడటం రాక్షసుడికే తగును. ఇటువంటిమంత్రిసత్తముడే లభిస్తే ఆరాజుఅదృష్టం ఏమనాలి! సెబాసు రాక్షసమంత్రీ! సెబాసు. నాకు శత్రువువైనా నువ్వు తగినశత్రువవు. మాబుద్ధికి ఇంతశ్రమ కల్పిస్తున్న నీశాత్రవం నాకు ఎంతైనా మెచ్చుపుట్టిస్తున్నది. ఏనాటికైనా నిన్ను సాధించి వశంచేసు కొని మావృషలుడికి నిన్ను మంత్రిని చేస్తే మగధసామ్రాజ్యలక్ష్మీ సుఖిస్తుంది; మామనస్సుకు విశ్రాంతీ లభిస్తుంది. చంద్రగుప్తునకు ఎందరు మంత్రులున్నా నీకు మాత్రం సాటిరారు. మంత్రులుండగానే సరా? ప్రజావిక్రమాలున్న మంత్రికి స్వామిభక్తి వుండదు. ప్రజ్ఞారహితులైనభీరువులకు బోలెడుస్వామి భక్తి వుంటుంది, ఉండి యేమి ప్రయోజనం? ప్రజ్ఞావిక్రమాలకు స్వామిభక్తి కూడా తోడై, దేశకాలాలెఱిగి సేవించే నీవంటిమంత్రి మఱివొకడు మాచంద్రునకు ఎక్కడా దొరకడు. కాబట్టి విశ్వప్రయత్నంచేసి నిన్ను సాధించి తీరుతాను.

“పాటలీపుత్రంలో నీయాటలు సాగకుండా నావేగులవాళ్లు వేయి కన్నులతో కనిపెట్టివున్నారు. భద్రభటాదులగు చంద్రగుప్తమిత్రులు పరమ విశ్వాసంతో రాజును కనిపెట్టుకొనివున్నారు. కాబట్టి ఇక్కడ నీయాట కట్టి

కష్టే. ఇక మలయకేతుప్రతిక్రియం మాత్రం నీవు వున్నది. ముందు అశ్రయో న్మూలనం చేసి వీన్ని ఏకాకిని చేస్తాను. "ఈకార్యానికి తగినవాడు నాసహాధ్యాయి యిందుశర్మ క్షపణకవేషున్నాడు. రాక్షసాదులకాతనియందు విశ్వాసం మెక్కుటం. కాబట్టి ఆతణ్ణి ప్రయోగిస్తాను. సింహనాదచిత్రవర్మాదులకు మలయకేతుపైనా, రాక్షసుడికీ మలయకేతుపైను కూడా భేదములు పుట్టించి నాకార్యం సుకరం చేసుకుంటాను."

ఇట్లు ఆలోచనాపరంపరలలో చాణక్యుడు మునిగియున్న సమయమున మహారాజు చెంతకు వచ్చి, నమస్కరించి "ఆర్యులేదో గాఢాలోచనం చేస్తున్నారు. రాక్షసనిగ్రహానిగురించి ఏమి నిశ్చయించారు." అని సవినయముగా ప్రశ్నించెను. "రాక్షసుణ్ణి నీకు ఎలాగైనా మంత్రిని చేయవలెనని ఆలోచిస్తున్నాను" అని చాణక్యుడు బదులు పలుక చంద్రగుప్తుడు "రాక్షసమంత్రిత్వమా! మనకు ప్రబలవిరోధికదా ఆతడు, మంత్రిత్వం ఆతనెలా చేస్తాడు, మనమెలా అంగీకరిస్తాము." అని ఆశ్చర్యపడుచు చాణక్యుని ముఖమువైపు వీక్షించుచు పలికెను. చాణక్యుడును "ఆతడెలా అంగీకరిస్తాడు అనేదే నేను ఆలోచిస్తున్నాను. రాక్షసమంత్రి నిన్ను సేవింపడానికి సమ్మతించాలే. గాని మనం కన్నులనద్దుకొంటూ అంగీకరించవచ్చును. ప్రతిజ్ఞావిక్రమవిశ్వాసాలుగల అటువంటిమంత్రి వేఱొకడు మనకెక్కడ లభిస్తాడు? మనమీద ఆతనుపట్టిన పగను మాన్పించి మనకు సుముఖుణ్ణి చేసుకోవడంలో నేవుంది కష్టమంతా. నీతివిదులకు శత్రుత్వమిత్రత్వాలు దేశకాలాధీనములై మారుతూ వుంటవిగాని శాశ్వతంగా ఒకడు శత్రువూ ఒకడు మిత్రుడూ అంటూ వుండడు" అనుచు రాక్షసమంత్రి బుద్ధిపాటవమును, విశ్వాసాతిశయమును పొగడి చెప్పి. 'ఆతడే నీకు తగినమంత్రి" అని పలికెను. చంద్రగుప్తుడు "ఆర్యులమాట నేనుగాదనను గాని ఆర్యులుండగా నాకు ఇతరమంత్రులతో పని యేమి" అనెను. చాణక్యు కాతనిభక్తికి సంతసించి "చంద్రా! మేమేదో కారణంచేత ఈసం[illegible]

నామేకాని, పరాన్నభుక్కై విచారించుకోకుండా మాకెప్పటికీ, ఈజంజాలంలోనే తగులుకొని ఉండటం తగదు. మగధసింహాసనంపైన నిన్ను సుప్రతిష్ఠి చేయటమే తరవాయియుంది. రాక్షసునిమంత్రిత్వం నీకు సంపాదించ గలిగితినా, నాకిక నిర్విచారము.'' అనుచు నాతనితలనిమిరి సాగనంపి స్వగృహోన్ముఖుడై, మార్గమున దన్ను గాంచిన పౌరులు ''అదుగో! మహానుభావుడు, మహారాజుకు-రక్ష, మనపాలికల్పకం వెళ్లుచున్నా''డనుచు దమయప్రవృత్తమును గొనియాడు కొనుచుండ బంగరుపల్లకిపై నేగెను.

గృహదేవతయగుగౌతమి వండి, వడ్డించిన పదార్థములను చాణక్యుడు దేవతానివేదనపూర్వకముగ భుజించుచు, ''ఇవ్వాళ్ల ఎవడో జ్యోస్యులు రాణికి సంతానంకలగదని జ్యోస్యం చెప్పాడట. వాడికి తగినప్రాయశ్చిత్తం చేయించాను. ఇటువంటి అమంగళములు పలికేవాళ్లందరికీ బుద్ధివస్తుందిక'' అనెను. గౌతమి, ''ఒకవేళ ఆతనిజ్యోస్యమే నిజమైతేనో?'' అని ప్రశ్నించెను. నిజమో, అబద్ధమో, రాజహితులెప్పుడు అమంగళం పలుకకూడదు. కాని నేను వైక్ష్యం చెప్పబట్టిసరిపోయిందిగాని లేకపోతే యిటువంటిప్రవాదల వల్ల రాబోకాలంలో ఎన్నెన్నైనా అనర్థాలు కలుగుతవి'' అనుచు చాణక్యుడు భోజనమాచరించి, వెళ్ళి బహిరంగణమున కేతెంచెను. అచట యమలోకపట ప్రవర్తకుడొకడు కార్యార్థియై వచ్చి వాకిట నిలిచి శార్ఙ్గరవుని యనుమతి వేడుచుండెను. ''మాగురువుగారు సర్వజ్ఞులైతే, చంద్రు డెవరికనిష్టుడో అడిగి చూడు'' మనుచున్న వానికి శార్ఙ్గరవుడు ప్రవేశమిచ్చుటలేదు. చాణక్యుడా సంభాషణమాలకించి, నగరమున చంద్రగుప్తాపరక్తులింకను గలరేమో విచారించి వచ్చుటకై పంపిన నిపుణకుడైయుండునని నిశ్చయించి ''రావోయి భద్రముఖా! లోపలికిరా! ఎవరేమి చెప్పినా విని తెలుసుకోడానికి సిద్ధంగా వున్నాను'' అని యమపటము వానిని ఏకాంతమునకు గొంపోయి ''విశేషములే''మని యడిగెను. నిపుణకుడు ''దేవరవారిమతిప్రభావంచేత ప్రజలందరూ

మహారాజులుంగారియందు అనురక్తులుగానే వున్నారు. కాని రాక్షసమంత్రి స్నేహితులింకా ముగ్గురు నగరంలోనే వున్నారు" అనెను. "కాలం చెల్లినవాళ్లా ముగ్గురు ఎవరెవరు" అని చాణక్యుడు ప్రశ్నించెను.

నిపుణ.—ఒకణ్ణి తమ రెరిగే వుంటారు. జీవసిద్ధి అనే క్షపణకుడు. మొదటి నుంచి శత్రుపక్షంలోనే వున్నాడతడు.

చాణక్యుడు తన సహాధ్యాయుడైన యిందుశర్మ నేర్పునకు లోలోన మెచ్చుకొని "రెండవవా డెవ్వడు" అనెను. నిపుణకుడు "రెండవయాతడు శకటదాసుడనే కాయస్థుడు" అని చెప్పెను. కాయస్థునివలన గాదగినచెరుపు స్వల్పమనియు, అయినను శత్రువల్పుడైనను ఉపేక్షింపదగదనుకొని 'మూడవవాడెవ్వడో చెప్పు"మని చాణక్యుడడిగెను. "చందనదాసనే రత్నాలవర్తకుడు. రాక్షసమంత్రికి ప్రాణస్నేహితుడు. అతనియింటనే రాక్షసమంత్రి ఆలుబిడ్డలను దాచిపోయినా" డని నిపుణకుడు వచించెను. ఆలుబిడ్డలను దిగవిడిచిపోవుటచే రాక్షసునకీతడు నిజముగా బ్రాణమిత్రుడేయని చాణక్యుడు నిశ్చయించుకొని "నీకీసంగతి యెట్లు తెలిసిన" దని యడిగెను. నిపుణకుడు "ఇదుగో దీనిని చిత్తగించు"డని యొకయుంగరమొసంగ జాణక్యు డాయంగుళీయకము రాక్షసనామ చిహ్నితమైయుంట గనుగొని ఆయుంగరము దొరకుటచే రాక్షసుడే తన చేతికి దొరకినట్లు సంతసించి "భద్రా! నీకిది యెచట దొరకిన" దని యడిగెను.

నిపుణకుడు.—నేనీవేషముతో నింటింటికరిగి యమపటము జూపి పాటలు పాడుచు, చందనదాసింటికి బోతిని. లోపలినుండి గొప్పయింటిబిడ్డడొకడు అయిదేండ్లవాడు నాపాటలువిని వెలుపలికి వచ్చెను. వెంటనే లోపలనుండి యెవరో స్త్రీ "పోకు నాయనా!" యనుచు వచ్చి తలుపు కొంచెము ఓరచేసి సుకుమారమైన చేయిచాచి బాలుణ్ణి లోపలికి తీసుకుపోయింది. బాలుని రెక్కపుచ్చుకొనిలాగేతొందరలో, ఆమెవ్రేలియుంగరము, పురుషులవ్రేలిది కావడంచేత కాబోలు వదులుగా వుండుటచేత జారి పడి, నాపాదముల

చెంతకు దొర్కివచ్చెను. వారంతట తలుపుమూసి లోనికేగుటచే నేనీయుంగ రంమీద రాక్షసమంత్రిపేరుండుట చూచి దేవరవారికి సమర్పించు కొన్నాను" అని విన్నవించెను.

చాణక్యుడు.—"భద్రా! మంచిపని చేసితివి. నీసేవ ఊరకే పోదుపొమ్ము" అని వానింబంపి, శార్ఙ్గరవుని మషీపాత్రయు పత్రము దెమ్మనెను. వాడుదెచ్చి యొసంగ "దీనిపై నేమివ్రాయుదునా" యని చాణక్యుడాలోచించుచుండ, శోణోత్తర ప్రవేశించి, నమస్కరించి మహారాజులుంగారు దేవరకెఱుకైతే పర్వతేశ్వరులవారికి పరలోకక్రియలు చేయిస్తామనీ, పర్వతేశ్వరులనగలు బ్రాహ్మణులకు దానముచేస్తామనీ విన్నవించమన్నారు" అని పలికెను. చంద్రగుప్తునకుగూడ దనకుదోచిన యాలోచనయే తోచినందుకు చాణక్యుడు సంతసించి, "మహారాజుల ఉచితజ్ఞతకు సంతోషమైనదనీ, నగలు పుచ్చుకోదగినబ్రాహ్మణులనుమాత్రం నేను విచారించి పంపుతాననీమనవిచెయ్యి" అని శోణోత్తరంబంపి, శిష్యుని బిలిచి "విశ్వావసుణ్ణి అతని సోదరులిద్దరిని నేను పంపానని మహారాజుతో చెప్పి వారిచ్చినవగలు తీసుకుని నాకు కనిపించమని చెప్పి రమ్మని పంపెను. పిమ్మట గలముచేకొని కమ్మవ్రాయువాడై "మలయకేతువుకు బాసటగావున్న కౌలూతమలయకాశ్మీరసింధుపతులను ముందుగా అతనినుండి విడదీయాలి. అప్పుడు మలయకేతువు రెక్కలూడిన పిట్ట అవుతాడు. కనుక వీరిపేరులువ్రాస్తాను ఇందులో" అనుకొని వ్రాయబోయి, మరల సంశయించి, అంతట నేదియో వ్రాసెను. పిమ్మట శిష్యుని బిలిచి, "నువ్వీపత్రం సిద్ధార్థకుడికిచ్చి, ఇందులో సంగతులే ఎవరో ఎవరికో జాబువ్రాస్తున్నట్లు శకటదాసుచే వ్రాయించి తీసుకురమ్మను. పైవిలాసం లోపలపేరు అక్కఱలేదనిచెప్పు. నేను పంపించినట్లు తెలియనీయగూడదని చెప్పు. తొందరగా రమ్మని వానిం బంపి "మలయకేతువు నిక జయించినట్లే" అని సంతసించుచుండెను. అంతట సిద్ధార్థకుడు శకట

దాసునే గప్పి వ్రాయించి తీసుకొనివచ్చెను. చాణక్యు డాపత్త్ర మందు గాంచి "ఆహా! అక్షరాలెంత స్ఫుటంగా వున్నవి" అని మెచ్చుకొనుచున్నట్లు మోమునుంచి. సిద్ధార్థకునిచే నాకమ్మపై రాక్షసముద్రచే ముద్ర వేయించెను. పిమ్మట సిద్ధార్థకున కాపత్త్రమును ముద్రికయు నొసగి, "అతిముఖ్యమైన కార్య మొకటి నీవలన గావలసివున్నది. కడిమాత్తుడవని నీమీద పెట్టుతున్నా నీ కార్యభారం. మరేమీ లేదు. నువ్వీసాయంత్రం వధ్యస్థానంచెంత దాగి వుండు. ఘాతుకులు శకటదాసును సంహరించడానికి బంధించి తీసుకువస్తా వచ్చుటికి. నువ్వు వెంటనే కత్తిదూసి చండాలురమీదికి, ఉరికినట్లే వురికి, హుంకరించి వాళ్లను భయపెట్టినట్లే భయపెట్టి కొంచెం కనుసన్న చేశావా అంతే వాళ్లు శకటదాసును వదలిపెట్టి పారిపోతారు. నువ్వు శకటదాసు కట్లువిప్పి, ఆతణ్ణి వెంటబెట్టుకు శీఘ్రంగా రాక్షసమంత్రి దగ్గరికి వెళ్లి రాక్షసునకు శకటదాసు నప్పగించు. రాక్షసమంత్రి సంతోషించి యిచ్చిన పారితోషికం పుచ్చుకో. ఆముద్రికమాత్రం రాక్షసమంత్రికి ఇవ్వాలి. చందనదాసింటిదగ్గర దొరకిందే అంటావో, మరేమంటావో, నీకు నేను వేరే చెప్పాలిగనుకనా! ఏలాగో రాక్షసమంత్రికి నమ్మకం పుట్టించి అతని దగ్గరే వుంటూవుండు. ఇంకా రావలసినవారంతా వచ్చినతరువాత ఈపని కూడా నెరవేర్చు" అని వానిచెవిలో నేదియో ఊదెను. సిద్ధార్థకుడు "చిత్త"మని అనుజ్ఞగైకొని యేగెను.

పిమ్మట శిష్యుని బిలిచి, "అబ్బీ! నువ్వు కాలపాశికదండపాశికులతో నామాటలుగా చెప్పు. జీవసిద్ధి అనే క్షపణకు డున్నాడే వాడు రాక్షసమంత్రి ప్రేరేపణచేత విషకన్యను పంపి పర్వతేశ్వరులను చంపించాడు. ఆనేరానికి దండనంగా మహారాజు జీవసిద్ధిని పట్టణంనుంచి పారదోలమన్నారని చెప్పు" అనెను. వాడు 'చిత్త'మని యేగుచుండ మరల వెనుకకు బిలిచి "ఇదిగో! ఇంకోమాట వున్నది. రాక్షసమంత్రి స్నేహితుడు, శకటదాసనే కాయస్థుడు

రాజద్రోహం చేస్తున్నాడట. అందుకు వాడికి శూలారోపం చేయించమని కూడా చెప్పు. పోయిరా" అనెను. శార్ఙ్గరవు డామాటలు చెప్పివచ్చినపిమ్మట చాణక్యుడు "చందనదాసు నొకసారి నేను రమ్మన్నా నని తీసుకురా"మ్మని పంపెను.

చాణక్యుడు పిలిపించెనని వినగానే చందనదాసునకు గుండెలలో రాయి పడినట్లయ్యెను. రాక్షసకళత్రమును దనయింటిలో గాపాడుచున్నందులకు జాణక్యుడు కొంపముంచక మానడని నిశ్చయించి, రాక్షసకళత్రమును మెల్లగా నావలకు బంపుదని భార్యాపుత్రుల కుపదేశించి చాణక్యు నాతడు దర్శింప జనెను. చాణక్యుడును "సెట్టి! వచ్చితివా" యని ఆపీటమీద గూర్చుండు" మనెను.

చాణక్యుడు చూపుచున్న అతిమాత్రాదరమును జందనదాసు శంకించి, "చిత్తము, చిత్తము. దేవరయెదుట పీటమీద కూర్చోడానికి నే నెంతవాణ్ణి. ఇక్కడ కూర్చుంటాను"అని నేలపై గూర్చుండబోవ "సంశయింపకు; ఇచట కూర్చుండు"మని చాణక్యు డాతని సమీపపీఠమున నునిచి "ఎలావున్నది, నీ వ్యాపారం బాగా సాగుతున్నదా" యని కుశలప్రశ్న మొనర్చెను.

చందన.—చిత్తం దేవరఅనుగ్రహంవల్ల ఏమీ లోపంలేదు.

చాణ.—చంద్రగుప్తమహారాజు చేసేదోషాలవల్ల పూర్వపురాజులూ, వారి సుగుణాలూ తలపునకు రావడం లేదుకద?

చందన.—(చెవులుమూసికొని) ఎంతమాట సెలవిచ్చారు! మహారాజులుంగారు పూర్ణచంద్రుడివలె సకలలోకాహ్లాదం చేస్తున్నారు.

చాణ.—సంతోషం. అయితే మతిప్రజారంజకుడైన రాజు ప్రజలవల్ల ఏమైన ప్రత్యుపకారం కోరవలసి వుంటుందిగదా!

చందన.—చిత్తము. నావంటి అల్పునివల్ల మహారాజులుంగారికి అయ్యేదేమున్నది? అయినా సెలవిప్పిస్తే శిరసావహిస్తాను.

చాణ.—సందులవలె చంద్రగుప్తమహారాజు మీవల్ల ద్రవ్యంకాదు కోరేది. మీరు వారికి కీడు తలపెట్టకుండా వుండటమే మహారాజుకోరిక.

చందన.—శివశివా! మహారాజులుంగారికి కీడుతలపెట్టేటంతద్రోహు లెవరు స్వామీ!

చాణ.—ద్రోహు లెవరంటున్నావా? నువ్వే మొదటి ద్రోహివి.

చందన.—నేనా! ఎంతపాప మెంతపాపం! ఈగడ్డిసరకకు నిప్పుతో విరోధమా?

చాణ.—విరోధంకాదా మరి? రాజద్రోహియైన రాక్షసుని ఆలుబిడ్డల నిప్పటికిని నీయింటిలో దాచడం ద్రోహంకాక ఏమవుతుంది?

చందన.—దేవరకి అసత్యం ఎవరుచెప్పారోకాని,రాక్షసకళత్రం మాయింట లేదు.

చాణ.—ఇదిగో, సెట్టీ! ఇందులో నువ్వంతగా భయపడవలసింది లేదు. రాజద్రోహులు పారిపోతూ తమ పెళ్లాంబిడ్డలను ఎవరింటిలోనో, మొట్టో వల దాటుచున్నా వినక, దిగవిడిచిపోతారు. అట్లా దిగవిడిచిపోయినా, దాచి పెట్టడంమాత్రం పనదితప్పు.

చందన.—చిత్తం. దేవర సెలవిచ్చినట్లు, ఆగడబిడలో, మాయింట్లో రాక్షసకళత్రాన్ని విడిచివెళ్లినమాటయితే యథార్థమే కానీండి, ఇపుడుమాత్రం మాయింట్లో లేరు.

చాణ.—చందనదాసూ! ఎందుకిన్ని తబ్బిబ్బులు! మొదట సర్వము అబద్ధమంటివి. ఇప్పుడేమో, పూర్వముండేదిగాని ఇప్పుడు లేదంటూవుంటివి. ఈ కపటము లింకట చాలించి రాక్షసకళత్రాన్ని మాకు వప్పగించు.

చందన.— మాట పొరపాటేకష్ప నావల్ల కపటమేమీ లేదు. రాక్షసగృహ జనం, మీ పాదసాక్షిగా మాయింట్లో లేదు. లేనిది నేనెట్లా వప్పగించను?

చాణ.—అయితే ఇప్పుడెక్కడ వున్నారంటావు?

చందన.—నే నెఱుగను.

చాణ.—(నవ్వి) ఎందు కెఱుగవు! సర్వమూ ఎఱుగుదువు. తలమీదపడడానికి సిద్ధంగా వున్నముప్పు, తప్పించుకుందామంటే తప్పదు. త్రాచు తలమీద వుంది, ఔషధమేమో మంచుకొండమీదవుంది. రాక్షసమంత్రి ఇంకా ఎన్నడో ప్రతీకారం చేస్తాడనీ, నేను నందోన్మూలనం చేసినట్లు చంద్రగుప్తుని రాక్షసుడు ఉన్మూలిస్తాడనీ ఆశ పెట్టుకోకు. ఆవలించిన సింహం నోటిలో, బలితగజరక్తారుణమైన కోరపెరకడంవంటిది దనుకో.

ఇంతలో వీధియందేదో కలకలము వినవచ్చెను, శార్ఙ్గరవుడు తత్క్షణ మరలివచ్చి క్షపణకుడగు జీవసిద్ధిని మహారాజాజ్ఞచే బురమునుంచి వెడలగొట్టు చుండిరని విన్నవించెను. చాణక్యుడంతట "పాపం! జీవసిద్ధి కెంతటియాపద వచ్చిందీ!" అని వగచి, చందనదాసుం గాంచి, "చూచితివా? రాజద్రోహులను మహారాజు ఎలా దండిస్తున్నాడో! పాముతో ఎందుకు చెలగాటము నీకు? నామాట విని రాక్షసకళత్రాన్ని మాకు సమర్పించి రాజానుగ్రహం సంపాదించుకో" అనెను. చందనదాసు చలింపక "రాక్షసకళత్రం మాయింటిలో లేదని మనవి చేస్తున్నాను" అనుచుండ మరల వీధిలో నేదియో కలకలము వినవచ్చెను. "రాజద్రోహియైన శకటదాసును శూలారోపము చేయుటకు గొనిపోవుచుండి" రని శిష్యుడు చాణక్యున కెఱిగించెను. చాణక్యుడంతట "మహారాజు రాజద్రోహుల నిక పట్టణంలో బ్రదుకనీయడు. చందనదాసూ! ఎందుకు వృథాగా చెడిపోతావు. పిల్లలుగలవాడవు. ఒకని పెళ్లాముబిడ్డల కోసమని నీభార్యాపుత్రులను దిక్కుమాలినవాళ్లను చేసుకోకు" అనెను.

చందన.—తమరు నన్ను మాటిమాటికి ఎందుకు భయపెట్టుతారు? రాక్షస కళత్రం ఒకవేళ, మాయింట్లోవున్నప్పటికి నేను సమర్పించను. ఇక లేనప్పుడు నే నెక్కడినుండి తీసుకురాను?

చాణ.—మంచిది. ఈమాట నిశ్చయమే కాదూ?

చంద.—చిత్తం. ముమ్మాటికి నిశ్చయమే.

చాణక్యు డంతట "సెబాసు! సెట్టీ! సెబాసు. పరార్థమై ప్రాణాలకు తెగిస్తున్న నీ శీలత్వం ఎంతని మెచ్చుకోను." అని లోలోపల సంతోషించినను; పైకి 'అయితే రాజద్రోహానికి ఫలమనుభవిస్తావు' అనెను. చందనదాసును "తమచిత్తానుసారం జరుగవచ్చును. నేను సర్వానికి సిద్ధంగావున్నా" ననెను. చాణక్యుడు శిష్యుని బిలిచి "కాలపాశికదండపాశికులతో, ఈదుష్టవర్తకుణ్ణి నేను బంధించమన్నానని చెప్పిరా" అని యాజ్ఞాపించెను. ఆయాన నౌదలదాల్చి శిష్యుడరుగుచుండ మరల వెనుకకు బిలిచి "ఇదిగో, వాళ్లతో వద్దుగాని దుర్గపాలకుడు విజయపాలునితో జెప్పిరా. ఈతని యింటనున్న ధనమంతా స్వాధీనపరచుకొని పుత్రకళత్రసహితంగా యీతని బంధించి వుంచమని, పిమ్మట చంద్రగుప్తునితో చెప్పి ఈతనికి తగినప్రాయశ్చిత్తం చేయిస్తాను" అని యాజ్ఞాపించెను. శార్ఙ్గరవుడు చందనదాసును వెంటగొనిపోయెను. మిత్రకార్యార్థమై ప్రాణములు విడుచుట మహాభాగ్యమని యెంచుచు చందనదాసు నిశ్చింతుడై వరిగెను.

"తనకై సంప్రాణం విడుస్తున్న యీ సెట్టికోసం రాక్షసమంత్రి తన ప్రాణాలు విడిచితీరుతాడు. కనక రాక్షసు డిక మనచేతిక్కి దొరకినట్లే", అని సంతసించెను.

పిమ్మట కొంతసేపటికి శిష్యుడు తిరిగివచ్చి, "వింటిరా! ఎంతప్రమాదం జరిగిందో! శకటదాసును వధ్యస్థానమునుండి సిద్ధార్థకుడు విడిపించి అతనితో

గూడ పారిపోయినాడట" అని విన్నవించెను. సిద్ధార్థకు డప్పుడే కార్యారంభ మొనర్చినందులకు చాణక్యుడు మోదమందియు, పైకి గనుబొమ్మలెత్తిజేసి "ఎంతపని చేసినాడు! ఆదుర్మార్గుణ్ణి తరిమి పట్టుకరమ్మని భాగురాయణునితో చెప్పిరా" యని యాజ్ఞాపించెను.

శార్ఙ్గరవుడు బిక్కమొగముతో తిరిగివచ్చి, "భాగురాయణుడుగూడా రాజద్రోహులతో గలసి పారిపోయెనట" యని విన్నవించెను. చాణక్యుడును 'ఏమీ! భాగురాయణుడుకూడా పారిపోయినాడుగా! ఆదుర్మార్గుణ్ణి వెంటనే పట్టితీసుకురమ్మని భద్రభటపురుషదత్త డింగరాతబలగుప్తరాజసేన రోహితాక్ష విజయవర్మలతో శీఘ్రంగా వెళ్లి చెప్పిర' మ్మనెను.

శార్ఙ్గరవు డేడ్పుమొగముతో దిరిగివచ్చి, భద్రభటాదులందఱు తెల్లవాఱకమునుపే పురము విడిచిపోయినవార్త వినిపించెను. ఈవార్తలు పురమంతట నగ్నిజ్వాలవలె వ్యాపించెను. చంద్రగుప్తుడు చాణక్యుని దర్శింపవచ్చి, "ఈరాజద్రోహులంతా రాక్షసమంత్రిని చేరబోయినారట. వీరందరిసహాయంతో మలయకేతువు పాటలీపుత్రంమీదికి ఎత్తివస్తాడని తెలుస్తుంది" అని విన్నవించెను. చాణక్యుడు, తనమంత్రము పారుచున్నందుకు సంతసించి, పాటలీపుత్రమునకు వచ్చిన భయ మేమియులేదని చంద్రగుప్తునికి జెప్పవలసినమాటలు చెప్పెను. "పురరక్షణానికి నువ్వేమీ సన్నాహం చేయనక్కఱలేదు. నిస్సైన్యాంగం కడుపులో చల్లకదలకుండా నిద్రపోవచ్చు. సర్వమూ నామంత్రబలంవల్లనే చక్కబెట్టుతాను" అనిచెప్పి పంపివైచెను.

"ఇంకా ఎక్కడికిపోతాడు రాక్షసుడు పట్టుబడక! మదించి చెలరేగిన అడవియేనుగును పట్టుకొన్నట్లు బంధించి కృతకృత్యుణ్ణవుతాను" అనుచు చాణక్యు డువ్విళ్లూరుచుండెను.

---

# 26

## రాక్షసమంత్రి

అట వృషఫాలనగరమున రాక్షసామాత్యుడు మలయకేతువును మగధ రాజ్యాభిషిక్తు నొనర్పుటకై పలయుయత్నములం దప్రమత్తుడై యుండెను. నందవంశనిర్మూలన మొనర్చిన హతవిధిని నిందించుచు, నందనిర్మూలనముచే నిరాశ్రయుడై ఒకరాజపుత్రు ననుసరింపనగ్గమైన తనదురవస్థకు విచారించుచు రేయుంబవళ్లొక్కటియై కార్యపరతంత్రుడై, అన్నము నీరు నుడిగి, శరీర సంస్కారముగూడ నాతడు వర్జించియుండెను.

నందులపట్ల రాక్షసునివిశ్వాసము నశించెననియు, గావుననే అన్యరాజు నాశ్రయించి ధనసంపాదన మొనర్ప నెంచుచుండెననియు, చంద్రగుప్తుడు వధించు ననుభీతిచే మలయకేతువు నండజేరి ప్రాణము లోముకొనుచుండె ననియు లోకులు దన్ను బలుగతుల నిందింతురని రాక్షసమంత్రి యెఱుగక పోలేదు. ఎవరేమనుకొన్నను, చాణక్యచంద్రగుప్తులను దాను సంహరింపగలుగు నేని చచ్చి స్వర్గముననున్న నందమహారాజు సంతసించునన్న యాసమై నాతడు విధిలేక మలయకేతువును సేవించుచుండెను. నందులు నశించినను నందసింహా సనమునెడ నాతనిపూజ్యభావము నశించలేదు. కులహీనుడైన చంద్రగుప్తుడు నందసింహాసన మధిష్ఠించుటయన్న నాతనికి దలగొట్టిపైచినట్లుండెను. లోక ములో ప్రసిద్ధవంశ్యులైన రాజసత్తము లెందఱో యున్నను, గతిమాలి, కుల హీను నాశ్రయించిన మగధరాజ్యలక్ష్మి నాతడు నిందించును! నందప్రభువులు చంద్రగుప్తుని బెంచి పెద్దజేయుటయెల్ల బాముకు బాలువోసి పెంచిన ట్లాయెగదా యని విచారించును. చంద్రగుప్తవినాశనముకొఱకై తానొనర్చిన యత్నములన్నియు బర్వతకవైరోచకులకు మృతికల్పించుట కుపకరించె గదా యని చింతించును. తనకు సర్వవిషయముల ప్రతికూలమైతోచువిధి చెయువములకు వగచియు నధైర్యము చెందక కార్యసిద్ధికై పడగలపాట్లెల్లబడుచు, జంద్ర

గుప్తవిరోధులనెల్ల సమకూర్చి పాటలీపుత్రముపై నెత్తిపోవుటకై పలయో సన్నాహముల నాత డొనర్చుచుండెను.

కుమారుడగు మలయకేతువుకూడ రాక్షసమంత్రినే గురువుగా దైవముగా నెంచి యాతనియాజ్ఞలో మెలగుచుండెను. ఆతనిభక్తివిశ్వాసములును సౌజన్యమును రాక్షసమంత్రిహృదయమును జూఱగొనెను.

రాక్షసామాత్యు డొకనాటియుదయమున విషణ్ణవదనుడై చెక్కిట చేయి జేర్చి విచారించుచు గూర్చున్నసమయమున కంచుకి యగుజాజిలి ప్రవేశించి యిట్లు విన్నవించెను. “ఆర్యులు చిరకాలమునుండీ, విచారపరీతులై ఉచిత సంస్కారములన్నీ వదలివుండడం మలయకేతుకుమారులకు ఎంతో చింతగల్పిస్తున్నది. నందమహారాజులగుణములు మఱచిపోదగినవైతే కావుగాని, అస్మరణంతో నితరకార్యములు మఱవరాదుగదా యని యెంచి కుమారులు తమకీయాభరణములు, తమయొడలినుండితీసి, కానుక పంపినారు. ఆర్యులు ధరింపవలెనని విన్నవిస్తున్నారు.”

రాక్ష.—జాజలీ! సంతోషం. మలయకేతుకుమారుని గుణములందలి పక్షపాతంచేత మాప్రభువులగుణములన్నీ మఱవనే మఱచితిని. కుమారుణ్ణి సుగాంగంలో సింహపీఠంపై అభిషేకం ఎట్లా చేయ్యుదునా అనేచింతతప్ప నాకితరచింత యిప్పుడు లేనేలేదు. కుమారపట్టాభిషేకం జరపకుండా నేను ఏమొగంలో ఆభరణములు ధరిస్తాను! శత్రువులుచేసిన పరాభవంచేత సిగ్గుపడి, నిరసించిన యీశరీరానికి నగలుకూడా ఎందుకు?

జాజిలి.—ఆర్యులు తలపెట్టినతరువాత కార్యసిద్ధి దుర్లభంగాదు. తమ రీనగలు ధరిస్తే కుమారులకూ ధైర్యంగా వుంటుంది. కాబట్టి వారి యీప్రథమానునయం దేవర అంగీకరించండి.

రాక్ష.—జాజిలీ! కుమారునిమాటవలె నీమాటా జవదాటరానిదే గనుక కుమారాజ్ఞ శిరసావహిస్తున్నాను.

జాజలి యంతట నమాత్యునిశరీరమున కానగలన్నియుం నలంకరించి సెలవుగైకొని యేగెను.

పిమ్మట రాక్షసామాత్యునకు నెచ్చెలియు, చారముఖ్యుఁడు నగు విరాధగుప్తుఁడు పాములవానివేషమున నేతెంచెను. రాక్షసుఁడు కుసుమపురమును విడిచి వచ్చినదాదిగా నచట ప్రవర్తిల్లినవిశేషములన్నియు వినిపించెను. తొలుత పర్వతకపారలౌకకర్మలమృతియు, పిమ్మట నభయదత్తప్రవీరకభీభత్సకాదుల విఫలప్రయత్నములగుటయు విరాధగుప్తుఁడు పూసగ్రుచ్చినట్లు వినిపింపగా రాక్షసమంత్రి విని తన ప్రయోగములన్నియు చాణక్యనీతిప్రతిహతములైనందుకు, దైవము చంద్రగుప్తహతకున కనుకూలించినందుకు దూర వగచి, తరువాతి వృత్తాంతము వినిపింపుమనెను.

జీవసిద్ధిని బురము వెడలనడచుటయు, శకటదాసునకు శూలారోపము గావించుటయు విరాధగుప్తుఁ డెఱిగించెను. తనకొఱకు కింకరుమిత్రులు మరణించుచున్నను దాను జీవములు దాల్చియుంటినిగదా యని అమాత్యుఁడు వగచుచుండ విరాధగుప్తుఁడు, "తమరు" స్వామికార్యం సాధించుటకు బ్రతికియున్నారుగాని ప్రాణాశచేగాదుగదా" యని యోదార్చి, పిమ్మట చందనదాసుని సంపదనంతయు గ్రహించి యాతనిబుత్రకళత్రసహితముగా బంధించియుంచినవార్త వినిపించెను.

రాక్షసమంత్రి యంతట "నాకళత్రమును చందనదాసుగృహంలో విడిచిరావడం మంచిపని అయిందనీ, స్వామికార్యంపట్ల నేనప్రమత్తుడనని యెంచటచే స్నేహితులకు ధైర్యంగా వుంటుందనీ ఇన్నాళ్లనుండి సంతోషిస్తున్నందుకు ఎంతపని జరిగిందోయీ! నా పెళ్లాంబిడ్డలకోసం పాపం చందనదాసు ఆలుబిడ్డలతో ఇట్టి అవస్థకు పాల్పడతాడనుకోలేదు. ఆతనిఋణం నే నెట్లా తీర్చుకోను? అటువంటిస్నేహితుడికి నామూలంగా యింతటి ఆపత్తు సంభవించినపిమ్మట నేనింకా జీవించవలె మెందుకోయీ!" అనుచు వగచుచుండెను.

ఇంతలో ప్రతీహారి ప్రవేశించి "ద్వారమున శకటదాసుడు వేచి యున్నా" డని విన్నవింప రాక్షసు డాశ్చర్యమగ్నుడై విరాధగుప్తుని మొగము గన్గొన, నాతడు "మన అదృష్టం శుభములను చేకూర్చుచున్న" దనెను. పిమ్మట సిద్ధార్థకశకటదాసులు లోనికి చేర "శకటదాసా! చాణక్యుని చేతినుండి తప్పించుకొని బ్రదికి వచ్చితివా!" యని యాతని ప్రియమార కౌగిలించుకొని చెంత నిడుకొనెను. శకటదాసు దంతట తన్ను సిద్ధార్థకుడు వధ్యస్థానమునుండి విడిపించికొని తెచ్చినవృత్తాంతమును సవిస్తరముగా వినిపింప నమాత్యు డానందమగ్నుడై తనమెడలోని యాభరణము లూడ్చి సిద్ధార్థున కొసగి 'నీవు చేసిన మేలున కీబహుమానము చాల' దనెను. సిద్ధార్థకు డానగలం గైకొని, నమస్కరించి, "దేవరవారిచ్చిన యీనగలు నే నెక్కడ దాచుకొంటాను? ఈముద్రికతో వానిని ముద్రించి తమయొద్దనే వుంచితే భద్రంగా వుంటవి. నాకు పనిపడినప్పుడు తిరిగి తీసుకొందు" నని విన్నవించెను "మంచిది. అట్లే చేయు" మని రాక్షసుడు శకటదాసున కానతి యొసగ నాత డాముద్రికతో ముద్రించి, అందు గానవచ్చిన రాక్షసనామాంకమున కచ్చెరువంది, ముద్రికను రాక్షసమంత్రి కొసగెను. అత డాముద్రిక తనది యగుట పోల్చికొని, భార్యకు నానొసగినముద్రిక యీతని కెట్లు లభించెనా యని విస్మయమందుచు "నీ కీముద్రిక యెక్కడి" దని సిద్ధార్థకు నడిగెను. వాడును జందనదాసు డనుధనికునియింటిముంగిట దనకు దొరకిన దని విన్నవించెను. శకటదాసు సంకట సిద్ధార్థకునితో "ఈముద్రిక అమాత్యనామాంకితం గనుక వారికి సమర్పించు; నిన్ను సంతోషపెట్టుతారు" అనెను. వాడును "అనుగ్రహం. దేవరవారి వేలనే ఇది అలంకరించుగాక" యనెను. పిమ్మట నమాత్యు డాముద్రికను శకటదాసున కొసగి 'నీ వీముద్రికతోనే వ్యవహారమంతయు మాపేరట నడుపుచుండు' మని యానతిచ్చి "మీరిక విశ్రమింపు" డనెను. సిద్ధార్థకు డంతట "దేవరవారలతో నాదొకమనవి వున్నది" అని సంశయించుచు బలుక "నిర్భయముగా చెప్పుము" అని అమాత్యుడు ధైర్యము గొలిపెను. వాడును "చాణక్యునకు అపచారంచేసి

తిరిగి పాటలీపుత్రం వెళ్లడానికి భయంగా వుంది. సెలవైతే కొన్నాళ్లపాటు తమపాదములదగ్గరే పడివుంటాను" అనెను. రాక్షసుడును "పరమసంతోషం. అట్లే చేయు"మని పలికి వారల నంపెను.

పిమ్మట నమాత్యరాక్షసుడు విరాధగుప్తునితో మరల ప్రసంగమునకు దొరకొని "ఇంకా కుసుమపురవృత్తాంతమును చెప్పు"మని యడిగెను. వాడును చాణక్యచంద్రగుప్తులకు మనసులు కలియుటలేదనియు, ఇరువురును స్వతంత్రులగుటచే నుభయులమధ్య క్రమముగా భేదములు పొడముచున్న వనియు పాటలీపుత్రమున ప్రజలు చెప్పుకొనుచుండి రని విన్నవించెను.

రాక్ష.—భేదములకు నిమిత్తములేమిటో!

విరాధ.—ఇతరనిమిత్తము లేమికావాలి? ప్రతిజ్ఞ నిర్వర్తించుకున్నాననే గర్వంచేత చాణక్యుడు తనయిష్టంవచ్చినట్లు సంచరిస్తున్నాడు. నేను రాజునుగదా అన్న అభిమానంచేత చంద్రగుప్తు డెప్పుడైనా ఎదురుపలికితే ఆబ్రాహ్మణుడు సహింపక 'నిన్ను రాజును చేసింది నేనే'యని ఎత్తిపొడుస్తున్నాడట. దేవరవారు మలయకేతువు నాశ్రయించి తత్సహాయంతో పాటలీపుత్రముమీదకు ఎత్తివెళ్లే ప్రయత్నం చేస్తున్నారని విని చంద్రగుప్తుడు 'మలయకేతువును ప్రాణములతో ఎందుకు వదలిపెట్టితి'రని చాణక్యుణ్ణి ప్రశ్నించాడట. ఆయన దేవో సమాధానం చెప్పి 'నువ్వు నన్ను అడిగేపాటివాడవా'అని విదిలించుకుంటూ చివాలున లేచిపోయినాడట.

రాక్ష.—సెబాసు! నేటికి దైవం మన కనుకూలిస్తున్నది. చాణక్య చంద్రగుప్తులకు పొరపులు పుట్టడంకంటె మనకు కావలసిం దేమున్నది? మన మంత్రం పారడానికిదే సమయం. నువ్వు వెంటనే ఈవేషంతోనే తిరిగి కుసుమపురానికి వెళ్లు. అక్కడ మన స్తనకలశుడు వైతాళికవేషంతో వున్నాడు. ఆతనితో నామాటలుగా చెప్పు 'సమయం కనిపెట్టి చాణక్య చంద్రగుప్తులభేదం వృద్ధిపొందించే పద్యాలతో చంద్రగుప్తుణ్ణి స్తవం

చేయమన్నానని.' అచటివిశేషాలు ఎప్పటి కప్పుడు కరభకునివల్ల నాకు తెలుపుతూవుండు. పోయిరా.

అనుచు సంతోషముతో నాతని పొడుకొల్పెను. పిమ్మట ప్రతీహారి ప్రవేశించి "ఈమూడునగలు అమ్మకానికి వచ్చినవట. దేవర చిత్తగించవలెనని శకటదాసుడు పంపినా" డని విన్నవించెను. చాణక్యుడు విశ్వావసుప్రభృతులగు బ్రాహ్మణులకు దానమిప్పించిన పర్వతకాభరణములని రాక్షసు డెఱుగమి, వానిని బరీక్షించి, విలువగలవి యని గ్రహించి "తగిన ధనమిచ్చి పుచ్చుకొమ్మని శకటదాసుతో చెప్పు" మని పంపెను. పిమ్మట రాక్షసమంత్రి తన యత్నములు ఫలోన్ముఖములగుచున్నవని మోదమందుచు నంతర్గేహముం జొచ్చెను.

---

# 27

## కౌముదీమహోత్సవప్రతిషేధము

ఆశరత్పూర్ణిమాకౌముదిచే గుసుమపురము పాల్కడలియంకమందున్న కమలాలయవలె నేత్రోత్సవ మొనర్చుచుండెను. ఒడుగబండిన వరిపైరులతో నిండారబూచిన కాశాటవులతో బృథివియంతయు నాటి కౌముదీమహోత్సవమున కాయత్తపడుచున్నట్లుండెను. కాంతుని బహువల్లభత్వముం గాంచి యీసుమై కృశించిన జహ్నుకన్యను, శరదృతువు సరసకథాభిజ్ఞయగు దూతికవోలె, బ్రసన్నం గావించి రత్నాకరుని గలుపుచుండెను. మింటిపై జగదానందకరుడై వెలుగు చంద్రునిపై మాత్సర్యమునవోలె జంద్రగుప్తమహారాజు రత్నభూషాసముజ్జ్వలమగువేషమున కౌముదీమహోత్సవముం దిలకింప సుగాంగప్రాసాదము నల్లనల్ల నధిరోహించి పట్టణమంతట గలయజూచెను. నగరమున నెందును ఉత్సవసంభ్రమమే కానుపించదయ్యెను. పెఱుందులబరువుచే నలసగమనలై ప్రియకంఠార్పితబాహువల్లరులై, సరసోజ్జ్వలవేషలైన ప్రోయాంద్రు

ప్రదీపముల వెలుఁగుట గానరాదు. వీధివీథుల విహరించెడి పౌరజన మహాబాలవృద్ధముగ సౌందర్యవతులతో మేళములాడుకొనుచు ఉత్సవదర్శన కౌతుకమున పాటలు ఎత్తి యేతెంచు జాడయే లేదు. కౌముదీమహోత్సవ కల్పితములగు తోరణాలంకారములతో కళకళలాడుచు కనులపండువు నొనర్పవలసిన కుసుమపురము నాటిరేయి చాటుమణఁగి చెన్నుదఱిగియుండుట గాంచి మహారాజు చెంతనున్న వైహీనరితో "ఏమిది పట్టణంలో ఇంకను ఉత్సవమారంభింపలేదు?" అనెను. మహారాజు నాటిరేయి ఉత్సవము జాటించినను ఆర్యచాణక్యుడు ప్రతిషేధించెనన్న వార్త మహారాజుతో నొడువుటకు నోరాడక అవృద్ధకంచుకి మిన్నకుండెను. చంద్రగుప్తుఁడును కంచుకి సంశయించుచుండుట యరసి గ్రుచ్చిగ్రుచ్చి యడుగగా ముదుక వైహీనరి 'ఉత్సవం ప్రతిషేధింపబడినది" అని యల్లన బలికెను.

చంద్రగుప్తుఁ డదరిపడి "ఏమీ! ఎవని చేత?" యని ప్రశ్నింప, కంచుకి "ఆపైవృత్తాంతం నేను మనవిచేయలేను" అనుచు గ్రుక్కిళ్లు మ్రింగుచుండుట మహారాజరసి, "ఆర్యచాణక్యులు ప్రతిషేధించిరా యేమి" అని మరల ప్రశ్నించెను. కంచుకి యంతట నిట్టూర్చుచు "తమ ఆజ్ఞకు ఆర్యులవారు కాకపోతే ఇంకా ఎవరు ఎదురు చేయగలరు?" అని విన్నవించెను. మహారాజు చిడిముడిపాటుగదుర నచట నాసీనుడై "ఆర్యచాణక్యులను చూడవలచుచున్నా"మని నంతట వైహీనరియు 'చిత్త'మని చాణక్యగృహమున కేగెను. రాజగురు డగు చాణక్యుని గృహమున నిండియుండిన సమిధల మోపులును, దర్భకట్టలును పిడుకల రాసులను వైహీనరి కన్గొని "ఆహా! ఏమి మహామాత్యులయైశ్వర్య"మని యాశ్చర్యమందుచు, "ఇంతటి నిస్పృహుడు గనుకనే మహారాజును 'వృషలా, వృషలా, అని పిలువగలుగుచున్నాడు ఆర్యచాణక్యుడు. కనుక జేతబట్టువారికే మావంటి సేవకులకు స్వాతంత్ర్యము రమ్మంటే ఎలా వస్తుంది! ద్రవ్యాశ వదలివేసిన యిటువంటి మహానుభావులు మహారాజునే కాదు, మహేంద్రుణ్ణినా డా

లెక్కచేయరు." అని మెచ్చుకొనుచు, లోనికేగి, దర్భాసనోపవిష్టుడైయున్న చాణక్యుని గాంచి, మోకరించి జయవచనము పల్కెను.

చాణక్యుడాతడు వచ్చినపనియేమో తెలియగోర "మహారాజులుంగారు దేవర నొకసారి దర్శనమిప్పించుడని విన్నవిస్తున్నా"రని వైహీనరి తెలిపెను.

చాణ:—వైహీనరీ! యీ అర్ధరాత్రివేళ ఏమంత ఉపద్రవం వచ్చింది?

వైహీ:—చిత్తము. మహారాజులుంగారు సుగాంగప్రాసాదంమీద విజయంచేసి వుండి దేవదర్శనం కోరారు.

చాణ:—కౌముదీమహోత్సవం నేను ప్రతిషేధించినవార్త వృషలునిచెవిని బడిందా యేమి?

వైహీ:—చిత్తము.

చాణ.—(కనుబెట్టజేసి) ఎవరుచెప్పారు వృషలునితో?

వైహీ:—చిత్తం. మహారాజులుంగారే నగరమంతటా ఉత్సవం లేకపోవడం చిత్తగించి కారణ మడిగారు.

చాణ:—సరే, మూర్ఖులంతా, ఇదేసమయ మని కొండేలు నూరిపోసి తంపులు పెట్టారు! అంతేగాదూ?

వైహీ:—(భయముతో తలవంచుకొని మిన్నకుండెను.)

చాణ:—పరిజన పరివారానికి చాణక్యునిమీద ఇంత ద్వేషమా! పదండి. సుగాంగానికే దారితియ్యి.

అని, వైహీనరి ముందునడువ చాణక్యుడు సుగాంగమునకు జని చంద్రగుప్తుని దరియజని జయధ్వని సలుప మహారాజు లేచి పాదములకు మ్రొక్కెను. చాణక్యుడాతని 'నాశీఃపూర్వకముగ లేవనెత్తి "మమ్ము పిలిపించిన పనియే"మని యడిగెను.

చంద్ర:—దేవరవర్మనంచేత నన్ననుగ్రహింప జేసుకొనుటకు.

చాణ:—(నవ్వుచు) ఈవినయాని కేమిగాని, నన్ను పిలిపించిన ప్రయోజన మేమిటో చెప్పు. నిష్ప్రయోజనంగా ప్రభువులు అధికారులు బిలిపించరు.

చంద్ర:—చిత్తం. కౌముదీమహోత్సవాన్ని ఆర్యులు ఏప్రయోజనంకొఱకు నిషేధించారో తెలుసుకుందామని శ్రమకల్పించాను.

చాణ:—ఓహో? నీయాజ్ఞను ప్రతిషేధించినందుకు మందలించాలని పిలిపించావా, యీ అర్ధరాత్రివేళ?

చంద్ర:—ఎంతమాట! ఆర్యులు నిష్ప్రయోజనంగా ఏపనీ చెయ్యరుగదా అని యెంచి అదియేమై యుంటుందో తెలుసుకోవాలని కుతూహలం కలిగింది.

చాణ:—మేము నిష్ప్రయోజనంగా ఏపనీ చేయమని తెలుసుకున్నందుకు చాలా సంతోషం. అయితే విను. శాస్త్రకర్తలు కార్యసిద్ధిని మూడువిధాల విభాగించారు. ఒకటి రాజాయత్తమని, రెండు సచివాయత్తమని, మూడు ఉభయాయత్తమని. ఈమూటిలోనూ ఇది సచివాయత్తమైన కార్యం గనుక దీనిప్రయోజనం నీ వడుగకూడదు.

చంద్ర:—(కోపమున మార్మొగమిడి మిన్నకుండెను.)

ఇదియే యదనని స్తనకలశుడు రాక్షసోపదిష్టప్రకారమున స్తవమొనర్చెను.

నిండుజాబిలి మింట బండువెన్నెల గాచె
ముల్లోకముల దెల్లముగ బుచ్చపువ్వు పూచె
రాజచంద్రమ! నీయరాతితండము లట్టు
పాఱి పర్వతగుహల్ దూరె బెనుచీకట్లు

ఆసేతుశీతాచలాంతసీమలనెల్ల
ప్రాక్పశ్చిమాబ్ధి సీమాంత తటసీమ వరకెల్ల
అభిమానధనులు శౌర్యాలవాలములు
నైతురే నృపతు లాజ్ఞోల్లంఘనములు
కోఱ లూడ్వగ సింహకౌపమసింగమ్ము
జవదాటని యాజ్ఞ సార్వభౌముండు
తల గిరీటము దాల్చు ధరణీశు డౌనె
ఆన చెల్లించుకోలేని భూపతికి
మోత చేటేకాక ముకుట మేమిటికి?

చాణక్యు డా స్తవము నాలించి, అయ్యది రాక్షసామాత్యప్రేరితముగా నిశ్చయించి తనలో దా నవ్వుకొనుచు చంద్రగుప్తుని మోము గన్గొనునంత నాతడు "వైహీనరీ! ఆ వైతాళికుడికి వేయి సువర్ణా లిప్పించు"మని యాన తిచ్చెను. "చిత్త"మని యేగుచున్న వైహీనరిని చాణక్యుడు "ఆగుమాగు"మని నిలిపి, మహారాజును "ఎందు కిప్పు డింతసొమ్ము అపాత్రదానం చేస్తావు?" అని ప్రశ్నించెను.

చంద్ర.—అడుగడుక్కూ తమరిట్లా నిషేధిస్తూవుంటే మాకిది బంధనాగారంగాని రాజ్యం కాదు.

చాణ.—నాయనా! నీకెంత కష్టంగా వుంటే మేమికనుంచి బాధపెట్టముగాని నీచిత్తంవచ్చినట్లు చేసుకో.

చంద్ర.—ఆహా మాపని మేమే చూచుకుంటాము.

చాణ.—శుభం. మాపని మేమూ చూచుకుంటాము.

చంద్ర.—మంచిదేగాని, ముందు మీరు కౌముదీమహోత్సవం ఎందుకు నిషేధించారో చెప్పండి వింటాము.

చాణ.—మహోత్సవ ప్రతిషేధం చేయించడంవల్ల ప్రయోజనమేమిటో నువ్వుచెపితే మేమూ వింటాము.

చంద్ర.—మాయాజ్ఞ చెల్లించుకోవడమే ప్రధానప్రయోజనం.

చాణ.—నా ప్రతిషేధానికికూడా ఆజ్ఞచెల్లించుకోవడమే ప్రయోజనం. ఆసేతు శీతాచలంగా చెల్లుతున్న నీఆజ్ఞ నప్పుడప్పుడూ ఇట్లా ప్రతిఘటిస్తూవుంటే నీకు వినయం నేర్పినట్లవుతుంది. ఇంతేకాదు. నా ప్రతిషేధానికింకొక ప్రయోజనం కూడా వున్నది. ఏమిటంటావా, చెపుతాను విను. మలయకేతువు మనమీద దాడివెడలడానికి సిద్ధంగా వున్నాడు. భద్రభటపురుషదత్త డింగరాతభాగురాయణప్రముఖులైన మనసేనాపతులు మనలను విడనాడి శత్రువు నాశ్రయించి, మనరహస్యము లాతనికి చెపుతున్నారు. ఎప్పుడేమి వుపద్రవం కలుగుతుందో తెలియదు. శత్రువు నెదుర్కోవడానికి ఆయత్తపడవలసిన మన కిది అలజడిసమయంగాని ఉత్సవాలకు, వేడ్కలకు సమయం కాదు.

చంద్ర.—భద్రభటాదులైన సేనానులు మనల నెందుకు విడనాడవలసి వచ్చిందో ఆర్యులు సెలవిస్తారా?

చాణ.—వినవలెనేగాని అవశ్యం చెపుతాను. గజాధ్యక్ష అశ్వాధ్యక్షులైన భద్రభటపురుషదత్తులు స్త్రీమద్యమృగయావ్యసనులు కావడం చూచి నేను వారి కా అధికారాలు తగ్గించి అన్నవస్త్రాలకు సరిపడ జీతమిప్పించడంచేత వారు మనల వదలి మలయకేతువు నాశ్రయించారు. డింగరాతబలగుప్తుల కిదివరకు మన మిస్తున్న జీతాలు చాలక ఎక్కువధనం సంపాదించేకోరికతో శత్రువునాశ్రయించారు. మనసేవచేసి అమితైశ్వర్యం సంపాదించిన రాజసేనుడు, మన మా సంపద నెప్పుడు హరించిపోతామో అనేభయంచేత పగవారితో చేరాడు. భాగురాయణుడు, మనం పర్వతకుని చంపించితిమని మలయకేతువుకు దుర్బోధచేసి భయపెట్టి అతణ్ణి మననుండి చీలదీశాడు.

ఆ సేనం బయటబడితే శకటదాసాదులకు పట్టిన అవస్థే తనకూ పట్టుతుందని భయపడి ఆత డామలయకేతువునే ఆశ్రయించి ఆతనికి విశ్వాసపాత్రుడై, మంత్రిత్వం చేస్తున్నాడు. మనవల్ల దాయాదభృతిగ్రహిస్తున్న లోహితాక్ష విజయవర్మలు అభిమానవంతులు గనుక స్వతంత్ర జీవనం కోరి మలయకేతువు నాశ్రయించారు.

చంద్ర.—వీరందరూ విరక్తులని తెలిసివుండికూడా మీరు ప్రతివిధానం ఎందుకు చేశారుకారు? లేచిపోతూవుంటే చూస్తూ ఎందుకు వూరకున్నారు.

చాణ.—ప్రతిక్రియచేయడమంటే, వీరిని అనుగ్రహించాలి, లేదా నిగ్రహించాలి. ఈరెండేగదా మార్గములు. భద్రభటపురుషదత్తులను తిరిగి వారిఅధికారములు వారికిచ్చికదా అనుగ్రహించాలి. అటువంటి వ్యసనపరాయణులకు అధికార మివ్వడమంటే చతురంగబలాన్ని నాశనంచేసుకోవడంతప్ప ఇతరంకాదు. డింగరాతబలగుప్తులతిలుబ్ధులు; వారిదురాశను పూరించడం మనతరంకాదు. రాజసేన భాగురాయణులు, ఉన్నసొమ్ము పోతుందేమోనని భయపడేవాళ్లు కాబట్టి వారినను గ్రహించే మార్గమే లేదు. ఇక లోహితాక్షవిజయవర్మలంటావూ? వాళ్లకు దాయాదం పుచ్చుకోవడానికే అభిమానమైనప్పుడిక వారి ననుగ్రహించడమెట్లా? కాబట్టి అనుగ్రహానికవకాశంలేదని తేలింది. ఇక మిగిలింది నిగ్రహం. మనది కొత్తరాచరికం. ఇంకా ప్రకృతివర్గానికి మనమీద పూర్తిగా అనురక్తి కలుగలేదు. ఒకవంక శత్రువులు దాడివెడలడానికి సిద్ధంగా వున్నారు. ఈస్థితిలో మనం పరుషదండం ప్రయోగించడం నీతికాదు. చూచీచూడనట్లూరుకోవడమే యుక్తం.

చంద్ర.—సరేగానివ్వండి; తమరి నింకొక్క ప్రశ్న అడగవలసివుంది.

చాణ.—ఒక్కటికాదు. పది ప్రశ్న లడగ్గవచ్చును.

చంద్ర.—ఈ అనర్థాలన్నిటికీ మూలకారణమైన మలయకేతువును ఎందుకు పోనిచ్చారు నగరంనుంచి?

చాణ.—పోనివ్వక ఏమిచేయమంటావు? పట్టుకొని నిగ్రహించమంటావా, అర్ధరాజ్యం పంచి యివ్వమంటావా? నిగ్రహించామా, పర్వతకుణ్ణి మనమే చంపించామని అంగీకరించినట్లవుతుంది. మనకృతఘ్నత బయటపడుతుంది. పోనీ, అర్ధరాజ్యమే యిద్దామా అంటే, పర్వతకవధకు కృతఘ్నత్వం తప్ప యింకో ప్రయోజనం లేకుండాపోతుంది. ఇదియంతా ఆలోచించే ఉపేక్షించవలసివచ్చింది.

చంద్ర.—ఎంతైనా బాగుంది మీసమాధానం! అయితే రాక్షసమంత్రి నెందుకుపేక్షించారు?

చాణ.—రాక్షసమంత్రి నందులకు పరమవిశ్వాసికావడంచేత ప్రకృతివర్గానికి ఆతనిమీద అనురక్తి వుంది. ఆతని కిక్కడ స్థానబలం, అర్థబలం, అంగబలం కూడా వుంది. వీటికితోడు బుద్ధిబలంగలవాడతడు. అటువంటిశత్రువు నగరంలోవుంటే, అంతఃకలహాలు పుట్టిస్తాడు. కాబట్టి పారిపోతూవుంటే, మనకే మేలని ఉపేక్షించాను. ఇప్పుడు ఇతరులవల్ల అపకారం చేయిస్తున్నా, మనం ఉపాయాంతరాలచేత వశుణ్ణి చేసుకోవచ్చును. ఇక్కడనే పీటవెట్టుకొని కూర్చుంటే మనకు హృదయశల్యమయ్యేవాడు. అలావుండకుండా, పారపడి పారిపోయినాడు. పోనిమ్మని నేనూ చూస్తూ వూరుకున్నాను.

చంద్ర.—అటువంటి ప్రబలశత్రువును బట్టి నిగ్రహించవలసింది.

చాణ.—(నవ్వి) నిగ్రహించడానికి ఆత డేమంత సులభసాధ్యుడుకాడు. పరాక్రమిస్తే అతడు నిజంగా రాక్షసుడే. మనకు అపారమైననష్టం కల్పించిగాని చావడు. అతడు చావడం మనకు క్షేమంకాదు. అంతటి తెలివిగల మంత్రి మన కెంతతపస్సుచేసినా దొరకడు.

చంద్ర.—నిజం సెలవిచ్చారు. రాక్షసమంత్రి ఎంతకైనా సమర్థుడు.

చాణ.(క్రోధముతో) ఏమి కాదనిపోగాదు నీతాత్పర్యం? ఏదీ, అతని యోగ్యత యెట్టిదో చెప్పు, వింటాము.

చంద్ర.—అతడెంతటి సమర్థుడూ కాకపోతే, మననగరంలో, మనకళ్లయెదుటనే మనకిన్ని అనర్థాలుకల్పిస్తూ, ప్రాణాపాయంకూడా ఎన్నోసార్లు కల్పించి, మనకంఠంమీద కూర్చున్నట్లు కూర్చోగలిగాడా? పైగా నిశ్చింతగా, నిర్భయంగా వెళ్లిపోతూవుంటే అతన్ని స్పృశించనైనా స్పృశించలేక పోయినాము. అతని ప్రభావంవల్లనే మనకిపట శత్రువెవరో, మిత్రువెవరో కూడా తెలుసుకోలేని దురవస్థ పట్టింది.

చాణ.—(నవ్వి) ఇంతేకదా! నువ్విట్లాడడం చూచి, ఒకవేళ మలయకేతువును రాక్షసమంత్రి—నేను నీకు చేసినట్లు, మగధరాజ్యాభిషేకం చేశాడేమో అనుకొన్నాను.

చంద్ర.—నాకు మగధరాజ్యాభిషేకం చేసింది మీరెందుకైనది?

చాణ.—([illegible]) మరి యెవరుచేశారు!

చంద్ర.—దైవం.

చాణ.—దైవం నమ్ముకొనేవారు విద్వాంసులుకారు.

చంద్ర.—ఆత్మస్తవం చేసుకొనేవారూ విద్వాంసులుకారు.

చాణ.—ఆఁ, ఆఁ! ఏమన్నావు? నందకులాటవికి నేనంటించినచిచ్చు ఇంకా చల్లారకుండానే, 'నీవెంత' అంటున్నావుగా! వృషలా! వృషలా! ఇంతలోనే ఎంతమస్సరివైనావు! ముడివేసుకున్న ఈజుట్టు మళ్లా నాచేత విప్పించాలనే దుర్బుద్ధి ఎందుకు పుట్టిందినీకు! ఇంతకు దోషమంతానాది. నిన్ను నిందించవలసినపనిలేదు. నీతో నాకింకా వాగ్వాదమెందుకుగాని రాక్షసమంత్రే నాకంటె మతిమంతుడని నీకు తోచిందిగనుక, శుభం, ఇదిగో!

అమాత్యభిక్షం; ఆతనికే యిచ్చి వ్యవహారం చక్కబెట్టుకో" అని కత్తిని చంద్రగుప్తునికొసగి, "రాక్షసా! రాక్షసా! నేటికి జయించావోయి నువ్వు" అనుచు నటనుండి వెడలిపోయెను.

చంద్రగుప్తుడంతట వైహీనరితో, "నేటినుంచీ చాణక్యునిజోక్యం లేకుండా రాచకార్యములు మేమే చూచుకొంటామని మంత్రులందరికీ తెలియజెయ్యి" అనెను. వైహీనరియు, "ఆర్యచాణక్యులనకుండా చాణక్యుడంటున్నారే మహారాజులుంగారు!" అని ఆశ్చర్యమందుచు నిశ్చేష్టయై నిలుచుటగాంచి చంద్రగుప్తుడు "వైహీనరీ! ఏమిటి ఆలోచిస్తున్నావ్" అని యడిగెను. వైహీనరియు, "ఏమీలేదు. దేవరవారు నేటికి దైవవశంచేత ప్రభువులైనారుగదా అనుకుంటున్నాను" అని బదులు పలికెను.

చంద్రగుప్తుడును దనలో "ఆర్యుల అనుజ్ఞచేతనే నిందించానుగదా పాపిని. అయినా మనస్సింత ఖేదపడుతున్నదే! నిజంగానే గురుధిక్కారం చేసేవాళ్ళెట్లా చేస్తారో! ఇంతకు ఆర్యులు కృతార్థులుగావడమే మనకుగావలసింది" అని యెంచుచు, "వైహీనరీ! ఈశుష్కకలహంచేత మాకు తలనొప్పివచ్చింది. శయ్యాగృహానికి త్రోవచూపు" మని యామెవెంట నేగెను.

---

## 28 (అ)

## బహుముఖమంత్రము.

అట మలయకేతుడు సేనల నాయత్తమొనర్చుకొని మగధపై దండి వెడలుట యెప్పుడెప్పుడని తత్తఱపడుచుండెను. చాణక్యచంద్రగుప్తులమధ్య దాను నాటిన భేదబీజములు మొలకెత్తి ఫలించెనన్న వార్తకొఱకు ఎదురుచూచుచున్న రాక్షసామాత్యుడు మలయకేతువున కేనాటికానాడు తాల్మి నుపదేశించుచు, నిద్రాహారములు మఱచి, శత్రుసాధనయత్నములు పూర్తినొనర్చుచుండెను.

పర్వతేశ్వరుడు మరణించి యప్పటికి బదిమాసములు గడచిపోయెను. కంటికిమంటికి నేకధారగా నేడ్చుచున్న తల్లిదుఃఖముంగాంచి మలయకేతు కుమారుడు, శాత్రవకళత్రములకుగూడ పతిభర్తృమరణశోకము ఘటించక మున్న తండ్రికి దర్పణము విడువనని చేసిన ప్రతిజ్ఞ ఇంకను నెఱవేఱక అట్లే యుండెను. "శత్రుఘ్నపుత్తానా, శత్రుసంహారంచేసి తల్లిదుఃఖం తీరుస్తాను. లేదా, చచ్చి స్వర్గంలోవున్న తండ్రిగారిని చూడబోతాను" అను నిశ్చయమునై వేగిరపడుచున్న మలయకేతువునకు రాక్షసామాత్యుడొనర్చుచున్న కాలహరణము దుస్సహమై తోచుచుండెను. చాణక్యోపదేశమున పాటలీపుత్రము విడిచివచ్చిన భద్రభటపురుషదత్తాదులు మలయకేతువునాశ్రయించి, సమయముదొరకినపుడెల్ల మలయకేతుహృదయమున రాక్షసునియెడ ననుమానముదయింపజేయుచుండిరి. వారిలో భాగురాయణుడు మలయకేతువున కత్యంతాప్తుడు, హితోపదేష్టయునై మెలగుచు, రాక్షసునకు నందకులముపై నున్న యభిమానమును చాణక్యునియెడ గలద్వేషమును వర్ణించి చెప్పుచుండెను." "చాణక్యునిబట్టి చంద్రగుప్తునిమీదకూడా పగసాధింపక తప్పకవచ్చిందిగాని, లేకపోతే రాక్షసమంత్రికి చంద్రగుప్తుడిమీద పగకు ఏమంత ప్రబల కారణముంటుంది? వారిద్దరిమధ్య చాణక్యనిమిత్తంగా ఎన్నిపొరపులుపుట్టినా, ఇరువురం మాగధులమనే అభిమానం రాక్షసచంద్రగుప్తులకు పరస్పరంవుండనే వుంటుంది" అనుచు నీరీతిమాటలతో భాగురాయణుడు మలయకేతువుమనస్సున ననుమానము నాటుచుండెను. భద్రభటాదులు మలయకేతువు నాశ్రయింప వచ్చినతొలినాడే "చాణక్యునివలలో జిక్కిన కారణంచేత చంద్రగుప్తుడంటే మాకు విరక్తికలిగి తమరి నాశ్రయింపవచ్చాము. అయితే తమసేనాపతియైన శిఖరకునిద్వారా ఆశ్రయిస్తున్నాముగాని రాక్షసామాత్యునిద్వారా కాదు" అని మనవిచేసిరి. ఎంత యాలోచించినను మలయకేతువున కామాటలయర్థము తెలియలేదు. తుదకు భాగురాయణునితో నామాటలెల్లచెప్పి, "వారిట్లా అన

దానికి కారణ మేమిటి?" రాక్షసమంత్రిద్వారా మమ్ము ఆశ్రయించడం దోషమా?" అని యడిగెను.

భాగురా:—ప్రియహితునిద్వారా ఆశ్రయించడం న్యాయంగనక వారు అలా అనివుంటారు.

మలయ.—అయితే మనకు రాక్షసామాత్యునికంటె ప్రియతము లెవరున్నారు?

భాగురా:—అట్లా అనుకోవడానికి వల్లకాదు. చాణక్యరాక్షసులకేగాని వైరం చంద్రగుప్తరాక్షసులకుగాదు. రేపు చాణక్యుడికీ చంద్రగుప్తుడికీ విరోధం పుట్టవచ్చు. చాణక్యుణ్ణి మహారాజు పదభ్రష్టుణ్ణి చేయవచ్చు. అప్పుడు రాక్షసమంత్రి, నందవంశభక్తుడుగనక, చంద్రగుప్తుడుకూడా నందవంశంవాడే ననేకారణంచేత ఆతనితో సంధిచేసి, ఆతనికి మంత్రి కావచ్చు. కాబట్టి ఏనాటికేమో అనేభీతిచే, భద్రభటాదులు రాక్షస ద్వారానరాక శిఖరకునిద్వారా తమచెంతకు వచ్చిరి.

ఈవిధంగా సందుదొరకినపుడెల్ల భాగురాయణుడు భేదబీజములు నాటుచుండెను.

రాక్షసమంత్రి యింకుక యస్వస్థుడై యున్నాడని విని మలయకేతువు పుష్కరాక్షసింధుషేణసింహనాదాదులతో నాతని దర్శింపనేగి, అమాత్యగృహ ద్వారముచెంత వారినందఱిని నిలిపి, తనరాక ముందుగా నమాత్యునకు తెలియ నంపమండగనే, భాగురాయణద్వితీయుడై లోనికేగెను.

కుసుమపురమునుండి వచ్చిన కరభకునితో రాక్షసమంత్రి అంతర్గృహమున మాటలాడుచుండ భాగురాయణమలయకేతు లాప్రసంగమును ద్వారము చాటున నిలిచి వినుచుండిరి. కరభకుడు చాణక్యచంద్రగుప్తుల కలహించుటయు, చాణక్యు డమాత్యఖడ్గమువదలి, 'రాక్షసునే మంత్రిని చేసుకో' మ్మని కోపించి వెడలిపోవుటయు విన్నవించెను. రాక్షసమంత్రి మిగుల సంతసించి,

"చాణక్యు డెప్పు డెక్కడనున్నా"డని యడిగెను. కుసుమపురమందే యున్నా"డని కరభకు డెఱిగించెను.

రాక్ష.—ఈకలహానికి కౌముదీమహోత్సవప్రతిషేధమే నా కారణం, ఇంకా యేమైనా వున్నదా?

కరభ.—దేవరవారున్నూ, మలయకేతుకుమారులున్నూ పురం వదలి వస్తూ వుండగా చాణక్యు వూరకుండటంకూడా కారణం. 'మీఆసమర్థతవల్ల వారిద్దరూ తప్పించుకుపోయి మనకు అనర్థం కలిగిస్తున్నారు' అని చంద్రగుప్తులవారు చాణక్యుని ఆక్షేపించి, దేవరవారు చాలా సమర్థులని పొగిడారు.

రాక్ష.—అయితే చంద్రగుప్తుడు మనకు దొరకినట్లే.

ఈసంభాషణము వినుచున్న మలయకేతువు భాగురాయణునితో, "ఇన్నాళ్లూ చాణక్యుడే మాతండ్రిగారిని చంపించి, మాపట్లకూడా ద్రోహం తలచినాడనుకున్నాము. ఇప్పుడు చూడబోతే వేరువిధంగా కనుపిస్తున్నది. చాణక్యచంద్రగుప్తులకు విరోధం కలిగించని అమాత్యుడు సంతోషించడంకూడా నాకు అనుమానంగావుంది. దేవకితోడు చంద్రగుప్తుడికి రాక్షసమంత్రిమీద ఇంతఅభిమాన మున్నదన్న సంగతికూడా ఇప్పుడు తెలియవచ్చింది."

భాగు:—మనం తొందరపడి ఇప్పుడేమీ నిశ్చయించకూడదు. కనిపెట్టివుంటే, యథార్థం క్రమంగా దానంతట అదే బయటపడుతుంది." ఇంతలో కరభకుడు రాక్షసునియొద్ద సెలవుగైకొనియేగుటయు మలయకేతు భాగురాయణులు లోనికేగిరి.

ఇట్లుతర్కించుకొనుచున్నండగు మలయకేతువుం గాంచి, రాక్షసమంత్రి "కుమారా! వచ్చితివా?" యని కౌగిలించుకొని చెంతగూర్చుండ నిడుకొనెను. "ఆర్యులకు తలనొప్పి తగ్గినదా"యని మలయకేతువు ప్రశ్నింప, "నాయనా! నీకు కుమారశబ్దమునుపోయి మహారాజశబ్దముగాకుండా నా తలనొప్పి యెట్లు పోవును" అని బదులుపలికెను.

మలయ.—మనము బలములన్నీ సమకూర్చుకొనికూడా ఇంకా ఎన్నాళ్ళిట్లా వేచివుండడం?

రాక్ష.—ఇదిగో, ఇక ముహూర్తం పెట్టడమే తరవాయి. చంద్రగుప్తచాణక్యులకు విరోధం వచ్చిందని ఇవ్వాళే తెలిసింది. ఇక మనకు జయం నిశ్చయం.

మలయ.—ఈవిరోధంకోరకేనా ఆర్యులిన్నాళ్లు వేచివున్నది! చాణక్యుడు మానుకుంటే చంద్రగుప్తుడు మరొకమంత్రిని చూచుకుంటాడుగాని వూరకుండడు గదా. ఏదియెట్లావున్నా, తమఆజ్ఞ అయింది; నా కదే కావలసింది. ఇక ప్రయాణభేరి మ్రోగింపమని ఆజ్ఞయిస్తాను.

అని సెలవుగైకొని రేగెను.

పిమ్మట జీవసిద్ధి పెట్టినముహూర్తముచొప్పున మార్గశీర్ష పూర్ణిమాదివసమున మలయకేతుసైన్యములు పయనమయ్యెను. పున్నమనాడు ప్రయాణము రాక్షసమంత్రికి మనస్కరించినదికాదు. మఱియు భద్రభటపురుషదత్తడింగరాతాదులనుగూర్చి యాతవిమనస్సు శంకావిల మగుచుండెను. కావున యెందుల కైన మంచిదని యెంచి ఖశమగధసేనలతో దాను ముందునడచువాడై, శకహూణసేనలు తనవెనుక నడచిరావలెననియు, యవనగాంధారసేనలు మధ్యభాగమునను, కులూతాధిపుడు మున్నగురాజులందరు మలయకేతువుం జుట్టి వారి నడవవలయుననియు నేర్పాటు గావించెను. ఇట్లు బయలుదేరినసేనలు కలిమినడచి ఇంద్రప్రస్థము జేరెను. అచట శత్రువు పొడయేని గానరాదయ్యెను. మార్గిమధ్యమున నున్నదుర్గములు సాధించుచు పోవుచున్నచో నాలస్యమగుననియు, వెంటనే కుసుమపురము నాక్రమించుట లగ్గనియు, ఆలసించినచో చాణక్యచంద్రగుప్తులకు సంధికుదురునేని కార్యము దుస్సాధ్యమగుననియు భాగురాయణు డుపదేశింప రాక్షసమంత్రియు నాయాలోచనము నంగీకరించి శీఘ్రప్రయాణములతో గుసుమపురమును సమీపింప నాజ్ఞయిడెను.

చంద్రగుప్తునిచారులు, సైన్యమున ప్రవేశింతురేమో యనుసంకోచముచే మలయకేతువు ముద్రాలాంఛితులుగాని వారెవ్వరును స్కంధావారమును

విడిచిపోగూడదనియు, లోనికి రాగూడదనియు గట్టిపరయొనర్చి ముద్రాధికారమును భాగురాయణుని కొసగెను. భాగురాయణుడు వచ్చువారికి, పోవువారికి నానవాళ్లిచ్చుచుండ మలయకేతువు రాక్షసప్రవర్తనమునుగూర్చి యాలోచించుచు ప్రక్కగదిలో గూర్చుండియుండెను.

ముందుగా క్షపణకుడగు జీవసిద్ధి స్కంధావారమును విడిచిపోవుటకై ఆనవాలిమ్మని భాగురాయణు నడిగెను.

భాగు.—జీవసిద్ధీ! ఎక్కడికి ప్రయాణము? ఏమైన రాక్షసమంత్రిపనిమీద వెళ్లుచున్నావా?

జీవ.—లేదులేదు. రాక్షసునిపేరు, పిశాచముపేరైనా వినబడనిచోటికి పోవుచున్నాను.

భాగు.—అదియేమి! రాక్షసమంత్రి నీకు స్నేహితుడుగదా! ఆయన ఏమిచేసెను? అంతకోపంగా మాట్లాడుతున్నావు?

జీవ.—ఆయన యేమీచేయలేదు. నిర్భాగ్యప్రజచ్చినవాణ్ణి నేచేసినపనికి నేనే సిగ్గుపడి పోతున్నాను.

భాగు.—అంతటి ఆకార్యం ఏమిచేశావు నువ్వు?

జీవ.—ఏదో చేశాను. గతించింది మళ్లాయిప్పుడు త్రవ్వడమెందుకు?

భాగు.—కుతూహలంచేత అడిగాను. అంతరహస్యమైతే చెప్పనక్కరలేదు.

జీవ.—రహస్యమేమిటి, రాక్షసకృత్యానికి? నేను తొందరగా పోవాలి.

భాగు.—నువ్వు చెప్పకపోతే నేను ఆనవాలివ్వను.

జీవ.—నాతొందరకనిపెట్టి నిర్బంధిస్తున్నారు మీరు. ఏమిచెయ్యను. వినండి చెప్పుతాను. పాటలీపుత్రములో వుండగా, రాక్షసమంత్రి దుర్బోధవిని విషకన్యాప్రయోగంచేసి పర్వతేశ్వరులవారిచావుకు కారణమైన దిక్కుమాలినవాణ్ణి. ఈసంగతి ఏమనిచెప్పుకోనని సందేహిస్తే మీరు కాదుకూడ చంటిరి. ఇకనైనా నాకు ముద్రికయిప్పించండి. పోతాను.

భాగు.—ఏలాగు ! ఏమన్నావు? రాక్షసుడా, పర్వతేశ్వరులవారిని చంపించింది ! చాణక్యుడే, అర్ధరాజ్యం ఎగబెట్టడానికి ఈద్రోహం చేశాడను కొంటున్నాము మే మిన్నాళ్లనుంచి.

క్షప.—బుద్ధదేవా ! (అని చెవులుమూసికొని) చాణక్యుడు విషకన్యపేరైనా ఎరుగడు. రాక్షసప్రేరణచేత ఈ దుర్మార్గం చేసినందుకు నన్నాయన పట్టణం నుండి వెళ్లగొట్టాడు. మళ్లా రాక్షసుడు నాచేత ఇంకో పిశాచకృత్యం చేయించాలని చూస్తున్నాడు. ఈసారి చాణక్యుడు నన్ను ఈ లోకంనుంచే సాగనంపుతాడు. అందుకని నాదారి నేను చూచుకొంటున్నాను. ఇక క్షమించండి అనవాలు.

భాగు.—ఇదిగో. తీసుకుపో ఈరహస్యం కాస్త మలయకేతుకుమారునికిగూడా చెప్పి మరీ వెళ్లు.

క్షపణకుడు చనుచుండ మలయకేతువు ప్రవేశించి, "సర్వమూ విన్నాను. ఇంకా ఒకరు చెప్పడమెందుకు? ఇంతద్రోహం చేసిన రాక్షసుడికి ఏమిదండనం చేస్తే నాకోపం చల్లారుతుంది ? సర్వవిధాలా తన్ను నమ్మివున్న నాకు ఇంతటి ద్రోహం చేసినపాపికి తగినదండనం నరకంలోగూడా వుండబోదు. రాక్షసా! రాక్షసా ! నువ్వు నిజంగా రాక్షసుడవే" యనుచుండ భాగురాయణుడు వానిని గూర్చుండనిడి, రాక్షసుని ప్రాణములు తీయగూడదను చాణక్యాదేశమును స్మరించి, శాంతివచనము లుపదేశింప దొడగెను.

భాగు.—రాక్షసమంత్రి విషయమై తమరు తొందరపడవలదని నావిన్నపం. నీతిశాస్త్రవేత్తలకు కార్యవశాన శత్రులు మిత్రులవుతారు; మిత్రులు శత్రులవుతారు. రాక్షసమంత్రి అప్పట్లో సర్వార్థసిద్ధిని రాజును చేయ దలచు కోవడంవల్ల పర్వతేశ్వరులవారిని శత్రువుగా ఎంచుకున్నాడు. కాబట్టి అందుకాయనన్ని నిందించగూడదు. మనకు ప్రస్తుతం సహాయకారిగావుండ

దమే మనకు గావలసింది. నందరాజ్యం మనకు ప్రాప్తించేదాకా ఆతన్ని చెడనాడుకోకూడదు. తరువాత ఏమిచేస్తారో తమయిష్టం.

మలయ.—నీ ఆలోచనం బాగానేవుంది. రాక్షసుణ్ణి మనమిప్పుడు చంపడం కార్యహానిచేసుకోవడమే.

ఇంతలో రాజచారులు సిద్ధార్థకుని గట్టికట్టుకొనివచ్చి "ఈతడెవరో అనుజ్ఞాపత్రంలేకుండా పారిపోతూవుంటే పట్టితెచ్చినా"మని విన్నవించిరి. "నీవెవ్వడ"వని భాగురాయణుడు ప్రశ్నింప, సిద్ధార్థకుడు "నే నమాత్యరాక్షసుని సేవకుణ్ణి"అని బదులుచెప్పెను. "అయితే ముద్రికలేకుండా ఎందుకు వెళ్లుతున్నా" వని భాగురాయణు డడుగ, నాతడు వెలవెలబోవుచు "తొందరపనిమీద వెళ్లుచున్నాను" అనుచుంట గాంచి, మలయకేతు వాతని ననుమానించి, "వానిచేతిలో ఏదో కాగితమున్నది, లాగికొను"డని భటులకాజ్ఞాపించెను. భాగురాయణు డాకమ్మలాగికొని, "ఇందు రాక్షసామాత్యుని ముద్రయున్నది" యనుచు దానిని మలయకేతువున కొసగెను

"స్వస్తి. మనపగవానిని నిరాకరించి వెడలగొట్టి మీరు మాటనిలుపుకొన్నందుకు సంతోషం. మనకుసహాయులై వచ్చినివారికి చేసినవాగ్దానంకూడా చెల్లించవలసినసమయం వచ్చింది. తమకాశ్రయుడైనవానిని నాశనంచేసి వారు మిమ్ము అనుసరింపగలరు. వీరిలో కొందరు పగవానిగజబలమును కోశమును కోరుతున్నారు. కొందరు రాజ్యమును కోరుతున్నారు. ఈవిషయమంతా మీరై తేమరివరుగాని నేను జ్ఞాపకార్థం వ్రాసినాను. మీరుపంపిననగలు మూడు నన్నా చేరినవి. వీనిద్వారా పంపుతున్నకానుక పరిగ్రహించి నన్ను ధన్యుణ్ణిచేతురని విన్నవిస్తున్నాను. వీనితో కొన్నినోటిమాటలుగూడా చెప్పిపంపుతున్నాను. అవధరించండని మనవి"

ఇట్లున్న లేఖార్థము చదివికొని "ఈకమ్మ ఎవరికితీసుకవెళ్లుచున్నా"వని సిద్ధార్థకు నడిగెను. వాడు భయమువేవడకుచు"మీకే" యని బదులుచెప్పెను.—

మలయకేతు వామాటలు విన్నవాడై 'వీణ్ణి బయటికితీసుకొనిపోయి నిజంచెప్పే దాకా కొట్టండి" అని భటులకాజ్ఞాపింప, భయకంపితగాత్రుడగు సిద్ధార్థకుని వారు చేయిపట్టిలాగినంత ముద్రాలాంఛితమగు పెట్టెయొకటి వానికక్షము నుండి జారిపడెను. దానినెత్తికొనిచూడ, పైన రాక్షసముద్రయు, లోన మూడునగలును గాన్పించెను. మలయకేతు వానగలు వెలికితీసిచూచి, "వీటిని నావంటిమీదనుండితీసి రాక్షసుడికి బహుమానమంపాను. వీనినిబట్టిచూస్తే, ఈకమ్మ రాక్షసుడు, చంద్రగుప్తునికి వ్రాసినట్లు తేలుతూవుంది. ఎంతద్రోహం?" అనుచు, "భాసురకా ! వీణ్ణిచావబాదండి, వీణ్ణి చెప్పమన్న నోటిమాటలేవో చెప్పే వఱకు" అని యాజ్ఞాపించెను.

సిద్ధార్థకుడంతట మలయకేతువు పాదములపైబడి "ప్రభూ ? రక్షించండి. నాకభయమిస్తే యథార్థం మనవిచేస్తాను" అని ఏడువదొడగెను. భాగురాయణుడు "నువ్వుపాత్రవు కాబట్టినీకువచ్చినభయంలేదు. ఉన్నదున్నట్లు మనవిచేసుకో"మ్మనెను. సిద్ధార్థకుడంతట "రాక్షసమంత్రి చంద్రగుప్తునకిమ్మని కమ్మయు నగలూ నాచేతికిచ్చారు. నోటిమాటలుగా, "మనస్నేహితులైన కులూతమలయకాశ్మీరపతులు మలయకేతువురాజ్యం కోరుతున్నారు. పారసీక సింధురాజులు మలయకేతుకోశాన్ని గజబలాన్ని కోరుతున్నారు. కాబట్టి చాణక్యుణ్ణిలేవగొట్టిమాటనిలుపుకున్నట్లు, వీరికోరికలుగూడా చెల్లించవలసినది" అని చెప్పవలసిందన్నారు. ఇంతకుమించి నేనేమీయెరుగను" అనెను. మలయకేతు వామాటలు విని నిశ్చేష్టుడై "చిత్రవర్మాదులుకూడా ద్రోహం తలపెట్టారుగా ! రాక్షసు డీనీచులతోగూడి మమ్ము వంచించి చంద్రగుప్తుడికి మమ్మును పట్టియివ్వాలని చేసినదుస్తంత్రమిది. కనుకనే రాక్షసుడు ఈతోడి దొంగలను ససైన్యంగా మాచెంతవుండే ఏర్పాటుచేశాడు. ముందు వీళ్లనందరినీ సంహరించినతరువాతనే చంద్రగుప్తుని పనిపట్టిస్తాము" అని మండిపడుచు "రాక్షసమంత్రిని మేము చూడవలసియున్నది" అని ప్రతీహారి నంపెను.

రాక్షసమంత్రియు మలయకేతువును దర్శింప నరుగుచు విశ్వావసు ప్రభృతులగు సోదరులకడ దానంతకుమున్న కొనిననగ అలంకరించికొని యేగెను. సకలప్రశ్నాదికము ముగిసినపిమ్మట మలయకేతువు “మీరీపురుషున కీపత్రమిచ్చి కుసుమపురమునకు పంపుచున్నమాట నిజమేనా?” యని పత్రమును చేతికిచ్చెను. అమాత్యుడద్దాని గాంచి “కుమారా! ఈకమ్మ నేనంపినది కాదు” అని సిద్ధార్థకుని గాంచి, “భద్రుడా! ఇదియేమి” యని యడిగెను. వాడును సిగ్గుపడుచు “నన్ను జావగొట్టుటచే రహస్యంబయటబెట్టితిని” ననెను.

రాక్ష:—ఆరహస్య మెటువంటిది!

సిద్ధా:—(తలవంచుకొని) “నన్నుభయపెట్టుటచే” అని గజగజలాడుచు నూరకుండెను. అంతట భాగురాయణుం డందుకొని “మీరీలేఖ చంద్రగుప్తునికి పంపుచున్నారట. నోటిమాటలుగూడ చెప్పిపంపితిరట.

రాక్ష:—కుమారా! ఇది యసత్యము. ఇందేదో శత్రుప్రయోగముంది.

మలయ:—పట్టియుత్తరమంపగూడదని ఈనగకూడాఇచ్చితిరటకాదా?

రాక్ష:—ఈనగ నేను వీనికి బహుమానమిచ్చినమాట నిజమేకాని ఈపత్రము నేనెఱుగను. ఈదుస్తంత్రము శత్రువులుపన్నినట్లున్నది.

మలయ:—మఱి యీముద్రిక యెక్కడిది?

రాక్ష:—ధూర్తు లసత్యముద్రికలుమాత్రము కల్పించలేరా!

భాగురా:—సిద్ధార్థకా! ఈకమ్మ ఎవరు వ్రాసిరి?

సిద్ధార్థ:—(భయపడుచు) శకటదాసుడు.

రాక్ష:—కుమారా! శకటదాసే వ్రాస్తే నేను వ్రాసినట్లే.

మలయ.—విజయా! శకటదాసును దీసుకొనిరమ్ము.

భాగు.—శకటదాసుమంత్రిగారియెదుట సత్యం చెప్పకపోడు. కాబట్టి ముద్రికను, అతనిచే వ్రాయుమా చెప్పించుట మంచిది.

విజయ వ్రాసిన దైకొనివచ్చినపిమ్మట రాక్షసమంత్రి శకటదాసుని వ్రాలును, కమ్మలోనియక్షరములు నొక్కపోలికగానేయుండుట యరసి, నిశ్చైయపడి, "శకటదాసు మిత్రుడని నమ్మితిని. ఆలుబిడ్డలనుబలచుకొని, ప్రాణభీతిచే ఇంతటిద్రోహం చేస్తాడనుకోలేదు" అని విచారించుచు నూరకుండెను. మలయకేతు వంతట రాక్షసునిశరీరమున నున్ననగనుగుర్తించి, "ఆర్యా! ఈకమ్మలో 'మీరుపంపిననగలు మూడున్నూ అందినవి' వని వ్రాసితిరి గదా! ఈనగ ఆమూటిలోనిదేనా" యని యడిగెను. రాక్షసుడు "దీనిని వర్తకులవద్దకొన్నాను" అనెను. మలయకేతు వంతట ప్రతీహారిం గాంచి "విజయా! ఈనగ నువ్వుగుర్తింపగలవా?" యని యడిగెను.

విజయ.—గుర్తించకేమిబాబూ! (కన్నీరొడ్చుచు) పర్వతేశ్వరులవారినగలు నాకుకొత్తవా?

రాక్షసమంత్రి యామాటలువిని, ఆశ్చర్యవిషాదములుపెనగొన "కుమారా! ఈనగలమ్మిన వర్తకులనుగూడ చాణక్యుడే పంపెనుగాబోలు" అనెను. మలయకేతువు "ఆర్యా మాతండ్రిగారినగలు చంద్రగుప్తుడిచేతికి చిక్కిన మాట యథార్థము. వానిని ఎవరో వర్తకులు అమ్మినారంటే ఎట్లానమ్మడం?" అని యడిగెను. రాక్షసమంత్రి కేమిపలుకుటకును నోరాడలేదు. కమ్మ తాను వ్రాయలేదంటాడా, ముద్రిక తనదని కనుపడుచున్నది. నిండ శకటదాసుపై త్రోయుట కాతడు దానునమ్మిన మిత్రుడాయెను. చంద్రగుప్తుడు నగలమ్మెనన్నమాట విన్నవారునవ్వుదురేగాని నమ్మరు. ఇంతచక్కగా దన్నువంచించిన శత్రుప్రయోగమున కచ్చెరుపందుచు, తానేమియు నెఱుగననుటకన్న దోషినని యంగీకరించుటయే యుక్తమనియెంచి మిన్నకుండెను.

మలయ:—ఆర్యా! మిమ్ము నొక్కమాట అడుగుతాను.

రాక్ష:—కుమారా! ఆర్యులైనవారినడుగుము. నాకింకా ఆర్యత్వ మెక్కడిది?

మలయ:—చంద్రగుప్తుడు నీప్రభువంశంలోవాడని నీకు విశ్వాసము ప్రాంత వచ్చును. ఆతఁడు నీకు భోగభాగ్యములిస్తాడని ఆశవుండవచ్చును. ఆతఁడు మహారాజుగనుక ఆతనికి మంత్రికావాలనే కోరికా నీకు వుండవచ్చును. అందుకు నిన్నెవ్వరూ కాదనరు. కాని యిటుచూస్తే, నేను నీమిత్రునికి కుమారుణ్ణి, నీకుభృత్యుణ్ణి. నాఐశ్వర్యమంతా నీవిచ్చినదేకాబట్టి నీవేనాకు దాతవు. నేనేమీ నీకఇవ్వలేను. నావృద్ధిఅంతా నీదే. నువ్వే నాకుప్రభువువు. ఇటువంటినాకు ద్రోహంచెయ్యాలనే దుర్బుద్ధి నీకు ఎందుకుపుట్టింది !

రాక్ష:—కుమారా ! నీకు నేను ద్రోహంచేయవలసిన కారణం లేదని నీమాటలే చెప్తూవుండగా ఇంకా నేనేమి చెప్పగలను? ఇది అంతా దైవవిలసితము. నన్నుఅంతగా ప్రేమించినమహానుభావులు, నాప్రభువులు; వారిని పొట్టను బెట్టుకొన్నదుర్దైవమే, నాప్రయత్నాలన్నీ మంటగలిపి నన్ను ఇట్లా వంచించింది.

మలయ:—(సరోషంగా) ఇంకా దైవాన్ని నిందించడానికి నీకు సిగ్గెందుకులేదు! విషకన్యనుపంపి చేతులారా నాతండ్రిని చంపించిందిచాలక, నన్నుకూడా శత్రువునకు కట్టియివ్వాలని యింతదుస్తంత్రం పన్నినరాక్షసుడవు నువ్వు. మనుష్యమాంసం అమ్ముకొనితినే కటికవాడవు.

రాక్ష:—కుమారా ! ఎందుకు పాపములన్నీ నామీదమోపుతావు? పర్వతేశ్వరులపై నేను విషకన్యను ప్రయోగించలేదు.

మలయ:—మరి మాతండ్రిని చంపినదెవ్వడు?

రాక్ష:—దైవము నడుగుము.

మలయ:—దైవమునడుగనా, జీవసిద్ధి నడుగనా?

రాక్ష:—జీవసిద్ధికూడా చాణక్యచారుడేనా ! ఇంకేమున్నది? శత్రువులు నాగుండెకాయనే హరించిరి.

మలయ:—భాసురకా! శేఖరసేనునకు మాఆజ్ఞ తెలియజెప్పు. కౌలూతమలయ కాశ్మీరరాజులు మారాజ్యం కోరుతున్నద్రోహులు. వారిని ప్రాణాలతో గోతిలో పూడ్చిపెట్టమను. మేఘనాథసింహునసేనలకు మాగజబలమూ కోశమూ కావలెనట వాళ్లను ఏనుగులచేత త్రొక్కించి చంపమను. (రాక్షసునివంక చూచి) నేను విశ్వాసఘాతి యగురాక్షసుణ్ణి కాను. మలయకేతువును. ఇక మాయెదుట నిలువకు. పో ఆ మీచంద్రగుప్తుణ్ణే ఆశ్రయించు. నిన్ను చంద్రగుప్తుణ్ణీ, చాణక్యుణ్ణీకూడా యుద్ధభూమిలో కలుసుకొంటాము. భాగురాయణా! కుసుమపురం ముట్టడించడానికి సేనలుసిద్ధం కమ్మను.

అనుచు రాక్షసునివంక జుఱచుఱజూచుచు భాగురాయణసహితముగా మలయకేతు వటనుండి వెడలిపోయెను. రాక్షసామాత్యు డంతట పొంగివచ్చు నావేగము నడచుకొనజాలక, "అక్కటా! చిత్రవర్మాదులకుగూడా ఎంత కష్టం వచ్చింది. శత్రునాశనంకొఱకు నేనుచేసినయత్నాలన్నీ ఇట్లామిత్రనాశనంగా పరిణమిస్తూవుంటే ఈవిపరీతదైవాన్ని నేనెట్లాయెదుర్కొందును! ఇంతట ప్రయత్నంచాలించి అడవులకుపోయి తపస్సుచేసుకుంటూవుంటామంటే, అంతర్వైరం నశించదాయె. ఈనురప్రష్టజీవిత మింతటచాలింతమనుకొంటే, ఇంతచేసినశత్రువులు బ్రతికివుండగా ప్రాణాలు విడవడం ఆడుదానిపని. ఇంకా పెనగులాడుదామంటే దైవం ప్రతికూలించె! చాణక్యతంత్రం నాబుద్ధికి మించిపోయెను. అయినదేమో అయింది. ఖడ్గం ధరించి శత్రుసైన్యంలో దూరబడి శక్తికొలది వాళ్లనుచంపి చచ్చిపోదామంటే, అక్కడ చందనదాసు, నాకోసం సర్వస్వం పోగొట్టుకొని చెఱలోబడివుంటే, అతణ్ణివిడిపించకుండా ఈశరీరం వదలిపెట్టితే కృతఘ్నదోషం చుట్టుకొంటుంది" అనుచు బరిపరివిధముల బలువిడుమనస్సులో గాళ్లీడ్చుకొనుచు కుసుమపురాభిముఖుడై యరిగెను.

---

# 28 (అ)

# ఫలసిద్ధి

మలయకేతువు పుష్కరాక్షసింహనాదచిత్రవర్మాదులగు రాజుల నెల్లర జంపించినంతటనే శకయవనపారసీకాదులగు నితరమిత్రులందరు నాతని బరిత్యజించి తమతమ దేశముల కేగిరి. అంతట ధననిస్సహాయతకు వెఱగుపడి ఇతికర్తవ్యతామూఢుడై యున్న మలయకేతువును భద్రభట పురుషదత్త డింగరాత భాగురాయణాదులగు చాణక్యచారులు, రెక్కలూడ్చిన పులుగును బోలె బంధించిరి. అంతలో చంద్రగుప్తసైన్యము లరుదెంచి మలయకేతుసైన్యముల నెదుర్కొని చెండాడివైచెను.

రాక్షసమంత్రియు మలయకేతువినాశమును చాణక్యుని విజయమును విని ప్రచ్ఛన్నవేషమున కుసుమపురపరిసరమందున్న ఉద్యానవనముం జేరి యచట కూర్చుండి తనదుర్గతిం గూర్చి విచారింపదొడగెను. "మలయకేతువున కీపాటి వివేకం లేకపోయిందే! అంకురం కూడా లేకుండా నశించిన నందవంశం మీది విశ్వాసం చేత ఇంతగా పెనగులాడుతున్న నన్ను నమ్మలేకపోయినాడే! ఇటువంటివాణ్ణి, శత్రువులతో చేరి తన్ను వంచిస్తున్నానని ఆతనికి ఎలా తోచిందో! ఇంతకు దైవోపహతులకు సదసద్విచారం ఎలా వుంటుంది? ఇక నాకు చందనదాసరక్షణం కంటె కర్తవ్యం కనిపించదు" అని నిశ్చయించుకొనెను.

రాక్షసుడు కుసుమపురము జేరిన వార్త చాణక్యుడు చారులచే నెఱింగి కర్తవ్యముపదేశించి చారునొకని నతనికడ కంపెను. వాడును నచటి యుద్యానపాదపమున కురిత్రాడు బంధించి దానితో కంఠమున కురివైచుకొను యత్నము గావింపజొచ్చెను. రాక్షసమంత్రియు ఆనిర్భాగ్యుని ఆత్మహననయత్నముం గాంచి దరియు నేగి 'నీ వెవ్వడవు? ఎందుకీ సాహసం చేస్తున్నావు" అని యడిగెను.

ఆపురుషు డంతట "ఈనగరంలో విష్ణుదాసుడని నాకొక స్నేహితు డున్నాడు. ఆవిష్ణుదాసునికి చందనదాసనే వర్తకుడు ప్రాణస్నేహితుడు; చందన

వాడు రాక్షసమంత్రి పెళ్లాముబిడ్డలను తనయింట్లో దాచినాడట. అందు-
వని చంద్రగుప్తమహారాజు అతనికి మరణదండనం విధించాడు. విష్ణుదాసు తన
మిత్రునికి కానున్న దుర్మరణాన్ని వారించడానికి మహారాజుదగ్గరికి వెళ్లి 'నా
ద్రవ్యమంతా సమర్పిస్తాను. చందనదాసును విడిపించు'డని విన్నవించాడు. మహా
రాజు నవ్వి 'చందనదాసును మేము ద్రవ్యాపేక్ష చేకాదు బంధించింది. రాక్షస
కళత్రాన్ని మాకు నప్పజెప్పితే ఇప్పుడైనా అతణ్ణి వదలిపెట్టుతాము. లేనిచో
అతనికి మరణదండనంతప్పదు' అని చందనదాసునువధ్యస్థానానికి తీసుకుపొండని
చండాలుర కాజ్ఞయిచ్చెను. విష్ణుదాసు తనమిత్రుని మరణవార్తవిన లేక అగ్ని
ప్రవేశం చేయబోయినాడు. అపుణ్యాత్మునిచావు వినకుండాచావాలని నేనిచ్చ-
టికి వచ్చినా'నని చెప్పెను.

విష్ణుదాసుని మిత్రవాత్సల్యమునకు, ఈపురుషుని తెగువకును రాక్షస
మంత్రి అక్కజమంది, ఇంతటిస్నేహబంధమునకు కారణమైనచందనదాసు తన
కొఱకుగదా మరణించుచుండెనని యోచించి "భద్రుడా! చందనదాసు నింకను
చంపలేదుగదా" యని ఆవేశముతో నడిగెను. "రాక్షసకళత్రమెక్కడో చెప్ప
వలసిందని గ్రుచ్చిగ్రుచ్చి ఎంతయడిగినా ఆమిత్రవత్సలుడు చెప్పకపోవడం-
వల్ల చండాలు రాతణ్ణి వధ్యస్థానానికి తీసుకుపోతున్నా"రని వాడు బదులం
చెప్పెను. రాక్షసుడంతట వానింగాంచి, "భద్రుడా! నువ్వు ఈసాహసంమాను.
చందనదాసుకు వచ్చినభయం లేదు! రాక్షసమంత్రి చందనదాసును రక్షింప
బోయెనని విష్ణుదాసుతో చెప్పి అతణ్ణి రక్షించుము" అనిపలికి, "సెబాసు! చందన
దాసా! సెబాసు! నేనులేనిసమయంలో నాభార్యాపుత్రులకొఱకు మరణించ
డానికి, వప్పుకొని శిబిచక్రవర్తిని తలదన్నినకీర్తిసంపాదించావు" అనుచు
బయలుదేరుచుండెను. ఆపురుషు డంతట రాక్షసునిపాదములపై బడి "దేవర
వారిని నేను పోల్చలేకపోయినాను. తమరుపూనుకొంటే చందనదాసు బ్రతికి
నట్లే. కాని దేవరవారు ఎలారక్షిస్తారో చందనదాసును నాకు తెలియకుండా
వున్న"దనెను. "ఇదిగో శత్రువినాశకరమైన ఈఖడ్గంతో" అని రాక్షసుడు

శక్తి చూపెను. ఆపురుషు డంతట "వద్దు సుమండీ! మీరు ఈకత్తితో వధ్యస్థానానికి వెళ్లితే అపాయం వస్తుంది. వెనుక శకటదాసు నెవరో ఇట్లాగే చండాల హస్తములనుండి విడిపించారట. చాణక్యుడు, శకటదాసును తప్పించుకొని పోనిచ్చినందు కాచండాలురను చంపించాడు. అందువల్ల ఖడ్గహస్తులెవరైనా సమీపిస్తే చండాలురు వెంటనే తమపనిముగిస్తారు. కాబట్టి తమరు ఖడ్గధారులై మాత్రం వెళ్లకండి" అని బ్రతిమాలెను.

శకటదాసును తనచెంతకు విరోధులు పంపించిరని నమ్మియున్న రాక్షసుని కీమాటలచే మతిపోయినట్లైయినది. "ఔరా! చాణక్యతంత్రం ఎంతదుర్భేద్యంగా వుంది" అని ఆశ్చర్యమందుచు, "ఖడ్గధారణాని కిదిసమయంకా"దని నిశ్చయించి, వట్టిచేతులతో వధ్యస్థానముచెంతకు పరుగిడెను.

అచట వధ్యస్థానమున చండాలురు శూలారోపయత్నము లొనర్చుచుండ, చందనదాసు, విన్నువిడలేక కన్నీటితో వెంటబడివచ్చిన భార్యాపుత్రుల నూరార్చుచుండెను. తనతోగూడ ప్రాణములు వదలుదునని యేడ్చుచున్న భార్యను "లోకవ్యవహారమెఱుగని పిల్లడు. వాణ్ణి కనిపెట్టుకొనివుండు. నీకన్న వాడి కిక దిక్కులే"దనిచెప్పి వారించెను. తుదిసారి తనకు కన్నీటితో నమస్కరించిన కుమారుని కౌగిలించుకొని "తండ్రీ! ఏనాటికైన తప్పనిచావు నాకు మిత్రకార్యరూపంగా వచ్చింది. కాబట్టి నాకై విచారించకు. చాణక్యుడు లేని దేశం వెళ్లి అక్కడజీవించు. ఏడువకు, నాయనా!" యని యోదార్చి వీడ్కొలుపుచుండెను. ఇంతలో చండాలురు శూలమునుపాతి చందనదాసును చేయిపట్టిలాగుచుండ గుటుంబిని మరల "అయ్యో! ఈసత్యవ్రతుణ్ణి, ఆశ్రితవత్సలుణ్ణి రక్షించేవారు లేరా" యని యేడ్చుచు నడ్డమువచ్చెను. అంతలో రాక్షసమంత్రి! "ఓరోరి! చండాలులార! నిలువుడు, నిలువుడు. చందనదాసును చంపకండి" అని కేకలిడుచు పరుగున నచటికేతెంచి, "ఇదిగో! నన్నుచంపండి. ఆర్తత్రాతుణ్ణి వదలండి"అని వారించెను. చందనదాసు రాక్షసమంత్రిని నీరు

నించెనకనుల గాంచి, "అమాత్యా ఏమిది! నా ప్రయాసమును, మైత్రిని ఎందుకువ్యర్థం చేస్తావు. మీరు తొలగిపొండి" అని బ్రతిమాలెను. రాక్షసమంత్రి తాను "చెలికాడా! ఈనిర్భాగ్యునికొఱకు ఎందుకువృథాచావు చస్తావు. సర్వనాశనమైనపిదప ఇంకా నీవంటిపుణ్యాత్ముణ్ణి నాకోసం బలియివ్వడ మెందుకు? నాధర్మం నన్నునిర్వర్తించనీ" యనిపలికి, చండాలురతో "ఓరీ! చాణక్యుడితో చెప్పండి. రాక్షసమంత్రి వచ్చాడని" అని పలికెను.

చండాలు రంతట జందనదాసవధ నాపిరి. వారిలో నొకడు రాక్షసమంత్రిని వెంటగొని చాణక్యగేహమున కేగెను. చాణక్యుడును మేనినిండ దుప్పటముగప్పికొని సగముతలుపు దెఱచి, మొగముమాత్రము గాన్పించు, చండాలునితో, "ఏమిరా! గాలిని పగ్గాలతో కట్టి రాళ్లనునీటిలో తేల్చి, సముద్రాన్ని చేయీతయాదనవా రెవ్వరురా! చెప్పు" అని యడిగెను. చండాలుడు "దేవరవారుకాక మఱియెవ్వ" రనెను. చాణక్యుడు నవ్వి, "కాదురా! కాదు. సంపకులద్వేషియైన దైవం యింతపనిచేసిందికాని నేనెవ్వడ" ననుచుండ రాక్షసమంత్రి యాతని నిరహంకృతిని వినయమును లోలోన మెచ్చుకొని "చాణక్యుడింతటిమహాత్ముడని యిన్నాళ్లూ మాత్సర్యంచేత తెలుసుకోలేకపోయినాను" అనుకొనుచుండెను.

చాణక్యు డంతట రాక్షసుని సమీపించి, ముసుగుదీసివైచి "రాక్షసామాత్యా! విష్ణుగుప్తుడు నమస్కరిస్తున్నాడు. మౌర్యునిసేనలను, నాబుద్ధినికూడా ఇంతఆయాసపెట్టిన నీమతి ప్రభావానికి జోహారు చేస్తున్నా" ననెను.

తన్ను 'అమాత్యా'యని సంబోధించినందులకు సిగ్గుపడుచు రాక్షసుడు "విష్ణుగుప్త! నేను చండాలస్పర్శదూషితుణ్ణి, నన్ను నీవంటిబ్రాహ్మణుడు తాకరా"దనెను. చాణక్యు డామాటలకు చిఱునగవుదోప, "వీరు చండాలురుకారు- ఈతడు మనమిత్రుడు సిద్ధార్థకుడు. రెండవయాతడు సమిద్ధార్థకుడు. ఇక నీ సందేహాలు విడువుము. పాపం! శకటదాసు నిర్దోషి. అత డాకమ్మవ్రాయలేదు.

ఆలేఖయు, నగలమ్ముటయు, నీముద్రికయు, సర్వమూ నేనే కల్పించితిని. చంద్రగుప్తునకు, నీకూ ఎలాగైనా సంధిచేసి, ఆతనిరాజ్యభారం నీకు వప్పగించాలని ఇన్నికపటములు చేశాను. నీమతిప్రభావం నాచేత ఇన్నితంత్రములు చేయించింది. గతమంతా నువ్వు మఱచిపోయి, వృషలుణ్ణి అనుగ్రహించవలసిందని నాప్రార్థన" అని పలుకుచుండ జంద్రగుప్తుడు సపరివారముగా నేతెంచి "ఆర్యా! చంద్రగుప్తుడు నమస్కరిస్తున్నా"డని రాక్షసునకు మ్రొక్కెను. రాక్షసామాత్యు డాతని వినీతికి సంతసించి, "మొన్నటిదాఁకపిల్లవాడు, ఇంతలో ఎంతటివాడయ్యెనో! గజయూథపతివలె ముచ్చటగొల్పుచున్నా" డనుకొని "విజయోస్తు" అని దీవించెను. "గురువృద్ధులైన మీయిద్దఱిఅనుగ్రహంవుంటే మాకు విజయానికేమికొఱవ" అను చంద్రగుప్తునిగాంచి, రాక్షసుడు దనలో "నన్నితడు భృత్యుణ్ణి చేసుకోవాలని చూస్తున్నాడు. ఇంతటివినీతుడు అదృష్టవంతుడూ దొరకుటచే చాణక్యుని ప్రజ్ఞ రాణించినది" అని సంతసించుచుండెను. చాణక్యుడు "రాక్షసామాత్యా! ఇదిగో! అమాత్యఖడ్గము. చందనదాసుని చావో బ్రతుకో నిశ్చయించు"మని కత్తి అందిచ్చెను. రాక్షసుడు విష్ణుగుప్తుడు ధరించినఅమాత్యఖడ్గం ధరించటానికి మేముతగము" అనియెను.

చాణక్యుడు "నీవు తగుదువో, లేదో, ఇదిగో నిరూ, మేతా వుడిగి, జీనులూ కళ్లేలూ తీయని ఈగుఱ్ఱాలూ. అందలాలు దింపకపోవడంచేత నడుములు పుండ్లయి ఈయేనుగులూ చెప్పుతున్నవి, నీబుద్ధిపౌరుషాలను. ఇక సందేహింపక ఈశస్త్రం ధరించి చందనదాసుని రక్షించుకో. మౌర్యుణ్ణి అనుగ్రహించు" అనెను. రాక్షసుడు "సర్వప్రవృత్తిమూలకమైన మిత్రస్నేహానికి దాసుణ్ణి" అని అమాత్యఖడ్గ మందుకొనినంతటనే చాణక్యుడు "వృషలా! వృషలా! రాక్షసమంత్రి నిన్ననుగ్రహించాడు. నీవుధన్యుడ"వని అభినందించెను. ఇంతలో నొక పురుషుడు ప్రవేశించి "భద్రభటాదులు మలయకేతువును కట్టితెచ్చారు. దేవరదర్శనం కోరుతున్నా"రని చాణక్యునకు విన్నవింప, నాతడు "అదిగో రాక్షసామాత్యులు. వారికివిన్నవించు, వారిచిత్త"మని చూపెను. చాణక్యునిగరువతనము

నకు రాక్షసుడు ముగ్ధుడై, చంద్రగుప్తునితో "రాజా ! ఈమలయకేతువునొద్ద మేము కొన్నాళ్లు భృత్యులముగా వున్నాము. ఆతని రక్షించవలసిన"దని విన్నవించెను. చాణక్యు డంతట "అమాత్యులవారు మలయకేతువును రక్షింపుడని విన్నవించారుగనుక మహారాజు 'మలయకేతువు నాతని తండ్రి రాజ్యమున ప్రతిష్ఠించిరం'డని భద్రభటాదుల కాజ్ఞయిస్తున్నారు" అని పలికెను. "దేవర చిత్తం"మని వాడవగుచుండ చాణక్యుడు వానిని వెనుకకు పిలిచి "రాక్షసామాత్యులవారు తమకు లభించిన యీసంతోషసమయాన మహారాజులుంగారు చందనదాసశ్రేష్ఠికి సర్వనగరశ్రేష్ఠిపదం అనుగ్రహించినారు. గజాశ్వములు తప్ప తక్కిన ఆతనిసంపద ఆతనికిచ్చివేయుడని దుర్గపాలునితో చెప్పు, శకటదాసుడు కాయస్థాగ్రణీపదవి మిచ్చారనికూడా చెప్పు" అని యాజ్ఞాపించి. "ఇంతేను, రాక్షసామాత్యులుండగా నాకింకా ఈగొడవయెందుకు? నాజుట్టు ముడివేసుకు నిశ్చింతగా కూర్చుంటాను" అని నవ్వుచు పలికెను. చంద్రగుప్తుడును 'కౌముదీమహోత్సవం ఆజ్ఞాపించడానికి నాకిక ప్రతిబంధకం లేదుగదా" యని నవ్వెను. రాక్షసామాత్యుడు "చంద్రగుప్తమహారాజునకు జయము" అని పలుక జయధ్వానములు మిన్నుముట్టెను.

---

## 29

## దిగ్విజయము

రాక్షసామాత్యలాభముచే జంద్రగుప్తు డిట్లు మగధరాజ్యమున సుస్థిరు డైనయనంతర మొకనాడు చాణక్యుడుమహారాజుతో ప్రసంగించుచు నిట్లు పలికెను. "ఆర్యధర్మానికి హానికల్పించడంవల్ల నందులు వధ్యులైనారే కాని వారియెడల నాకేమీపగలేదు. వారిని నాశనంచేయడంవల్ల నాకు హానిగింది లేదు. ఆర్యధర్మానికి అవలంబనమాత్రం లభించింది. వినయము, వృద్ధసేవ, ధర్మాభిరతీ నీవు ఆబాల్యాభ్యస్తములుగనుక నీవలన మగధరాజ్యం ధర్మప్రతిష్ఠిత

మైనది. కాని భారతక్షోణి నాల్గుచెఱగులా సుస్థిరఆర్యధర్మాన్ని ప్రతిష్ఠించవలసింకామిగిలివుంది. ఆమహాకార్యానికి సేవిక పూనుకోవాలి. అప్పుడుగాని మన సంకల్పం సిద్ధించదు. అంతర్బహిశ్శత్రువులను రూపుమాపి రాజ్యం నిష్కంటకం చేసుకొన్నాము. ప్రకృతివర్గం సీయందు అనురక్తమైవుంది. కోశం సమృద్ధమైవుంది. ఆఱులక్షల కాల్బలముతో, ముప్పదివేలగుఱ్ఱపుదళముతో, ఆఱ్వేలరథములతో, తొమ్మిదివేలయేనుగులతో సేనాంగము బలిసియున్నది. దండనాథ చంద్రాదివ్యూహ రచనలయందారితేరి, భక్తివిశ్వాసములతో గొలుస్తూవున్న మనసేనలను ఎవ్వరూఎదిరింపలేరు. కాబట్టి ఆర్యధర్మస్థాపనార్థం మనం దిగ్విజయంచేయడం యుక్తం. ఆలీసాందనువలె అర్థలోభంచేతా, కీర్తికాంక్షచేతా కాదు, కేవల ధర్మస్థాపనంకొఱకే సుస్థిరదిగ్విజయంచేసి మళ్లా భరతుడివలె ఏకకర్తవుకావడం నాకభీష్టం". చంద్రగుప్తుడు "మహాప్రసాదం. ఇది నాకును ఇష్టమే" అని విన్నవించి, మంత్రిసామంతాదులతో నాలోచించి మిత్రఘోషములును ధర్మాలవాలములునైన ఆంధ్ర చోళ పాండ్య కేరళ కళింగ సింహళ సత్యపుత్ర దేశములుగాక తక్కినదేశముపై దైత్రయాత్ర నిశ్చయించెను.

పిమ్మట దైవజ్ఞులునిర్ణయించిన శుభముహూర్తమున చంద్రగుప్తమహారాజు ఇష్టదైవతములఁ బూజించి బ్రాహ్మణాశీర్వాదము లందుకొని ప్రయాణభేరి చరపించెను. పౌరాంగనానికరంబును లొసఁగునీరాజనములు గైకొనుచు మహారాజు చాణక్యసమేతముగా రాణులతోగూడి పశ్చిమాభిముఖుఁడుగా బయలుదేరెను. కాశీప్రయాగ రాధాపురములందు బ్రజలొసంగుకానుకలందుకొనుచు కతిపయప్రయాణముల గౌశాంబీనగరము చేరెను.

కౌశాంబీపతి యగువత్సరాజుకూతురు దుర్ధర గుణవతియు రూపవతియునని చాణక్యుఁ డంతకుమున్న వినియుండెను. శాంతవతీదేవి అనపత్యయైన కారణమున చంద్రగుప్తునకు మరల వివాహమొనర్పవలయునని యాతఁడనురూపకన్యాన్వేషణ మొనర్చుచున్నవాడు గావున దుర్ధర సర్వవిధముల మహారాజు

వతః వరించరియని నిశ్చయించెను. శాంతవతీదేవియు సంతసమున్న మహా రాజును "మీరు సామాన్యగృహస్థులవంటివారు కారు; మహారాజులు. సామ్రాజ్యక్షేమమునకై మరల వివాహితులై మగధరాజ్యభారము వహించ దగినకుమారుని బడయవలెను. పుత్రపూర్ణాంకనై మిమ్ము సంతోషపెట్టేభాగ్యం నేను నోచలేదు. పుత్రునికొఱకు నాహృదయం పరితపిస్తున్నది. కాబట్టి మీరు వివాహంచేసుకొని, సంతతిగని నాకోర్కె తీర్చండి. నామీదిప్రేమకొద్దీ మీరిట్లా పుత్రహీనులై సామ్రాజ్యాన్ని సంశయావస్థలో దింపకండి. మీరు మళ్లాపెండ్లిచేసుకుంటే నేను అసూయచెందుతానని సంశయం మీకు తగదు. మీకు నాహృదయం ఎఱుగుదురు. మీకుమారుణ్ణి నాబిడ్డగాయెంచుకొంటాను. మీరు వెంటనే పెండ్లిచేసుకొని నాముద్దుచెల్లించండి" అని యనేకవిధముల ప్రతిమాలి ద్వితీయవివాహమునకు సుముఖుని గావించియుండెను. మఱియు ఉదయనమహారాజవంశ్యు డగువత్సరాజుకూతురు సర్వవిధముల దనకుదగినకన్య యనికూడ చంద్రగుప్తుడు సమ్మతించెను. వత్సరాజగు ఉదయనుడు తొల్లి మగధ రాజకన్యయగు పద్మావతిని బరిణయమయ్యెగావున నీయుభయవంశములకు సంబంధము క్రొత్తగాదని చాణక్యుడెఱిగించి కౌశాంబేశుని సమ్మతింపజేసెను. పశ్చిమదిగ్యాత్ర ముగిసినపిమ్మట వివాహోత్సవము నెఱపుటకు నిశ్చయించి, చంద్రగుప్తుడు ససైన్యముగా నటనుండి గదలి హస్తినాపురమును, ఇంద్ర ప్రస్థమును గడచి, యమునాపరంగిఱిబాటి వితస్తాతీరమున నున్న అలిసాందరు గిరి కరిగెను.

వితస్తాయమునామధ్యదేశస్థులగు రాజులెల్లరు మలయకేతు పురస్కృ తులై యటకరుగుదెంచి చంద్రగుప్తసార్వభౌముని దర్శించి కానుకలర్పించిరి. చాణక్యు డచట నాలీసాందరు నాటెన జయస్తంభమును భగ్నముచేయించి, అగిరికి రాజగిరియని పేరుపెట్టెను. యవనవిజయచిహ్నములు భారతభూమిలో నెచ్చటను కానరాకుండ ధ్వంసమొనర్పుడని యెల్లరకు నాజ్ఞాపించెను. అట నుండి సౌభూతిరాజధానికరిగి, యటనుండి సంగలాపురికేగి యచట గాథేయుల

పొసగిన కాన్కలందికొని వారు మలయకేతురాజధానియగు వితస్తానగరి కరిగిరి. భర్తృమరణదుఃఖితయగు స్వర్ణమయీదేవి అప్పటికి రెండునెలల క్రిందటనే మరణించెనని చాణక్యచంద్రగుప్తులు విని, వాత్సల్యమయి యగు నాదేవికి తామొనర్చినయపకృతికి వగచి, ఆమార్గమున జంద్రగుప్తుని బంధనాగారముం గాంచి నవ్వుకొని, కొన్నాళ్లచట మలయకేతునిప్రాజ లాదికొనుచు నిలిచిరి.

అనంతర మాసేనలు వితస్తనుదాటి తక్షశిలానగరముపై నెత్తివచ్చెను. తక్షశిలాపతియగు నంభియు సంధిగోరి రాయబారుల నంపెను. "తక్షశిలానగరమును మాకర్పించి, సామంతుడవై తక్కినరాజ్యమేలుకొ"మ్మని చాణక్యుడు వర్తమానమంపెను. అంభి యందులకంగీకరింపక యవనసేనాని యగు ఉద్దాముని సాయమున జంద్రగుప్తుని బ్రతిఘటించుటకు నిశ్చయించెను. అంతకుమున్నె మలయకేతునకోడి నృపఘాలనికాయనగరములనుండి పారిపోయిన యవను లెల్లరు నంభికి బాసటయైరి. "మౌర్యసేనలకు దుర్గాలముట్టడించే నేర్పుచాలదు. కనుక మనకు వచ్చినభయం లేదు. ఈతక్షశిలాదుర్గం ఎన్నియేండ్లముట్టడినైనా ఓర్చగలదు" అని యుద్దామసేనాని అంభికి ధైర్యముగఱపెను.

సుశిక్షితమగు నరువదివేలసేనతో సర్వసంభారసంపన్నమై దుర్భేద్యమైన తక్షశిలాదుర్గమును సాధింపదగిన పరికరములు తమయొద్దలేమి చాణక్యచంద్రగుప్తులు తలపోసి దీర్ఘకాలపుముట్టడియే సాధనమని నిశ్చయించిరి. వేయియేనుగులతో లక్షసేనతో బలగుప్తుని తక్షశిలాదుర్గమును ముట్టడించుటకు బంపించి, తక్కినసేనలతో వారు గాశ్మీరమునకేగిరి. కాశ్మీరపతియు, అభిసారార్శ్మకేశులును చంద్రగుప్తునకు కప్పములుగట్టుట కంగీకరించి తత్సార్వభౌమత్వమునకు దలలొగ్గిరి.

భూలోకనందనమని పేరుగన్న కాశ్మీరదేశసౌభాగ్యము నవలోకింపుచు చాణక్యచంద్రగుప్తులు అగధరమణీయములగు కొండలోయలగుండా ప్రయా-

ణములొనర్చి హిమచ్ఛన్నమగు శేషనాగనదిని దాటి అమరనాథక్షేత్రమునకు జనిరి.

ప్రశాంతసుందరమగు నాక్షేత్రమున చంద్రగుప్తు డమరనాథేశ్వరుని బూజించి, యేకాంతరమణీయమగు నా ప్రదేశమున భగవత్కైంకర్యమొనర్చుచు నిశ్చింతమై కాలముగడుపు నిరాచారుల గాంచి, చాణక్యునితో "ఆర్యా! హింసా కళంకితమైన ఈశస్త్రజీవనం ఇంతటచాలించి ఈపావనక్షేత్రంలో ఈశ్వరుని సేవించుకొంటూ వుండవలెనని నాకు కోరిక కలుగుతున్నది" అనెను. చాణక్యు డామాటల కించుక నవ్వి, "వెఱ్ఱివాడా! క్షత్రియధర్మం మఱచి విషాద మోహంలో పడుతున్నావు. ప్రజాక్షేమం కోసం, సామ్రాజ్యరక్షణంకోసం నువ్వు పని చేయక తప్పదు. శిష్టరక్షణ దుష్టశిక్షణములు నీధర్మం. దానికొఱకు నువ్వు కర్మాచరణం చేయకతప్పదు. శత్రువులవల్ల స్వప్రజను, బలవంతులగు దుష్టులవల్ల బలహీను లగుసాధులకు పీడగలుగుతూవుంటే రాజైనవాడికి మన శ్శాంతి యెలాలభిస్తుంది? కాబట్టి అధిపుడవు కాక నీధర్మం నువ్వు నెరవేర్చు" అని బోధించెను.

పిమ్మట సేనలతోగూడ వారు బనిహాలకనుమలగుండా పాంచాలముం జొచ్చిరి. చాణక్యు డాకనుమలకు గాశ్మీరద్వారమని నామకరణ మొనర్చెను. అటనుండి సింహపురమునకరిగి యచట విజయసింహుని సత్కారములందుచు నొకవారము విశ్రమించిరి. అటనుండి పాటలమునకేగి శైబ్యమాళవక్షుద్రకు లొసగుకప్పములు గైకొనిరి. సింధుప్రాంతములను ఉత్తరాపథరాజ్యమున జేర్చి, పాటల బ్రహ్మస్థలమాలవకోటదుర్గములను బలిష్ఠములొనర్చి వానిరక్షణమునకు సరిపడినసేనల నందు నిలిపిరి.

పిమ్మట వారు సింధుపూర్వతీరము వెంట జని కచ్ఛభూమిం జొచ్చిరి. మేఘనాదసుతుడగు ఆరాసకుడు కప్పముగానొసగిన సేనల గైకొని వానిని తద్రాజ్యమున బ్రతిష్ఠించి, మేఘనాదవిజితమగు సౌరాష్ట్రమునకు రాజవైశ్య

పుష్యగుప్తు నధిపతి నొనర్చెను. పుష్యగుప్తుడు పదిలక్షలపణములు వెచ్చించి సుదర్శనమనుసరస్సు నిర్మించుచుండెను. క్షామపీడితమగు సౌరాష్ట్రమున కాతడొనర్చుచున్న యీ మేలునకు చంద్రగుప్తసార్వభౌముడు హర్షించి, తత్సరోనిర్మితికై తానుకూడా బదిలక్షలపణములు దానమొసంగెను.

పిమ్మట సార్వభౌముడు సేనలతో నుజ్జయినిపైనెత్తి చని దాని నవలీల నిర్జించెను. భోగరాయుడు నచట దన ప్రతినిధిగా నిలిపి, యమునా నర్మదా శతద్రూకచ్ఛ మధ్యదేశములు, సౌరాష్ట్ర సింహపురములను ఆవనిపరిశీలనమున జేర్చి, ఆమహామండలమునకు వేదిశగిరి నుపరాజధాని నొనర్చెను. లోహితాక్షుని మాళవదేశమున కధినాథుని గావించి యాతడు గప్పము వెట్టిన మాళవసైనికదళమును గ్రహించెను.

దక్షిణాపథపాలకులగు కుంతల కోశ కదంబ కొంకణ గాంగవదుక మహారాష్ట్ర యరండపలీపతు లంపిన రాయబారులు సార్వభౌము నుజ్జయినీనగరమున దర్శించి కప్పములు సమర్పించిరి. చంద్రగుప్తుడు వానిని గ్రహించి, కుండినపుర నందవేర నాసికావిజయదుర్గములను రక్షించుటకై తనసేనలనంపెను. ఆంధ్రసార్వభౌముడగు సత్యశ్రీశాతకర్ణి మగధసామ్రాట్టును, దర్శింప నుజ్జయిని కేతెంచి, ఆంధ్రమగధసామ్రాజ్యములు పరస్పరస్నేహముమై మెలగుట ఉభయమునకు క్షేమమని తనయాశయ మెఱింగించెను. ధర్మరక్షకుడగు నంధ్రేశుని చంద్రగుప్తుడు సస్నేహముగా నాలింగనమొనర్చుకొని "మన ఉభయరాజ్యములున్నూ, జంబూద్వీపంలో దుర్భిక్షానికి, అజ్ఞానానికీ, అధర్మానికీ నిలువనీడ లేకుండా చేయాలి. చాణక్యులవారి ఉపదేశములే మనకు పరమప్రమాణము" లని నుడివి సత్కారపూర్వకముగా వీడుకొలిపెను.

పిమ్మట చాణక్యసహితుడై మహాకాళనాథుని సేవించి, తదాలయకుడ్యమున చెక్కబడియున్న కాలచక్రము గాంచి, తత్ప్రభావమును చాణక్యునిచే వినెను. అనంతరమున నర్మద కేగి, శుక్లతీర్థమున గ్రుంకులిడి, ప్రశాంతపావన

మగు నాక్షేత్రమున దుర్ధరాదేవితో వసించుకోర్కెమై నచట ప్రాసాదమొండు, నిర్మింపజేసెను. తదుపరి తపతీతీరమున సూరత్తును వశీకరించి, యటనుండి మరలి కౌశాంబికరుదెంచెను. సింహబలపురుషదత్తడింగరాతులను దక్షిణదిగ్విజయమునకై సేనలతో నంపి సార్వభౌముడు కౌశాంబీనగరమున నిలిచెను.

అట ప్రవర్తిల్లిన దుర్ధరాచంద్రగుప్తులవివాహమహోత్సవమునకునాంధ్ర కళింగభూపతులు నెయ్యముమై గట్నములు దెచ్చిరి. తక్కినరాజచక్రమును సామంతమండలేశ్వరులును గానుకలతో నరుదెంచిరి. నేపాళపతియు, ముంజపత్పతియు, కార్తికపురాధీశ్వరుడును కప్పములొసగి మౌర్యసార్వభౌమశాసనము శిరసావహించిరి. పాటలీపుత్రమునుండి గౌతమీదేవియు నావేడ్కగనులారగాంచుకోర్కెమై నరుదెంచెను. శచీదేవేంద్రులవివాహముమాడ్కి నతి వైభవముగా ప్రవర్తిల్లిన ఆవివాహమున నందరికోర్కెలు నిండారెను.

వివాహోత్సవములు ముగిసినపిదప సార్వభౌము డతిథులనందరిని సత్కరించి వీడ్కొలిపి, దుర్ధరాదేవితో, గౌతమీచాణక్యులతో, కతిపయపరివారముతో నరిగి నర్మదాతీరప్రాసాదమున నాల్గునెల లభీష్టభోగము లనుభవించుచు గడపెను. ఇంతలో దుర్ధరాదేవికి నెలమసలిన శుభవార్త గౌతమిచే చాణక్యుడు విని, దేవీగర్భరక్షణమునకు వలయునేర్పాటులు గావించి, ఆమెకు ప్రొద్దుపుచ్చుటకు నెన్నియోవినోదములు గల్పించెను. భారతరామాయణ గాథలచే దేవికి కాలక్షేప మొనగూర్చెను!

పిమ్మట వారెల్లరు పాటలీపుత్రమున కరుదెంచిరి. మౌర్యవంశాంకురమును గర్భమునదాల్చివచ్చిన మహారాజ్ఞికి పాటలీపుత్రనగరలక్ష్మి ఎదురుచని మంగళవాద్యములతో హర్షధ్వానములతో నగరిలోనికి దోడ్కొనిచనెను. పిమ్మటనొకసుముహూర్తమున దుర్ధరాదేవి కుమారుని గనెను. కుమారోదయ మహోత్సవమున సార్వభౌముడు వెలలేని దానధర్మములొనర్చె. సామ్రాజ్యమంతట మూడుదినములు పండుగ కనుజ్ఞయొసగెను. సర్వలక్షణసంపన్నుడగు

నామమాత్రునకు జ్యేష్ఠుడు బిందుసారుడని నామకరణమొనర్చెను. బిందుసారుడు జనించిననాడే ప్రద్యుగుప్తునకుగూడ కుమారుడుదయింప, నాతడు మహారాజానుమతమ్మున నబ్బాలునకు చంద్రగుప్తుడని పేరిడికొనెను.

ఇంతలో మగధసేనలు మహారాష్ట్రదేవరాష్ట్రకొంకణకుంతలమహిష మండలములను జయించిన శుభవార్తయు వరుపెంచెను. సార్వభౌము డారాష్ట్రములకెల్ల సువర్ణగిరి రాజధానిగా నచట పురుషదత్తుని దనకు ప్రతినిధిగా నియమించెను. మోహూరపాలకుడగు ద్రావిడపతియొకడు మౌర్యసైన్యముల నెదిర్చి యపజయమును బొందెనని విని సింహబలప్రముఖకళింగరాజులు మహాసైన్యముతో నాతని వెన్నంటి తరిమిరి. మోహూరపాలకు డంతట దుర్భేద్యము లగు కొండదారులం జొచ్చి పొదిలిమలల నాశ్రయించెను. చంద్రభానుడు సువర్ణనేములగు రథములతో నాపర్వతముల నాక్రమించినంత నాద్రావిడపతి శరణుసొచ్చెను. ఇంతలో పొదిలికొండలు దాటిపోవలదనియు, దక్షిణాపథ పాలకులందఱు ఓడలపై మగధకు గానుకలంపిరనియు చంద్రగుప్తుడు వనసేనానులకు తెలిపెను. మగధరాజ్యమునకు కన్యాకుమారినే దక్షిణపుటెల్లయొనర్చ నువ్విళులూరుచున్న సింహబలుడంతట నుస్సురని నిట్టూర్చుచు పొదిలిమలల నుండి తనసేనల మరల్చెను.

బలగుప్తుడు తక్షశిలానగరమును ముట్టడించుటకు మొదలిడి అప్పటికి రెండేండ్లాయెను. కోటలో నానాట దినుబండములు కఱవైపోవుచుండెను. పౌరు లలజడిచెంది ఆక్షేపులగుచుండిరి. దుర్గరక్షణమున యవనసేనలతో జోక్యపడుచున్న ఉద్దామునకుగూడ నస్థైర్యముదోచెను. ఆవల ఏషియామైనరులో నలకసుందరుని సేనానులు మత్సరగ్రస్తులై ఒకరినొకరు చంపుకొను చుండిరి. ఉద్దాముని కథిపతియగు యామునేశుడు క్రీ. పూ. 321 లో కర్తరేశుని సంహరించి గ్రీకుసేనాధిపతి యయ్యెను. కర్తరేశపుత్రుడగు పైథాను పంతట తులమాపిన యాష్పశల్యకేశులతో ఆంటిగోనసుకు బాసటయై యూమ

శత్రువుల జయింప యత్నించుచుండెను. చంద్రసేనుడు, గజబలముతో వచ్చు పర్వతకనిష్ఠుని యుద్దామునకు గబురు పంపుచుండెను. తక్షశిలను ముట్టడించిన మగధసేనలో వేయిగజములున్నవిగాన సుద్దాము తనగజబలము నెట్లయిన రక్షించుకొనవలయునని యెంచి కోటవెడలి మగధసేనలపై పోయిపడెను. మాగధు లాతని బరాజితునొనర్చి పరల గోటలోనికి దరిమిరి. ఉద్దాము డంతట సిరి పనికాదని యెంచి, పర్వతకకనిష్ఠునికడ గజబలమున్నదని వినియున్నవాడు గావున నాతని నెట్లయిన మోసగించి కిరీటముల హరింపనెంచెను. పర్వతకకనిష్ఠుడు మలయకేతునిపై పగబూనియుండెను. "నీవు నీగజబలముతో ఉపబంధపురము నకు రమ్ము. నేను నాసేనలతో సిన్నచటికి జేరవచ్చెదను. మనమిద్దరముకలిసి మలయకేతువును వెనుకనుండి ఆక్రమించి ఓడించవచ్చును. అపుడు బలగుప్తుడు తక్షశిలముట్టడివదలి మలయకేతువును రక్షింపవస్తాడు. ఈవిధంగా తక్షశిల రక్షింపబడుతుంది. నీకు మలయకేతువు రాజ్యమూ దక్కుతుంది" అనియుద్దాముడు పర్వతకకనిష్ఠునకు వార్త పంపించెను. వాడామాటనమ్మి గజబలముతో నుపబంధపురము చేరవచ్చెను. ఉద్దాము డంభితో "నేను మలయకేతువును వెనుకనుండి ఆక్రమించుతాను. బలగుప్తు డాతనిరక్షణార్థం వెళ్లగల" డనిచెప్పి నమ్మించి, రెండువేలయాశ్వికులతో మూడువేలకాల్బలముతో, నూటయిరువది యేనుగులతో రహస్యమార్గమున తక్షశిలవిడచి ఉపబంధపురి కేగెను. అచట పర్వతకకనిష్ఠు నొంటిమై దనబసకు రావించి, వానినిసంహరించెను. ఆతనిసైన్య ముల నంతట చెల్లాచెదరొనరించి, వానిగజబలమును, కోటిసువర్ణములను గైకొని తనసేనలతో సుద్దాముడు యామునేశునిగూడ చేరెను. అచట గ్రీకుసేనాను లకు బరస్పరము ప్రవర్తిల్లినరణమున సుద్దామునితోగూడ యామునేశుడు మరణించెను.

ఇచట దక్షశిలలో సుద్దాముని ద్రోహమును పర్వతకకనిష్ఠునిమరణమును పౌరులు విని, దుర్గరక్షణ మిక శక్యముగాదని నిశ్చయించి, కోటతలుపులుదెరచి మగధసేనలకు ప్రవేశమునొసగిరి. ఆంభి చేయునదిలేక కోటబురుజులపైనుండి

క్రిందికి దుమికి మరణించెను. బలగుప్తుడును సేనలతో దక్షశిలానగరమున బ్రవేశించి, అంభికి, సర్వగౌరవముతో నుత్తరక్రియలు జరిపించి, అనపత్యుడగు నాతనిరాజ్యమును మగధసామ్రాజ్యమున జేర్చెను.

పిమ్మట బలగుప్తు డచటనుండి బయలుదేరి సింధునదమును దాటి, పుష్కలావతియందున్న గ్రీకులను పారద్రోలి, ఆనగరమును గూడ నాక్రమించెను. చంద్రగుప్తసార్వభౌముడు బలగుప్తునివిజయపరంపరకు మెచ్చి అతని తక్షశిలానగరమున దనకు బ్రతినిధిగా నియమించి, శతద్రూనదికి పశ్చిమమునను, కచ్ఛదేశమునకు ఉత్తరమునను గలరాజ్యమున కాతని నధిపతి గావించెను. పాంచాల కాశ్మీరాదిప్రాంతములెల్ల బలగుప్తునిపాలనమున జేర్చెను. బలగుప్తుడు కేవల మౌర్యసేనానియేకాక రాజవంశ్యుడగుటచే మలయకేతుడును, పర్వతకనిష్ఠుని పుత్రుడును, కాశ్మీరసింధుపతులును అభిమాన ముజ్జగించి అతనియేలుబడికి దల లొగ్గిరి. పిమ్మట చంద్రగుప్తసార్వభౌముడు చాణక్యోపదేశమున దనప్రతినిధుల కెల్లరకు నిట్టు లాజ్ఞ యొసగెను. "మాసామ్రాజ్యంలో క్రొత్తగా చేరినరాష్ట్రములలో ప్రజలను పరులనియెంచక ఆత్మీయులుగానెంచి పాలింపుడు. వారియెడ నెట్టి అవజ్ఞయు జరుగగూడదు. వారి ధనమానప్రాణములకు, ఆచారములకు, ధర్మములకు ఎట్టిహానియు జరుగగూడదు. ఇది మా ఆన. దీనికి తప్పినవారు దండ్యులు."

సార్వభౌముని ఈయాన సామ్రాజ్యమంతట బ్రకటితమగుడు బ్రజ లెల్లరు పరమహర్షమున మగధసామ్రాట్టునెడ అనురక్తులైరి. చంద్రగుప్తుడు సింహాసనమధిష్ఠించిన పదియేండ్లకు సామ్రాజ్యమంతట నాతనియాజ్ఞ సమస్త ప్రజలును బువ్వుదండవోలె దలలు దాల్చిరి. పుష్కలావతినుండి తామ్రలిప్తపట్టణమును, కాశ్మీరమునుండి పొదిలిమలలపర్యంతమును మగధసామ్రాజ్యము సుస్థిరమై నెలకొనెను.

---

# 30

## "విజేత జితుడైనాడు"

అలీసాందరు ననంతరమున దత్సేనానులకు బరస్పరము ప్రవర్తిల్లిన యుద్ధములలోనెల్ల నప్పటప్పటికి పైచేయియగుచుండినపక్షము నాశ్రయించుచు వచ్చినశల్యుకుడు క్రీ. పూ. 306 నాటికి సిరియాకు దూర్పున సింధు నదముదనుక వ్యాపించియున్న బాక్ట్రియా, గెడ్రోసియా మున్నగు రాష్ట్రముల కధినాథుడాయెను. సింధుశతద్రూనదములకు బశ్చిమదిక్కున దొల్లి అలీసాందరు జయించిన పాంచాలాదిదేశములను జంద్రగుప్తు డాక్రమించెను గావున దిరిగి వానినెల్ల జయించి తాను చక్రవర్తి కావలయుననుఆశ శల్యుకుని బ్రేరేచ దొడగెను.

ఆనాడు వృషఘాలనగరమున నలకసుందరుని ధిక్కరించి చెరనుండి తప్పించుకొనియేగిన పడుచువాడు, ఆనల్లబాపనిసాయమున మగధచక్రవర్తియై, భారతభూమినంతటిని వశీకరించెనన్నవార్తలు బాబిలోనియాలో నుండగనే శల్యుకునిచెవి సోకెను. మహావీరుడనుకొన్న పర్వతేశ్వరునంతటివాడు చాణక్య తంత్రమున హతుడగుటయు, దక్షశిలేశుడగు నంభి కూడ పరాజితుడై ఆత్మ హననమున కొడిగట్టుటయు, జంద్రగుప్తునిరాజ్యము నిష్కంటకమగుటయు శల్యుకుడు వినెను. ఈనల్లబాపని, రాచగున్నను నిర్జింపలేకపోదునా యనుధైర్య మూతగా శల్యుకుడు క్రీ. పూ. 305 యేట బాక్ట్రియానుండి చంద్ర గుప్తున కిట్లు సందేశమంపెను. "తొల్లి అలీసాందరు జయించిన రాజ్యభాగ మంతా మాకువదలి, తక్కిన భారతభూమిని మీరు మాకుసామంతులై యేలుకో వచ్చును. మాకు ఏటేట కోటిసువర్ణములు గప్పము చెల్లించుచుండవలెను. ఇందుకు సమ్మతించకపోతే యుద్ధానికి సిద్ధంకావలెను."

చాణక్యునితో నాలోచించి చంద్రగుప్తుడు శల్యకున కిట్లు బదులంపెను.

"బాబిలోనియా ప్రభువులగు శల్యకేశ్వరులకు, మగధసార్వభౌములగు చంద్రగుప్తులవారు, ఉభయకుశలానంతరం వ్రాయించిన వయినం.

మీరాజ్యానికి మేముగాని మారాజ్యానికి మీరుగాని ఆశించవలసిన ఆగత్యం ఎంతమాత్రము కనిపించదు. స్వతంత్రులగు ప్రభువు లొకరికొకరు కష్టంగల్పించేఆచారం ఇంతకుముందు మేము విన్నది కాదు. శల్యకేశ్వరులు తమ రాజ్యం తాము ఏలుకొంటూ వుండేపక్షంలో వారికి మావల్ల ఎట్టితొందరలూ కలగవు. అట్లుగాక తాము తొందరపడతారా, వెనుకంటికి భారతభూమిపై ఎత్తివచ్చిన అలెక్సాందరులవారు, తమవెంట కొనితెచ్చినసేనలతో మూడుపాళ్ళిచట కాకులకు గ్రద్దలకు బలిచేసి మరలిపోవుట శల్యకేశ్వరు లెరుగనివారు కారు. ఎరిగివుండీ భారతభూమిపై అడుగుపెట్టుతారా, మాఖడ్గములకు ఎఱ కాగా మిగిలినవారిని చక్కబెట్టడానికి ఇచట నక్కలు, రాబందులు సిద్ధంగా వున్నవని తెలుపుకొంటున్నాము." 'జగజ్జేతయైన అలెసాందరు సేనానులలో నతిరథశ్రేష్ఠుడని పేరంది, పర్వతేశ్వరునంతవానిని జయించిన మమ్ము, మున్ను మాచే చెరపట్టబడిన యీక్షుద్రబాలకు డిట్లు అవమానించునా' యని శల్యకేశ్వరుడు మండిపడెను. వెంటనే నూరువేల గ్రీకులను, నూటయేబదివేలకు శకపారసీకాదులను సమకూర్చుకొని, 'మగధపై నెత్తిచని అలెసాందరు సాధింపజాలని పాటలీపుత్రమును గూడ సాధించి ఈమూర్ఖబాలునకు బుద్ధిగఱపుదు" నని శీఘ్రప్రయాణము లొనర్చి కతిపయదినములకు పరాపమిశ్రము వచ్చిచేరెను. అటనుండి అభిసారార్మ కేశపుష్కరదత్తములయకేతులతో రహస్యముగా రాయబారములు సాగించెను. అభిసారాదులు శల్యకునియవివేకమునకు లోలోన నవ్వుకొని, అతనికి సర్వవిధముల దోడ్పడుదుమని చెప్పి, ఎప్పటివర్తమాన మప్పుడె ఆర్యచాణక్యులకు దెలుపుచుండిరి. చంద్రగుప్తచాణక్యులు సమరతంత్రమంతయు నిశ్చయించుకొని శల్యకునికొఱ కురులొడ్డి వేచియుండిరి.

శల్యకుడు సేనలతో బుఖ్ఖారావతిపైకరిగి, అచట శాత్రవప్రతిఘట-నములేమి దాని నవలీల నాక్రమించెను. అటనుండి ఉదభాండపురముపై నడచెను. అందును శత్రుసన్నాహములు గానరామి "ఈపిరికిపందలు మాపేరు వినగానే పారిపోతున్నా"రని కుమార్తెయగు దేవభ్రాంతతో బలికి నవ్వుకొనుచు శల్యకుడు సేనలతో నవలీల సింధునదిని దాటెను. తొల్లి ఆలీసాందరు సేనలతో విడిసిన ఆప్రదేశముననే కొన్నాళ్లు విడిసియుండి, శత్రువిజయమునకు వలయుసన్నాహము లొనర్చుకొనుచు, ఆలీసాందరు దండయాత్రనాటివిశేషములను గూతునకు వినిపించుచు బదునైదుదినములు విశ్రమించెను. ఇంతలో నిర్వదివేలగుఱ్ఱములతో, నాల్గువేలయిరథములతో, నారువేలగజములతో, నాల్గులక్షలకాల్బలములతో దక్షశిలయొద్ద జంద్రగుప్తుడు పగతునిరాక కెదురుచూచుచుండెనని వార్తవచ్చెను. ఆవార్త విన్నవెంటనే దేవభ్రాంత Diophantes తండ్రితో "బాబయ్యా! ఇంతసేనను మనమెట్లా జయించగలుగుతాము?" అనెను. శల్యకుడు చిఱునవ్వు దోప "వెఱ్ఱిదానా! నువ్వు చూస్తూవుండు. చంద్రగుప్తునిగతి ఏమవుతుందో! మలయకేతుసేన లొకవైపున, మనసేనలొకవైపున క్రమ్మి అడకత్తెలో వక్కవలె మగధసేనలను నొక్కివేస్తా"మని పలికెను. అంతకుమున్న అభిసారార్యకేశాదులతో నాలోచించి నిశ్చయించుకొన్నవిధమున కుమారుడగు అంటియోకుని Antiochos నూటయేబదివేలసేనతో కాశ్మీరమున కంపెను. అంటియోకుడు కాశ్మీరపర్వతమార్గములగుండా సేనలతో నరిగి చంద్రగుప్తుని పిఱిందిదెస నాక్రమించునేని అవ్వలిదెసనుండి మలయకేతువు నిజసైన్యముతో వచ్చి మగధసేనలపై బడును. ఇది వారిసమరతంత్రము.

భూలోకనందన మని వాసికెక్కిన కాశ్మీరభూభాగములను గనులార గాంచి, వివిధతరులతాచ్ఛన్నములగు కాశ్మీరసరస్తీరముల వేడ్కమై విహరింప వలయు ననుకుతూహలమున దేవభ్రాంతయు సోదరునితో బయనమై యేగెను. సహజరమణీయములగు నాకొండలోయలలో చిత్రవర్ణములగు పుష్పములు

రాలుటచే రత్నకంబళములవలెనున్న బాటలవెంట దేవభ్రాంత చనుచు, పువ్వుల పూచున్నవృక్షములై గగనభాగమును జుంబించు పర్వతపంక్తులగాంచి యచ్చెరు వందుచు “ఈకాశ్మీరము నిజంగా భూతలస్వర్గమే” యని తలయూచి మెచ్చు కొనుచుండెను. ఆకొండలలోయలలో గ్రీకుసేనలకు మార్గము జూపుటకై వెంట వచ్చిన అర్యకేశు డాతొయ్యలికి రమణీయములగు వివిధప్రదేశములను వర్ణించిచెప్పుచుండెను. ఆపర్వతప్రదేశముల గ్రీకుసేన లిట్లు రెండువారములు పయనమొనర్చినపిమ్మట నర్యకేశుడు “నేను ముందుగా వెళ్లి ఆవలివిమార్గమును దాటుటకు ఏర్పాటుచేసి వచ్చెద” నని చెప్పి యేగెను. ఆత డట్లేగి పదిదినములు గడచినను తిరిగి రాడయ్యెను. ఆంటియోకు డంతట తనసేనలను నిలిపి కాశ్మీర ద్వారముచెంతకు కొంతసేననంపి యచటివిశేషము లరసి రమ్మనెను. వారు తిరిగి వచ్చి “అర్యకేశాభిసారులు లక్షమౌర్యసేనతో కాశ్మీరద్వారమును అరికట్టి యుండి”రని వార్తతెచ్చిరి. ఆంటియోకు డంతట కళవళపడుచు తిరిగి నుద భాండమున కేగగోరెనుగాని ఆద్వారమున మౌర్యసేన లోకలక్షక్రమ్మియుం డుటచే గానరయ్యెను. ఉభయసేనలమధ్య నిట్లు చిక్కుకొని ఆంటియోకుడు నూయియు గోయిగానున్న తనదురవస్థకు వగచుచుండెను.

“బాబయ్యగారు ఈదుష్టుని నమ్మి మనకీఅవస్థ తెచ్చిపెట్టినారు. యుద్ధంముగిసేవరకు మనకీచెర తప్పదనీ, ఇచటిప్రజలను గనుక బాధిస్తే సహించ మనీ అర్యకేశుడు కబురు పంపినాడు” అని సోదరితో విసివికొనుచు నాంటి యోకుడు పలికెను.

దేవభ్రాంత.—అయితే మన మిప్పు డేమి చేద్దామంటావు?

ఆంటియో.—చేయడాని కేముంది? బాబయ్యగారు మాగధులను జయిస్తే మనకు విడుదల; లేకపోతే లేదు. మనఅవస్థ ఇలావున్నదని బాబయ్యగారి కిప్పుడే వార్త పంపాను.

దేవభ్రాంత.—మనదూత నిక్కడినుంచి బయటికి పోనిస్తారా?

అంటియా.—మనం పంపే సందేశం పరిశీలించి మరీ పోనిస్తారు.

దేవభ్రాతి!—అనల్లబాపనితంత్రమే ఇదియంతా.

అంటియా.—నల్లబాపడితంత్రం కాదిది. ఎఱ్ఱరాచవానిదే. అర్నకేశుడు నీ అందచందాలన్నీ వర్ణించి చెప్పాడట ఆచంద్రగుప్తునితో। ఆరాజు నీకోసమని యెన్నో అపరూపమైనకానుకలు పంపాడు.

అనుచు దంతపు గోళ్లపట్టెమంచమును,హంసతూలికా శయ్యను, బంగారు సరిగ పనిచేసిన వెలలేనిపట్టుచీరెలను దేవభ్రాంతకు జూపించెను. ఆజవ్వనియు గనులుమిరుమిట్లుగొలుపు నాపసదనములెల్ల హర్షపూర్ణావలోకనముల గాంచి "నాకెందుకీకానుకలన్నీ పంపటం?" అనుచు అన్నవంక గాంచెను. అతడు "అందకత్తెలైనయువతులకు పురుషు లెందుకు పంపుతారో, అందుకు" అని మాఱు పలికెను.

కుమారుడు కాశ్మీరద్వారము దాటెనన్నవార్తరాగానే మౌర్యసేనను రెండవదిక్కునుండి ఆక్రమింపవలయునని వేచియున్న శల్యకునకు దుదకొకనాడు జంద్రగుప్తునిచెంతనుండి వచ్చినదూత యిట్లు విన్నవించెను. "మీకుమారుడూ, కూతురూ కూడా కాశ్మీరంలో ససైన్యంగా సురక్షితులై వున్నారు. యుద్ధం పూర్తి అయ్యేపర్యంతం వారక్కడే వుంటారు. వారికోసం మీరు ఆలజడి పడకండి."

దీనికి దగినట్లు మఱునాటికి అంటియోకుని చెంతనుండి కూడ వార్త వచ్చెను. పర్వతముఖమున సేనలను కాపుదలకొఱకు నిలుపకుండా కాశ్మీరమున బ్రవేశించి శత్రులవలలో జిక్కినకుమారుని యవివేకమునకు శల్యకుడు దూర వగచి, "ఇంతకు, వానిని నిందించడమెందుకు? ఈఅర్నకేశాభిసారులను నమ్మి నేనే యింతముప్పు దెచ్చిపెట్టుకొన్నాను" అనుచు దన్ను దా నిందించుకొనెను.

పిమ్మట సేనాపియగు దేవమిత్రునితో నాలోచించి, తక్షశిలపై నెత్తి పోయి చంద్రగుప్తునోడించుటయే కార్యమని నిశ్చయించి, సేనల దరలించి తక్ష శిలాభిముఖుడై యేగెను. అచట ఇన్నూటయేబదివేల కాల్బలములతో, నాలు వేల యేనుంగులతో వేచియున్న చాణక్యచంద్రగుప్తబిందుసార బలగుప్తులు శల్యకసైన్యములపైబడి నుఱుమాడసాగిరి. సుశిక్షితములగు మాగధమాతంగములు శల్యకసేనలో దుంగమడువు సొచ్చినట్లు చొచ్చి కాల్వరను, అశ్వికులను పచ్చడిచేయదొడగెను. మౌర్యసేనాసముద్రము నడగొండలవంటి యేనుంగులతో నిట్లు ముంచుకొని వచ్చినను గ్రీకుసేన లోహటింపక పెనగుచుండెనుగాని శక యవనపారసీకాదులు వెన్నిచ్చి పాఱిపోవ దొడగిరి. తన సేనలదురవస్థకు వగచుచు, గజఘటాక్రమమునకు బ్రతిక్రియ దోపక కుందుచున్న శల్యకుని చెంతకు సింధుతీరమునుండి వార్తాహరు లేతెంచిరి. చాణక్యచంద్రగుప్తులు గెడ్రోసియా గాంధారాది దేశస్థులకు బదిలక్షలసువర్ణము లంపిరనియు, వారా సొమ్ము గైకొని అచటి గ్రీకుదండనాథులను బంధించిరనియు, పుష్కలావతి నాక్రమించిరనియు, బర్వతమార్గముల మూసివైచి సింధునదిలోని నావలను దగులబెట్టిరనియు నావార్తాహరులు విన్నవించిరి.

నోరుచుట్టుపై రోకటిపోటువలె వచ్చినవాయీ వార్తను శల్యకుడు విని, బాబిలోనియాకు, పారసీకమునకు మరలిపోవుటకుగూడ దెన్ను తోపక దేవ మిత్రునితో నాలోచించెను. "కొత్తనీరు వచ్చి పాతనీటిని కొట్టుకుపోయె" నన్నట్లున్నది మన యవస్థ. ఈమౌర్యసేనలను మనమింక జయించలేము. ఈమదగజములను చూడగానే మనసేనలు భయపడి వానిధాటకు ఆగలేక పోతున్నవి. మనమింతట సంధిచేసుకొని కాశ్మీరములో చిక్కుపడిన బిడ్డలను సేనలను విడిపించుకొని యింటిదారి పట్టడం మంచిది. అచట ఆంటిగోనసును జయించి మనం సిరియాను సంపాదించగలిగితే చాలు. ఈగాంధారంతో గెడ్రోసియాతో మనమింక వేగలేము. ఈదేశాలు పుచ్చుకొని చంద్రగుప్తుడు మనకు ఏనూరేనుగులను ఇచ్చి వచ్చినదారిని వెళ్లనిస్తాడేమో రాయబార

చంపి చూస్తాను. ఆయేనుగులతో మనం ఆంటిగోనసును జయించవచ్చును.” అని శల్యకుడు వచింప దేవమిత్రుడును వల్లెయని చంద్రగుప్తునిచెంతకు దూత నంపెను. చాణక్యచంద్రగుప్తు లందుల కంగీకరించిరి. శల్యకపుత్రిపై జంద్రగుప్తుడు మరులుగొనియున్నవాడు గాన నాబాలిక నాతని కిచ్చి వివాహ మొనర్పుడని చాణక్యుడు దేవమిత్రున కెఱిగించెను. శల్యకు డందులకంగీకరించి “ఈస్నేహం శాశ్వతబాంధవంగా పరిణమించడంకన్న కావలసినదేమున్నది” అని దేవభ్రాంతను చంద్రగుప్తున కొసగి పరిణయమొనర్చెను. హతశేషమైన సేనతో శల్యకుడు పలదడవి చూచుకొనుచు స్వదేశమున కరిగెను.

శల్యకదత్తములగు గెడ్రోసియాపెరాప్రములను దక్షశిలారాజ్యమున జేర్చి, అర్యకేశాభిసార పుష్కరదత్త మలయకేతువు లొనర్చినసాయమునకు ప్రతిఫలముగా జాణక్యచంద్రగుప్తులు, దమకు వారిచ్చుకప్పములో సగపాలు ఏబదియేండ్లవఱకు రద్దుచేసిరి.

నాటిరేయి దక్షశిలానగరమున చంద్రగుప్తసార్వభౌముడు శయ్యామందిరమున నూత్నవధువును జేరదీసికొని, లజ్జావనతమగు నాబాలికవదనమును బుఱుకుచు గడ్డముబట్టి పైకెత్తి “ఇటు చూడు. కోటలో ఆప్రజల ఉత్సవ కోలాహలం విన్నావా? వారేమని కేకలువేస్తున్నారో విను. ‘విజేత విజితుడైనాడు’ అను జయధ్వానములు చేస్తున్నారుకదా! ఆమాటల కర్థమేమిటో చెప్పు, చూస్తాము. మీతండ్రిగారిని మేము జయించినామనా, మమ్మును నువ్వు జయించినావనా, వారియుద్దేశము” అని యడిగెను. ఆముద్దరాలామాటల కెలనగవుదోప, నీమదవనతాస్యయై ‘రెండుపక్షములూ సత్యమేకదా” యనుచు తనముద్దుమోమును సార్వభౌమునివక్షమున దాచుకొనియెను.

# 31

## పండితపరిషత్తు

భారతభూమి నలుదెసలనుండి యేతెంచిన పండితబృందముచే తక్షశిలా నగరము కిటకిటలాడుచుండెను. అప్పటికి నెలదినములనుండియు శాస్త్రార్థవాదములతో, విద్యావినోదములతో పండితులు ప్రొద్దులుపుచ్చుచు జంద్రగుప్త సార్వభౌమున కతిథులై నగరమున విడిసియుండిరి. సార్వభౌమసమక్షమున సకలవిద్యలయందును పండితులు తమతమ పరిశ్రమమును ప్రదర్శించిరి. ఆపరీక్షలో విజయమందినవారినెల్ల సార్వభౌము డానాడు సత్కరించును. నగరమంతటికి ఆనాడు పండుగ చాటించిరి. పురమంతయు చిత్రతోరణధ్వజపటాలంకృతమై కలకలలాడుచుండెను.

భేరీపటహకాహళధ్వనులు సెలంగ సార్వభౌముడు, యువరాజగు బిందుసారునితోడను, చాణక్యబలగుప్తరాజసేనానులతోడను పరిషద్భవనముం జేరవచ్చినంత సభాపతియగు ధర్మరత్నపండితుడు పూర్ణకలశాదులతో నెదురేగి సత్కారపూర్వముగా సభాంగణప్రవేశముసేయించి వారినెల్ల సర్హాసనాసీనులం జేసెను. పండితబృందమంతయు సార్వభౌమున కొక్కపెట్టున జయపెట్టుచుండ సభాపతి కేలెత్తి యాకలకలము వారించి "సహస్రశీర్షః పురుషః సహస్రాక్షస్సహస్రపాత్" అనుచు బురుషసూక్తము నెత్తికొనుడు సహస్రకంఠము లద్దానినందుకొని గానమొనర్చెను.

పిమ్మట ధర్మరత్నులవారు సభాసదుల నవలోకించి యిట్లు పలికెను. "సార్వభౌములవారు ఇచటికి విజయంచేసి, ఈనెలదినాలనుండి పండితగోష్ఠులన్నీ చిత్తగించడం మహాప్రసాదం. ఏలినవారి యీవిద్యాపక్షపాతం వేదశాస్త్రాలకు చౌషష్టికళలకు అభయప్రదానం చేస్తున్నది. భారతభూమికి దాపరించిన యవనారిష్టాన్ని పారదోలడానికి యిన్నాళ్లు సార్వభౌములవారు

ధనుష్పాణులై రణశూరు లనిపించుకొన్నారు. శత్రుపీడ పరిహరించి యీపుణ్యభూమిని నేకచ్ఛత్రం క్రిందికి తెచ్చారు. ఆర్యధర్మానికి పునఃప్రతిష్ఠ కల్పించారు. ఇప్పుడు దానకంకణం తాల్చి వితరణశూరు లనిపించుకొంటున్నారు. నేటిసభలో ఏలినవారు చేయనున్న అపూర్వసత్కారాలవల్ల దిగ్విజయసమార్జితమైన నిజకీర్తికి వన్నెపెట్టనున్నారు. తక్షశిలావిద్యాపరిషత్తుపట్ల సార్వభౌములవారు చూపుతున్న యీఅనుగ్రహానికి మనం ఏమిప్రతిచేయగలం గనుక! అయినా, ఉడుతభక్తిగా, మీమహాపండితసదస్సు సార్వభౌములకు "రాజనరేంద్రు"లనే బిరుదపట్టం సమర్పించుకొంటున్నది.

"పదిహేనేండ్లచిరుతప్రాయంలోనే అసమానశౌర్యం ప్రకటించి అపరాభిమన్యు లనిపించుకొన్న యువరాజులుంగారికి "అమిత్రఘాతు"లనే బిరుదపట్టము కూడా యీపరిషత్తు సమర్పించుకొంటున్నది. ఇంద్రజయంతులవలె యీసభనలంకరించియున్న శ్రీవారలకు వేదమాత సకలాభీష్టములు అనుగ్రహించుగాక" అనుచు బిందుసారచంద్రగుప్తులకు పుష్పాక్షత లొసగి సభాపతి మరల నిట్లు పలుకదొడగెను.

"మననగరంలోనే గురుకులవాసంచేసి, జగదేకపండితు డనిపించుకొన్న మాసతీర్థులు విష్ణుగుప్తులవారు కూడా నేడిచటికి విజయంచేయడం మనభాగ్యం. నందకాననకుఠారులు, ఆర్యధర్మప్రతిష్ఠాపకులు అయిన చాణక్యమహామాత్యులవారు మొన్న అర్థశాస్త్రవేత్తలతో ఢీకొనడం, అందరినీ 'జితోస్మి' యనిపించి తుదకు మాధ్యస్థపీఠం అలంకరించడం మీరు చూచినదే కదా. ఇవ్వాళ్లో వారి సదుపదేశాలు వినేభాగ్యం కూడా మనకు లభించబోతున్నది.

"ఇక ఈయేటిపరీక్షలనుగూర్చి నేను వేరే చెప్పేదేమున్నది! శాస్త్రపరీక్షలో ఉత్తీర్ణులైన అరవైనలుగురిని సార్వభౌములు నేడు సత్కరిస్తారు. శాస్త్రవాదాలలో మేలిబంతులుగా తేలినవానిలో, చాణక్యులవారి "ప్రాణికోటికి పొట్టకై ప్రాకులాట" అనేసూత్రం మీరు విన్నదే కదా! "మృతియె మేలు

పసువ్రమాలి బ్రతుకుకంటె" అనీ "పాపరతుడు విద్దియలమ్మి బ్రతుకజూచు" అనీ "అనితరసాధ్యమ్ము నాచరించినయట్టి పురుషుండె సూవె దేవుండనంగ" అనీ మఱికొన్ని సూత్రములు కూడ ఈయేడు గ్రంథస్థము చేశాము.

"శాస్త్రజ్ఞులతోపాటు కళావేత్తలను కూడా సార్వభౌములవారు అరవైనాలుగుబహుమతులు ఇప్పిస్తున్నారు. వారిలో సార్వభౌములఅంగుళీయకాన్ని పేరుచెప్పిహరించిన ఐంద్రజాలికుని ప్రజ్ఞ ఎంతైనా కొనియాడదగింది. కాని ఆ ప్రజ్ఞ చాణక్యులవారిఉంగరాన్ని హరించలేకపోయింది. బ్రహ్మస్వాపహరణం రాజస్వాపహరణంవలె చులకన కాదుగా మరి! అగ్నిస్తంభన, జలస్తంభన, విషస్తంభనాదివిద్యల వారిప్రజ్ఞలు సభవారు చిత్తగించినవే. వారికి కూడా బహుమానములు ముట్టుతున్నవి. సార్వభౌములవారిని పద్మపాణులుగాను, శల్యకేశ్వరులను ద్రాక్షాఫలహస్తులుగాను సింహవాహనములపై మలచిన శిల్పివరుడికౌశలం ఎంతైనా మెచ్చదగింది. సింహవ్యాఘ్రభల్లూకాదులతో ద్వంద్వయుద్ధంచేసి గెలిచిన మల్లునిపరాక్రమం, ఏకకాలమందు అనేకజంత్రములపై వాద్యమొనర్చిన గాయకునికౌశలమును, కన్నులకు గంతలు కట్టుకొని శబ్దవేధయొనర్చిన విలుకానినైపుణ్యమునూ, ఇంకను గల తక్కిన విద్యావంతులనూ సార్వభౌములవారు సత్కరిస్తున్నారు. రహస్యభేదనంచేసి మనకందరికి ఆశ్చర్యం కలిగించిన జీవసిద్ధినిగూర్చి నేను వేరే ప్రశంసింపనక్కర లేదు. ఆమహామంత్రవేత్త విష్ణుగుప్తాచార్యుల శిష్యుడగుటను సమర్థించుకొన్నాడు."

పిమ్మట జంద్రగుప్తసార్వభౌముడు తక్షశిలా గురుకులమును ప్రశంసించి, అచటిపండితుల విద్యాపరిశ్రమమును వక్కాణించి "అర్థశాస్త్రంలో పరిశ్రమచేసేవారికిగాను యేభైగ్రామాలు మాన్యం గాఇస్తున్నాను"మని తెలిపెను. "మాకు, యువరాజులుంగారికి బిరుదప్రదానపూర్వకంగా మీరుచేసినసత్కారానికి మాకు చాలా సంతోషమైనది. యువరాజులుంగారికి పదహారేళ్లనిండ

గానే మీనగరంలో వారిని మా ప్రతినిధిగా వుంచుతాము" అని పలికి చంద్రగుప్తుడు ముందుగా ధర్మరత్నులవారిని "కులపతి" అనేబిరుదముచే సత్కరించి, తక్కినవారినందరిని చందన తాంబూలరాంకవాంగదకంకణాదులచే సత్కరించెను. సార్వభౌముడు సత్కారములు చేయుచున్నంతసేపును పండితులెల్లరు "ఆహాహా! ఏమిమహారాజండీ! ఎంతవిద్యాపక్షపాతం! ఎంతవినయం! ఏమి వితరణవ్యసనం! వితరణానందంచే మహారాజునేత్రము లెలా మెరుస్తున్నవో చూడండి! ఆదిరాజచక్రవర్తండీ చంద్రగుప్తులవారిది" అనుచు దమలోదాము ప్రశంసలొనర్చుచుండిరి.

పిమ్మట జాణక్యపండితుడు 'రాజనరేంద్రు'లగు చంద్రగుప్తసార్వభౌములను, 'అమిత్రఘాతు'లగు బిందుసారులను, 'కులపతు'లగు ధర్మరత్న పండితులను, తక్కుంగలపండితప్రకాండులను ఉద్దేశించి యిట్లు పలికెను.

"ఎన్నాళ్లయినదో, యీవిద్యానిలయమును, యిచటిపండితమిత్రులను, వారివిద్యావ్యాసంగములను వదలి! రాచకార్యాలలోపడి, దంభమూ, కాపట్యమూ, పారుష్యమూ, వంచనమూ అవలంబించి యిన్నాళ్లు కాలక్షయం చేశాను. ఆరాజకార్యాలభారంచేత శరీరం క్రుంగిపోయి తల నరసిపోయింది. నక్షత్రగణనం చేయవచ్చు, వ్యాకరణసూత్రాలైనా వల్లించవచ్చునుగాని మంత్రాంగాలు చేయడం మాత్రం ఎవ్వడికీ శక్యంగానిపని. ఆమహాసంక్షోభం నుంచి బయటబడి, మళ్లా యీపదిరోజులూ మీఅందరితో అరమరికలేకుండా మెలగడంవల్ల నాకు క్రొత్తజవసత్వాలు వచ్చినట్లుగా వుంది. ఇన్నాళ్లనుంచి అలవాటయిన పారుష్యాన్ని, కౌటిల్యాన్నీ వదలి నాలుక మళ్లా సారళ్యాన్ని, ప్రసన్నతను అలవరచుకొంటున్నది. మగధసామ్రాజ్యమహామాత్యులనీ, నందకులోన్మూలకులనీ అనిపించుకొన్నదానికంటె నేడు మీవల్ల ఈగౌరవసత్కారాలు పొందడమే నాకు మహామేరువుగా వున్నది.

"కాని ఆర్యమిశ్రులగు మీఅందరికి నేను క్రొత్తగా చేయదగినఉపదేశ మేమిటా అని ఆలోచించాను. ఎంత విచారించి చూచినా యిచట ప్రసంగించ డానికి నాకు స్వయంగా ఏమిన్నీ తోచిందికాదు. కాబట్టి ఆర్యమహర్షులు చేసిన ఉపదేశాలనే యథాశక్తి వ్యాఖ్యానిస్తాను.

"సత్యవ్రతాన్ని మనపెద్దలు సర్వధర్మములలోను అధికంగా చెప్పారు. 'సత్యం వద' అనేమాటను సకలవిద్యాసారంగా విధించారు. ఎందువల్ల సత్యానికింత ఉత్కృష్టత కల్పించారూ అని ఆలోచిస్తే మనవిద్యలూ, కర్మలూ అన్నికూడా ఈశ్వరుణ్ణిపొందడానికి ఏర్పడ్డవిగనుకా! ఆయీశ్వరుడు సత్యస్వరూపుడుగనుకా సత్యాన్నిమించినధర్మమూ, వ్రతమూ లేదని తేలుతుంది. కనుకనే మనపెద్దలు త్రికరణములయందు సత్యాన్ని పాటించవలసిందని పదేపదే విధిస్తూ వచ్చారు. ఈసత్యవ్రతాచరణమనేది బహుకష్టసాధ్యంగా కన్పిస్తుంది: సత్యా సత్యనిర్ణయంచేయడం సామాన్యంకాదు. వెనుకటి మహాభారతంలో కౌశిక సత్యవాదిచరిత్ర మీరు వినే వుంటారు. ఆతపస్వి సత్యవ్రతుడననే అహంకారంవహించి తన సత్యానికి ఎక్కడ హానివచ్చిపోతుందో అనేభయంకొద్దీ జీవహింసకు కారణమైనాడు. హింసాకరమైన యీసత్యంవల్ల ఆమహర్షికి నరకప్రాప్తి అయిందని భారతం చెప్పుతున్నది. కౌశికుడు పిమ్మట శ్రీకృష్ణభగవానుణ్ణి అడిగాడు. "నువ్వు సత్యస్వరూపుడని వేదములు చెప్పుతున్నవి కదా! సత్యవ్రతుడనైన నాకీనరకం ఎందుకు ప్రాప్తించింది" అని. భగవంతుడన్నాడట కదా, "వెఱ్ఱివాడా! ఏవ్రతానికైనా దేశకాలయోజన చేయవలసి వుంటుంది. నువ్వు! మౌనంవహించి ఊరకున్నా పోయేది. లేదా, నేనెరగనని చెప్పినా కించిదసత్యదోషంతో తేలిపోయేది. హింసాపాతకం చుట్టుకొనేది కాదు. సత్యాహంకారంచేత నీకు ఆలోచన లేకపోయింది. ఆసాధువులను బోయవాళ్లకు చేతులారా పట్టియిచ్చి ప్రాణహింస కొడిగట్టావు" అంటే కౌశికుడు నిరుత్తరుడైనాడు. కాబట్టి సత్యాసత్యనిర్ణయం సుకరం కాదు. సత్యము

కంటె కూడా అహింస ఉత్కృష్టమైనదిగా కనిపిస్తుంది. కనుకనే 'పరోపకారః పుణ్యాయ, పాపాయ పరపీడనం' అన్నారు. కాబట్టి ఏధర్మమునైనా సూక్ష్మ దృష్టితో విచారించి ఆచరించవలసి వుంటుంది. అందుకనే 'వారిజాక్షులందు, వైవాహికములందు' అంటూ భార్గవులుకొన్ని సందర్భములందు అభ్యనుజ్ఞ కల్పించారు. హింసకంటె అనృతం వేరే వుండదని పెద్దలతాత్పర్యంగా కనిపిస్తుంది. అనృతం చెప్పవద్దంటూ మళ్ళా అప్రియమైనసత్యంకూడా చెప్పవద్దని వారుసెల విచ్చారు. కాబట్టి మానవమాత్రులందరూ హింసాదూరమైనసత్యమునే యథాశక్తిగా ఆచరించాలి. సత్యాన్ని ఒకవంక, తక్కిన యాశ్వమేధ మొకవంకా తులలోవుంచితూస్తే సత్యంపైపే మొల్లు చూపిందట. అందువల్ల సత్యమే ఈశ్వరుడన్నారు. సత్యారాధనతత్పరులకు ఈశ్వరుడు సుగమ్యుడని భావంగా కనిపిస్తుంది.

"స్వధర్మానుష్ఠానంకూడా చాలా ముఖ్యమైనదిగా విధించారు ఋషులు. శ్రీకృష్ణపరమాత్మ 'పరధర్మం భయావహ' మన్నారు. స్వధర్మంవిసర్జించి పరధర్మావలంబనం చేయడంవల్ల సంఘవ్యవస్థ తారుమారై, అనర్థములు కలగడమే కాక మొదలు ధర్మానికే హానికలుగుతుంది. కాబట్టి ప్రభువులు క్షత్రియధర్మం అనుసరిస్తూ, ప్రజలు పరధర్మావలంబనం చేయకుండా ధర్మరక్షణం చేయవలసిందని విధించారు. "పిమ్మట అధ్యయనం నిత్యమూ చేయవలసిందీ" అన్నారు. అధ్యయనమే నీకు ఇహపరాలను సాధించిపెట్టుతుంది! అనధ్యయనంవల్ల నువ్వు భ్రష్టుడవై సంఘాన్ని భ్రష్టంచేస్తావు. కనుక అధ్యయనం చేస్తూ వుండు.

"అధ్యయనం సమాప్తియైనపిమ్మట గురుదక్షిణ సమర్పించమన్నారు. నీకు కలిగినంతలో గురుదేవులకు ప్రీతికూర్చడం విధి. అంతేగాని కడుపునిండా తిని ఎగవేసేగొడ్డుటావులవలె చరించగూడదు.

"పిమ్మట వివాహితుడవై, సంతానం కని వంశమును రక్షించు. గృహస్థ ధర్మం చాలా ఉత్కృష్టమైనదిగా పెద్దలు చెప్పారు. నువ్వేమిా ఆకాశంనుంచి

కూడిపడలేదు. ఇచట నేమీ నీకొఱకు త్రిశంకుస్వర్గమూ లేదు. కాబట్టి గృహస్థుడవై పంచయజ్ఞపరుడవై సకల భూతారాధనం చేయాలి. సంతానవంతుడవై జగత్కార్యమును కొనసాగించాలి. నిత్యమూ దేవతలను, పితృదేవతలనూ, ఋషులనూ తర్పితులనుచేయడం నీకు విధి. ప్రత్యక్షదేవతలైన తలిదండ్రులను, గురువును, అతిధులను, ఆరాధించు. "నిత్యమూ అనింద్యకర్మలను మాత్రమే చేయవలసిం" దని పెద్దలువిధిస్తూ, "మేము చేసిననింద్యకర్మ లేవైనావుంటే వాటిని నువ్వు చేయకు. మేము చేసినసత్కార్యాలుమాత్రమే చేయవలసిం" దని ఉపదేశించారు.

"పిమ్మట దానవిషయంలో, పాత్రవిచారణం చేసి శ్రద్ధావంతుడవై దానంచేయవలసింది" అన్నారు. అయితే' అపాత్రదానమూ, శ్రద్ధారహిత దానమూ కూడా అంగీకరించారుగాని అదానం మాత్రం పనికిరాదన్నారు. నీ శక్తికొలది దానంచేయడమే నీపని. సర్వదాతయైన ఈశ్వరుడున్నాడనియెఱిగి దానం చేయవలసిందన్నారు. పెట్టనివారికి పుట్టదన్నారు. కాబట్టి భక్తిచే, మైత్రిచే, సౌహార్దంచే దయచే దేనిచేతనైనా సరే దానం మాత్రం చేయాలి. అందరూ నిన్నులోభి అంటారనేభయంచేతా, లజ్జచేతనైనాసరే దానంచెయ్యి "నీకు ధర్మసందేహంకలిగినప్పుడు పెద్దలను ప్రమాణంగా గ్రహించు. జ్ఞానమూ ధర్మాధర్మవిచక్షణం, కర్మకౌశలం, శాంతం, దయా కలిగి అప్రమత్తులు, స్వధర్మ రతులూ అయినవారే పెద్దలంటే, వారే ఆచార్యపురుషులు: వారినడవడిదే మనకు ప్రమాణం.

"పాపకర్ములపట్ల. పైనచెప్పినట్టు పెద్దలు ఎలా చరిస్తారో నువ్వూ అలాగేచరించు. వారే నీకు ప్రమాణం. ఇవియే సకలవేదసారమైనవిధులు! ఇవియే ధర్మములు. ఇవియే సకలోపదేశాలకు శిరోమణులు. శ్రద్ధాభక్తులతో మనము వీని ననుష్ఠింతుముగాక. ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః" అని పలికి చాణక్యుడు చాలించెను.

పిమ్మట ధర్మరక్షకులపతి యారంభింప పారిషదులెల్లరు
"అసతో మాసద్గమయ
తమసో మాజ్యోతిర్గమయ
మృత్యోర్మాఽమృతం గమయ"
అని ఏకకంఠముతో గాన మొనర్చిరి.

---

# 32

## సముద్రనాథశ్రేష్ఠి

చంద్రగుప్తసార్వభౌముడు సపరివారుడై రాజధానికి తిరిగివచ్చి నెల గడచినది. పిమ్మట నొకనాడు సార్వభౌముడు యువరాజమంత్రిసామంతదండనాథులతో పేరోలగముండి, ద్వీపాంతరముల కేగివచ్చిన సముద్రనాథునకు దర్శన మొసగెను.

సముద్రనాథుడు వేయిమంది నావికులును, వేయిమంది బేహారులును గొలువ నూరునావలపై రెండేండ్లకుసరిపడసంబారములెత్తించుకొని ప్రాక్పశ్చిమ సముద్రములను జుట్టివచ్చెనుగావున ద్వీపాంతరవిశేషములను వినుకోర్కెతో శాంతవతీదేవి మధ్యరాదేవభామినులతో గూడ యవనికాభ్యంతరమున ఆసీనయై యుండెను.

సముద్రనాథు డంతట దనయాత్రావిశేషములను వినిపించువాడై తొలుత దాము కళింగరాజధానియగు కళింగపట్టణము కరిగితిమని తెలిపి కళింగ వైభవమును వర్ణింపదొడగెను. కాళింగులు ఓడబేహారముకొఱకు యవబలిద్వీపములకు సుమాత్రకు మధురకు జనుచుందురనియు,మలయసింహళములకు (నాగద్వీప-(Ceylon) సువర్ణభూమికి (Burma) నరిగి వెలలేనిముత్తెపుజిప్పలు గొని

తెత్తురనియు, కళింగమున దశార్ణ Orissa సంభవములగు గజదంతములు మిక్కుటముగా లభించుననియు విన్నవించెను.

"కళింగసముద్రం నిండా చిన్న చిన్న లంకలున్నవనీ, వానిలో నరమాంస భోక్తలుంటురనీ కళింగప్రజలు చెప్పగా విని మేము అంభమాన Andamans నగ్నద్వీపములకు Nicobars వెళ్లి అచట దిస్సమొలలతో తిరిగే స్త్రీపురుషులను నల్లని వికృతాకారులను చూచాము. రంగురంగుల, మన ధ్వజపటములు చూచి వాళ్లు ఆశ్చర్యపడి 'అటువంటివి మాకుకొన్ని యివ్వండి' అని అడిగిరి. మేమిచ్చిన పడగచీరెలను వాళ్లు ఒంటికి కప్పుకొనక తలలకు చుట్టబెట్టుకు సంతోషంతో గంతులువేశారు."

ఈమాటలు విని రాక్షసామాత్యుడు నవ్వుకొని "అనాగరకులకేమిటి, కోతులకేమిటి ! వస్త్రాలు అలంకారానికేగాని మానగోపనానికి కాదు" అనెను. "నాగరస్త్రీలకు గూడా అంతే" నని చాణక్యుడు వచింప సభాసదులెల్లరు గొల్లుమని నవ్విరి.

సము:—"నగ్నద్వీపంలో మన నావికు డొకడు గొబ్బరికాయలు కోసుకొనాన్న డనేకోపంచేత ఆరాక్షసులు వానిని పట్టుకొని చంపి తినిరని మాకు తెలిసింది. వాళ్లనొకవందమందిని మేము వేటాడి బుద్ధిచెప్పి వచ్చితిమి. పిమ్మట తుపానులో చిక్కుకొని మనవి పద్దెనిమిదిఓడలు నష్టమైనవి. నూటయేభైమంది కళాసులు చనిపోయినారు. ఓడలోనున్న బ్రాహ్మణుడొకడు 'మనం అన్యాయంగా ఆద్వీపవాసులను వందమందిని చంపినపాపం వెంటనే యిట్లా ఫలించింది; చూచారా' అన్నాడు. ఆబ్రాహ్మడిమాటలకు కళాసులు మండిపడి 'బాపనయ్యా ! నీకంతజాలిగా వుంటే ఆరాక్షసులదగ్గరకేపో' అని కాలు సేతులు కట్టి పాప మాబ్రాహ్మణుని నడిసముద్రంలో పారవేశారట. ఆబ్రాహ్మణుడు 'కుయ్యోమొఱ్ఱో' అని ఏడుస్తున్నా వినిపించుకోక నావలు సాగిపోనిచ్చారు."

రాక్ష:—"అయ్యో! పాప, మాబ్రాహ్మణునిగతి యేమైనట్లు?

సము:—"ఏమో! మళ్లా వెళ్లి తెలుసుకురావాలి"

ఈమాటలకు సభాసదులెల్లరు కడుపుబ్బ నవ్వుకొనుచుండ సముద్ర నాథుడు పిమ్మట దామ సుమాత్రయవబలిద్వీపములకు, మదన చంపా కాంభోజములకు దరలిపోయితిమని విన్నవించి అచటివిశేషముల దెలుపసాగెను.

"వంగ కళింగ ద్రావిడకేరళసౌరాష్ట్రవాసులు చాలామంది ఆలంకలలో వుండి, ఆద్వీపవాసులచేత ఆరణ్యములన్నీ ఛేదింపజేసి, క్రమంగా ఆభూములను సేద్యంలోకి తీసుకువస్తున్నారు. ఆలంకల నిండా ఎక్కడచూచినా లవంగాలు, ఏలకులు, పోకలు, కొల్లలుగా పండుతున్నవి. మలయద్వీపంలో తగరపుగను లెన్నోవున్నవి. ఆ లంక లంతటా చిత్రమైనచెట్టు ఒకటికనిపిస్తుంది. దానిపాలకు ఎంతోజిగురు వుంటుంది. అది ఎండబెట్టి ముద్దలుచేస్తే ఆముద్దలకు ప్రాణంవచ్చి పైకి క్రిందికి ఆడడం మొదలుపెట్టుతవి. అటువంటివి మూడు తెచ్చాను. చిత్తగింపు"డని ఆరబ్బరుబంతులను సార్వభౌమునకు సమర్పించెను. చంద్రగుప్తుడాబంతిని నేలపైవైచి, అది చిందులుద్రొక్కుచుండ వార్షవిస్ఫారితనేత్రుడై యవలోకించుచుండెను. సభయంతయు రెప్పవేయక ఆవింత చూచుచుండెను. దేవభ్రాంతయు నందొక కందుకమును దండ్రిగారి కంపుదునని తెప్పించుకొని అంతఃపురజనమున కాయపరూపవస్తువు నాడించి చూపెను. చాణక్యుడొక కందుకమును గేలనందికొని, దానిని మూమూచి, నేలపైవైచి, యదియెగిరినంత జేతితో దట్టి యాడుచు గొండొకవడి వినోదించి, దానిని రాక్షసమంత్రి కందిచ్చెను. ఆత డద్దాని బరిశీలించి, ఆశ్చర్యమగ్నమానసుడై "ఎంత చిత్రమైన వస్తువు!" అనియెను. చాణక్యుడు "దానిచిత్రమేమిటో మనకప్పుడే ఏమి తెలిసింది! ముందుముందు తరాలవారికి గాని దానిచిత్రమంతా తెలిసిరాదు" అని పలికెను.

సముద్రనాథుడు మరల తనకథ చెప్పదొడగెను. "తూర్పుదీవుల నుండి బయలుదేరి మేము పశ్చిమానికి వెళ్లి సింహళం చేరాము. దీనినే నాగద్వీపమంటారు. అనురాధపురంలో సింహళేశ్వరుని దర్శించాము. ఆమహారాజు పిలినవారికుశలమడిగి, దేవరవారు తొల్లి పంజరబద్ధమైన సింహాన్ని విడిపించిన మతిప్రభావాన్ని తలపోసి ప్రశంసించెను. పిమ్మట వెలలేనిముత్యాలసరాలు, ఏడడుగులన్నరపొడవైన రెండు ఏనుగుదంతాలూ దేవరకు కానుకగా సమర్పించెను. అవంతా ఒక్కొక్కదానిలో చిన్నబిందెడునీళ్లు పట్టుతవి" అని దంతములను ముత్తెపుపేరులను సమర్పించి, "సింహళేశ్వరుడు దేవరవారితో పాటు తాను కూడా 'దేవానాంప్రియ' అనే బిరుదాన్ని ధరించడానికి నా ముఖాన అనుజ్ఞ వేడుచున్నాడు" అని విన్నవించెను.

రాజు.—"సింహళం సారవంతమైన నేలయేనా?"

సము.—"చిత్తం. అక్కడ ఇనుపముక్క పాతిపెట్టితే మర్నాటికి చిగురుస్తుందని సామెతగా చెప్పుకొంటారు. సింహళమంతా కొబ్బరితోటలూ, పోకతోటలూ మయం.

లంకనుండి బయలుదేరి తిన్నగా దక్షిణదిగంతమైన కన్యాకుమారీ క్షేత్రం చేరుకొన్నాము. మూడుసముద్రాలు సంగమించే ఆక్షేత్రంలో కుమారీదేవి శివదేవుని వివాహమాడవలెనని పప్పు బియ్యాలు, బంగారం పోగు చేసికొని చిరకాలం తపస్సుచేసిందట. కాని శివదేవు డంతకుపూర్వమే పాండ్య కన్యయైన మీనాక్షిని పెండ్లాడటంవల్ల కుమారికోరిక యీడేరింది కాదు. కుమారిభగ్నమనోరథయై శిలావికారంపొంది కన్యగానే వుండిపోయింది. ఆమె సమకూర్చుకొన్న పెండ్లిసంబారాలన్నీకూడా శిలావికారంపొంది నేటికీ అలాగే వున్నవనీ, ఆదేవికి కన్యాకుమారి అని పేరువచ్చిందనీ స్థలపురాణజ్ఞులు చెప్పగా విన్నాము. అంతట మేము ఆదేవాలయానికి వెళ్లి కన్యాకుమారినీ, బియ్యంవలె, పప్పువలె, బంగారుపొడివలె కనిపించే యిసుకరేణువులనూ దర్శించాము. అక్క

చాణక్యులకు జన్మభూమియైన కేరళపుత్ర దేశాని కాదేవియే రక్ష. చోళపాండ్య కేరళపుత్రములు మూటినీ తమిళకదేశమంటారు. కేరళపుత్రులకు కుమారి యిష్ట దైవమైతే, పాండ్యులకు కుమారస్వామి యిష్టదైవం. చోళులకు పశుపతియైన శివుడే యిష్టదైవం. శివుడు మనకు లయకారకుడు మాత్రమే. వారి పశుపతి సృష్టిస్థితిలయాలు మూటికీ కర్తగా చెప్పుకుంటారు.

"అచటి బ్రాహ్మణులు మనశూద్రులకంటె కూడా నల్లగా వుంటారు. కాని వారు మత్స్యమాంసాలు ముట్టరు. ఒడలినిండా గుడ్డ వేసికోవడం అక్కడ అనాగరకలక్షణం. బ్రాహ్మణులు క్షత్రియులు అచట మొలకుమాత్రమే వస్త్రం ధరిస్తారు. నీచజాతులా పెద్దలకు తమనీచశరీరం కన్పించకుండా అంగోటు బట్ట కప్పుకుంటారు. వారుమాట్లాడేతమిళభాషకు సంస్కృతప్రాకృతాలకు సంబంధం కనిపించదు. ఇటువంటివెన్నో వారికీ మనకూ భేదాలు వున్నవి. "చోళపాండ్య కేరళములు మూడిటికీ ముగ్గురు రాజులున్నారు. వారిలోవారెప్పుడూ కలహిస్తూ వుంటారు. ప్రజలు, వైద్యులూ, జ్యోతిష్కులూ, పురోహితులూ, రాజపురుషులూ-ఈఅయిదు తెగలవారు రాచకార్యాలలో ప్రభువుకు అమాత్యులుగా వుంటారు. భూమిపన్నులూ, సుంకములూ దారిపన్నులూ రాజుకు ముఖ్యాదాయం. చోళులకు సామంతగణంవల్ల ఎక్కువగా పన్నులు ముట్టుతవి. కేరళపుత్రంలో ఏనుగులవల్ల చాలాసంపదలభిస్తుంది. పాండ్యమండలంలో ముత్యపు చిప్పలు ముఖ్యసంపద.

బ్రాహ్మలు, తమిళులు, చండాలురు అని మూడేజాతులక్కడ. తమిళులలో పురోహితులు, క్షత్రియులు, పశుపాలకులు, కర్షకులు, చండాలురు అని అయిదువిభాగాలున్నవి. స్త్రీల కచట అంతఃపురవాసం లేదు. రాజమహిషి కూడా రాజుతో సింహాసనం అలంకరిస్తుంది. అరిసేనలో మనసేనలోవలెనే రథగజతురగపదాతులని నాలుగంగాలు వున్నవి. ఇవిగాక ఆరాజులుముగ్గురికీ కూడా మంచి నావికాబలమున్నది. ముఖ్యంగా పాండ్యులు నావికాబలంలో

ఆధికులు. వారు మత్స్యలాంఛనులు. నేలమీదపోరాటంలో అపజయంకలిగితే వారంతగా చింతించరుగాని నీటిమీద ఓడటంమాత్రం వారికి తలకొట్టివేసినట్లుంటుంది. పాండ్యరాజులు లంకను జయించినకారణంచేత కలియుగరామబిరుదం తాలుస్తారు. చోళులకు ప్రబలమైన పాదాతిబలం వున్నది. వారు వ్యాఘ్రలాంఛనులు. కేరళపుత్రులకు గజబలం విస్తారంగావున్నది. ముగ్గురికీకూడా అశ్వబలం తక్కువ. "దేవునిపుణ్యమాఅని గుర్రాలకు కొండలకు కొమ్ములుపెట్టలే"దని వారికొకసామెత వుంది. దాన్నిబట్టే గుఱ్ఱములంటే వారికెంతభయమో తెలుస్తుంది. పదాతులు మాత్రం మాంచి శూరులనే చెప్పాలి. వెనుకటిఆదేశంలో ఒక వీరవనిత. తనకొడుకు రణపరాఙ్ముఖుడై విరిగివచ్చాడని విని తను ఖడ్గం తాల్చి రణభూమికి వెళ్లిందట 'అటువంటిపిరికిపందకు పాలిచ్చి పెంచిన రొమ్ములు ఖండించుకుంటా' నని. తమిళులంతా స్వేచ్ఛాప్రియులు. మనసామ్రాజ్యంపట్ల భయగౌరవములున్నప్పటికీ మనకు సామంతులుగా వుండడానికి అంగీకరించరు. పొదిలిమలలో మన సేనలకు ఓడినప్పటినుండీ మగధసామ్రాజ్యమంటే వారికి గౌరవ మధికమయింది. 'ఈమగధసామ్రాజ్యప్రాబల్యమంతా మనచాణక్యుడిదే' అనికూడా సంతోషంగా చెప్పుకుంటూ మనయెడ అనురక్తులై వుంటున్నారు.

"కేరళపుత్రదేశము పోకతోటలతో కొబ్బరితోటలతో, ఏలాలవంగజాతీలతలతో నందనవనంవలె వుంటుంది. పురాతనములైన అరణ్యములలో కావలసినంత దారుసంపద వుంది వారికి. వజ్రాలు, ఇనుముదొరికే ఖనిజసంపదకూడా వుంది. చక్కని రేవుపట్నాలు, పలురకాలఓడలు, అరబీదేశంతో నిత్యం వ్యాపారం, నిజంగా కేరళపుత్రం చాలా ఐశ్వర్యంగలదేశం.

"పిమ్మట మేము సత్యపుత్రదేశపురేవు మంగళూరుమీదుగా కన్నడదేశం చొచ్చి అంజిద్వీపమూ **Oyster islands,** శశిగ్రీవమూ **Vengurla rocks** చూచాము. కరవీరగోకర్ణక్షేత్రములు సేవించుకొన్నాము. కన్నడతీరములందు చోరభయం విస్తారం. అయితే మేము మగధులమని విని మాజోలికిమాత్రం ఆచోరులు రాలేదు.

"అనంతరం కన్నడభూమిదాటి ఉత్తరదిక్కుగా మహాలవణం Malwan చేరి, రత్నగిరిని, మందరగిరిని, విజయదుర్గమును, దేవగిరిని, చంపావతిని దర్శించి పశ్చిమాంధ్రరాజధానియైన కళ్యాణపురం చేరాము. ధాన్యకటకమునుండి, ప్రతిష్ఠానమునుండి వచ్చిన వస్త్రములతో, ధాన్యరాసులతో నిండి వున్నది కల్యాణపురం. తమిళదేశపురేవులలోను, ఆంధ్రుల రేవులలోను చోరభీతిమాత్రం లేదు."

"కల్యాణమునుండి బయలుదేరి తపతీనర్మదాముఖములందున్న మన రేవులు సూరత్తును, భరుకచ్ఛమును చూచి అటనుండి ఉజ్జయిని కేగితిమి. పిమ్మట సోమనాథక్షేత్రమును ద్వారకను దర్శించి మరల పశ్చిమసముద్రము మీదుగా పూర్వోదధి చేరి, రామేశ్వరుని సేవించుకొన్నాము. అటనుండి పాండ్యులరేవుపట్టణం కొరకాయి చేరుకొన్నాము. ప్రపంచకంలో నానా దేశాలనుండి వచ్చిచేరిన ఓడలతో కిటకిటలాడుతున్న ఆరేవు పాండ్యులసంపదను మూడు వేయినోళ్లతో చాటి చెప్పింది. ఇటుకలతో కలపతో కట్టి ముత్యములు పగడములు తాపినపాండ్యులయిండ్లు ఎంతో చూడ ముచ్చటగా వున్నవి. అటనుండి మధురకేగి, మీనాక్షిని సేవించి, చోళరాజుల రేవైన కావేరీపట్టణం చేరుకొన్నాము. చోళరాజధానియైన ఆర్కాడునగరం దర్శించి నాగపట్టణం పుదుచ్చేరులు దాటి కాంచీనగరం చేరి అచట కామాక్షిని సేవించుకొన్నాము.

"పిమ్మట ఆంధ్రదేశం చొచ్చి మచిలీపట్టణపురేవు ప్రవేశించాము. అచట పలువన్నెలవస్త్రములు కనులార చూచి ఆంధ్రులనైపుణ్యాని కెంతో ముచ్చటపడ్డాము. అటనుండి అమరావతిని, రాజపురాన్ని, ధనదపురమునూ దర్శించాము. ఆంధ్రులు వేషభాషలలో తమిళులకంటె మనకే ఎక్కువ సన్నిహితులుగా కనుపించారు." మచిలీపట్టణంలో లంగరుఎత్తిన పదహారుమాసాలకు మళ్లా తామ్రలిప్తి చేరుకొన్నాము. మొత్తం మున్నూటనలభైయైదుగురు నావికులూ, ఎనమన్నూటనలభైమంది బేహారులూ త్రోవలో నష్టపడ్డారు.

తిరుగా రెండేండ్లకు దేవరపాదమూలానికి చేరుకున్నాము" అని వినయపేశల మితుడై సముద్రనాథుడు నమస్కరించెను. సార్వభౌముడు సముద్రనాథుని ప్రియమార కౌగిలించుకొని చందనతాంబూలదానాదులచే సత్కరించెను. "సముద్రనాథునిసేవకు మాకు చాలసంతోషమయింది. ఏటేటా 24000 పణాలభృతితో ఈతణ్ణి పదియేండ్లపాటు మానావికాపథాధిపతిగా అభిషేకించి శ్రేష్ఠిబిరుదంతో సత్కరిస్తున్నాము. వేయిఓడలు కట్టించడానికి సముద్రనాథ శ్రేష్ఠికి అధికారమిస్తున్నాము" అని పలికి సార్వభౌముడు నాటికి గొలువు చాలించెను.

---

# 33

## మే ఘ స్థా ను డు

ఆట శల్యకేశ్వరుడు శత్రువులనెల్ల బరాజితులనొనర్చి, రాజ్యము నిష్కంటము గావించికొని, క్రీ. పూ. మున్నూరవయేట! మేఘస్థాను డను మిత్రుని మౌర్యసార్వభౌమునిచెంతకు రాయబారముం పెను. అప్పటికి వక్షశిలలో సార్వభౌమప్రతినిధియైయున్న బిందుసారుడు, హరివన Ariana పాలకుడైన ఆర్యమిత్రుని హరిస్థలము Herat వరకు నెదురంపి, మేఘస్థానుని సగౌరవ ముగ వక్షశిలానగమునకు దోడితెప్పించెను. ఆరాయబారియుం బిందుసారుని సత్కృతు లంగీకరించుచు దన్నగరమున గొన్నాళ్లుగడపెను. పిమ్మట బిందుసారు డాతనికి సిద్ధార్థకుని దోడుగా నొసగి పాటలీపుత్రమున కంపెను.

పాటలీపుత్రమున కేగురాచబాట పదియాఱుగజములవెడల్పు. ఉభయ పార్శ్వములు దట్టముగా బెరిగిన తరుశ్రేణి శాఖాహస్తములు సాచి బాటపై జల్లపందిళ్లు కప్పించుచుండెను. క్రోశపాదమున నర్ధక్రోశక్రోసు కొకరాయి దవ్వునెఱిగించుచుండెను. ప్రతియోజనమున నొకసత్రమును దిగుడుబావియు

బాటసారులను జేరబిల్చుచుండెను. పథశ్రమము గానరానీని యామార్గము వెంట శల్యకమాత ప్రయాణ మొనర్చుచు నింద్రప్రస్థమును హస్తినాపురమును గడచి, సిద్ధార్థకు డయ్యయ్యక్షేత్రమాహాత్మ్యము లెఱిగింప నాలింపుచు, రాధాపురమార్గమున గాన్యకుబ్జముం జేరి యటనుండి ప్రయాగమును దర్శించి, క్రమముగా గాశీనగరముం బ్రవేశించెను. విశ్వేశ్వరస్థానముం దర్శించుకొని యట గదలి, తక్షశిల వీడిన యఱువదియాఱునాళ్లకు బాటలీపుత్రముం బ్రవేశించెను.

పాటలీపుత్రమార్గమున గంగాయమునాగోమతీగోగ్రాదులగు నదీప్రవాహములచే సారవంతములై, సస్యశ్యామలములై యెడనెడ గాన్పించు జనపదములఁ గాంచి యావనరాయబారి, సాధువర్తనులు, కష్టజీవులు, దీర్ఘతనులు, స్ఫురద్రూపులునగు ప్రజలవేషభాషల నవలోకించి, చంద్రగుప్తరాజ్యమున సుభిక్షమిల్లుగట్టుకొన్నదని సంతసించెను. సరిగంచులబుటేదారు వలిపవస్త్రములు దాల్చి, మణిఖచితములగు స్వర్ణభూషణములు ధరించుకొన్న జనపదకాంతల సౌందర్యమునకు దలయూపికొనుచు, క్రయవిక్రయాదిసమస్తవ్యవహారములను, వ్రాతకోతలు లేకయే, నోటిమాటతో జరపికొనిపోవు ప్రజలనీతివర్తనమును, సరళస్వభావమును గాంచి యచ్చెరువందుచు, వారివినయమును బోదుపరితనమును మెచ్చికొనెను. ఇంటికతలుపులకు బీగములిడకయే గృహస్థులు దమతమ పనులవెంట జనుచున్నను చౌర్యమన్నమాటయే యెందును వినరామి కాతడెంతయు నాశ్చర్యరసమగ్నుడయ్యెను. సంపన్నగృహస్థులకు సేవకులు త్రోవ వెంట గొడుగులు పట్టుచుండుటగాంచి "ఆసేవకులందరూ బానిసలేనా" యని యడిగి, "చంద్రగుప్తరాజ్యమున నరవిక్రయమును, దాస్యమును లే"వని సిద్ధార్థకునివలన దెలిసికొనెను. బ్రాహ్మణరక్షితములగుచు జిరకాలాగతములగు స్మృతులు పక్క వేఱుశాసనము బ్రజలెఱుఁగరనియు ప్రజలు ఎవరివేళకు వారు ఒంటరిగా భోజనమొనర్చుటయేగాని అందఱు గుమిగూడి భుజించుట కంగీకరింపరనియు, పూర్వాచారాతిక్రమణమునకు సహింపరనియు, సంపన్నులు

బియ్యమును వండికొని కాయగూరలతో నారగింతురనియు, పేవలు గంజి కాచుకొని త్రాగుదురనియు సిద్ధార్థకునిచే నాతడు విని భారత ప్రజలు సంతుష్ట జీవనులని సంతసించెను.

మేఘస్థాను డెల్లి దీపావళిపండుగ యనగా పాటలీపుత్రముం బ్రవేశించెను. మఱునాడు చంద్రగుప్తసార్వభౌముడు మంత్రి సామంతదండనాయక పరివృతుడై భద్రాసనమున నభ్యంగన మొనరించికొని గంగాజలాభిషిక్తుడై, సామంతగణ మొసంగు కానుక లంగీకరించుసమయమున మేఘస్థానుడు గూడ గొలువుసాలకేగి శల్యకుడంపిన యంజూరపుద్లును, ద్రాక్షాసవయమును, ఖర్జూర ఫలములను, వెలలేని పాత్రలును కానుక పెట్టెను. సార్వభౌము డాదరపూర్వముగా వానినెల్ల నంగీకరించి శల్యకుని కుశలమారసి, పచ్చలుదాపిన పైడిగిన్నెల నిండ వృక్ష్యౌషధములు నింపి శల్యకునకొసగుమని మేఘస్థానునకొసగి, యాతని గూడా సత్కరించెను. పిమ్మట రాకసేనుని, ద్విభాషియగు కాత్యాయనుని శల్యక మాతకు దోడొసగి పాటలీపుత్ర విశేషములు చూపుడని పంచి, సార్వభౌముడు కొలువు చాలించి ధర్మస్థానమున కేగెను.

మేఘస్థానుడు తొలుత దేవబలిగృహమున కేగి, యచట బశువులను నవరంధ్రములు మూసి చంపుచుంట గాంచి, 'కత్తితో నఱకక ఇట్లా ఎందుకు చంపుచున్నా" రని కాత్యాయను నడిగెను. "వికలాంగమైనపశువు దేవతలకు ప్రీతి కాదు" అని యాత వెఱిగించెను.

త్రోవలో ధర్మస్థానమున వొంగిచూడ నచట సార్వభౌముడు న్యాయ విచారణము సల్పుచు అంగోద్వర్తనము చేయించుకొనుచుండుట కాన్పించెను. "మహారాజులుంగారు అంగమర్దనం ఇక్కడనా చేయించుకొనేది, యింత బహిరంగంగా!" అని యడుగ గాత్యాయనుడు "న్యాయవిచారణం చేసేటప్పుడు తీరికగా వుంటుంది గదా అని యిచటనే చేయించుకొంటారు. దీనికొఱకు వేఱే కాలహరణమెందుకని" అని బదులు పలికెను.

మేఘ.—"ఈయెండవేళ ప్రభువులు నిద్రపోరా యేమి?"

కాత్యా:—"పగటివేళ వారెప్పుడూ నిద్రించరు.

ఇట్లు ప్రసంగించుకొనుచు వారు సార్వభౌమునిశయ్యామందిరమున కేగిరి. ఆమందిరమున నెచిమిది పడుకగదు లుండెను. గదు లన్నిట ప్రతీహారిణులు కాచి యుండిరి. సార్వభౌముడు నిరపాయతకై యిన్ని పడకగదులలో నేనిలోనో శయనింతురనియు, రాణులు సంచరించు ప్రదేశముగాన నిచట బురుషసేవకు లుండరనియు గాత్యాయనుడు మేఘస్థానునకు దెలియజెప్పెను.

అనంతరమున వారు పానమందిరమున కేగి యచట ద్రాక్షాసవాదులచే నిండిన స్వర్ణకుంభములను బానపాత్రలను గాంచిరి. శల్యకదూత "సార్వభౌములు పానప్రియులేనా?" యని యడిగెను.

"ఎపుడో మీవంటి అతిథులు వచ్చినపుడూ, విశేషతిథులయందూ సార్వభౌములు కొంచెముగా సేవింతురే కాని వారు పానప్రియులు గారు. మద్యసేవావ్యసనం రాజులకు నిషేధింపబడినది మాస్మృతులలో. తఱచు ప్రతీహారిణులే ప్రభువు లీవ్యసనంలో తగుల్కొనకుండా చూస్తూ వుంటారు. వెనుకటి కొకరాజు అతిపానంచే ఒడలు తెలియక, చెంతనున్న క్షత్రియప్రతీహారిణిపట్ల మర్యాద తప్పి ప్రవర్తించాడట. అంతట నాకులాంగన మొలనున్నకత్తి తీసి ఆమూర్ఖుణ్ణి పొడిచి చంపిందట. రాజహత్య చేసినందు కామెను దండించలేమ సరిగదా, తరువాత పీఠమెక్కినరాజు ఆమెధీరత్వానికి, సచ్చరిత్రకు మెచ్చి ఆమెనే పెండ్లిచేసుకొన్నాడట" అని కాత్యాయను డాతని కెఱుగ జెప్పెను.

పిమ్మట మేఘస్థానుడు శల్యకేశ్వరపుత్రియగు దేవభాగ్యవతను జూడ నేగి యామహారాజ్ఞితో నొంటిమైగష్టసుఖములు మాటలాడెను. పితృసఖుడగు మేఘస్థానుని గన్నంతనే యామెకు జన్మభూమిని గాంచినట్లయి కొంతతడ వాదేశపు ముచ్చటలతో గాలము గడపి, పిమ్మట నాతడు ప్రశ్నింప నిచటి తన యునికిని

గూర్చి యిట్లు తెలిపెను. "శాంతవతీదేవి అభిజాత్యసంపన్న యైనా గర్వ మెట్టిదో ఆమె యెఱుగదు. దుర్ధరాదేవిని, నన్ను దోబుట్టువులుగా చూచు కుంటుంది. ముందు మేము భోజనం చేయకుండా తాను తినదు. పెద్దరాణిననే ఔద్ధత్యం మందుకైనా ఆదేవిచెంతలేదు. తనకు సంతానం లేకపోయినా యువరాజునే తనబిడ్డగా చూచుకొన్నది."

మేఘ.—"యువరాజులుంగారిని తక్షశిలలో దర్శనంచేశాను. నన్ను ఎంతో గౌరవించారు. సర్వవిధాలా సార్వభౌములకు దగిన కుమారులే. మనభాష యందు తండ్రిగారికంటె వారి కెక్కువప్రవేశం కూడా వుంది. మన ద్రాక్షారసం రుచికూడా తెలుసును వారికి."

దేవ.—యువరాజులుంగారికి నావద్ద చదువు అధికం కావడంచేత మనభాష అధికంగా పట్టుబడ్డది. దుర్ధరాదేవి కూడా చాలా యోగ్యురాలు. సౌమ్య స్వభావ. నాపట్ల యెంతో అనురక్తిగా వుంటుంది. కుమారున కెప్పుడేమి ఆపద గలుగుతుందో అని నిత్యమూ భయపడుతూ వుంటుంది.

మేఘ.—మహారాజులుంగారిమాట యేమీ చెప్పవైతివి?

దేవ.—వారు మహాపురుషులు. వారినిగూర్చి నేనేమి చెప్పగలను? నాభర్త గారని చెప్పడంకాదు. వారు సర్వవిధాలా మాతండ్రిగారిని మఱపించారు. ఆ కార్యశూరతా, ఆప్రజారంజనశీలమూ, ఆపాపభీతి, ఆదైవభక్తి యింకో చోట మరి చూడము. మాముగ్గురిపట్లా ఎంతో ప్రీతివారికి. కుమారుడంటే ప్రాణమే. ప్రజలంతా వారికి సంతానమే. ఇందరిమీదాకంటె వారిమన స్సంతా దైవంమీదనేవుంటుంది. మహారాజు కర్మయోగి అని అంతాఅను కొంటారేగాని నాకు జూడగా వారు మహాభక్తులని తోస్తుంది. ఎప్పుడూ ఆదేవతావిగ్రహాలముందు ధ్యానస్థిమితులై కూర్చుండివుంటారు. ఒకనాడు శివలింగంముందు మోకరిల్లి వుండి కండ్లవెంట వూరికే ఆనందబాష్పములు కారుస్తున్నారు. దుర్ధరాదేవి కూడా వచ్చి వారిచెంతనే సాష్టాంగంపడింది.

తరువాత శాంతవతీదేవితో నేనీవృత్తాంతం చెప్పేసరికి "అయ్యో! ఆదివ్య దర్శనం నాకు లభించదాయెను గదా!" అని చాలా విచారించింది. నే నప్పుడు నవ్వుతూ అన్నాను గదా "అదియేమి దివ్యదర్శనమో నేనెఱగను గాని వారున్నట్లుండి ఎప్పుడో మనలనందరినీ విసర్జించి దండిస్వామిలాగా బైరాగులతో కలసిపోవడం మాత్రం నిజం" అన్నాను. వారు నిజంగా అలా లేచిపోతారేమోఅని ఆమెకు విచారంకలగలేదు సరికదా, పైపెచ్చు ఎంతో గౌరవంతో "ఔను. వారికి మొదటినుంచీ ఆముష్మికమునుగూర్చిన చింతే. దైవభక్తి వారికి పుట్టుకతోనే అబ్బింది" అని సంతోషంతో పలికింది."

మేఘు:—"సరేకాని, అమ్మా! నీకు మళ్లా మనజన్మభూమి చూడాలని లేదూ!"

దేవ.—నిట్టూర్చి, ఇంచుక మౌనముతాల్చి "లేదుబాబయ్యా! ఒకవేళ చిన్ననాటిస్నేహితులను, బంధుమిత్రులను చూడాలనికోరికవున్నా, ఒక్కసారి అందరినీ చూడగానే అది తీరిపోయేదేగాని నన్ను మళ్లా జన్మభూమితో కట్టి వుంచలేదు. ఈదివ్యదేశం నాచిత్తాని హరించి కైవసం చేసుకొన్నది. ఈహిమాలయశిఖరాలూ, గంగాయమునలూ మనపర్వతాలనూ నదులనూ మఱపించినవి. ఇచటి మామిడిపండ్లు మరగి మన అంజూరను, ఇచటికోకిలా ధ్వని విని మనపక్షుల కలధ్వనులనూ మఱచాను. ఇచటిగోమాతలనుచూచి మన అశ్వరాజాలను మఱచాను. నీదగ్గర దాచడమెందుకు? నాభర్తగారికి నాదేహం ప్రాణం మనస్సూ అర్పించి బాబయ్యగారినే మరిచాను. ఏమి చెప్పను! ఈపుణ్యభూమి కటువంటిమహిమ వుంది.

మేఘు:—నిజమే కావచ్చు. నేను ముఖ్యంగా ఈదేశప్రభావాన్ని తెలుసుకుందామనే వచ్చాను. ఒక గ్రంథం కూడా వ్రాయాలని సంకల్పించాను. నీకు తెలిసినవిశేషా లింకా వుంటే చెప్పు వింటాను.

దేవ:—నావల్ల ఏమి వింటావు! నీకు కావలసినసంగతులన్నీ కాత్యాయనుణ్ణి అడుగు, ఆతడు చెపుతాడు.

అని కాత్యాయనుని బిలిపించి "మేఘస్థానునకీదేశపువిశేషాలన్నీ తెలియజెప్పు" మని పంపెను. ఆతడును "మహాప్రసాద" మని మరల శల్యకదూతను వెంటగొని కారాగారముచెంత కేగెను. అచట కన్యాబలాత్కారదోషమునకై యొకనిశిరస్సును పాషాణములతో మర్దించుచుండిరి. కన్నుపొడిచినదోషమున కింకొకనిచేతిని ఖండించుచుండిరి. శిల్పవిద్యానిపుణు డగువానిహస్తములు నఱికినదోషమునకై వేఱొకనితల దఱిగివేయుటకై తలవరులు సిద్ధముగానుండిరి. ఇట్లు పగులబడుచుండగా జూచి శక్తిగల్గియు నామంటల నార్పనిదోషమునకై యిరువురిని కశాఘాతములపాలొనర్చుచుండిరి. మేఘస్థానుడాయీదోషులకు దండనమువిధించిన యధికృతు లెవ్వరని యడిగి తెలిసికొని, "నగరంలో చౌర్యము జరుగుచుండునా?" యని ప్రశ్నించెను. కారాగారరక్షకు డగు విజయపాలుడు "చౌర్యం, ఇచట చాలాఅరుదు. నాల్గులక్షలప్రజలుండే యీమహానగరంలో దినానికి ఏరెండువందలపణాలో దొంగతనం జరుగుతూవుంటుంది" అని బదులు పలికెను.

పిమ్మట మేఘస్థానుడు పురపాలకులుండు భవనమున కేగెను. నగరమందలి కర్మవిద్యలనుగూర్చియు, వైదేశికులనుగూర్చియు, జననమరణములగూర్చియు. వర్తకవ్యాపారములనుగూర్చియు, ఉత్పత్తియగువస్తువులనుగూర్చియు క్రయవిక్రయములపై గ్రహించు పదియవవంతు పన్నునుగూర్చియు విచారించు వేర్వేరు పంచాయతుల నచటగాంచెను. ఈపంచాయతులన్నియుగూడ దేవాదాయధర్మాదాయములను, విపణివీథులను, ఓడరేవులనుగూర్చి విచారించి పాలించుచుండునని తెలిసికొనెను.

అనంతరమున వార లారాయబారికి సేనాంగపరిపాలనము జూపుటకై సేనాధికారిస్థానమునకు గొంపోయిరి. అచట సేనాంగములు నాలుగింటికి నలుగురధికృతులును, వారి కాలోచనము చెప్పుటకు నాలుగు పంచాయతు

లుండెను. అట్లే నావికాదళాధిపతికిని, సైన్యసంభారపరిశీలకునకును సహాయ మొనర్పు పంచాయతులు నుండెను. పిమ్మట నారాయణుని యచట నేనుంగుల నడుపుచున్న మావటీంద్రను, నాలుగుగుఱ్ఱముల బూన్చినరథములను నడపుసారథులను గాంచెను. సేనలో నందఱికిని ధనరూపముననే భృతులు ముట్టుననియు, సైనికులు పనిచాలించుకొన్నపుడు వాహనములు నాయుధములు వదలిపోవుదురనియు, సార్వభౌముడుదక్క నితరగృహస్థులెవ్వరును యుద్ధార్థములగునేనుగులను గుఱ్ఱములను బోషింపరాదనియు గాత్యాయనాదు లాతని కెఱింగించిరి.

పదంపడి మేఘస్థానుడు తక్కుంగల రాజకార్యస్థానముల బరిశీలించి, నీటిపంపకపుబద్ధతులను, బన్నులువిధించుపద్ధతులను, భూమినికొలచుపద్ధతులను గూర్చి విశేషము లడిగి తెలిసికొనెను.

చంద్రగుప్తునిపరిపాలనమున శ్రావణమాసారంభమునుండి ఆషాఢాంతమువఱకు మున్నూటయేబదినాల్గుదినము లొకవత్సరమనియు, ప్రతివత్సరాంతమునను ఆదాయవ్యయములు పరిగణించి సరిచూతురనియు, గణకులు ఆలసించినచో దండనార్హులనియు మేఘస్థానునకు గాత్యాయను డెఱిగించెను. ఋత్విజులకు. రాజగురువునకు, పురోహితునకు, మంత్రులకు, సేనాపతికి, యువరాజునకు, రాజమాతకు, రాణులకు సంవత్సరమునకు 48000 పణములభృతి ఇచ్చుచుండిరి. సన్నిధాతృకాంచుకీయాదులకు 24000 పణములును, నగరరక్షకులకు, వివిధశాఖాధికృతులకు 12000 పణములును, గజరథాధ్యక్షులకు ఎనిమిదేసివేలు, పదాతిదళపతికి, నశ్వాధ్యక్షునకు నాలుగేసివేలు, గజరథచోదకులకు రెండేసివేలు, కవులకు దైవజ్ఞులకు వేయిపణములు; సైనికులకు గణకులకు సైదునూర్లు నటులకుగాయకులకు నిన్నూటయేబది, శిల్పులకు నూటయిరువది, వార్తాహరాదులగు సేవకులకు నరువదేసిపణములును భృతులు. మేఘస్థాను డీవివరములన్నియు నాలించి, "పెద్దఅధికారులభృతులు చాలాఎక్కువగా నున్నవి" అనెను. కాత్యాయనుడు "రాజపురుషులకు లేమియు, ప్రలోభమూ పరిహరించవలసి వుంటుంది" అని బదులు చెప్పెను.

మేఘస్థాను డీవిధముగా నొకపక్షముదినములు వివిధరాజ్యాంగవ్యవహారములను బరిశీలించి యెన్నియో విశేషములు గ్రహించెను. పిమ్మట నాతడు నగరమున బ్రాహ్మణాగ్రహారమున కేగి యచట స్వాధ్యాయనిరతులు, శమదమసంపన్నులూ, లోభవంచకరహితులూ నగువిప్రస్వాముల గాంచెను. బ్రాహ్మణులచట అధశ్శయనబ్రహ్మచర్యాదినియమములతో ముప్పదియాఱేండ్లవయసు వచ్చేవఱకు గూడ వేదశాస్త్రము లభ్యసించుచుండిరి. పిమ్మట వివాహితులై సాత్వికాహారులు, పంచయజ్ఞపరులు, షట్కర్మనిరతులునై కాలము గడపుచుండిరి. సంధ్యాసమయములందు పండితగోష్ఠులలో నిహపరములగూర్చినవిచారణము జరుగుచుండెను.

పిమ్మట నాతడు శ్రమణకవిహారముల కేగి వారి వ్రతాచారాదుల బరిశీలించెను. శ్రమణకులు మందుమాకులతో రోగులను చికిత్సించుచు, ఇంద్రజాలప్రయోగాదులచే, నారకబాధావర్ణనములచే ప్రజలకు భక్తివిశ్వాసములను గల్పించుచుండిరి.

పిమ్మట నాతడు భద్రభటునితో గూడి కళింగారణ్యభూముల కేగి, యచటవనకరులను బట్టుకొనునుపాయముల గనులార గనుగొనెను. ఏనుగుల గాయములకు నుష్ణోదకముచే గాపులువెట్టి, ఆపైని వెన్నతో బూతవెట్టుటయు, పుండ్లకు నెత్తుగోడుచున్న నూతనవరాహమాంసముతో గట్టు కట్టుటయు, కనులలో నావుపాలు బోయుటయు, మద్యమును గోడిమాంసపుసూపమును పథ్యముగా నొసగుటయు నాతడు సూచెను.

ఈరీతిగా బాటలీపుత్రమున రెండునెల లాతడు గడపి, స్వదేశమున కేగువాడై, సార్వభౌమునిచే ననుజ్ఞాతుడై, కాత్యాయనుని జేర బిలిచి, "రేపు మనము మరల గలిసికొందాము, ఇంకను నీవల్ల తెలిసికొనవలసినవిషయాలున్నవి" అనెను. ఆతడును 'వల్లె' యనెను.

# 34

## ఉన్నవీ, లేనివి

మఱునాడు మేఘస్థానుడు కాత్యాయనునితో సంభాషణమునకు దొరకొని ముందుగా భరతఖండవైశాల్యమును, సరిహద్దులను, ముఖ్యనదీనదములను, బర్వతములనుగూర్చి ప్రశ్నించెను. కాత్యాయనుడు గంగాసింధుమహోదధులు భరతఖండపు టెల్లలని చెప్పి, నదీనదపర్వతముల వర్ణించి తుదకు శిలానదినిగూర్చి చెప్పుచు, "పూర్వ మొక పరమలోభి వుండేవాడట. ధనము విపరీతప్రవర్ధకి ఇచ్చి ఎన్నియోసంసారా లాతడు గుల్లచేశాడు. వానిదురాశకు, కాత్యాయనికి కోపించి చంద్రుడు వాణ్ణి శిలానదివి కమ్మని శపించాడట. అప్పటినుంచీ వాడు నదియై పాఱుతూ వున్నాడు. ఆనదిలో ఏవస్తువు వేసినా వెంటనే శిలయై మునిగిపోతుంది. ఎవరో సిద్ధపురుషుల్లు తప్ప ఇతరు లచటికి వెళ్ళలే" రని తెలిపెను. పిమ్మట మహేంద్రగిరి భరతఖండమునకు నడిబొడ్డనియు, నచట నీడలు దక్షిణమునకారునెలలు, నుత్తరముగా నాఱునెలలు వ్యాపించుచుండుననియుం దెలిపెను.

పిమ్మట నీదేశమున రెండుపంటలు పండునని ఎఱిగించి, ముఖ్యమైన ధాన్యములగూర్చి తెలిపి, చెఱకుపంటవలన చక్కెరయుం, పత్తివలన వస్త్రములును లభించువిధమును బోధించెను. అనంతరమున భారతీయులముఖ్యదైవతములగు శివకేశవాదులగూర్చి ముచ్చటించి, చంద్రవంశపురాజుల ప్రస్తావము దెచ్చి, చంద్రగుప్తమహారాజావంశములో నూటయేబదిమూడవ రాజనియు నావంశ మప్పటికి 6042 సంవత్సరములనుండి యీదేశము నేలుచుండెననియు వివరించి చెప్పెను.

పదపడి మేఘస్థాను డీదేశమందలి పశుపక్షిమృగాదులగూర్చి ప్రశ్నింప కాత్యాయనుడు సింహవ్యాఘ్రభల్లూకవానరాదులగూర్చి తెలుపుచు, ఇచట

వెల్లయేనుగు లున్నవనియు; నవి చాలనరుదుగా లభించు ననియు జెప్పెను. మఱియు నాతడు "ఈదేశంలో రెక్కలపాము లున్నవి. అవి రెండుమూళ్ల పొడవు మాత్రమే వుంటవి. రాత్రులు అవి యెగిరిపోయేటప్పుడు వాటిమల మూత్రములు మీదబడిన ప్రాణులు వెంటనే చచ్చిపోవును. అడవులలో పెద్ద పెద్ద తేళ్లుంటవి. అవి పశువులను గూడా అవలీలగామ్రింగుతవి. ఇంకా యిచట బంగారపుగనులు తొలిచే చీమలున్నవి. అవి పెద్దనక్కలంత వుంటవి. తమ బంగారం ఎత్తుకుపోతారనేభయంచేత ఎవరినీ చెంతకు జేరనివ్వవు. సింహళ దేశంలో ఏనుగులదంతాలలో మంచిముత్యాలు దొరుకుతవి. ఇచట సముద్రంలో బ్రహ్మాండమైన తాబేళ్లు వుంటవి. వాటిచిప్పలలో నూరుకడవలనీళ్లు అవలీలగా పట్టుతవి. అరణ్యాదేశంలో అడవిగుఱ్ఱా లున్నవి. వాటిని పట్టి తెచ్చి గాడిదలతో కలిపితే కంచరగాడిదలనేజాతి పుట్టుతుంది. అవి బండ్లు లాగుతూ వుంటాయి" అనుచు నెన్నియో వింతలు విశేషములు వచించెను.

మేఘస్థాను డంతట "ఈదేశపుప్రజలలో ఎవరైనా విచిత్రజాతులవాళ్లున్నారా?" అని యడిగెను. కాత్యాయనుడు "లేకేమి. కిరాతులని 45 అంగుళాలవాళ్లు హిమాలయాల్లో వుంటారు. వాళ్లలో పొట్టివాళ్లు 27 అంగుళాలే వుంటారు. వాళ్లకు ముక్కు లుండవు. కొందరు పెద్దపెద్దచెవులవాళ్లున్నారు. ఆచెవులనే ప్రక్కపరచుకొని పండుకొంటారు. ఒంటిపైన కప్పుకొంటారు. కొందరిపాదాలకు మడిమలు ముందుకు, వ్రేళ్లువెనుకకు వుంటవి. అటువంటివాళ్ల నిద్దరిని పట్టి తెప్పించవలెనని సార్వభౌములు ప్రయత్నమైతే చేశారుగాని వాళ్లు అన్నమూనీరూ ముట్టక త్రోవలోనే చనిపోయినారు. వీరు కాక లలాటాక్షులున్నారు. వారికి నొసటనుంటుంది ఒక్కటే కన్ను. ఇంకా ఖడ్గరోములున్నారు. వారితలవెండ్రుకలు కత్తులవలె నిక్కపొడుచుకుంటాయి. ఇంకా ఉత్తరకురులని వున్నారు. వారు వెయ్యేండ్లు బ్రదుకుతారు. కొందరు కాయకల్పవిధిచేత చిరకాలం జీవిస్తారు. మాదేశంలో ముసలివాళ్లను పడుచువాళ్లనుచేసే వృష్యయోగము లున్నవి" అనుచు వచించెను.

మేఘ.—"అప్పుడప్పుడు. కల్యాకేశ్వరుల కివ్వవలసిం దని మహారాజు నా కామందులిచ్చారు. ఈమందుమాకులు లేనివారు సాధారణంగా ఎంత కాలం బ్రతుకుతారు?"

కాత్యా.—ఇచట అరవైయేండ్లు సామాన్యంగా ఆయుర్దాయం. పాండ్య దేశంలో నలభైయేళ్లే ఆయుస్సు. అచట తొమ్మిదోయేటే స్త్రీలు బిడ్డలను కంటారు. ఇరవైయేండ్లకల్లా తలలు నెరుస్తవి పురుషులకు. చిన్నతనంలోనే స్త్రీపురుషులు పండిపోతారు. స్త్రీపురుషులే కాదు; చెట్లు కూడా త్వరగా పండుతవి.

మేఘ.—బాగున్నదికాని ఈమహాఖండంలో ఎన్నిదేశాలు, జాతులూవున్నవో అని నేను ఆశ్చర్యపడుతూ వుంటాను.

కాత్యా.—నిజమే. నూటపద్దెనిమిది దేశాలున్నవి. మశకావతిలో అశ్వకులూ, తక్షశిలలోతక్షులూ మీరెరిగినవారేకదా! ఇంకా కాశ్మీరులూ, ఆరట్టులూ, యౌధేయులూ, అభీరులూ, శౌరసేనులు, శకులు, కిరాతులూ వున్నారు. ప్రాచ్యులమూ, గంగాపుత్రులమూ మే మున్నాము. మాకు పాటలీపుత్రం రాజధాని. ఆఱులక్షలపదాతులు, 30000 అశ్వదళమూ, 6000 రథాలూ, 9000 ఏనుగులూ మారాజ్యానికిరక్ష. ఆవల కాళింగులున్నారు. వారిలో ఉత్తరకాళింగులకు 6000 పదాతులు, వేయిగుఱ్ఱాలూ, ఏడునూర్ల ఏనుగులూ వున్నవి. తామ్రలిప్తిరాజ్యానికి 50000 పదాతి బలం, నాల్గువేల అశ్వదళం, నన్నూరు గజబలమూ వుంది. ధనదపురంలో మధ్యకళింగు లున్నారు. ఆవల ఆంధ్రరాజ్యమున్నది. వారికి లక్షపదాతి దళమూ, 2000 గుఱ్ఱాలూ, వేయింటికి గజబలమూ వున్నది. రాజపురం, మచిలీపట్టణం, అమరావతి, కల్యాణం, ప్రతిష్ఠానం, ధాన్యకటకం మొదలైన అభేద్యనగరాలు ముప్పది వున్నవి ఆంధ్రులకు. సింధుదేశంలో వున్న పాటలం మొదలైనరాజ్యాలు మీ రెఱిగినవే. మధ్యదేశంలో నిషధాదు

లున్నారు. వల్లభీపురంలో సౌరాష్ట్రులనే మహావీరజాతు లున్నారు. వారికి 1600 గజబలము, 150000 పదాతిదళం, 5000 అశ్వదళమూ వున్నది. ఇంకా శర్మమండలసౌరమానాదు లున్నవి. దక్షిణదేశంలో బలిష్ఠమైన పాండ్యరాజ్య మున్నది. వారికి మున్నూరు నగరాలూ, 150000 కాల్బలమూ, వీనూరేనుగులూ వున్నవి. మధుర వారికి రాజధాని. ఆర్కాడులో చోళులున్నారు. త్రోపాంత్రములో కేరళ పుత్రులున్నారు. 750 గ్రామాలతో సింహళరాజ్యమున్నది. ఇంకా ఎన్నని చెప్పను. మొత్తమీద ఈరాజ్యాలన్నీ మగధసామ్రాజ్యాన్ని అను సరించుకొనే వుంటవి.

మేఘ.—ఇంకా యేమైనా విశేషాలుంటే చెప్పండి.

కాత్యా.—ఎన్నయినా చెప్తాను. ముఖ్యంగా మావేదాంతులు, సన్యాసులూ, సిద్ధపురుషులూ వున్నారు.

మేఘ.—వారిని నే నెరుగుదును. మీకల్యాణస్వామిని దర్శించానుకూడా. వారిచరిత్ర కడముట్ట మీరు విన్నారో లేదో. ఆస్వామి ఉపవాసాలు చేసిచేసి, ఒకనాడు కంఠపూర్తిగా మద్యం సేవించి, మాంసాదులు తినే టప్పటికి విపరీతమైనశూలలు బాధించడం మొదలుపెట్టింది. ఆబాధకు స్వాములవారు తాళలేకపోయినారు. తానిలా మితిమీరి తిని జబ్బుపడిన వార్త వింటే మీరంతా నవ్విపోతారనికూడా ఆయనకు భయం పుట్టింది. అంతట ఆలీసాందరుచక్రవర్తితో 'నే నిక ఈదేహం చాలిస్తాను. నాకు చితి పేర్పించండి' అనికోరాడు. ఆప్రభువు స్వాములదురంతం మాన్పాలని ఎన్ని చెప్పినా, అన్నిటికీ అన్నీచెప్పి, తనపట్టు విడిచాడు కాడు. చక్రవర్తి యిక చేసేదిలేక ఆయన కోరికప్రకారం చేయవలసిందని సెలవిచ్చారు. చితి పేర్పించడం మొదలైన ఏర్పాటులన్నీ తులమావి చేశాడు. రణవాద్యములు భోరుకలగుతుండగా కల్యాణస్వామి వేదమంత్రాలు చదువుతూ చితి

ఎక్కి, అందరిదగ్గర సెలవుతీసుకొన్నాడు. 'నాకు ఆత్మశాంతిగా మీరంతా ఈరాత్రి విందులు కుడవండి' అని కోరాడు. చక్రవర్తి ఆదారుణకర్మ చూడలేక అచటికి రాలేదు. స్వామి చక్రవర్తిని బాబిలోనులో దర్శిస్తాను' అనిచెప్పి, అగ్ని దరికొల్పవలసిందన్నాడు. ఆమహాజనసమక్షంలో అగ్నికి ఆహుతియైపోయినాడు. ఆయన అన్నట్లుగానే చక్రవర్తి బాబిలోనులో కాలంచేశారు. ఇదీ స్వాములవారికథ. ఇటువంటివి మీకు పరిపాటియే అని విన్నాను. స్త్రీలు గూడా ఇచట భర్తలచితి ఎక్కుతారని మాదేశస్థులు చెపుతారు.

కాత్యా.—నిజమే. అలాసహగమనం చేయడం సతీధర్మంగా కొందరు ఎంచుతారు. అంతేగాని అది సామాన్యవిధికాదు. ఇంకా మీసందేహాలడగండి.

మేఘ.—మరి సందేహాలయితే లేవుగాని, మీరు ఉన్నవి కొన్నీ లేనివి కొన్నీ గుచ్చియెత్తి చెప్పారు. ఇందులో నిజమెంతో, అసత్యమెంతో ఎలా తెలుసుకొనేది ?

కాత్యా.—నవ్వి, "క్షణికమైన యీజీవితంలో ఆవిచారణ ఎవరికి కావాలి? అదీగాక నిజానికి సత్యాసత్యనిర్ణయం చేయడం ఎందుకు? పుక్కిటిపురాణాలని మీరనుకొనేవి బహుజనులెరిగి నమ్ముతున్న విషయాలు. సత్యమనేవి ఎరిగినవారు అరుదు. కాబట్టి బహుజనం నమ్మేదే సత్యమనుకొంటే తీరిపోయె" అని సెలవుగైకొని యేగెను.

---

# 35

## దుర్భిక్షము

క్రీ. పూ. 299 వ యేట మగధసామ్రాజ్యమునకు దారుణమైనదుర్భిక్షము దాపరించెను. ఒక్కకుంతలమునను, ఇశీలబ్రహ్మగిరులందును, దక్షిణాపథమున సువర్ణగిరిమహామండలమునను దక్క దక్కినచోట్ల వర్షములు లేవు.

పంటలులేమికి మలమలమాడ్చు నెండలు తోడయ్యెను. నదులు, కాలువలు, చెఱువులు, మడుగులు, బావులు, గుంటలు సర్వము నెండిపోయి, ఒక్కచుక్క నీరు దొరకుట దుర్ఘటమయ్యెను. తిండియు, నీరును లేక స్త్రీబాలవృద్ధముగా ప్రజలు, డొక్కలకంటుకొనిపోయినకడుపులతో, ప్రాణములు కనులలో దాల్చి, కన్నుల నాకసమున నిగిడ్చి, యెచటనైన ఆఱచేయంతమబ్బు కన్పించునా యని యారయుచు, నానాటికి నిరాశావశులై హాహాకారములు సల్పజొచ్చిరి. పచ్చికబీళ్లన్నియు బీరెండకు మాడిపోయెను. పశువులకు గ్రుక్కెడు నీరును, కమికెడు గ్రాసమును లభింపవయ్యెను. తొలుత గొన్నాళ్లు అర్ధాకలి తీర్చుకొని, పదపడి కొన్నాళ్లు ఒక్కప్రొద్దులుండి, పిమ్మట గంజితో గడుపులు నింపుకొని, పిదప దుంప లారగించి, ప్రజలు తుదకు శుష్కోపవాసములు చేయ దొడగిరి. ముందుగా బశువులు మరణింప దొడగెను. పిమ్మట పదులు పదులుగా ప్రజలు మరణింపసాగిరి. అనంతరము వందలు వందలు మృత్యువున కెరయగుచుండిరి. ఇంతలో నీకాటకమునకు జెలికత్తెలవలె మహామారియు, విషూచియు దోడు కాగా, ప్రజలు వేలకువేలు మరణించి, గ్రామములకు గ్రామములు పాడువడ జొచ్చెను. ఎంతట జూచినను బ్రజలమోముల దైన్యము, భీతి, నైరాశ్యము వ్రేలుకాడుచుండెను. పట్టెడుగింజ లెచటనైన దొరకినచో వానికొఱకు ప్రజలు రక్కసులవలె దగవులాడుకొన జొచ్చిరి. ఎవరిపొట్టతిప్పలు వారివే కాని దయ, దాక్షిణ్యము, వాత్సల్యము నడుగంటెను. కడుపార గన్నబిడ్డలం కనులముందు మలమల మాడి యసువులుబాయుట గాంచియు దలిదండ్రులు, శుష్కహృదయములతో దమపొట్టలు నింపుకొనుటెట్టులా యని యల్లాడ జొచ్చిరి. దేశములో చౌర్యము, దౌష్ట్యము, దోపిడులు చెలరేగి యరాజకమునకు ద్రోవతీయుచుండెను. వందలకువందలుగా దోమలవలెమాడి, కాటకమున కెరయగుచున్న ప్రాణులను గాల్చువారును బూడ్చువారును లేరు. గుట్టలై పడుచున్న శవముల దుర్గంధము భరింపరాకుండెను. నక్కలేమైనవో, రాబందు లేమైనవో గాని ఎక్కడి శవము లక్కడనే పడియుండెను.

చంద్రగుప్తసార్వభౌము డీవిపత్తునుండి ప్రజలను గాపాడు టెట్లాయని యహోరాత్రములు చాణక్యునితో, రాక్షసామాత్యునితో మంతనముండి పలువిధముల విచారింపదొడగెను. ముందుగా సామ్రాజ్యమునందలి కుమారామాత్య ప్రతిప్రతినిధులకు, ప్రాదేష్ట్రులకు, మహామాత్రులకు, మంత్రిపారిషదులకు, అంతమహామాత్రులకు, యుక్తోపయుక్తులకు, నాగరికస్థానికగోపకులకు, వారు వీరన నేల, సమస్తరాజపురుషులకు, క్షామనివారణోపాయములు వెదకి, శక్తి వంచనసేయక ప్రజలను రక్షింపు డని ఆజ్ఞాపత్రములు పంపెను. సంస్థానములో నెచ్చటెచ్చట నున్న గాదెలు తెరపించి ప్రజలకు గొలిపించి యిచ్చుచుండెను. సత్రములు పెట్టించెను. ఇంద్రాగ్నియమవరుణాదిదేవతలకు సూక్తవిధితో జపములు చేయించుచుండెను. వర్తకులయొద్ద నిలువయున్న ధాన్యమును చవుకగా గొనిపించి, ధనికుల కాధాన్యమును దగుమాత్రము విక్రయము సేయించెను. ధనకీర్తి యనువర్తకునియొద్ద నేబదివేలబస్తాల ధాన్యముండగా నాతడు వేయిబస్తాలే యున్నవని రాజపురుషులకు విన్నవించెను. సార్వభౌముడా వేయింటికి మూల్య మిచ్చికొని, తక్కిన 49000 బస్తాలధాన్యమును దుర్గమునకు జేర్పించి, పేదలకు బంచిపెట్టించెను. వర్తకు లంతట భయపడి మర్మము విడిచి, రాజపురుషులకు దోడ్పడ జొచ్చిరి. ఎవరేమి చేసినను, ఎన్ని త్రిప్పలబడినను, మేఘు డనుగ్రహించవలెనుగాని, మానవయత్న మా ప్రళయములో నేమూల చక్కనొత్తును.! ఇంతలో భద్రబాహుస్వామి యను జైనసిద్ధుడు ఈ ప్రళయమునుండి తప్పించుకొనుటకు ప్రజలను దక్షిణదేశమునకు వలసలు పొండని బోధింప దొడగెను. గయాప్రయాగ వారాణశీ వైశాలీక్షేత్రములందును, పాటలీపుత్రమునందును ఆస్వామి ప్రజల నిట్లు హెచ్చరించుచుండ అగతికులగు ప్రజలు, ఇండ్లు వాకిళ్లు వదలి తండోపతండములుగా దక్షిణభూములకు వలసలు పోజొచ్చిరి. "పురాకృతములైన పాపకర్మాలకు ఫలంగా ఈక్షామం దాపరించింది ప్రజలు హింసాక్రౌర్యము లీవిధంగా పండినవి. దయాదాక్షిణ్యములు నశించినవి

ప్రజలలో. ఈకాటకంవల్ల కుక్షింభరత్వం, లోభం, మాత్సర్యం, పాప చింతా పెరిగి, నరులు రాక్షసులైపోతున్నారు. 'ఒకరి కివ్వా' లనే బుద్ధి వున్నప్పటికీ, ఇచ్చుట కేమీ లేకపోవడంచేత దయాగుణానికి నిలువ నీడ లేకుండా పోతున్నది. ఆర్యధర్మం నశిస్తున్నది. శరీరాన్ని రక్షించుకొని ధర్మరక్షణం చేయవలసి వుంటుంది గనుక, బయలుదేరండి. ప్రజలారా! మహిషమండలంలో సుభిక్షంగా వున్నది. వెంటనే అక్కడికి వలసలుపోయి. ప్రాణములు కాపాడుకోండి" అనుచు నాస్వామి హెచ్చరింప జొచ్చెను. అంతటితో నాగక చంద్రగుప్తసార్వభౌమునకుగూడ "నీరాజ్యము వదలిపొ" మ్మని యుపదేశించెను.

చంద్రగుప్తుడు చాణక్యాదులతో విచారించి, స్వామీ! నేను నారాజ్యమును, ప్రజలను వదలి పారిపోను. ఇచటనే వుండి నాప్రజలను సేవించడం నాధర్మం. యుద్ధమధ్యమందు సేనలను శత్రువులబారిని పడవేసి పారిపోయి ప్రాణములు దక్కించుకోవడం క్షత్రియధర్మంకాదు. నేను ఈరాజ్యం వదలి పోవాలనుకున్నా ఇంతమందిప్రజతోనూ పోవాలి. ఈమహాసామ్రాజ్యమందలి కోట్లకొలదిప్రజను వెంటగొనిపోలేమాత్రం మమ్ము నెవరుభరిస్తారుగనుక: కాబట్టి ఆర్యచాణక్యుల ఉపదేశానుసారంగా దైవమునుప్రార్థిస్తూ శుభకాలమును ప్రతీక్షిస్తూవుంటాను' అని భద్రబాహుస్వామికి విన్నవించెను. పిమ్మట నాస్వామితో వలసకేగువారికొఱకు 500 ఎడ్లబండ్లను సమర్పించి సువర్ణగిరియందలి రాజప్రతినిధికి, 'స్వర్ణబాహుస్వాములవారికి సమస్తసదుపాయములూ చేయవలసింది" అని ఆజ్ఞాపత్రికనంపెను. ఉజ్జయినిలో సార్వభౌమప్రతినిధిగా నున్న పుష్యగుప్తాత్మజుడగుచంద్రగుప్తుడు మాత్రము భద్రబాహుస్వామిని ఇర్వది యైదువేలప్రజతో వెన్నంటియేగెను. చంద్రగుప్తసార్వభౌము డాతనిపోక విని మిగుల వగచి, లోహితాక్షుని ఉజ్జయినికి ప్రతినిధిగా నంపెను.

సామ్రాజ్యమున నేవర్తకుడును ధాన్యముదాచుకొనరాదని చేసినయాజ్ఞ వలన నెక్కడెక్కడిధాన్యరాసులును బయటపడి ఒక్కసంవత్సరమునకు చాలి

నంతధాన్యమును, విత్తనములునున్నవని తేలెను. పిమ్మట సముద్రనాథుడు వేయి పడవలు వెంటగొని, నందకోశమునుండి కోటిపణములు ద్రవ్యముగొని చోళచేర పాండ్యమండలములనుండియు, సింహళమునుండియు సంభారములు గొనితెచ్చుటకై యేగెను. ఆమండలాధీశ్వరులు మగధసామ్రాజ్యమునకు వాటిల్లిన విపత్తునకు వగచి, ద్రవ్యముగైకొనకయే నలుబదిలక్షలబస్తాలధాన్యమును మాగధనావలకును, తమనావలకును ఎత్తించిరి. నాలుగువేలనావలనిండా ఆధాన్యరాసులు గొని సముద్రనాథు డాఱునెలలకు దిరిగివచ్చెను. చంద్రగుప్తసార్వభౌముడు చోళకేరళపాండ్యసింహళాధీశ్వరుల సౌహార్దము నెంతయుగొనియాడి సువర్ణగిరియందున్న పురుషదత్తునకు ఇట్లు ఆజ్ఞాపత్రమంపెను. "పొదివిమలలందును, చోళపాండ్యమండలములందును వున్న మనరాజ్యమును వెంటనే మరలించి కుంతలానికి మహిషమండలానికి చేర్చవలెను. చోళపాండ్యకేరళాధీశ్వరులకు ఒక్కొకరికి నూరు సువర్ణరథములను ఇచ్చి వారిమైత్రిని బహూకరింపవలెను.

ఇట్లు కొల్లలుగా వచ్చిపడిన ధాన్యరాసులను సేనానివహమునందున్న అర్వదివేలవృషభశకటములపై నెత్తించి సామ్రాజ్యము నలుమూలలకుబంపించిరి. కాలువలను లోతుగా ద్రవ్వుటకును, వాగులను ఎత్తైనగట్లుపోయుటకును లక్షలకొలది ప్రజను నియోగించిరి. నదీవేణికల నంటియున్న భూములందు ధాన్యమునునాటుటకు కర్షకుల కాజ్ఞనొసగిరి. కాటకముగడచువఱకు గాసారగర్భములలో పంటలు పండించుడని అనుమతినిచ్చిరి. కుళ్ళినశవములను నదులలో పడవేయరాదని నిషేధించిరి. వేలకొలది వైద్యులను ఏర్పరించి రుగ్ణులకు చికిత్సలు చేయింపదొడగిరి. లక్షమందిసైనికుల నియోగించి శోణానదికి అడ్డముగా సేతువు గట్టించి నగరమునందలి చెఱువులు నింపించిరి. అన్నసత్రములు పెట్టించి అనాథశిశువులను, అగతికులను, వికలాంగులను పోషింపదొడగిరి. శిథిలదుర్గములను ఉద్ధరించుటకు, బాటలు వేయుటకు లక్షలకొలది ప్రజలను నియోగించి ధాన్యమునిచ్చిరి. ఈవిధముగా చాణక్యచంద్రగుప్తులు, మంత్రిసామంతాదులు,

రాజపురుషులు, అందరును క్షామబాధానివారణమున మగ్నులై రే యనక, పవ
లనక, వేయిచేతులతో పోరాడి క్షామదేవతను అరికట్టుచుండిరి.

ఇట్లు క్షామదేవత దలవిరియబోసికొని, దంష్ట్రాకరాళవదనయై, చింకిపేలి
కలు మొలకుజుట్టబెట్టుకొని, కంకాళధారిణియై పదునెనిమిదిమాసములు తాండ
వించి తాండవించి యించుక శాంతించెను. ఈలోపల బ్రాహ్మణులు జపములు
సేయుచుండిరి. పురాణములు చదువుచుండిరి. ' దేవదేవుం టే మన ప్రార్థనల
నాలించి తీరుతాడు" అని చాణక్యుడు ధైర్యముచెప్పుచుండెను.

ఉన్నట్లుండి ఒకనాటి సంధ్యాసమయమున ఆకాశమున మేఘదర్శన
మాయెను. ప్రజలు విప్పారినమొగములతో నొకరికొక రామేఘమును జూపి
చెప్పుకొనుచుండగనే మిన్నులు కారుక్రమ్మి, పెళపెళ మను మెరుపుదీగలతో,
బడబడ మను ఉరుములతో చిటపట జినుకనారంభించెను. అదినుకు పెద్దదియై
జడివాన కుండపోతగా వర్షించి భూదేవితనువును సమాశ్వాసించి చల్లబఱచెను.
ప్రజలు పులకితదేహులై వర్షధారల దడియుచు దాండవించిరి. తెలవారుసరికి
ఏళ్లుగోళ్లు నేకమైపోయెను. చాణక్య చంద్రగుప్తులు వలసినన్ని పడవలు నలు
దెసలకంపి ప్రజలను జలప్రళయమునుండి తప్పించిరి. ఇట్లు వారముదినము లేక
ధారగా వర్షములుగురిసి మిన్నులు తెల్లబడెను. నీటిపోటు తీసిన మూడవనాటికి
భూదేవి హర్షపులకితయైనమాడ్కి ఎల్లెడల నంకురములు పొడసూపి కనులు
పచ్చనయ్యెను. కాటకమే మైనదో, జలప్రళయమేమైనదో, నెలదినములగు
సరికి దేశమంతట సుభిక్షము నెలకొన్నెను. ప్రజలు మహాదేవుని కుంభములతో
నభిషేకించి, మహారాజుపేరుచెప్పుకొని దీపములు పెట్టుకొనసాగిరి.

---

# 36
## సుభిక్షము

సామ్రాజ్యమునకు బట్టిన క్షామపీడ యిట్లు తొలగిపోయి, మరల రెండు కార్లు పంటలుపండ మొదలిడెను. ప్రజలు తమతమ కష్టములు మఱచి మరల సుఖముల కలవాటుకాజొచ్చిరి. సామ్రాజ్యము శత్రుపీడగాని, అంతర్వైరములు గాని లేక నిమ్మకునీరెత్తినటుల శాంతి ననుభవించుచుండెను. సార్వభౌముడంతట రాజ్యభార మమాత్యులకొప్పగించి, క్రీ. పూ. 297-వ యేట ఫిబ్రవరినెలలో ఆర్యచాణక్యుని బురోహితులను, రాణులను వెంటగొని, కతిపయ పరివారముతో తీర్థసేవకై బయలుదేరెను.

ముందుగా వారలు కాశీక్షేత్రమున కేగి మణికర్ణికా దశాశ్వమేధ ఘట్టముల గ్రుంకులిడి, విశ్వనాథుని సేవించిరి. హరిశ్చంద్రఘట్టమున బ్రజలు దమపితరులయస్థులను గంగలో గలుపుచుండ జంద్రగుప్తుడు గాంచి, చాణక్యునితో "గంగాజలము నిట్లు పాడుచేయకుండా ఈదురాచారమును మాన్పింపవలెను" అని పలికెను. చాణక్యుడు "మృతాస్థులు కలుపుతూ వుండడంవల్లనే భాగీరథిజలానికి కింతపవిత్రత కలిగింది. పితరులఅస్థులు గంగాదేవి తనగర్భంలో ధరించి మూడుకాలాలను ఏకంచేస్తున్నది" అని చెప్పి ఆయత్నమునుండి వారించెను. పిమ్మట వారు ప్రయాగ కేగి త్రివేణీసంగమున దానమాడి ప్రయాగమాధవుని సేవించిరి. చాణక్యుడు "ఇచట ప్రత్యక్షాప్రత్యక్షములు సంగమిస్తున్నవి. అప్రత్యక్షరహితమైన ప్రత్యక్షం ఎప్పుడూ పూర్ణంకా దని మనం గ్రహించాలి" అని ప్రయాగక్షేత్రమహిమను వర్ణించి చెప్పెను.

అటనుండి వారు హరిద్వారమున కేగి దక్షప్రజాపతిఘట్టమున మునుకలాడిరి. "దక్షుడు కర్మాభినివేశంచేత అహంకరించి ఈశ్వరభక్తి శూన్యుడైనాడు. తానే ఈశ్వరుడననుకొని విఱ్ఱవీగాడు. తుదకు కన్నకూతురే అతణ్ణి విడవడం, ఈశ్వరకోపాగ్నికి అతడు ఇంధనం కావడం తటస్థించింది. కనుక

ఈశ్వరోద్దిష్టములుగాని కర్మలు నెత్తి అణుస్తవి" అని చాణక్యుడా క్షేత్రవిశేషము తెలియజేయుచుండ, చంద్రగుప్తుడు "ఈశివక్షేత్రానికి హరిద్వారమని పేరు రావడానికి కారణమేమి" అని ప్రశ్నించెను. చాణక్యుడు "శివకేశవుల అభేదం తెలపడానికని తోస్తుంది. అలాగే అమరనాథానికి, రామేశ్వరానికి కూడా పేర్లు పెట్టివుంటా"రనెను.

చంద్ర:—సముద్రనాథుడు వర్ణించి చెప్పిందిమొదలు నామనస్సు రామేశ్వర దర్శనంకొఱకు ఉవ్విళ్లూరుతుంది. ఆక్షేత్రం సేవించేభాగ్య మెన్నటికో!

చాణ:—అదియెంతభాగ్యం! ఎప్పుడో దక్షిణయాత్రలు కూడ సేవించి వద్దాము.

అనంతరమున వారులక్ష్మణఝోలానుదర్శించుటకై బయలుదేరి ప్రకృతిరమణీయములగు పర్వతసానుమార్గముల నేగి అలకనందానదిని దర్శించిరి. కొండలోయలలో 360 అడుగులలోతున బ్రవహించుచున్న యానదిని దాటుట కీవలిగుట్టనుండి యావలిగుట్టకు త్రాటివంతెనయున్నది. పుణ్యాత్ములుగాని ఆత్రాటివంతెనపై నదిని దాటలేరు. చాణక్యుడు 'నాయనా! నావంటి సంశయగ్రస్తు లీపనికి బూనుకోరాదు. పాపపుణ్యము లెఱుగనిబాలురు, సరళజీవనులు దీని నవలీలగా దాటగలరు. అమాయికరైన నాయిల్లాలువంటి స్త్రీ కూడా కనులుమూసికొని దాటిపోతుంది" అని పలికి చంద్రగుప్తాదులనుగూడ "మీరు దాటవలదు"అని వారించెను. చాణక్యు డెంతచెప్పినను వినక శాంతవతీదేవభ్రాంతలతోగూడ జంద్రగుప్తుడలకనందను తరించెను. చూలాలైనదుర్ధరాదేవిని శాంతవతి వలదని వారించెను. వారుముగ్గురు నదినిదాటుచున్నపు డీవలియొడ్డున నిల్చి చూచువారల కొడళ్లలో బ్రాణములు లేవు. వారు తిరిగివచ్చిన పిమ్మట దుర్ధరాదేవి, శాంతవతిని "దాటునపుడు నీకెట్లావున్నది" అనియడిగెను. 'నేను పైనున్న ఆకాశాన్ని, క్రిందవున్న అఖాతాన్ని చూడనేలేదు. ఎంతసేపూ ఆర్యపుత్రులమీదనే దృష్టివుంచి, వారినిరపాయతరణంకొఱకు దైవాన్ని

ప్రార్థిస్తూ దాటిపోయినాను" అని శాంతవతి బదులుచెప్ప నాయమపతిభక్తి కందఱు నాశ్చర్యమగ్నులైరి.

పిమ్మట వారు గయాక్షేత్రమునకేగి పితృదేవతలకు పిండప్రదాన మొనర్చి, వైశాలీనగరమునకేతెంచిరి. అచటి బ్రాహ్మణాదులగు నాలుగుజాతుల వారు దమలోదాము తగవులాడుచు పంచములతోగూడ గలహించుచుండిరి. అట్లే బౌద్ధులును, దిగంబరశ్వేతాంబరజైనులును బరస్పరము వాదులాడుకొను చుండిరి. చంద్రగుప్తుడాతగవులెల్ల దిద్దువాడై, వారినందరిని బిలిపించి యిట్లు చెప్పెను. "జంబూద్వీపమనే ఈమహోద్యానంలో పలువిధములైన వృక్షము లకు తీగెలకూ చోటు వుంది, ఇవన్నీ యీఆరామానికి శోభకూర్చేవే. అంతే కాని ఇవి ఒకదానితో ఒకటి కలహించి, ఒకదానివృద్ధి కొకటి ఆటంకం కలిగిస్తే ఉద్యానశోభే మాసిపోతుంది, అపుడు అడ్డము వచ్చిన చెట్లను నరకవలసి వుంటుంది. కనుక వివిధమతాలతో చిత్రవర్ణమైన కంబళింవలె వున్నయీపుణ్య భూమికి మీపరస్పరకలహాలతో కళంకం తీసుకురాకండి. మీరే కాదు. ఇంకా యెన్ని వర్ణాలున్నా యీకంబళానికి అందమే వస్తుందిగాని లోపం రాదు. కనుక మీరీకొట్లాటలు మానండి. ఈమరంహాంకారాలను మేము సహించము."

పిమ్మట జాణక్యుడు వారికిట్లుపదేశించెను. "బ్రహ్మముఖోద్భవులు బ్రాహ్మణులు, బాహుజులు క్షత్రియులు, వైశ్యులూరుసంభవులు, శూద్రులు పాదజులూను. కనుక మీరందరూ బ్రహ్మసంభవులే. మీరందరూ చేరితే విరా ట్పురుషుని మూర్తి అవుతారు. మీరునలుగురూతప్ప పంచములంటూ వేరే ఒక జాతిలేదు. మీలోమీరు ఎక్కువ తక్కువలెంచుకొని తగవులాడుకోవడం అవి వేకం. తాను అన్నంపెట్టుతున్న నోటితో చేయి కలహించడంగాని, తనకు అన్నంబెట్టుతున్న చేతితో నోరుకలహించడంగాని ఎక్కడైనా కద్దా? అలాగే చేతికీ నోటికీగూడా ఆధారభూతమైన తొడతోగాని, సమస్తదేహానికి నిలు కడయైన పాదాలతోగాని చేయీనోరూ కలహించడంకంటె అవివేకమంటూ

వుంటుందేమో ఆలోచించండి. ఇందులో ఎవనికి మోసంవచ్చినా శరీరమంతటికీ మోసమేకదా! పోనీ, పాదాలను వేరుపెట్టి తక్కినఅవయవాలుగాని, అన్నీకలసి నోటిని వేరుపెట్టిగాని వృద్ధిచెందగలవేమో ఆలోచించండి! అలాగే సర్వసమత్వం బోధించిన బుద్ధదేవుని మతస్థుల కీతగవులాటలు తగవు. తనకున్న ఒక్కవస్త్రాన్ని మహావీరులవారు సోమదత్తుడనే బ్రాహ్మణున కిచ్చి తాము దిగంబరులైనారు. అటువంటి మహావీరానుచరులు బ్రాహ్మణులతో కలహించడం కాని, శ్వేతాంబర దిగంబరభేదాలతో పరస్పరం వివదించడంకాని తగదు." చాణక్యచంద్రగుప్తు లిట్లు పలికినపిమ్మట వారెల్లరు "మేమింక కలహింప" మని ప్రమాణము లొనర్చి సఖ్యపడి వెడలిపోయిరి.

పిమ్మట చంద్రగుప్తాదులు రామపూర్వమున కేగిరి. చంద్రగుప్తు డచట నొకశిలాస్తంభమును స్థాపించి దానిపై వృషభశిఖరము నెత్తించెను. ఆ స్తంభమునకు నలువంకలను బ్రాకారము నిర్మింపజేసి ప్రాకారమున కొకదెస బౌద్ధులధర్మచక్రమును జాతకకథలును జెక్కించెను. రెండవతట్టున జైనతీర్థంకరుల చరిత్రములను, మూడవదెస భారతరామాయణగాథలను జెక్కించి నాలవదిక్కున నేమియు జెక్కింపక వదలెను. వృషభశిఖరము శివచిహ్నమనియు, ప్రాకారపుమూడుదిక్కులూ మూడుమతములకూ చిహ్నములనియు, నాలుగవదెస నేచిహ్నమును లేదుగావున బ్రజలు తమకిష్టమువచ్చినభావము దాని కారోపింపవచ్చుననియు జాణక్యున కాతడు తన తాత్పర్యము నెఱిగించెను. చాణక్యుడును "వత్సా! జంబూద్వీపచక్రవర్తికి అనురూపమైన పనిచేసితివి. సర్వమతసమానము రాజులకు నీతి. ఆనీతిని నీవు నేడు ధర్మంగా అవలంబించడం చాలా శుభం" అని సంతోషించెను.

పిమ్మట సీతాకుండమున మిట్టమధ్యాహ్నముగూడ మంచువలె చల్లనైన నీటిలో మునిగి "ఆతల్లిహృదయంవలెనే ఈకుండము కూడా శీతలంగా వుంది" అనుకొనిరి. పిమ్మట జంద్రగుప్తుడు రాముని సీతాపరిత్యాగమునుగూర్చి

ప్రశ్నింప, చాణక్యుడు రాజధర్మమును గూర్చియు కర్మసూత్రమునుగూర్చియు నాతని కుపన్యసించి, రామకృష్ణాద్యవతారపురుషులు గూడ కర్మబద్ధు లని బోధించెను.

చంద్రగుప్తు డొకనాడు తానుగూడ బూర్వరాజులవలె బ్రజాభ్యుదయము నారయువలయు ననుకుతూహలమున మాఱువేసమువైచికొని యుండగ్రామ మనుపల్లె కేగెను. అచటి గ్రామవృద్ధులం జేరి, సంభాషింపమొదలిడి క్రమముగా చాణక్యచంద్రగుప్తుల ప్రసంగము దెచ్చి "ఆవుభయులలో ఎవరి కెక్కువ సౌఖ్య" మని ప్రశ్నించెను. అంతట నొకవృద్ధుడు "ఎల్లవేళల రాజ్యభారంచేత వ్యాకులపడే చంద్రగుప్తుడికి సౌఖ్యమే లేదు. చాణక్యుడికి పోవడానికితనదంటూ ఏమీలేదు గనుక పూరింట్లో నిశ్చింతగా సుఖపడతాడు. అదీగాక చంద్రగుప్తుడు పరతంత్రుడూ, చాణక్యుడు స్వతంత్రుడూను. స్వతంత్రునిసుఖం పరతంత్రున కెలా వస్తుంది?" అని బదులు పలికెను. చంద్రగుప్తు డామాటలకు జిన్నబుచ్చుకొని, మరల "నీకు దేనియందు కోరికో చెప్పు" మని యడిగెను. వృద్ధుడు "నాకు ఈశ్వరసాక్షాత్కారం కావాలి" అనెను. చంద్రగుప్తుడు "అబ్బో! ఆకోరిక నేను తీర్చలేను" అనునంత వృద్ధుడు "తీర్చవలసిందని ఎవరడిగారు నిన్ను!" అనియెను.

చంద్ర.—పోనిమ్ము. నువ్వే చంద్రగుప్తుడవైతే ఏమి చేస్తావో చెప్పు.

వృద్ధుడు.—ఏమిచేస్తానా! నారాజ్యంలో అల్పుడికికూడా 'నాకష్టసుఖాలలో మహారాజు పాలుపంచుకొంటున్నాడు' అనేభావం కలిగిస్తాను. అంతేగాని అల్పులను, దీనులనూ వాళ్లకర్మకు వాళ్లను వదలివేయను. మనరాజులందరూ అల్పులసంగతి విచారించకుండా అలా వదలివేయడంవల్లనే 'రాముడేలితే యేమి, రావణుడేలితేయేమి' అనే జనశ్రుతి వ్యాపించింది. రాజ్యంలో ప్రతీవాడికీ 'ఇది నారాజ్యం' అనే అభిమానం కలిగించడమే రామరాజ్యమంటే.

మర్మభేదకములైన వృద్ధునిమాటలు తలచుకొంటూ సార్వభౌముడు మరలిపోయెను. తదుపరి కొన్నాళ్లకు దీర్ఘాటనము ముగించి వారెల్లరు పాటలీపుత్రముం జేరిరి. పిమ్మట నగరమంతట నుత్సవము జాటించి సార్వభౌముడు మూన్నాళ్లు లక్షలాదిజనుల కన్నసత్రము పెట్టించెను. ఇట్లు పవలెల్ల విందులతో గాలముగడపి, రాత్రులందు భాసకవిరచితములగునాటకములను బ్రయోగింపజేసి కనులార గాంచి యానందించెను. పిమ్మట భాసున కొకయగ్రహారమును సువర్ణ కంకణములను ఇచ్చి బహూకరించెను. అదిమొద లాతని దనయాస్థానమందు నిలిపికొని వత్సరమునకు రెండువేలపణముల భృతినేర్పరచి, యాతనినాటకములను సర్వత్ర ప్రయోగించుట కనుజ్ఞనొసంగెను.

ఆనాటకప్రయోగములను దర్శించిన కేరళపుత్రరాయబారి, వాని ప్రతులు వ్రాసికొనుట కనుజ్ఞవేడెను. చంద్రగుప్తు డందులకు సమ్మతించి "మీ దేశంలో ఈప్రయోగములనుచూచి గ్రహించేవారున్నారా" యని ప్రశ్నించెను. ఆరాయబారియు "గ్రహించడమే కాదు, ఎంతో ఆనందిస్తారు. ఈనాటకాలను ఏనాటికైనా మీరు మఱచిపోయేపక్షంలో కేరళపుత్రులు వీనిని భద్రంగారక్షించి వీటి విశేషములను తిరిగీ మీకు బోధిస్తారేమో! ఎవరు చెప్పగలరు మహాప్రభూ!" అనెను.

చంద్రగుప్తు డంతట "మీరు అర్థశాస్త్రప్రతి వ్రాసుకోడానికి అనుజ్ఞ అడగలేదేమి?" యని ప్రశ్నింప, నారాయబారి "ఆర్యచాణక్యుల అనుమతితో నేనిదివఱకే దానిప్రతి మాప్రభువులకు పంపుకున్నా" ననెను. చంద్రగుప్తుడు చిఱునవ్వు నవ్వుతూ "ఆర్యులకు జన్మభూమిపై ఎంత అభిమానమో" యని చాణక్యునివైపు గనుగొన, జాణక్యుడును "నాజన్మభూమి వృషలుడిపట్ల అనురక్తంగా వున్నంతకాలమే ఆయభిమాన" మని బదులుచెప్పెను. చంద్రగుప్తుడు "అయితే నేను ధన్యుడను" అనెను. "చంద్రగుప్తచాణక్యుల వశంలోవున్న సామ్రాజ్యానికి ఏమీ భయంలేదు" అని రాక్షసామాత్యుడు వచింప సభాసదులెల్లరు చాణక్యచంద్రగుప్తులకు జయపెట్టిరి.

# 37
## ధర్మాసనము

క్రీ. పూ. 297 వ యేట ఆగస్టునెలలో నొకనాటి పూర్వాహ్ణమున మగధేశ్వరుడు ధర్మాసనముండెను. సుగాంగప్రాసాదమంతయు మంత్రిసామంతాదులతో నధికృతులతో నిండియుండెను. నగరాధ్యక్ష నాగరక (A city Superintendent) స్థానికాది (Superintendents of the wards of a city) పరివృతుడై మహారాజు ధర్మాసన మలంకరించెను. మహారాజునకు దక్షిణపార్శ్వమున బిందుసారుడును, యువరాజునకు దక్షిణమున నార్యచాణక్యుడును, తత్పార్శ్వమున ధర్మాధికారియగు సంకీర్త్యాయనుడు నుపవసించియుండిరి. మహారాజవామపార్శ్వమున సుబుద్ధిశర్మయు, దత్పుత్త్రుడగు ఖల్లాటకుడును నాసీనులైరి. నగరరక్షకులగు కాలపాశికదండపాశికులుగూడ నధికరణమంటప మలంకరించియుండిరి. మహారాజునకు వెనుకతట్టున సేనమంద్రంగరక్షకులు నిలిచియుండిరి. ప్రతీహారిణు లిరువురు కరకంకణకలస్వన మనోహరముగ జామరములు వీచుచుండిరి.

వృద్ధకంచుకి యగువైహీనరి యంతట సభలో గలకలమువారించి "మహారాజులుంగారు ధర్మాసనమందు విజయంచేసియున్నారు. విన్నపములు చేసికొనుడు" అని తెలిపినంతట శోధనకు (Usher of the court) కొక్కదోషినే కొనివచ్చుచుండ నధికరణకులు తత్తద్వ్యవహారములనుగూర్చి మహారాజునకు విన్నవించుచుండిరి.

వైశాలీనగరవాసి యొకడు ఏబదిపణము లప్పుపడెను. అప్పుదీర్పుమని ఋణదాత పలుమారు లడిగెనని కోపించి వానియింటికి కొకరాత్రివేళ చిచ్చుపెట్టెను. ఆమంటలోబడి యిరువురుబాలకులు గూడ దగ్ధమైపోయిరి. ఈదోషమునకై మరణదండనము నచటియధికరణకులు విధించిరని చెప్పి శోధనకుడాదోషిని ప్రవేశపెట్టెను. మహారాజు "వీని నామంటలలోనే కట్టి పడవేయు

వలసినది. గృహదాహదోషానికి మరణమే శాస్త్రములలో విధింపబడింది. కాబట్టి ఈదోషిని శూలారోపము చేయింపు" డని ఆజ్ఞయిడెను.

రెండవదోషి కుండగ్రామవాసి నలుబదియేండ్లవాడు. ఊరిపెద్దలపై గోపించి, చెరువుకట్టలు త్రెంచి పంటలను ముంచివేయుచుండ గ్రామస్థులాతని బట్టి బంధించిరి. వానికిగూడ మరణదండనము నధికరణికులు విధించిరని ఖల్లాటకుడు విన్నవించెను. మహారాజు "వీని నాచెరువులోనే ముంచి చంపవలసినది. సకాలములో చెరువునకు, గ్రామానికి అపాయం తప్పిందిగనక ఇప్పుడు వీణ్ణి చంపబనిలేదు. సువర్ణసరోవరంలో వీనిచేత పదునాలుగేండ్లు త్రవ్వపని చేయించండి" అని ఆజ్ఞయొసగెను.

గృధ్రకూటవాసి, యేబదియేండ్లవాడొకడు సువర్ణనిధిని కనుగొనుటకై కాళికను బ్రసన్న నొనర్పనెంచి మూడేండ్లశిశువు నాదేవికి బలియిచ్చెను. అధికరణికులు 'మరణాంతము వానిని సువర్ణగిరిసిధులలో బనిచేయవలసిన'దని దండనము విధించిరని ఖల్లాటకుడు విన్నవించెను. "ఇక వీడు బాగుపడటం కల్ల. వీని తల కొట్టివేయు"డని మహారాజు ఆజ్ఞాపించెను.

నలుబదియైదేండ్ల వయసుగల యాడుదాసిని పిమ్మట బ్రవేశపెట్టిరి. ఆపె యోగినీవేషమున సీతాకుండగ్రామముం జొచ్చి, అచటి యిల్లాండ్రకు ప్రసాదములో దుత్తూరచూర్ణము గలిపిపెట్టెను. వా రాచూర్ణమహిమచే నొడలెఱుగక యున్నతఱి నాయోగిని యింటిలోని వెండి బంగారములు సంగ్రహించుకొని పాఱిపోయెను. ఆయోగిని చేతిప్రసాదమునే స్వీకరించిన మఱియొకయిల్లాలు సొమ్ముతో పాటు ప్రాణములు గూడ గోల్పోయెనట. ఆపెకు గూడ నధికరణికులు మరణమే విధించిరి. చంద్రగుప్తమహారాజుకూడా నాపెకు మరణమే శాస్త్రవిహిత మనెను.

కన్యా బలాత్కృతికై మఱియొకనికి విధించిన మరణదండనమునకు గూడ మహారాజు సమ్మతిచూపి, పిమ్మట దారిదోపిడిగాండ్రకు ముప్పదిమందికి

సువర్ణగిరియందలి బంగారుగనులలో మరణాంతము పని చేయు డని దండనము విధించెను.

కూటసాక్ష్యమొసగి అన్యాయముగా నొకనిర్దోషి మృతికి కారణమైన వానికిగూడ మహారాజు "ఇది కూడా ప్రత్యక్షహననం వంటిదే" య ని మర ణము విధించెను.

పాండుగతిగ్రామంలో గృహస్థులు తమకు భిక్షము పెట్టలే దని కోపించి ఏడుగురు భిక్షుకులు ఏదియోశాంబరపుదంతు చేసిరట. నాటిరేయి గ్రామములో పదియిండ్లు పరశురామప్రీతికాగా భిక్షుకు లది తమప్రభావమే యని చెప్పి బెదరించిరట. అంతట నిరువదిమంది గృహస్థు లాభిక్షుకులను బంధించి మంట లలోవైచి కాల్చిరట. అధికరణికులు, వారి కందఱికి తలకొక రెండువందలపణ ములు అపరాధముగా విధించిరి. మహారాజు వారికాదండనము తగ్గించి, తల కొక పండ్రెండుపణములు దండుగగాగొని ఆసొమ్ముతో పాండుగతిగ్రామమున హారీతదేవికి గుడికట్టింపుడని ఆజ్ఞయిడెను.

వేశ్యాబలాత్కారదోషమునకై పాటలీపుత్రవాసికి విధించినపండ్రెండు పణముల యపరాధమును న్యాయ్యమేయని మహారాజు తగవుదిద్ది అపండ్రెండు పణములను బలాత్కృతయగు వేశ్యకిప్పించెను.

పాటలీపుత్రవీథులలో ఏనుగు మనుజునొకని త్రొక్కి చంపినందుల కాయేనుగును నడపిన మావటివానికి 500 పణముల దండుగవిధించిరి. మహారా జందుల కంగీకరించెను. అంతటితో విన్నపములు పూర్తియగుడు, వైహీనరి "క్రిందటిసారి మహారాజులుంగారు ధర్మాసనమున్న అనంతరం ముగ్గురులంచ గొండులూ, పద్దెనమండుగురు కూటసాక్షులు దేశమునుండి వెడలనంపబడిరి" అని ప్రకటించి, "అధికరణికులవల్ల తమకు న్యాయం కలగలే దని విన్నవించే బ్రాహ్మణులూ, భిక్షుకులూ, అనాథులు దయ చేయండి" అని పిలిచెను.

అంతట గొందరు బ్రాహ్మణులు ప్రవేశించి "మహాప్రభూ! ఏలినవారి అధికరణికులు బ్రాహ్మణదోషులకు తప్తలోహంతో ముద్రలువేస్తున్నారు. చౌర్యానికి శునకముద్రలూ, మద్యపానదోషానికి మద్యవిక్రేతృపతాక ముద్రలూ, స్త్రీబలాత్కారదోషానికి త్రికోణముద్రలూ కాల్చి వేస్తున్నారు. ఏలినవారు ఈకార్యంతప్పించి బ్రాహ్మణాశీర్వాదపాత్రులు కావలసిం"దని విన్నవించిరి. మహారాజంతట నావిప్రులంగాంచి "మాఅధికరణికులు విప్రస్వాములకు విధిస్తున్న యీదండనం స్మృతివిహితమే కాని అన్యంకాదు. ఇతరకులాలవారికి విధించేదండనం ముందు విప్రులకుచేసేదండనం ఏపాటిదో మీరే ఆలోచించండి. కూలిపుచ్చుకొనికూడా బట్టలునేయనినేరానికి సాలెవాని బొటనవ్రేళ్లు నరికేస్తున్నాము. బ్రాహ్మణస్త్రీని బలాత్కరించినశూద్రుణ్ణి ప్రాణాలతో కాల్చి చంపేస్తున్నాము. ఇటువంటి దారుణదండనాలూ, క్రూరహింసలూ ఎన్నో స్మృతులయందు విధింపబడివున్నవి. స్మృతివిహితమైన ధర్మానికి మేము ప్రవర్తకులం. అంతేగాని మేము అన్యథాచేయలేము. వీనిలో దేనినిమార్చినా తదనుగుణంగా ఆప్రకరణమంతా మార్చవలసి వుంటుంది" అని పలికెను.

అంతట నావిప్రులలో నొకడు "దోషులైన బ్రాహ్మణులను దేశమునుండి వెడలనంపడానికికూడా స్మృతులలో కల్పం చెప్పబడివుంది. కనుక ఏలినవారు విప్రులకు వాతలుపెట్టించడం మాన్పి రెండవకల్పాన్ని అనుసరించవలసిందని కోరుతున్నాము" అని విన్నవించెను.

మహారాజంతట చిఱునవ్వు నవ్వుచు "అలా దేశనిష్కాసితులైన బ్రాహ్మణులితరదేశాలకువెళ్లి మాగధబ్రాహ్మణవర్ణానికి చాలాఅప్రతిష్ఠ తెస్తారు. చెడిపోయినసరుకులకు ఎలాముద్రవేస్తామో అలాగే యీపతితవిప్రులకుగూడా వేయకతప్ప"దనెను.

పిమ్మట శ్రావస్తీనగరవాసులు గొందరు మహారాజును దర్శించి గడచిన సంవత్సరములో రాజపురుషులచటిప్రజలనుండి వెట్టింపుపన్నులు గ్రహించి

రనియు, నిధినిక్షేపాదులు దొరకుటచేగాని, అడవులలో విపరీతముగా కలప లభించుటచేగాని, తమ ఆదాయము లేమియు పెరుగకున్నను ఇట్లు చేయుట అధర్మమనియు విన్నవించిరి. మహారాజంతట ఆర్యచాణక్యుని వైపు కనుంగొని "అమాత్యుల అభిప్రాయం వినగోరుచున్నా" ననెను. చాణక్యుడు "ఈ విషయంలో మన అర్థశాస్త్ర ప్రథమఖండం, తొమ్మిదో అధ్యాయంలో అసందిగ్ధముగా ఇట్లా చెప్పి వున్నది. 'రాజాదాయం అకారణంగా రెట్టింపుచేయడం ప్రజలరక్తాన్ని పిండుకోవడమే. కాబట్టి అట్లుచేయుట తగదనిబుద్ధిచెప్పి విడువవలెను. అపరాధం మరీ పెద్దదైతే కఠినంగా దండించవలెను.' మహారాజప్పుడు శ్రావస్తీ పౌరులంగాంచి "మా రాజపురుషు లిదివరకెన్నడైనా యిట్లా ప్రజాపీడనం చేశారా? వారిచరిత్రమెటువంటిది?" అని ప్రశ్నించెను. "రాజపురుషు లింతకు మును పెన్నడూ ఇట్లాచేసినవారుకారు. వారు స్వభావంచేత యోగ్యులనే మాకు తోస్తుంది" అని పౌరులు విన్నవించిరి. "వారిని మేము గట్టిగా మందలిస్తూ ఆజ్ఞాపత్రం పంపుతా" మని చెప్పి మహారాజు వారల నంపివైచెను. అంతట కొందఱు తైర్థికులు ప్రవేశించి "మహాప్రభూ! మేము కామాఖ్యాక్షేత్రాన్ని సేవించుకొంటూ వుండగా మాలో పదిమందిని నాగులు పట్టుకొనిపోయినారు. వారిని వాళ్లు బానిసలను చేస్తారని భయపడుచున్నా" మని విన్నవించిరి. రాష్ట్రామాత్యుడు లేచి, "చిత్తం. భద్రభటసేనానివద్దనుండి ఇపుడే వార్తవచ్చినది. కామరూపాధిపతికి సేనాపతులవారు గట్టిగా హెచ్చరికపంపినమీదట నాలుగు ఆపదిమందిలో ఎనమండుగురను విడిచిపెట్టిరి. ఒకడు నాగులకు ఆచార్యుడై వారితోనే వుంటానని ఉండిపోయెనట. పదియవవాడు నాగులవద్దనే కాలధర్మంచెందెనట" అని విన్నపముచేసెను. మహారాజు "శుభం. మనవారిలో ఒకరచట ఆచార్యత్వం అంగీకరించడం మేలే అయింది. ఆ రాక్షసులను సాధువులను చేయాలంటే అదే మార్గ" మనెను. పిమ్మట మహారాజుగారి పాకశాలలో వంటచేసేవాడొకడు ప్రవేశించి "మహాప్రభూ! నేను కట్టెలెక్కువగా వాడుచున్నానని చాణక్యులవారు నన్ను పనిలోనుంచి తొలగించారు. బిడ్డలుగల

వాణ్ణి కనికరించాలి ఏలినవారు. సామాన్యసంసారులు గూడా వంటకట్టెల నీలాలెక్కచూడరుగదా, సార్వభౌములవారికిలా కట్టెలూ, ఉప్పూ, పప్పూ లెక్కచూచి ఇప్పించడం కద్దా" యని మనవిచేసికొనెను. చాణక్యుడులేచి "మహారాజులు ప్రజలసొమ్ముకు ధర్మకర్తలుకాబట్టి వారిసొమ్ము నిట్లా దుబారా చేయగూడదు. ఈవంటవాడు గాడిపొయ్యిలో బండెడుకట్టెలు పారవేస్తే అవి పూర్తిగా మండిపోతూ వుంటే తాను ఇటూఅటూతిరుగుతూ పరిచారికలతో సరసాలాడుతూ వుండడంచూచి ముమ్మారు మందలించాను. అప్పటికీ బుద్ధిరాక పోతే పనిలోనుంచి తొలగించాను. కట్టెలభాగ్యాని కింత జాగ్రత్తపడాలా అనిపించేమాట నిజమే. చూడడాని కివి స్వల్పవిషయాలేకాని యిటువంటివే పది చేరితే పెద్దవవుతాయి. ఒక్కొక్కపంటవెన్నే గిల్లుకుపోయే మిడతలవల్ల చేనుకు ఏనుగులవల్లకూడా కలగనినష్టం కలుగుతుంది" అని పలికెను.

మహారాజు:—వీనివల్ల ఎంతనష్టం కలిగించుదంటూరు ఆర్యులు?

చాణ:—నలభైమూడు పణాలు.

మహారాజు:—మాస్వంతకోశంనుంచి ఆనష్టమిప్పించండి. వీని నాపనిలో తిరిగి ప్రవేశపెట్టిచూస్తాము. ఇంతటనైనా చక్కబడకపోతే తొలగించుతాము. సభాసదులు మహారాజుపల్కులకు సాధువాదము లొనర్చిరి.

పిమ్మట మణిపురమునుండి యరుదెంచిన యంగనలు "మానగరంలో స్త్రీలు ప్రత్యేకం విపణివీధి యేర్పాటుచేసుకొంటున్నాము. స్త్రీలును, రాజకులమూతప్ప ఇతరు లక్కడ క్రయవిక్రయాలు చేయకుండా అనుజ్ఞఇప్పింపు"డని వేడిరి. మహారాజు "ఇలా ఎందుకు చేస్తున్నారు మీరు?" అని యడిగి, "భరతఖండంలో మాపురమును నిరుపమానం చేయడమే మాఆశయం" అని యావిలాసవతులు విన్నవింప, "పట్టణానికి సార్వకాలికంగా ఈయధికార మిస్తున్నాము" అని యనుజ్ఞ నొసగెను.

పిమ్మట భరుకచ్ఛమునుండి వచ్చిన వర్తకు లిట్లు విన్నవించిరి. "మా రాష్ట్రమున కొందరు 'కృత్రిమపునాణెములు చేసి తక్కువమూల్యమున కమ్ముతున్నారు. అట్టి నాణెముల నన్నిటిని వెంటనే ముక్కలు చేయింపవలసినదనే చాణక్యులవారి ఆజ్ఞ నచటిఅధికారులు అనుసరించడంలేదు" అని విన్నవించిరి. ఆవిషయమై లక్షణాధ్యక్షునకును, (Superintendent of the Mint) ఉజ్జయినియందున్న రాజప్రతినిధికిని, సౌరాష్ట్రమండలాధిపునకును వెంటనే యాజ్ఞాపత్రమంపుదుమని చెప్పి మహారాజు వారల నంపెను.

అనంతరమున బాటలీపుత్ర పౌరులు కొందఱేతెంచి యిట్లు విన్నవించుకొనిరి. "మావీధులలో మద్యవిక్రయశాలలు ఎక్కువైపోతున్నవి, మహాప్రభూ ! మద్యశాలల కొకదానికొకదానికి వుండవలసినదూరాన్ని అధికారులు క్రమంగా పాటించడంలేదు. మద్యశాలలు పూలతో అలంకరించి, పలురకాల పండ్లతో నింపి, చెడిపెల నక్కడికి చేరదీస్తూ వుండడంవల్ల కులీనులబిడ్డలుకూడా మద్యశాలల కెగబడి చెడిపోతున్నారు. రాత్రిజాము ప్రొద్దుపోయింది మొదలు నాలవజామువఱకు వీధులలో ఎవ్వరూ తిరుగగూడదనే ఆజ్ఞకూడా మీఱి జారచోరులు సంచరిస్తున్నారు. ఈవిషయమై ఏలినవారు తగినకట్టడి చేయించకపోతే సంసారులం చాలాచిక్కులుపడతా మని మనవిచేస్తున్నాము. ఏలినవారు ఇంకోవిన్నపంకూడా చిత్తగించాలి. శవాలను తీసుకుపోవడానికి కట్టడి చేసిన వీధులు తప్పించి తీసుకుపోతున్నారు. ప్రభువులు ఆవిషయంలోకూడా కట్టడిచేయించాలి."

మహారాజు, "నగరాధికారులకు మేము ఆజ్ఞాపత్రిక పంపి కట్టడి చేయిస్తా"మని పలికినంతట నాపౌరు లనుజ్ఞగైకొని యేగిరి. పిమ్మట జాణక్యజామాతయగు అగ్నిశర్మ లేచి "ఏలినవారు, నిరుటిజన్మదినోత్సవావసరాన నాకు, నాభార్యాపుత్రులకు నెలకైదువందలభృతి యిప్పింతుమని చేసినవాగ్దానము నార్యచాణక్యులు చెల్లకుండా చేస్తున్నారు. ప్రభువులవారి ఆజ్ఞను అమాత్యు లిట్లా అన్యథాకరించడం ధర్మవిరోధం" అని మనవిచేసెను.

చాణ.—నే నేమీ మహారాజాజ్ఞను అన్యథాకరించలేదు. ఆభృతి నాకక్కఱ లేదని వదలుకొన్నాను.

అగ్ని.—మీకిచ్చేదయితే మీరు వదలుకోవచ్చునుగాని, నాకు రావలసినదాన్ని మీరెలా వదలుకొంటారు?

మహారాజంతట సంకీర్త్యాయనుని "ఇందులో మీఅభిప్రాయమే"మని యడిగెను.

సంకీ.—అగ్నిశర్మ ఆక్షేపం న్యాయమే అని తోస్తుంది. ఒకరిసొమ్ము నింకొకరు వదలుకోవడం శాస్త్రవిరుద్ధమే.

చాణ.—నాఅల్లుడికుటుంబాన్ని నేనే పోషిస్తున్నాను గనుక నా కాఅధికార ముంటుంది.

సంకీ.—తమయింట్లో వున్నంతమాత్రంచేత వారికుటుంబం వేఱుకాకపోదు.

చాణ.—అయినా, ఈతడు నాఅల్లుడనేకారణంచేత యిస్తున్నభృతి కాబట్టి నాకు ఇస్తున్నదే అవుతుంది గనుక నేను వదలుకోవచ్చును.

సంకీ.—మహారాజులుంగారు చేసినదానము యోగ్యమా, అయోగ్యమా అని విచారించదగునేకాని ఎందుకిచ్చారు అనేవిచారణ మనకు ప్రస్తుతంకాదు.

చంద్ర.—అయితే కుండగ్రామాదాయంనుండి ఏటా ఆఱువేలపణాలు అగ్నిశర్మకు తరతరాల శ్రోత్రియబ్రహ్మదాయసర్వస్వంగా చెల్లవలసిందని తిరిగి యిప్పుడు దానపట్టం ఇస్తున్నాము.

ఇట్లుపలికి మహారాజు కొలువుచాలింప సభాసదులెల్లరు హర్షపులకితులై జయజయధ్వానము లొనర్చుచు నేగిరి.

ఆర్యచాణక్యుడును నిజగృహమున కేగునంతట గౌతమి పాదోదక మొసగి, దౌహిత్రుడగు రాధాగుప్తుని బదునెనిమిదిమాసముల చిఱుతవాని

నిందమని పతిచేతులకందిచ్చి రాజసభావిశేషములకూర్చి ప్రసంగముతెచ్చి, “అల్లుడుగారిప్పుడే ఆశుభవార్త అమ్మాయితో చెప్పుతున్నారు. మీరాక చూచికాబోలు చల్లగా జారినట్టున్నారు” అని నవ్వుచు బలికెను. చాణక్యుడు “తండ్రితాతలతరాలనాడు కూడా ఎన్నడూ ఇటువంటి ప్రతిగ్రహాలు ఎఱుగము. మనయింట్లో వుంటున్నపిల్లకు ఇచ్చినదానం మనంపుచ్చుకొన్నట్లే అవుతుందని నేనెన్నివిధాలచెప్పినా, సంకీర్త్యాయనుడూ, ఇతడూ ఏకమై నామాట సాగనిచ్చారుకారు. ఏలాగైతేనేమి మహాప్రయోజకుడైనాడు నేటికి” అనెను. గౌతమియు “మీఅల్లుడైన తరువాత ప్రయోజకత్వానికేమిలోపముంటుంది” అని మేలమాడి, “స్నానంచేయండి. మహారాజులుంగారు, పాపం, మీకోసమని కేరళంనుంచి తెప్పించిన అప్పడాలూ, ఊరగాయలూ ఇప్పుడే పంపించారు” అనెను. “ఎందుకు వృషలు డిట్లా నాకోసం యింత శ్రమపడడం? ఈస్వల్పానికి నిరాకరిస్తే చిన్నబుచ్చుకొంటాడు. ఏదివదలుకొన్నా కేరళపు ఊరుగాయలూ, అప్పడాలూ వదలుకోలేనని ఎఱిగి చేసినగడుసుదనమే యిది” అనుచు నవియెల్ల బరీక్షించి “ఎందు కిన్ని తెప్పించాడు! ఇంకోసంవత్సరందాకా మళ్లా తెప్పించకు బాబూ అని చెపుతాను” అని పలికి స్నానమొనర్ప నేగెను.

---

## 38

## హితోపదేశము

క్రీ. పూ. 298 వ యేట అక్టోబరునెలలో దక్షశిలాపరిపాలనమును బలగుప్తునకప్పగించి బిందుసారుడు పాటలీపుత్రమున కరుదెంచెను. తక్షశిలలో నున్నకాలమున జాల ప్రజారంజకుడనిపించుకొనివచ్చిన యువరాజును మహారాజును మంత్రిమండలమును మిగుల బ్రశంసించిరి. క్రీ. పూ. 297 వ సంవత్సరమున ఆగస్టునెలలో నాతడు చాణక్యునిచెంత రాజధర్మముల నభ్య

క్షింప నారంభించెను. చాణక్యుడు చంద్రగుప్తునితో "బాబూ! మహారాజులు పెద్దలైనారు. సామ్రాజ్యభారం నీ కప్పగించి నిశ్చింతగా కాలంగడపాలని కోరుతున్నారు. నీకున్నూ రాజ్యభారం వహించదగ్గవయస్సు వచ్చింది. ప్రజా పాలనంలో వుండే కష్టసుఖాలూ కొంతవఱకు అనుభూతములైనవి. కాని రాజ నీతి అతిగహనమైనది. అందులో సూక్ష్మధర్మాలు తెలుసుకు వ్యవహరించే రాజుకు ఇహపరాలు కరతలామలకము లవుతవి. నాయనగారి అనుజ్ఞచే నేను కూర్చిన అర్థశాస్త్రగ్రంథమును నువ్వు అభ్యసించు. పదిహేనుఅధ్యాయముల గ్రంథ మది. లోకవ్యవహారమంతా ఆగ్రంథంలో నీకు తెలిసివస్తుంది. సమస్త శాస్త్రాలకు సారభూతమైన దీయర్థనీతిశాస్త్రం! అర్థనిపుణుడైనవానికి పురుషార్థాలు అరచేతిలోనివే. సమస్తవిద్యలకు శిరోమణియైన ఆన్వీక్షకిని అభ్యసించి నువ్వు సమాహితచిత్తుడవై, లోకమర్మాన్ని గ్రహించి, వాక్క్రియాకౌశల మును అలవఱచుకోవాలి. రాజులపాలిటి కామధేను వది" అనిపలికి నీతిశాస్త్ర ప్రాశస్త్యము నుపదేశించెను. పిమ్మట నాతడు పుణ్యాపాపవిచారమున వేద ప్రామాణ్యతను నిరూపించి రాజులకు వేదము లుపాదేయము లని తెలిపి, కృషి వాణిజ్యపశుపాలనముల నెఱిగించువార్తను గుఱించి ప్రశంసించెను. నాలవది యగు దండనీతిచే రాజులు న్యాయవిచక్షణులు, బలసంపన్నులునై నెగడుదు రని తెలిపి యీనాలుగువిద్యలును నేర్చినప్రభువులే భూపరిపాలనయోగ్యు లని బోధించెను.

అనంతరమున నాలుగువర్ణములను, నాలుగాశ్రమములనుగూర్చి ఎఱిగించి, రాజులు ప్రజలను వర్ణాశ్రమధర్మములందు గ్రమముగా మెలగించుట కర్తవ్య మని యుపదేశించెను. నాలుగువర్ణములవారికిని అహింస పరమధర్మ మనియు సత్యము, శౌచము, దాక్షిణ్యము, అక్రోధనత యనునవి అహింసకు జెలిమికత్తియలనియు దెలిపి ఆయీసద్గుణముల నలవఱచుకొని స్వధర్మము నను ష్ఠించువాడే పురుషార్థపరు డనియు బోధించెను. ప్రజలను వారివారిధర్మము

లందు ప్రవర్తింపజేయుట రాజులకువిధి. స్వధర్మరతి స్వర్గప్రాప్తిసాధనమనియు పరధర్మావలంబనము భయావహమై వర్ణవ్యవస్థను రూపుమాపుననియు నెఱింగిన రాజు భూతలమును స్వర్గతుల్య మొనర్చుననియు నుపదేశించెను. బిందుసారు డంతట "యవనులలో వర్ణాశ్రమాదిధర్మాలు లేవు గదా, వారు మాత్రం సుఖపడటంలేదా? మనమెందుకు వీనిని రక్షించడం?" అని ప్రశ్నించెను. చాణక్యుడు "ఎవరిధర్మం వారికి సుఖమే యిస్తుందని చెప్పనే చెప్పితినిగదా? మన ధర్మం యవనులుగాని, యవనధర్మం మేనంగాని అవలంబిస్తే భయావహమవుతుంది. శరీరం తెల్లగావుండడం వారికి సహజధర్మం. మనకు ఒంటిపై ఎక్కడైనా ఒక తెల్లనిమచ్చ కనపడితే అదిరోగలక్షణం" అని బదులుచెప్పెను.

బిందు.—చిత్తం. ఆర్యులవల్ల ఒకటి రెండు సందేహాలు తీర్చుకోవలసివున్నది. నేను. ఏమిటంటే:—అలకసుందరుడు పాంచాలాదిదేశాలలోవుండే మహాశూరజాతులను అవలీలగా జయించాడుగదా, ఆయనసేనలు మగధపై ఎత్తిరావడానికెందుకు వెనుదీసినవా అనే సందేహ మొకటి నన్ను బాధిస్తూవున్నది. పోనీ, నందసేనలు పర్వతకాదులసేనలకంటె ఎక్కువశౌర్యము కలవేమో అంటే కావాయెను. ఈవిషయంలో ఆర్యు లేమంటారో తెలుసుకోవలెనని వుంది.

చాణ.—వెనుకటికి ఒకగృహస్థువంటయింట్లో దొంగ ప్రవేశించాడట. ముందు అక్కడిపదార్థాలు ఆరగించి తరువాత తక్కినపని చూచుకొందామనుకొని వంటయిల్లుశోధించడంలో వాడి కొక ఆముదపుసీసా కనిపించింది. ఆచీకటిలో తేనె అనుకొని ఆయాముదం కాస్తా త్రాగాడు. త్రాగినదగ్గరనుంచి వికారంపుట్టుకువచ్చి, తక్కినయిల్లు చక్కబెట్టడం వదిలేసి, ముందు ఇక్కడినుంచి బయటపడడమే శ్రేయమనుకొని వచ్చినదారినే పారిపోయినాడట. అలాగే అలకసుందరునకుగూడా ముందుగానే ఇనుపగుండ్లవంటి పాంచాలవీరులు తారసిల్లారు. వారిని జయించేటప్పటికే తలప్రాణం తోకకువచ్చింది.

ఆస్థితిలో ఇంకా ముందుకు సాగివద్దామంటే వెనుకనుంచి అశ్వాలు తిరుగబడి, పర్వతమార్గాలు అరికట్టితే ప్రాణాలతో బయటబడలే మని ఆధైర్యం కలిగింది. అలా కాకుండా అలీసాండరే గనుక ముందుగా దక్షిణదిశనుండి ప్రవేశించినట్లయితే అయ్యనపూనినపని చాలా సుకరమయ్యేది. ఆదొంగకు గూడా ముందుగా పాలో చక్కెరలో దొరికినట్లయితే తీరికగా యిల్లంతా చక్కబెట్టి మరీ వెళ్లేవాడు."

బిందుసారు డార్యునిమాటలకు నవ్వుకొనుచు. "చిత్తము. నాకెండవ సందేహ మేమిటంటే శల్యకేశ్వరుడు మనవల్ల గ్రహించినదెల్లా ఐదునూర్ల ఏనుగులే కదా, అభాగ్యానికి తనరాష్ట్రం మనకెందుకు వదలిపెట్టినాడా అని. దీనికి అంతకంటె బలమైన కారణ మేదోవుండి యుండాలి" అని యడిగెను.

చాణ.—మనకు వదలిపెట్టినరాష్ట్రాలు శల్యకేశ్వరునకు పూర్తిగా వశంవదములుకాక చాలాచిక్కులు కలిగిస్తున్నవి. అవల ప్రబలశత్రువులతో పోరాడవలసి యున్నతరుణంలో అపరక్తములైనరాష్ట్రాలను వెనుక ఉంచుకోవడంకంటె, వానిని మనకు వదలివేసి, శత్రువిజయసాధకములైన ఏనుగులను మనవల్ల సంపాదించుకోవడమే మంచి పని అయన ఆలోచించాడు. ఆయన మంచిరాజనీతిజ్ఞుడు. సంధివిగ్రహయానాదులను దేశకాలములెఱిగి, అవలంబించడమే రాజనీతి. ఒకశత్రువుతో సంధిచేసుకొని రెండవశత్రువుమీదికి ఎత్తిపోవడం నీతిశాస్త్రంలో చెప్పబడినదే. కనుక శల్యకేశ్వరు డానీతి నవలంబించి శత్రువును జయించాడు.

బిందు.—ఆర్యులుచెప్పినమాట నిజమేకాని, శల్యకేశ్వరుడు ఇచటి అపజయాన్ని కప్పిపుచ్చుకోడానికి, తాను చప్పగా లొంగిపోయి రాజ్యం వదలుకొన్నట్లు కనిపించకుండా ఏనుగులను పుచ్చుకోవడమనే మిషబన్నాడను కొంటాను.

చాణ.— ఔను. అవిన్ని రాజనీతియే. తన ఓటమిని, పలాయనమును అపలపించి కప్పిపుచ్చవలసి వుంటుంది. లేకపోతే స్వసేనలు ఆధైర్యపడతాయి.

ఇట్లు వచియించి, ఆనాటికి శాస్త్రవిచారము చాలించి, చాణక్యుడు మఱునాడు మరల నిట్లు చెప్పదొడగెను.

"వేదములు ధర్మాధర్మములు బోధిస్తాయని నిన్న చెప్పాను. కృషివాణిజ్య పశుపాలనములను ఏమఱక రక్షించుకొంటూ రాజు అర్థమును చేకూర్చుకొనే విధులను వార్తాశాస్త్రం బోధిస్తుంది. దుష్టశిక్షణ శిష్టరక్షణములను చేయవలసిన మార్గాలను దండనీతి బోధిస్తుంది. దండనీతిని క్రమంగా అనుసరించకపోతే వార్తకు, వేదములకు, ఆన్వీక్షకికి గూడా హానికలుగుతుంది. కాబట్టి రాజులకు దండనీతి ప్రాణసమానం. మానవబుద్ధి ఎప్పుడూ అపమార్గములలో ప్రవర్తించ గోరుతుంది. దండనీతివల్ల మానవస్వభావాన్ని సంస్కరిస్తూ వుండకపోతే బలహీనులకు, సాధువులకూ పీడ కలుగుతుంది మాత్స్యన్యాయం ప్రబలిపోతుంది.

"అయితే దండనీతిని రాజులు కనుగలిగి ప్రవర్తింపచేస్తూ వుండాలి. లేకపోతే నిరపరాధులు దండితులై, సాపరాధులు తప్పించుకుపోతారు. సాపరాధులను దండింపకవిడిచిన దానివల్లకంటె నిరపరాధులను దండించడంవల్ల రాజుకు ఎక్కువపాపం సంఘటిస్తుంది. కనుకనే సాపరాధిని విడిచిపుచ్చినదోషానికి ఒకదినమూ, నిరపరాధదండనానికి మూణ్ణాళ్లు రాజు ఉపవసించవలసిందని శాస్త్రములు విధిస్తున్నవి.

"కారాగృహబద్ధులైన దోషులకష్టసుఖము లైదునాళ్లకొకపర్యాయమైనా విచారిస్తూ, వారికి విద్యాబుద్ధులలవరచి, సన్మార్గగాములను చేయవలసి వుంటుంది. అనాథములైన వారికుటుంబాలకు భరణము లిచ్చి పోషిస్తూ వుండాలి. రాజుకుపుత్రలాభంకలిగినప్పుడూ, యువరాజు నభిషేకించినప్పుడూ, రాజ్యలాభం కలిగినప్పుడూ, జన్మదినాదు లైనపండుగలందూ, పబ్బములందూ, యౌవనవంతులూ, వృద్ధులూ, దీనులూ అయినదోషులను విడిచిపెట్టుతూ

వుండాలి. దండనం అనుభవించి, విడుదలైనవారిని నిష్కళంకులుగా ఎంచి వారిని రాజకార్యాదులయందు నియోగించవచ్చునేగాని వారి నింకా దోషులుగానే ఎంచగూడదు.

బిందు.—మరణదండనము శాస్త్రసమ్మతమేనా?

చాణ.—ఆహా. హంతకులకు, రాజద్రోహులకూ మరణదండనం విధిస్తే ఇతరులు భయంకలిగి అపరాధములు చేయకుండా వుంటారు. బహిశ్శత్రువులను శస్త్రాదిసాధనాలచే యుద్ధములో చంపినట్లే అంతశ్శత్రువులైన హంతకాదులనుగూడా శూలారోపాదివిధులచే చంపవలసి వుంటుంది. ఇది విశేష ధర్మము. దీనిని శాస్త్రములు అంగీకరిస్తవి.

అని చాణక్యుడానాడు దండనీతిప్రకార మెఱిగించి మఱునాడు శమదమాదుల నిట్లుపదేశింపదొడగెను. "రాజు శమదమాదులచే నిగృహీతేంద్రియుడు కావాలి. ఇంద్రియగ్రామము బలవత్తరమైనది. నిగ్రహమభ్యసించని రాజులు తాము చెడి, లోకమునుగూడా చెరుస్తారు. కామక్రోధవశులై, విషయలోలురైనవారు రాచరికానికి కొఱగారు. వైదేహుడగు కరాళుడు బ్రాహ్మణకన్యను బలాత్కరించి నశించెను. భృగువంశులపై కోపించిన తాళజంఘుడు చెడిపోయెను. సౌవీరుడైన అజబిందుమహారాజు లోభగ్రస్తుడై వినాశముపాలయ్యెను. మోహలోభాదులచే రావణదుర్యోధనులు సర్వనాశము దెచ్చుకొన్నారు. మాత్సర్యముచే హతుడైనాడు కార్తవీర్యార్జునుడు. వ్యాసుణ్ణి అపహసించిన వృష్ణిసంభవులు, అగస్త్యుని వంచించిన వాతాపి ఏమిగతిపాలైనారో చూడు. ఎందరెందరో రాజు లీవిధంగా అంతరరులచే వినాశం పొందారు. కాబట్టి రాజు శమదమాదిషట్కసంపన్నుడై, బ్రహ్మచర్యాదుల నవలంబించి శాస్త్రాధ్యయనంచేసి, వృద్ధసేవచేయాలి. ఆహారవిహారాదులయందు నియమవంతుడై వుండాలి. పూర్వాహ్ణమందు రథగజతురగారోహణము. యుద్ధనీతి అభ్యసిస్తూ భారతరామాయణాదులను పఠించి పూర్వరాజచరితలను స్మరిస్తూ

వుండాలి. అపరాహ్ణమందు వార్తాదండనీత్యాదులను తత్తచ్ఛాస్త్రజ్ఞులవలన అభ్యసించాలి. రాత్రులందు వీటినన్నిటినీ చిత్తనాపూర్వకంగా మననం చేయాలి. ఈవిధంగా శ్రద్ధావంతుడూ, నియమవంతుడూ అయి, అభ్యస్తశాస్త్రుడైనరాజు ప్రజారాధనంచేసి విశ్వాన్ని ఏలుకోగలుగుతాడు."

మణునాడు అర్థప్రకారమెఱిగించువాడై చాణక్యు డిట్లుపదేశించెను. "అర్థమే రాచరికానికి ఆయువుపట్టు. కాబట్టి రాజులు కోశరక్షణమున అప్రమత్తులై వుండాలి. అర్థానర్థవిచారణం చక్కగా చేసి, అర్థాగమమార్గములను కాపాడుకోవలెను. పట్టణాలు, జనపదాలు, గనులు, అడవులూ, ఆరామములూ, పశువులూ, నదులూ, సముద్రమూ, శుల్కములూ-ఇవి ముఖ్యంగా అర్థాగమమార్గాలు. రథగజతురగాదులు, కొలపాత్రలు, తూనికరాళ్లు, పానశాలలు, ద్యూతగృహాలు, మాంసవిక్రయశాలలు, ఘృతతైలాదులు, చక్కెర, గృహనిర్మాణాలు, తైర్థికులు ఇత్యాదులచే నగరాలలో శుల్కములు లభిస్తవి. పల్లెలలో, పంటభూములు, బీళ్లు, రాచబాటలు, యానపాత్రలు మొదలైన వానివల్ల సుంకములు లభిస్తవి. స్వర్ణరజత వజ్రవైదూర్య ప్రవాళ శంఖలవణాదులగు ద్రవ్యములు ఖనిజాదులు. పూలు, పండ్లు, చెఱకు మొదలైనవి ఆరామములవల్ల వచ్చేరశ్మి. ఇలాగే అరణ్యములలో దారువులవల్ల, గజాదిమృగములవల్ల రాజుకు అర్థము లభిస్తుంది. పశుసంపద సరేసరి కదా! నదులలో సముద్రంలో దొరకేమత్స్యాదులలో నిధి నిక్షేపాములలో, ఓడబేహారంలో అటో పాలు రాజుకు చేరుతుంది. ఇవియన్నీ అర్థాగమమార్గములు.

"ఇక అర్థవ్యయం. నిత్యమూ, సద్వినియుక్తమూ, విశేషమూ అని వ్యయమార్గాలుమూడు. రాజపురుషులకూ, భృత్యాదులకూ యిచ్చే వేతనాదులు నిత్యవ్యయం. సువర్ణనసరస్సుకొఱకు వెచ్చించిన మూడుకోట్లపణాలు సద్వినియుక్తము. కాటకపువేళ వెచ్చించిన కోటిసువర్ణాలూ విశేషవ్యయం.

"రాజులు ఆయవ్యయాల నెప్పటికప్పుడు సరిచూచుకుంటూ రాజ కార్యనియుక్తులు అపహరించకుండా కనుపెట్టి వుండాలి. మనుష్యులు చంచల స్వభావులు. అశ్వగతివలె వారిచిత్తవృత్తులు మారుతూ వుంటవి. నాలుక చివర నున్నది విషంగాని, అమృతంగాని రుచిచూడకుండా వుండలేరు. కాబట్టి రాజనియుక్తులు ద్రవ్యం అపహరించకుండా వుండరు. నీటిలో బ్రదికే చేపలు ఎంతనీరు త్రాగుతున్నవో చెప్పలేము. అలాగే రాజద్రవ్యమును నియుక్తు లెంత అపహరిస్తున్నారో స్పష్టంగా తెలుసుకోలేము. కాబట్టి నియుక్తుల కెప్పటి కప్పుడు స్థానభ్రష్టత కలిగిస్తూ క్రొత్తచోటికి మారుస్తూవుంటే ద్రవ్యా పహరణం కొంతతగ్గుతుంది. నియుక్తాపహృతమైన ద్రవ్యపుజాడ తెలిపినవాళ్లకు అపహృతద్రవ్యంలో ఆఱోపాలు ముట్టజెప్పవలెను. ఆ తెలిసినవాళ్లు కూడా నియుక్తులే అయితే పండ్రెండోపాలు ఇవ్వవలెను. అపహరణవిషయంలో తెలిసీ తెలియనికొండెములు చెప్పేవాళ్లను కశాఘాతంచేత దండించాలి."

మఱునాడు రాజ్యాంగములగూర్చి చాణక్యు డీరీతి నుపదేశించెను.

"రాజు, మంత్రీ, రాష్ట్రము, దుర్గము, కోశము, సేన, మిత్రులు అనేవి సప్తాంగములు. రాజ్యానికి సప్తాంగసహితమైనరాజ్యమును ఉపాయ షట్కముచేత రక్షించుకోవడం రాజులకుకర్తవ్యం. ఉపాయములు దేశకాలము లెఱిగి ప్రయోగించాలి. శత్రువు యుద్ధసన్నద్ధుడై ఎత్తిరానున్నప్పుడు సంధి కోరడంగాని, యుద్ధానికి సంసిద్ధుడు కాకుండా శత్రువుపైకి ఎత్తిపోవడంగాని రాజులకు తగదు. మంత్రం బైటికి పొక్కకుండా రక్షించుకొంటూ, ఏవేళ నేమిచేసేదీ యితరులకు తెలియనీయకుండా కార్యములు చేసుకుపోవాలి. చారులవల్ల శత్రువులరహస్యములు తెలిసికొంటూ, తనమంత్రం శత్రువులకు చిక్కకుండా గోపనంచేసుకోవాలి. చారచక్షువైన రాజుయొక్క రాజ్యం శాత్రవోపద్రవములు లేకుండా సుఖిస్తుంది. మహారాజు పక్షులను లాలిస్తూ వుండడం నువ్వు చూచేవుంటావు. ఎఱగనివాళ్లు మహారాజు కాపక్షులమీద

# ముగ్గురు మూర్తులు

ప్రతికాబోలు ననుకొంటారు. మేఘస్థానుడు కూడా అలాగే అను డు. నిజానికి, ఆపఘ్నులద్వారాదేశం నాల్గుదిక్కులనుండి చారు లెప్పటి లప్పుడు పంపుతూ వుంటారు. మహారాజు వాటిని లాలిస్తున్నట్లే వుండి చ్చిన రహస్యలేఖలను పరికిస్తూ వుంటాడు. కాబట్టి రాజులు ఏపని పను చేస్తున్నారో ఇతరులకు తెలియగూడదు.

"ఆత్మదేశీయులు, అభిజాతులు, కళాకుశలురు, దూరదర్శనులు, కులు, ధైర్యసంపన్నులు, వాచానిపుణులు, ఉత్సాహశీలురు, గంభీరులు, హిష్ణులు, సచ్చరిత్రులు, చతురప్రజ్ఞులు, అకుటిలులు, విశ్వసనీయులైన త్యులను రాజు మంత్రసహాయులుగా వరించాలి. దానమోహాభయా కే వారిని ముందుగా పరీక్షించి, అట్టి పరీక్షకాగిన స్వామిభక్తుల నే వరిం

"సామాద్యుపాయములచేత నిగ్రహానుగ్రహములను పంచిపెట్టే లకు రాజ్యం సుఖముగా వశంవదమవుతుంది. ప్రమాదము, ఆలస్యము, ము, నిద్రలో కలవరించుట మున్నగుదుర్గుణములు గలవారిని, స్త్రీలోలురై క్రమును పొక్కనిచ్చువారలను మంత్రిత్వమునుండి రాజులు తొలగింప ." "విన్నపములు సేయవచ్చినవారికి రాజసభ సులభప్రవేశముగా ఉండ . దేవస్వబ్రహ్మస్వములకు హానికలుగకుండ రాజు స్వయము విచారించు కవలెను.

"పశువులకు, వృద్ధులకు, బాలురకు స్త్రీలకు, అనాథులకు, దీనులకు రబాధలను రాజు స్వయముగా విని వారిని రక్షింపదగును. ప్రజలకు ఈతి లు కలిగినపుడు నివారించుచుండవలెను.

"వివాహములు, ఋణములు, ఇల్లడసొమ్ములు, జూదములు మున్నగు కారణముల బరిహరించి ప్రజలను సుఖపెట్టుచుండవలెను."

చిందు.—వివాహము లెన్నివిధములో ఆనతీయాలి ఆర్యులు.

చాణ.—శాస్త్రము లెనిమిదివిధములైన వివాహాల నంగీకరిస్తున్నవి. ఆచారం మరికొన్నిటిని అంగీకరిస్తున్నది. ఉభయపక్షాలకు సమ్మతమైన వివాహం ఎటువంటిదైనా రాజు అంగీకరింపవచ్చును.

చిందు.—స్త్రీలకు భాగార్హతమాట ఏమంటారు?

చాణ.—శక్తిగలవాళ్లనెల్ల భార్యకు రెండువేలపణాలు స్త్రీధనంగా యివ్వడం ధర్మం. ఇక నగలంటావా, నగలివ్వడానికి మితియంటూ లేదు.

చిందు.—ప్రజల ఆచారభేదాలు, మతభేదాలు మన్నించవలసినదేనా, రాజులు?

చాణ.—పరులకు బాధకలిగించని ఆచారాలను, మతములను రాజు మన్నింపవలసినదే. అకారణంగా జోక్యంచేసుకొని, మతైక్యత, ఆచారైక్యతా కల్పింపజూచేరాజును ప్రజలు సహించరు. సహించినప్పటికీ రాజు జోలికి పోగూడదు. ప్రజలందరినీ ఏకమతస్థులనుచేయాలనీ, వారిలో సమత్వం కల్పించాలనీ చేసేప్రయత్నం అందరిముక్కులూ ఒక్కటేకొలతనుండాలని చెక్కించడంవంటిది. పూర్వసంస్కారములవల్ల, కర్మలవల్ల కలిగే యీ భేదాలే సృష్టికి శోభను కూర్చేవి. యజనయాజనాదిషట్కర్మనిరతుడై బ్రాహ్మణుడు ముక్తిని పొందుతాడు. అలాగే ప్రజారాధనతత్పరుడైనరాజు మోక్షార్హు డవుతాడు. ప్రజలసుఖమే తనసుఖము. అంతేగాని తనసుఖం ప్రజల దని యెంచగూడదు. ప్రజలకు ప్రియమైనదే రాజులకు ప్రియం. ఈవిధంగా స్వధర్మనిరతుడై రాజు కర్తవ్యాచరణం చేయవలెను.

"ఈరాజధర్మాల నెఱిగి నీవున్నూ పూర్వరాజులకీర్తిని సంపాదించుకొని వృషలునికంటె అధికుడవ నిపించుకోవాలని నిన్ను సర్వదా ఆశీర్వదిస్తున్నాను."

---

# 39

## సుభద్రాంగి ప్రణయము

చంపాపురవాసియగు దేవశర్మయను విప్రునకు సుభద్రాంగియను కూతురు గలదు. చూపఱకన్నులకు అమృతస్నానమొనరించు నాబాలికయుజ్జ్వల మూర్తిని గాంచి దేవశర్మ పట్టరానిసంతోషమున మురియుచు నాటబెరిగెడి దానిని గూటబెంచుచుండెను. రూపమునకు దగిన ట్లాబాలిక గుణములుగూడ జిన్నల, బెద్దల నొక్కరీతి వలపించుచుండెను. అపరూపరూపగుణభాసిత యగు కూతు నాతండ్రి దైవజ్ఞులకుం జూపి "నాబంగారుతల్లికి జాతకఫలం చెప్పు" డని కుతూహలియై యడుగుచుండ నాకార్తాంతికులు "ఈపిల్ల చక్రవర్తికి భార్య అవుతుంది. ఈమెకడుపున జక్రవర్తిపుట్టుతాడు" అని చెప్పి దేవశర్మ యదృష్టమును గొనియాడుచుండిరి. జ్యోతిష్కులు చెప్పినట్లుగానే ఆటపాటల లోను చదువుసుద్దులలోను అబాలిక తులలేనిగరువతనమును,తీవియు వెలార్చుచు గ్రమముగాబెరిగి పదునైదేండ్లదియైయారిదై మిసమిసలాడు యౌవనసంపదచే మెఱసిపోవుచుండెను. రాణివాసమునకు దగినయీదేవకన్య పేదబాపడైన దేవశర్మయింటబుట్టుట చోద్యమని పౌరు లాడుకొనుచుండ, గనులయెదుట బూర్ణయౌవనయగుచున్న ముద్దుకూతుంగాంచి దేవశర్మ అనురూపవరునిగూర్చి విచారింపనారంభించెను. తనయరూపగుణములను, దననిష్పచ్చరమును బలుగతుల దలపోసి, ధీరవిచారు డగు దేవశర్మ తుదకు గార్తాంతికులమాటలు నిజమొన ర్చెదగాక యని పూని కార్యసాధనమున కుపాయములు వెదకజొచ్చెను.

తుద కొకనాడు సుభద్రాంగిని వెంటదోడ్కొని పాటలీపుత్రమున కేగి రాజాంతఃపురమునకు చిన్నగా ద్రోవతీసెను. అప్పటికప్పుడే యువరాజగు బిందుసారుడు వివాహితుడు. కళింగరాజతనయయగు లజ్జావతిని, ఉజ్జయినీ రాజపుత్రియగు సూర్యకాంతను బిందుసారునకు పదునాఱేండ్లు నిండగనే

వివాహమొనర్చెను. అప్పటి కింక నాతడు తక్షశిలకు రాజప్రతినిధియై యేగ లేదు. సుగాంగముచెంతనే యున్న కుమారప్రాసాదమున నాతడు నూత్నవధువులతో భోగము లనుభవించుచుండెను. యువరాజభార్యలిరువురు రూపవతులనియు, భర్తృసేవారత లనియు, భర్త్రనుగ్రహసంపాదనమునకై వంతులు పడుచుండురనియు, తమపట్టైచట సడలిపోవునో యనుభయమున చిన్నరాణులిరువురు గూడ విలాసవతులగు జవ్వనుల నంతఃపురమున గాలిడనీయరనియు దేవశర్మకు దత్రత్త్య తెలియగించిరి. దేవశర్మ తనపూనిక నెరవేర్చుకొనుట కిది కాదుమార్గమనియెంచి ఉపాయాంతరము నిశ్చయించెను.

సుభద్రాంగి సంకట సుభగంకరణవిద్యయందు నిపుణురాలిం గావించి పరిచారికావేషమున రాజాంతఃపురముం బ్రవేశపెట్టెను. కులోచితవేషమున నాయెలనాగ అలనాటిసైరంధ్రియుంబోలె రాణివాసముం జొచ్చి, మాల్యానులేపన కేశసంస్కారాదివిధులచే చిన్నరాణులకు మెప్పుబుట్టించుచు, నగరిలోని వారి కెల్లరకుం దలలోనినాల్కయై మెలగుచుండెను. నివురుగప్పిననిప్పువలె వెలుంగునమ్ముదరాలి రూపసౌభాగ్యమున కచ్చెరువందియు రాణులిద్దరు దాని కళాకౌశలమునకు మధురభాషణములకు మేలువడి మనసిచ్చి మన్నింపజొచ్చిరి. సుభద్రాంగియుం బిందుసారుని కంటబడుటకును, జగన్మోహనమైన నిజరూపముచే ఆతని ముగ్ధునొనర్చుటకును దఱిపేచి యిట్లు మూడునెలలు గడపెను.

అంతట నొకనాటి సాయంసమయమున సూర్యకాంతాలజ్జావతులు శాంతవతీదేవిచే నాహూతలై ఆయమ నగరి కరిగియున్నతఱి, సుభద్రాంగి సమలంకృతదేహయై ఏకాంతమందిరమున బర్యంకాసీనయై వీణియ గైకొని పాటపాడదొడగెను. అప్పుడే వాహ్యాళి వేగివచ్చినయువరాజు అంతిపురముం జొచ్చి ఆగాంధర్వమధురిమము కర్ణపుటములం జొఱబాఱి సంగీతప్రియుడగు నాతనిహృదయము నెలయించికొనిపోవ, నాసవ్వడి యేతెంచుజాడనే చనిచని సుభద్రాంగియున్న మందిరముం దాసెను. తలుపు దట్టినచో నాసంగీతప్రవాహ

మాగిపోవునసుభయమున, హృదయమును గద్దములం నప్పగించి, చిత్రలిఖిత రూపముకై వడినట్లే గుమ్మముచెంత గొంతవడి నిలిచెను. పిమ్మట నారాకుమారు డల్లన దలుపులు దెఱచి లోనికిం దొంగి చూచెను. మరకతమణిపీఠనిషణ్ణయై కచ్ఛపింబలికించు శారదాదేవియన బచ్చపట్టుపరపులపై నాసీనయై వీణియకు బలుకులునేర్పుచున్న సుభద్రాంగిం గాంచి ఆశ్చర్యరసమగ్నుడై మరల జేష్టలుడిగి కొండొకవడి అట్లే నిలిచి రెప్పవేయక ఆదివ్యరూపముం గాంచుచుండెను: సుభద్రాంగియు నేమియు నెఱుగనట్లు వీణియలో లయించి పోవుచుండెను. యువరాజంతట నల్లనల్లన నడుగులిడుచు లోనికిం జని పర్యంకముచెంతనున్న పాదపీఠముపై నుపవసించెను. సుభద్రాంగియు నాల పించుచున్న రాగము ముగించి, యువరాజు స్ఫటికశ్వాదము చూచినదానివలె దివాలునలేచి, పర్యంకము డిగ్గనుఱికి, వినయవినమితయై, "ఏలినవారిరాక పరికింపక అపచారంచేశాను" అని నొచ్చుకొనుచు బలికెను. "కాదుకాదు. నేనే లోనికివచ్చి సంగీతాధిదేవత కపచారంచేశాను. అంతేకాదు. నానగరులోవున్న దేవకన్యక నిన్నాళ్లు గురుతింపని అపచారంకూడా జరిగింది నావల్ల" అని బిందుసారు డనియెను.

సుభద్రాంగి.—"దేవర నన్నింతటికిట్లా సామ్రాజ్యంగా స్వర్గలోకంలోకి ఎత్తుతారు?"

బిందు.—"నీఅప్సరస్సౌందర్యం నీగాంధర్వగీతం, పిలాసికే నన్నే స్వర్గంలోకి ఎత్తితెచ్చినవి" అనుచు నాజవరాలి కెంగేలు గ్రహించి "కాని యీ స్వర్గంలో నీతో కూడా వుండేభాగ్యం నాకులేదు. నీవలె నిరుపేదశూద్ర కులంలో జన్మించక, మగధసామ్రాజ్య కుమారుడనైనపాపం నన్ను దిగ లాగుతున్నది" అనియెను. సుభద్రాంగి యానందహర్ష విస్ఫారితలోచనయు, లజ్జావనతవదనయునై, యువరాజహస్తకీలితమైన కెంగేలు చెమరుమొగ్గలు దొడుగ "నేను శూద్రబాలికనని యెవరుచెప్పారు ప్రభువులకు! చంపా

వాసియైన దేవశర్మ కూతురివే ప్రభువులు వంచితులైనారు. ఈ అపరాధం నా ప్రేమది కాని నాది కాదు. పంపామార్గాన వేటకు వెళ్లుతుండగా చూచింది మొదలు యువరాజును హృదయగట్టుకొన్న శరీరమిది. ప్రభువు లీసాహసం మన్నించాలి" అనెను.

యువరాజంతట నాశ్చర్యహర్షములకు వశుడై, అవనతముగు నాబాలిక నెమ్మోమును నిజహస్తమున పైకెత్తి తేరిపారజూచుచు, "అవును. ఎంత పొరబడ్డాను. ఈముద్దుమొగంలో ఉచ్చుగ్రుచ్చినట్లున్న ఆభిజాత్యాన్నీ, అభిమానాన్నీ యిన్నాళ్లు చూడలేక గ్రుడ్డినైపోయినాను. విధివంచితుడనైతే ప్రతిక్రియ లేదుగాని, నువ్వు చేసినవంచనానికి ప్రతిక్రియ నా చేతిలోనే వుంది" అనుచు సుభద్రాంగిని చెంతకు దీసికొని హృదయమున జేర్చుకొనెను. లవలీకోమలయగు సుభద్రాంగి క్రమముగ నిగిడికొంట నిష్కంపితయగుచు బాహాయుగ్మము నాతనికంధరమునకు బంధనముగ గావించి నెమ్మోము నాతనివిపుల వక్షమున దాచుకొనియెను. వసకొంటనట్లు కరగిపోవుచున్న ప్రియురాలి నెమ్మొగము నారాకమాయుషించుచు యెడగలుగ హస్తతలమున నెత్తిపట్టి ప్రేమోజ్జ్వలములైన యభిమానతలూపుడు నా కన్నదోయిని వికసితనేత్రపద్ముడై కాంచుచు "సుభద్రా! నువ్వు చేసినవంచనకు నిన్ను మగధసింహాసన మెక్కించడమే దండనం" అనుచు గాంధర్వవిధిచే నామెను కరగ్రహణమొనర్చెను.

లజ్జావతీసూర్యకాంతలు నగరికేతెంచి యువరాజు సుభద్రాంగిని వివాహమైన వృత్తాంతమును యువరాజముఖముననే విని, ఆశ్చర్యసంభ్రమ విషాదము లొండొంటి మీఱి నెమ్మొగమ్ముల వోప నించుకతడవుండి, పిమ్మట సుభద్రాంగియెడ నలవడిన నెయ్యము పెంపు పైచేయియగుడు సాదరముగ నాముద్దరాలి నాలింగనమొనర్చుకొని సంభావించిరి. పిమ్మట చాణక్యచంద్రగుప్తులును, రాక్షసామాత్యుడు నీవార్తవిని క్షణములోదా మించుక గుసగుసలు వోయిరి. తుదకు చాణక్యుడు "మనదేశపుబాలికను అందులో విప్రకన్యను

యువరాజువరించడం ఎంతైనాఉచితంగావుంది. ప్రజలుకూడా యువరాజ్ఞిని ఆత్మీయగా ఎంచి ఎంతో అనురక్తులవుతారు" అనిపలికి మహారాజును, అమాత్య ముఖ్యులను సమాధానపఱచెను. పిమ్మట శుభముహూర్తమున సుభద్రాంగీ బిందుసారులవివాహము యథావిధిగా జరిగెను. మఱుసటియేట బిందుసారుడు దక్షశిలకు మహారాజప్రతినిధియై యేగునప్పుడు సుభద్రాంగిని గూడ వెంటగొని యేగెను.

క్రీ. పూ. 301 వ యేట సుభద్రాంగి కుమారుని గనియెను. ఆశిశువునకు సుమనుడని నామకరణమొనర్చిరి. ఆమఱుసటియేట సుభద్రాంగికి రెండవకుమారుడు జనింప నాబిడ్డ కశోకవర్ధనుడని పేరిడిరి. పెద్దకొడుకు సుమను డందాలకుప్ప. అశోకవర్ధనునకు అందచందాలకు జాలనవ్వు. అట్లయ్యు గడుపునగన్నవారికి, గనులగన్నవారికిం గూడ నారెండవబాలుడే ప్రియము మెంపదొడగెను.

త్రికాలవేదియని పేర్వడిన పింగళవత్సజీవులను ఆజీవకస్వాములకు యువరాజు నిజకుమారు లిరువురింజూపి "వీరిలో నాయనంతర మెవరు గద్దె నెక్కుదు"రని యడిగెను. ఆస్వామి యంతట నశోకవర్ధనుం గేల జూపుచు "ఈబాలుడు చక్రవర్తి లక్షణలక్షితుడు. ఇంతటిచక్రవర్తి యీభూమిపై మఱి పుట్ట" డనెను. యువరాజును లోలో మురిసిపోవుచు "చిన్నవాడు గద్దె యెక్కుటెట్లు" అని మరల ప్రశ్నింప వత్సజీవులు నవ్వుచు "విధివిలాసానికి కారణ మెవరు చెప్పగలరు!" అని బదులు పలికి తనదారి నేగెను.

యువరాజు భార్యాపుత్రులతో పాటలీపుత్రమునకు దిరిగివచ్చునప్పటికి సుమనునకు మూడేండ్లు. అశోకవర్ధనునకు రెండవయేడు. మహారాజునకు పెద్దరాణులకు గన్నులపండువుగా నాబాలురిద్దరు రాచనగరులో పెరుగుచు దమతొక్కుపలుకులచే వారికి శ్రవణానంద మొనర్చుచుండిరి. ముఖ్యముగా దేవభ్రాంత ఆబాలకులను బలువిధముల ముద్దుసేయుచు దద్రక్షణమున నేమఱక

సదా వారితో మెలగుచుండును. చాణక్యదౌహిత్రుడగు రాధాగుప్తుఁడా బాలుర క్రీడలజోడై వారితో రాజాంతఃపురమునందే పెరుగుచుండెను.

మహారాజప్పటికే మహావ్యాధిగ్రస్తుడై తఱచు అంతఃపురముననే కాలయాపన మొనర్చుచుండెను. చాణక్యచంద్రగుప్తులిరువురు సంజప్రొద్దుల నాబాలకులు మువ్వురితో నారామముల నాటపాటలతో దఱచు గాలక్షేప మొనర్చుచు రాచకార్యములనెల్ల విస్మరించుచుండిరి.

---

# 40

## విజయదశమి

క్రీ. పూ. 297 వ సంవత్సరమున సెప్టెంబరునెల యది. మగధ సామ్రాజ్యమంతయుం నరిష్టములు, బీడలు లేక చల్లగా సుఖిస్తున్న రోజులవి. అనుకూలవర్షపాతముచేత నాయేట భూమి విఱగ బండినది. ప్రజారంజకమగు చంద్రగుప్తమహారాజపాలనమున బ్రజలెల్ల రాజనియంతృత్వదౌష్ట్యము లెట్టివో యెఱుగక, ధనమానప్రాణభీతిలేక సుఖించుచు, గలకాల మీనేల నీమహారాజే యేలవలెనని వేయిదేవుళ్లకు మ్రొక్కుచుండెను. పవలనక రాత్రియనక నిర్భయముగా దేశమున నీమూలనుండి ఆమూలకు రాకపోక లొనర్పదగిన రాచబాటలతో దేశమంతట వర్తకము విరివిగా సాగుచుండెను. ద్వీపాంతరములతో నవిచ్ఛిన్నముగా నోడబేహారము సాగుచుండెను; భారతభూమి సిరిసంపదలతో దులదూగుచుండెను. పట్టణములు బల్లెలు గూడ గ్రయవిక్రయములతో బాడిపంటలతో గలకలలాడుచుండెను. దేవస్వబ్రహ్మస్వములు సురక్షితములై ప్రజలు భక్తివంతులు, బురుషార్థపరులు నగుచుండిరి. భోగత్యాగములకు నిలయములగు ధనికసదనములతో, వేదశాస్త్రభాండారము లనదగినయగ్రహారములతో, కృషివాణిజ్యపశుపాలనాదుల నేమఱక స్వస్వవృత్తుల సుఖజీవనము

లొనర్చు నితరగృహస్థమందిరములతో దేశమెల్ల శాంత్యావాసమై అతిథిసంతర్ప ణములతో విధివిహితకర్మకలాపములతో నిత్యకల్యాణము, బచ్చతోరణముగా నుండెను.

లక్షలాది తైర్థికులు కాశీరామేశ్వర గయాప్రయాగాది పుణ్యక్షేత్ర ములకు దేశము నలుదెసలనుండి మూగి గౌతమీభాగీరథులను, యమునాకావేరు లను, తామ్రపర్ణీసింధులను ఏకమొనర్చి అరమరికలు లేక పరస్పరము కలసి మెలగుచుండిరి. ఉత్తరదేశమునుండి భద్రబాహుస్వామి వెన్నంటి వచ్చిన జైనులు వేలకొలది శ్రావణబెలగోల, బ్రహ్మగిరి, జాతింగా, రామేశ్వరసిద్ధ పురములందు, సత్యపుత్రదేశమునందు స్థిరనివాసము లేర్పఱచుకొనిరి. అట్లే బౌద్ధులు గూడసువర్ణగిరిమండలములలో, అమరావతీ కాంచీ నాగపట్టణములలో విహారములు నిర్మించుకొనిరి. చోళపతియానతిచే బ్రాహ్మణులు కావేరిపూంపట్టన మున నింద్రయాగమారంభించి ప్రజను వైదికమతానుయాయుల నొనర్ప దొడగిరి. కొందరు విప్రులు పాండ్యమండలమున శ్రీచెందూరునకేగి నివాసము లేర్పఱచుకొనిరి. ఈవిధముగా దిగ్భేదములు, మతభేదములు, భాషాభేదములు సమరసభావమునందుచుండెను. కార్తికేయస్వామి మురుగేశునితో, సుబ్రహ్మ ణ్యేశ్వరునితో నభేదము భజించెను.

ఇట్లు భారతభూమియంతయు నేకకుటుంబముగా మారుచున్న నాళ్లలో నాయేటి శరన్నవరాత్ర్యుత్సవము నపూర్వవైభవముతో బ్రవర్తిల్లెను. తోర ణాలంకృతములైన ద్వారములతో, రంగవల్లికలచే నొప్పారు ముంగిళ్లతో నేయింటివి జూచిన గలకలలాడుచుండెను. ఏయింటిచత్వరమున గాంచినను అగురుధూపధూమములతో, కర్పూరనీరాజనములతో లక్ష్మీసరస్వతీపార్వతుల పూజలు జరుగుచుండెను. ఏయూర గనుగొన్నను ఆటలు, పాటలు, నాటక ములు, భజనలు, పురాణములు మున్నగు వేడుకలే.

దేశమంతయు నాశరన్నవరాత్రులతో నిట్టుత్సవములలో వినోదించు చుండ నప్పటికప్పుడే మూడేండ్లనుండియు మేహరుజాపీడితుడై యున్నమహా

రాజు రాజవైద్యులు వలదని వారించినను వినక, ఒడలిపై బొక్కి పక్వమగుచున్న చేమ ప్రాణములబాధను లెక్కసేయక, తురంగదీయు జరాభారము నావలకు త్రోచివైచి, "మంచములో ఈసడకకంటె మరణమే మేలు" అనుచు లేచి "ఈజన్మాని కింకనిదియే తుదిశరదుత్సవ"మని పల్కుచు ససంభ్రముడై మహాలయము దొరకొని దేవీపూజలొనర్ప నారంభించెను. తొలినాడు వేయిమంది విప్రులకును, ఐదువేవురు పేదసాదలకును సంతర్పణము సేయించెను. పురమున జరగుసత్సవములతో తృప్తినందక బిందుసారభద్రభటరాజసేనులం గూడి, అశ్వారూఢుడై మృగయార్థ మరిగెను. అటవీమధ్యమున కేగినపిమ్మట గుఱ్ఱము డిగి చంద్రలేఖ నధిరోహించి, పంద్రెండుగురు ప్రతీహారిణులు విచ్చుకత్తులం బూని పరివేష్టింప పులిజాడ లరయబోయెను. మహారాజున కిరుగెలంకుల ఈటెలువాల్చిన వేటకాండ్రు రాజసేనుని పురస్కరించుకొని బలసియేగుచుండిరి. వలగోలుమూకలు దప్పెటలు నఱచుచు ముందు నడచుచుండెను. ఇట్లు చనిచని తుదకు పులియున్న యిక్కవ దెలిసియున్న ఆటకాండ్ర నావ్యాఘ్రము నిప్పులురలు చూపులంజూచి యెటుతప్పుకొనుటకును మార్గముగానక గాండ్రుమనుచు నాజనముపై నొక్కయుదుటున లంఘించెను. మహారాజంతట నొక్కుమ్మడి మూడుబాణములు వదలి శార్దూలమును నేలగూల్చెను. బిందుసారరాజసేనులం చెరియొక చిఱుతపులిం బరిమార్చిరి.

నాటిరేయి వారెల్ల రాయరణ్యమున బటకుటీరములలో వసియించి మఱునాడు మరల నశ్వారూఢులై పురమునం బ్రవేశించిరి. వేటలో సిక్కిన మెకముల మూటి నానాడు పురమున నూరేగించిరి.

ప్రాణబాధను మృగయాపరిశ్రాంతి తోడుపడినను మహారాజు వేసట చెందక మఱునాడు రేపకడ స్నానాదికము లాచరించి సేనానులతో గూడి ఆయుధపూజ లొనర్చెను. విజయదశమినాటికి ప్రాణములు పక్వమై సలుపుచున్నను అశ్వమునధిరోహించి సైన్యములుగొలువ పురమంతట నూరేగెను.

నాటిరేయి నగరుసొచ్చునప్పటికి మహారా జసురుసుర్రై, ప్రణబాధ దుర్భరముగుడు నెట్లెట్లో స్నానమాచరించి శయ్యాతలముం జేరి పరుండెను. రాజవైద్యు లరుదెంచి మహారాజుశయ్యను బిందుసారచాణక్యరాక్షసామాత్యులును, రాణులును, రాజవైద్యుడును జుట్టువారియుండిరి. శోకోద్విగ్నయై యున్నదుర్ధరాదేవి నవ్వలికంపి శాంతవతీదేవి మహారాజుచెంత చూడ్కులు నిలిపి కాళ్లకడ నిలిచియుండెను. దేవభ్రాంతిమాత్ర మధీరగాక, శోకోత్తరావై హీనరులకు దోషుపడి మహారాజున కుపచారము లొనర్చుచుండెను.

నడురేయి యగుసరికి సువర్ణగిరినుండి మహారాజప్రతినిధి యంపిన ప్రణిధి దర్శనముగోరి వచ్చి తావెచ్చినపత్రిక సమర్పించెను. చాణక్యాదులం వలపన్నను వినక మహారాజు "మేమింకా జీవాలతో వున్నాముగనుక మా ప్రతినిధు లంపినవార్త వినగోరుచున్నా"మని పట్టుపట్టెను. చాణక్యు డంతట నా పత్రిక విచ్చి యిట్లు చదివెను.

"స్వస్తి: శ్రీమన్మహారాజాధిరాజులును, దేవానాంప్రియులునూ, మగధేశ్వరులునూ అయిన శ్రీచంద్రగుప్తసార్వభౌముల పాపద్మములసన్నిధిని సువర్ణగిరిపాలకుడు పురుషదత్తుడు సామాత్యంగా ప్రణతుడై విన్నవించుకొన్నది.

జినదేవాపరావతారులైన శ్రీభద్రబాహుస్వాములవారు సువర్ణగిరిలో వేంచేసియున్నవయినం దేవరకు విశదమయ్యే వున్నది. శ్రీ స్వాములవారు ఇటీవల మరణపర్యంతమైన సల్లేఖనవ్రతం పూనుకొన్నారు. వారు దినక్రమేణా ఆహారం వర్జించి జలాహారులై వున్నారు. ఆమీద అది కూడా మాని వాయుభక్షణం చేస్తూ గొంతకాలముండి యిపుడు దేహంచాలించి నిర్వాణంపొందినారు. వారు నిర్వాణం పొందిన పర్వతగుహకు 'భద్రబాహుగుహ' అని ప్రజలు నామకరణం చేశారు. శ్రీభద్రబాహుస్వాముల ప్రియశిష్యులునూ, ఉజ్జయినీవాసులునూ అయిన శ్రీరాజవైశ్య చంద్రగుప్తమునీంద్రులు కూడా యీ

వరకే శ్రుతకేవలులుగా వుంటూవున్న కారణంచేత వారున్నూ గుహాముఖ మందు ఆసీనులై సల్లేఖనం ఆచరించి నిర్వాణం పొందివున్నారు. మునీంద్రుల వారిపేరుమీద ఆగుట్టకు ప్రజలు 'చంద్రగిరి' అని నామకరణం చేశారు. ధర్మావతారులైన మేలినవారి ధర్మతత్పరత్వం ఎటిగివున్న కారణంచేత యీ అద్భుతవర్తమానాన్ని దేవపాదమూలానికి చేరనంపుకొన్నాము.

దివ్యచిత్తానకు తేవలెను.

ఇతి శ్రీ"

భద్రబాహుస్వాముల యీవిచిత్రనిర్వాణవృత్తాంతమును విని మహారాజు కొంతవడి కనులుమూసి మౌనముద్రాల్చెను. పిమ్మట గనులువిచ్చి "మేము నూ స్వాములవారిని అనుసరిస్తాము. ఏకేటేట భద్రబాహుగుహదగ్గర ఉత్సవాలు జరిపేనిమిత్తం వేయిపణాలు ఇస్తూవుండవలెనని మాయాజ్ఞ" అని వచించి మరల మౌనమువహించెను.

పిమ్మట గొంతసేపటికి చాణక్యునివైపు తిరిగి "కుమారుణ్ణి పట్టాభిషిక్తుణ్ణిచేసి ఆర్యులే కనిపెట్టి వుండాలి. ఈపసివాణ్ణి మీచేతుల్లో పెట్టుతున్నాను" అనుచు బిందుసారుని జెప జూపెను. చాణక్యుడును గన్నీరు రెప్పల నప్పళించుచు "వృషలా! నీకు వచ్చిన భయంలేదు. అప్పుడే అలా యెందుకు అధీరుడనౌతావు" అని పలికెను. మహారాజంతట 'చావునుగూర్చి నాకు చింతలేదు. కుఱ్ఱవాడికి ఆర్యు లభయమిచ్చారుగనుక నాకిక నిశ్చింత. జైనస్వామివలె నేను గూడా సల్లేఖనం చేయవలెనని వుంది. రోగగ్రస్తమైన యీశరీరంతో ఆవ్రతం చేయదగునో లేదో, ఇది ఆర్యధర్మానికేమైనా విరోధమేమో ఆర్యులు సెల వివ్వాలి" అని యడిగెను. చాణక్యుడు "అది జైనధర్మం. ఆర్యధర్మప్రవర్తకుడవైన మహారాజువు నువ్విలాచేయడం ధర్మంకాదు" అని వారించి, బ్రాహ్మణుల రావించి భాగవతరామాయణములను వేదమంత్రములను బఠింప నియోగించెను. మహారాజు శాంతచిత్తుడై ఈశ్వరస్మరణముసేయుచు గొంతసేపుండి, మరల

చాణక్యునితో "నాకు ఉత్తరాయణమరణం లభించింది కాదు" అని పలికెను. చాణక్యుడు "నీకు విచార మక్కరలేదు. చంద్రవంశ్యుడవైన నీకు ఇదేయోగ్య కాలం. చంద్రయానంచేత పరలోకాన్ని పొంది, చిరకాలం స్వర్గసుఖాలనుభవించి మళ్లా ఏమహారాజుఇంటిలోనో నువ్వు జన్మించవలసి వుంది. నువ్వూ నేనూ చేసినకర్మలబంధం ఇంతట వదిలేది కాదు. మనకు పునర్జన్మ తప్పదు" అనెను. మహారాజు "అయితే అబ్బాయిపట్టాభిషేకం త్వరగా కానివ్వండి. కళ్లారచూచుకొంటాను" అని కోరెను.

అంతట చాణక్యుడు మంత్రిపురోహితసామంతదండనాథులను, నగర పాలకధర్మాధికారులను శీఘ్రముగా నచటికి రావించి, మహారాజాభీష్టమును వారికెల్లరకు నెఱిగింప వారు సమ్మతించిరి. పిమ్మట బిందుసారునుద్దేశించి "మగధసింహాసన మధిష్ఠించి గోబ్రాహ్మణరక్షణంచేస్తూ, ప్రజను ధర్మమార్గాన పాలించుట మీకభిమతమేనా?" యని చాణక్యుడు ప్రశ్నింప, కాల్వలుగట్టు కన్నీటితో నాతడు "సమ్మతమే" యని బదులుపలికెను. ఆర్యచాణక్యు డప్పుడు చంద్రగుప్తుని శిరమున నున్న మణికిరీటమును బిందుసారునిశిరమున నుంచి "అమిత్రఘాతులు, దేవానాంప్రియులు అయిన శ్రీ బిందుసారమహారాజులుంగారికి జయము" అని పలికినంత మంత్రిసామంతాదులెల్లరు జయధ్వానము లొనర్చిరి.

పిమ్మట మహారాజు మనుమలనిద్దర రావించి వానిశిరములు పుడికి ప్రియమాఱ ముద్దులిడుకొని వారల నంపివైచెను. పదపడి రాణులముగ్వుర జేర బిలిచి వారల నాశ్వాసించి సెలవుగైకొనెను. చీరచెరంగుల నెమ్మోములు గప్పికొని వారుముగ్వురు నెడగలుగ నేగినంత మహారాజునకు మైకము గ్రమ్మి స్మృతి తప్పెను. రాజవైద్యులు పరీక్షించుచుండగనే నాడి నిలిచిపోయి శరీరము కొయ్యవారుచుండెను. అంతట వైద్యులు ముకురముంగొనితెచ్చి ముకుపుటముల చెంతనిడి దానిపై నూర్పుజెమర్పుటమి యరసి, నాడీస్పందము నిలిచిపోవుట గాంచి, శాంతిమార్గము నాసారంధ్రములలోని కల్లన నూదియు ఫలముగానక

పెదవి విఱిచి చాణక్యునివంక గాంచి అధోముఖులై నిలిచిరి. చాణక్యు డంతట "శ్రీమన్మహారాజాధిరాజ దేవానాంప్రియ చంద్రగుప్తసార్వభౌములు స్వర్గతి చెందారు. శ్రీరామ, శ్రీరామ, శ్రీరామ" యని పలికి, యంతట సొలబడి వావిడిచి బాలకునిపగిది నేడ్వదొడగెను. "వృషలా! వృషల! ఇంతలోనే నీకు నూరేండ్లు నిండుతాయని అనుకోలేదోయి తండ్రీ! ఇన్నాళ్లూ నాతో గూడి యింతనాటకమాడినవాడవు నన్నిక్కడే దిగవిడిచి నిష్క్రమిస్తా వనుకోలేదు. పరమఘాతుకుడూ, పాషాణహృదయుడూ అని లోకమంతా నిందించినా, నా వృషలుడూ, నాగౌతమీ నాహృదయాన్ని ఎఱుగుదురు గదా, నాకంతే చాలనుకొన్నానోయీ! నువ్వుకూడా నన్ను విడిచిపోయినావా! ఇక నాకు గౌతమినే దిక్కు చేసి పోయినావా, బాబూ!" అని గోలుగోలున నేడ్చు చాణక్యుని దుఃఖముం గాంచి, చెంతనున్నవారందఱు "ఈమహాబ్రాహ్మణుని హృదయ మింత కోమలమా?" యని యక్కజ మందుచుండిరి. రాక్షసామాత్యు డంతట చాణక్యునిచెంత జేరి, యల్లన భుజముపై జేయి వైచి "తమరు కూడా యిలా అధీరులైతే మాకందరకు ఇక ఆధారమెవ రున్నారు! తమరు ఓదార్చుకొని కర్తవ్యమాలోచించాలి" అనుచు బ్రబోధించెను. చాణక్యు డెట్టకేలకు దుఃఖమును దిగమ్రింగికొని, "దేశమంతటా బిందుసారమహారాజులుంగారు పట్టాభిషిక్తులైనారని చాట బంపండి" అని చెంతనున్నవారల కాజ్ఞయిడెను.

పిమ్మట శాంతవతీదేవి భర్తృసహగమన మొనర్చుటకై అనుమతి వేడినంత చాణక్యు డామాచారము నార్యులు అంగీకరింపలే దని తెలిపి వారించెను. శాంతవతియు నంతట నిలువక "మీప్రాచ్యులకీ ఆచారం దూష్యం కావచ్చును. మాదేశంలో ఇది సదాచారమే కనుక ఆర్యులు నాకనుజ్ఞ నిప్పించండి" అని యేడుచు విలపింపదొడగెను. చాణక్యు డపుడు "తల్లీ! ఎందుకట్లా విలపిస్తావు? ప్రాచ్యులకోడలివైతివి గనుక మా ఆచారాలే నువ్వూ అవలంబింపక తప్పదు. అయినా యీ ఆచారంమాట అలావుంచి ఇంకొక్క సంగతి ఆలోచించు. అంతఃపురమంతటికీ నువ్వే పెద్దదానవు. కొడుకునూ కోడళ్లనూ చూచుకుంటూ ఆపస్త

కందుబిడ్డకనీ పెంచి పెద్దవాళ్లనుజేసేభారం నీమీద వుంది. నీభర్తగారి అభిమతం కూడా అదేకనుక ఆయనమీద ఆనపెట్టి చెప్పుతున్నాను. నామాట విని ఈప్రయత్నం మాను" మని చెప్పి శాంతవతీదేవి నాయుద్యమమునుంచి మరల్చెను.

పిమ్మట నేడవదినమున జంద్రగుప్తుని దేహమునకు, గంగాతీరమున లక్షలాదిజనము కన్నీటితో నవలోకింపుచుండ, బిందుసారమహారాజు మంచిగంధపుగట్టెలతో దహనసంస్కార మొనర్చెను. ఆట్లాశరీరము బూదియైనపిమ్మట జాణక్యుడు బిందుసారుని కౌగిలించుకొని "కుమారా! మీతండ్రి అదృష్టవంతుడుగనుక నీచేతిమీదుగా ఉత్తమగతి సంపాదించుకున్నాడు. ఈదౌర్భాగ్యుడికి ఆయదృష్టంకూడా లేదుగదా" అని కనుల నీరుబెట్టుకొనెను. బిందుసారుడును, గాద్గద్యమడంచికొని "ఆర్యులకు మాత్రం కొఱత ఏమున్నది? ఆసమయంవచ్చేసరికి రాధాగుప్తుడు పెద్దవాడై కర్తవ్యం నెరవేరుస్తాడు" అని యోదార్చి, ప్రాసాదమునకు మరలి వచ్చినపిమ్మట ముగ్గురుతల్లులతోను, రాణులు మువ్వురతోను ఈముచ్చట దెలిపెను. దుర్ధరాదేవి యపుడు కుమారునితో "నాయనా! ఆర్యులు ప్రళయస్వరూపు లని లోకు లనుకుంటారేగాని నిజానికి వారిది జాలిగుండె. వారికీ మనవలెనే శోకమోహా లున్నాయి. ఇంతకు ఏది యెలావున్నా, నిన్ను విపత్సముద్రమునుంచి గట్టుచేర్చడానికి తెప్పవలె వారు జీవించి వుండడమే మనకు బదివేలు. సర్వదా ఆర్యులే మనకు శ్రీరామరక్ష" యని పలికెను.

స మా ప్త ము.

---

చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.

# వచనగ్రంథములు



| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశస్కంధములు, శ్రీశతఘంటము | | | |
| వేంకటరంగశాస్త్రికృతము ఒకేసంపుటము | ... | 9 | 0 |
| డిటో 3 సంపుటములు | ... | 10 | 8 |
| ఆంధ్రవచనభారతము | | | |
| ,, భీష్మద్రోణపర్వములు | ... | 4 | 8 |
| ,, కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | ... | 3 | 0 |
| ,, ఆనుశాసనికము మొదలు స్వర్గారోహణ పర్వమువరకు | | | |
| గలసంపుటము | ... | 4 | 8 |
| పంచతంత్ర హితోపదేశకథామంజరి | ... | 1 | 12 |
| ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము | ... | 1 | 12 |
| ఆంధ్రకవిత్వచరిత్ర, బసవరాజు అప్పారావుగారిది | ... | 1 | 12 |
| ఆంధ్రకవిజీవితములు, శ్రీగురుజాడ శ్రీరామమూర్తి | ... | 4 | 0 |
| అరేబియన్ నైట్సుకథలు | ... | 1 | 4 |
| న్యాయవిచారము, ప్రహసనము | ... | 0 | 4 |
| తిలకుగారి సెక్యూరిటికేసు, ఉపన్యాసములు | ... | 0 | 14 |
| భారతరమణీమణులు, ప్రథమభాగము | ... | 1 | 0 |
| డిటో ద్వితీయభాగము | ... | 0 | 10 |
| యజుర్వేదకథాసంగ్రహము | ... | 0 | 8 |
| నీతిచంద్రిక, చిన్నయసూరిగారిది | ... | 0 | 10 |
| పంచతంత్రము, వచనము, సులభశైలి | ... | 0 | 12 |
| నవనాథభక్తులచరిత్ర | ... | 2 | 8 |
| నీతిరత్నాకరము | ... | 0 | 8 |
| సంగ్రహరామాయణము | ... | 1 | 0 |
| సంగ్రహభారతము | ... | 1 | 8 |
| సంగ్రహభాగవతము | ... | 1 | 8 |
| ప్రాచీనదేశచరిత్రలు | ... | 2 | 0 |

| | | రూ. | అ. |
|---|---|---|---|
| | | ప్రతి 1-కి రూ. | అ. |
| పతివ్రతలచరిత్రలు | ... | 2 | 0 |
| దక్కనుపూర్వకథలు | ... | 2 | 0 |
| భోజునికథలు | ... | 0 | 12 |
| భోజకాళిదాసకథలు, ప్రథమభాగము ఉత్పల వేంకట నరసింహాచార్యులు | ... | 1 | 0 |
| ,, ద్వితీయభాగము, మద్దులపల్లి సుబ్రహ్మణ్యశాస్త్రిగారిది | | 0 | 12 |
| తెనాలిరామలింగనికథలు, గురజాడ శ్రీరామమూర్తి | ... | 0 | 6 |
| ,, ఎ. ఎస్. పి. అయ్యరుగారిది | ... | 0 | 8 |
| సంస్కృతనాటకకథలు | ... | 2 | 0 |
| దశకుమారచరిత్రము, ఎనమచింతల సంజీవరాయశాస్త్రి | ... | 1 | 8 |
| రాజశేఖరుడు, గోపాలుడు | ... | 0 | 8 |
| చాన్ దర్వీషుకథలు | ... | 0 | 12 |
| తాతాచార్యులకథలు | ... | 0 | 8 |
| బేతాళునికథలు | ... | 0 | 12 |
| వైద్యులకథలు, శివలమల్లు, చెన్నాప్రగడ సీతన్న అను ఇద్దఱి వైద్యుల అద్భుతచికిత్సలుగలవు | ... | 0 | 4 |
| వీరాంగనలు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారిది, 22 వీరాంగనల చరిత్రలు గలవు | ... | 0 | 12 |
| పరమానందశిష్యులకథలు | ... | 0 | 4 |
| నలుగురుమంత్రులకథలు | ... | 0 | 6 |
| అయిదుగురుదొంగలకథలు | ... | 0 | 6 |
| రేచుక్కపగటిచుక్కకథ | ... | 0 | 3 |
| సత్యసేనవిజయము | ... | 0 | 6 |
| పురాణగాథలు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారిది | ... | 0 | 12 |
| డిటో II ,, | ... | 0 | 12 |
| ఋషులచరిత్ర | ... | 0 | 3 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.

| | ప్రతి 1-కి | రూ. | అ. |
|---|---|---|---|
| ఆంధ్రచంద్రాలోకము, సటీక | ... | 1 | 0 |
| కవికర్ణరసాయనము, (మాంధాతచరిత్ర) | ... | 2 | 4 |
| కవిసంశయవిచ్ఛేదము, అడిదము సూరకవిది | ... | 0 | 10 |
| కవిరాజమనోరంజనము | ... | 1 | 4 |
| కృష్ణరాయవిజయము | ... | 0 | 8 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) | ... | 0 | 6 |
| డిటో గట్టుప్రభుకృతము | ... | 0 | 8 |
| గజేంద్రమోక్షము, సటీక | ... | 0 | 10 |
| గయోపాఖ్యానము, రామనామాత్యునిది | ... | 0 | 12 |
| గరుడాచలము, యక్షగానము, పెద్దచ్చు | ... | 0 | 3 |
| గీతమంజరి, చిలకమర్తి లక్ష్మీనరసింహము | ... | 0 | 4 |
| చిత్రభారతము, చరిగొండ ధర్మనగారిది | ... | 1 | 8 |
| చెన్నపురీవిలాసము | ... | 0 | 8 |
| చెన్నబసవపురాణము, పాపకవికృతము | ... | 1 | 4 |
| జైమినీభారతము, అశ్వమేధపర్వము | ... | 2 | 0 |
| దశకుమారచరిత్రము, పద్యకావ్యము, కేతన కవికృతము | ... | 2 | 0 |
| దశావతారచరిత్ర | ... | 3 | 0 |
| దసరాపద్యములు | ... | 0 | 2 |
| దేశింగురాజుకథ (జంగంకథ) | ... | 0 | 8 |
| ధ్రువోపాఖ్యానము, సటీక | ... | 0 | 10 |
| నలోపాఖ్యానము, సటీక | ... | 0 | 8 |
| నలచరిత్ర, ద్విపద | ... | 2 | 0 |
| నిరంకుశోపాఖ్యానము, రుద్రకవికృతము | ... | 0 | 8 |
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము | ... | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము | ... | 0 | 8 |
| పంచతంత్రము, నారాయణకవికృతము | ... | 1 | 8 |
| పల్నాటివీరచరిత్రము | ... | 3 | 0 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు | ... | 1 | 0 |
| డిటో సురభివ్యాఖ్యాసహితము | ... | 3 | 0 |

| | | ప్రతి 1-కి రూ. |
|---|---|---|
| బ్రహ్మోత్తరఖండము, | ... | 3 |
| బసవపురాణము, పిడపర్తి సోమనాథకవి | ... | 4 |
| భోగినీదండకము | ... | 0 |
| యయాతిచరిత్ర, పొన్నిగంటి తెలగనార్య | ... | 1 |
| యయాతిచరిత్ర, ఆకొండి వ్యాసమూర్తి | ... | 0 |
| పంచతంత్రము, వేంకటనాథరాజకవికృతము | ... | 1 |
| భక్తిరసశతకసంపుటము I (20) శతకములు | ... | 3 |
| ,, II ,, | ... | 3 |
| ,, III ,, | ... | 3 |
| నీతిశతకసంపుటము I ,, | ... | 3 |
| రత్నపరీక్ష, సాంధ్ర తాత్పర్యము | ... | 0 |
| రంగరాయచరిత్రము | ... | 1 |
| రాఘవపాండవీయము, సటీక | ... | 4 |
| రాజశేఖరవిలాసము | ... | 0 |
| రాజయోగసారము, ద్విపద | ... | 0 |
| రామరాజీయము | ... | 0 |
| రామాభ్యుదయము | ... | 2 |
| రుక్మిణీకల్యాణము, సటీక | ... | 0 |
| రుక్మిణీపరిణయము, శుద్ధప్రతి | ... | 0 |
| రుక్మాంగదచరిత్ర, ఏకాదశీమాహాత్మ్యము | ... | 1 |
| వాసిష్ఠరామాయణము, ద్విపద | ... | 1 |
| విక్రమార్కచరిత్ర, జక్కనకవిది | ... | 1 |
| విష్ణుపురాణము | ... | 8 |
| వివేకసింధు, కొండనార్యప్రణీతము | ... | 1 |
| వేంకటాచలమాహాత్మ్యము | ... | 3 |
| వేమనపద్యములు (2728) | ... | |
| ,, ,, తాత్పర్యము | ... | 7 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్న